

చప్రియా టాకీ డిస్ట్రిబ్యూటర్స్ వారు ఉగాది అభినందనలతో ప్రకటించు
తమ రాబోవు చిత్రములు

జైశక్తి పిక్చర్స్ వారి
"అల్లాదిన్ అండ్ వండర్‌ఫుల్ ల్యాంపు"
అంజలిదేవి * నాగేశ్వరరావు * రంగారావు

అంజలీ పిక్చర్స్ వారి
"సువర్ణ సుందరి"
అంజలిదేవి * నాగేశ్వరరావు

అశోకా వారి
"భూలోకరంభ"
అంజలిదేవి * రేలంగి * చలం

నందీ పిక్చర్స్ వారి
"సౌభాగ్యవతి"
యన్. టి. రామారావు * సావిత్రి

విజయా ఫిల్మ్సు వారి
"అన్నతమ్ములు"
యన్. టి. రామారావు * గిరిజ * రేలంగి

నేషనల్ ఆర్ట్ థియేటర్స్ వారి
"పాండురంగ మహాత్మ్యం"
యన్. టి. రామారావు * అంజలిదేవి

శ్రీ రాజరాజేశ్వరి ఫిలిం కంపెనీ వారి
"కృష్ణమాయ"
నాగేశ్వరరావు * జమున

రిపబ్లిక్ పిక్చర్స్ వారి
"ప్రేమ కంకణం"
నాగేశ్వరరావు * అంజలిదేవి

సరస్వతి వారి
"రాణీ సంయుక్త"

యం. ఏ. వి. వారి
"సంపూర్ణ రామాయణం" (తెలుగు)
యన్. టి. రామారావు * పద్మిని

ఉమా పిక్చర్స్ వారి
"చక్రవర్తి తిరుమగళ్" (తెలుగు)
అంజలిదేవి * యన్. వరలక్ష్మి * యం. జి. ఆర్.

సంగీతా ప్రొడక్షన్సు వారి
ప్రొడక్షన్ నం 1.
యన్. టి. రామారావు * జమున
(సీడెడ్, నైజాం, మైసూరులకు)

జెమినీ వారి తెలుగు చిత్రం
పక్షిరాజా వారి తెలుగు చిత్రం

(సీడెడ్, నైజాం, మైసూరు టెరిటరీ క్షేత్రం)
చప్రియా టాకీ డిస్ట్రిబ్యూటర్స్
విజయవాడ - గుంటకల్ - సికింద్రాబాద్

ఉగాది

# ఆంధ్రపత్రిక



(నలువది ఎనిమిదవ ఉగాది సంచిక)

## హేమలంబ సంవత్సరాది సంచిక

(1957-58)

సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్

[వెల రూ. 2]

48
సంచిక

# ఆంధ్రపత్రిక

సంవత్సరము
1957-58

## హేమలంబ ఉగాది సంచిక

### విషయానుక్రమణిక



### త్రివర్ణచిత్రములు

నాట్యసుందరి : (ముఖచిత్రము)

చిత్రకారుడు : కేతినీడి భాస్కరరావు.

**అంపకాలవేళ**

చిత్రకారిణి : శ్రీమతి శ్యామాకొండిన్య.

గత దశరామహోత్సవాల సందర్భంలో మైసూరులో జరిగిన అఖిలభారత చిత్రకళా ప్రదర్శనంలో ప్రథమ బహుమతిని పొందిన చిత్రం.

**అవతారచిత్రము :**

(1) మత్స్య (2) కూర్మ (3) వరాహ (4) నారసింహ (5) వామన (6) పరశురామ (7) శ్రీరామ (8) బలరామ (9) కృష్ణ (10) కల్కి.

# ADVERTISERS' INDEX



నాదోపాసన

చిత్రకారుడు : పైడిరాజు

ఓమ్

# ప్రస్తావన

అది సాధారణసంవత్సరము. 'సంవత్సరాది సంచిక'ల ప్రచురణ ప్రారంభమైనది. ప్రజల ఆశలను ప్రతిబింబించుచు, ఆశయాలను వివరించుచు వెలువడిన తొలి సంచిక, తత్రాపి వెలువడుచుండిన ప్రతి సంచిక, ఆంధ్రమహాజనుల ఆదరణకు, ప్రాజ్ఞుల గౌరవాభిమానములకు పాత్రమైనవి.

నాటి ఆశలు ఫలించినవి. ఆశయాలు సిద్ధించినవి. దేశము సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని పొందినది. నాలుగు ముక్కలై నాలుగు రాష్ట్రాల్లో చేరివున్న ఆంధ్ర ప్రాంతము ఏకరాష్ట్రంగా ఏర్పడినది. విశాలాంధ్ర ఏర్పడినా సమగ్రాంధ్రరాష్ట్రము సిద్ధించలేదు. ఆంధ్రులు అధికసంఖ్యాకులుగ వున్న ప్రాంతాలు కొన్ని ఇప్పటికి ఒరిస్సా, మద్రాసు, కర్నాటక రాష్ట్రాల్లోనే వుండిపోయినవి. సరిహద్దుల సర్దుబాటుకు కేంద్ర ప్రభుత్వ అధ్వర్యమున ద్విపక్ష సంప్రతింపులు సాగుచున్నవి. సరిహద్దుల సమస్య ముఖ్యమైనదే. అంతమాత్రమున ఆ సమస్యా పరిష్కారమునకే ప్రజలు, ప్రభుత్వము యావచ్ఛక్తిని వినియోగించుతూ వుండడం వివేకవంతం గాదు.

దుర్ముఖిలో ఆంధ్రరాష్ట్రము విస్తృతమై ఆంధ్రప్రదేశ్‌గా రూపొందినది. ఆంధ్రజాతి రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక అభివృద్ధికి ప్రాతిపదిక ఏర్పడినది. నలువదియేడుసంవత్సరముల క్రితము ఆంధ్రుల విజ్ఞానాభివృద్ధికి, భాషావికాసానికి ప్రత్యేక విశ్వకళాపరిషత్తు ఏర్పాటు కావాలని కోరితిమి. మూడు దశాబ్దముల క్రితమే ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ఏర్పడినది. నేడు ఆంధ్రప్రదేశ్‌లో మూడు విశ్వకళాపరిషత్తులున్నవి. విద్యా, విజ్ఞానరంగాల్లోవలెనే, ఇతర రంగాలలోకూడ, తొలి ఆశలకు మించిన అభివృద్ధిని సాధించగలమనే నమ్మకం కలుగుచున్నది.

దుర్ముఖి ఆంధ్రులకేగాదు; భారతీయులకేగాదు; ప్రపంచప్రజ లందరికీ బహువిధాల స్మరణీయమగుచున్నది. పశ్చిమాసియాలోను, తూర్పుయూరప్‌లోను అనేక విషాద సంఘటనలు జరిగినవి. తృతీయ ప్రపంచ సంగ్రామానికి అంకురార్పణ అయినదా అని ప్రపంచ ప్రజలు ఆందోళనచెందిరి. అదృష్టవశాత్తు ప్రజల శాంతిప్రియత్వము, యుద్ధవిముఖత్వము బలీయమైనందున సైనికసంఘర్షణలు ఆయా ప్రాంతములకే పరిమితమైనవి. ఐక్యరాజ్యసమితి సకాలంలో, త్రికరణశుద్ధిగా చర్యలు తీసుకొనినందున పశ్చిమాసియాలో తిరిగి శాంతి ఏర్పడినది. సమితి ప్రయోజకత్వము ఋజువైనది.

ప్రపంచ సమస్యల పరిష్కారములో భారతదేశము నిర్వహించిన భూమిక ప్రశంసాపాత్రమైనది. కాశ్మీరు విషయంలో కొంత నష్టపడినను, పశ్చిమ రాజ్యాల పగకు గురికావలసివచ్చినను భారతదేశము పంచశీలను అనుష్ఠించి యుద్ధనివారణకు నిర్విరామముగ కృషిచేసినది. కాశ్మీరు వ్యవహారములో భద్రతామండలి భారతప్రతినిధి వాదమును పూర్తిగా వినక, విన్నంతవరకు అయినా ఆకళింపు చేసుకొనక పాకిస్తాన్‌ను తృప్తిపరుస్తూ ఒక తీర్మానమును ఆమోదించినది. ఆ తీర్మానమును పురస్కరించుకొని స్వీడన్ ప్రతినిధి శ్రీ జారింగ్ ప్రస్తుతము భారత ప్రభుత్వముతో సంప్రతింపులు జరుపుచుండిరి. న్యాయమును, ధర్మమును పాటించు ఏ రాజీపరిష్కారమునకైనను భారతదేశము సమ్మతించునని శ్రీ నెహ్రూ స్పష్టముచేసిరి.

కాశ్మీరు సమస్యతోబాటు, భారతీయులను, జాతీయ నాయకులను కలవరపెట్టుచున్న మరొక సమస్య దేశములోని పోర్చుగీసు స్థావరాల భవిష్యత్తు. ఫ్రెంచి

స్థావరాల విలీనాన్ని సాధించినట్లే, సంప్రతింపుల ద్వారా, పోర్చుగీసు స్థావరాల భవిష్యత్తును పరిష్కరించుకోవాలని ప్రభుత్వం చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. పోర్చుగల్ సామ్రాజ్యతత్వమే ఇందుకు కారణము. ఈ సమస్యాపరిష్కారానికి ప్రభుత్వం సరిక్రొత్త పద్ధతులను అవలంబింపనున్నట్లు ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ ప్రకటించిరి. ఆఫ్రికాలో మరొక స్వతంత్ర రాజ్యము - ఘనా - అవతరించినది. బ్రిటిష్ సామ్రాజ్యము క్రమంగా ఆఫ్రికానుంచి నిర్గమిస్తున్నది. కాలగతిని పోర్చుగల్ కూడా త్వరలోనే గ్రహించగలదని, గ్రహించి భారతదేశమునుంచి వైదొలగునని ఆశింపవచ్చును.

దేశములో నూతనరాజ్యాంగము ప్రకారము రెండవసారి ఎన్నికలు జరిగినవి. ఈ ఎన్నికలలోనూ ప్రజలు కాంగ్రెస్‌నందు, శ్రీ నెహ్రూ నాయకత్వమునందు సంపూర్ణవిశ్వాసమును ప్రకటించిరి. మొదటి ఎన్నికలలో పొందినంతటి విజయాన్ని ఈ ఎన్నికలలో కాంగ్రెస్ పొందలేదు. అటు ఒరిస్సాలోను, ఇటు కేరళలోను ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయుటకు వలసిన బలాన్ని కాంగ్రెస్ సంపాదింపలేదు. కేరళలో కమ్యూనిస్టుపార్టీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయనున్నది. ఎన్నికలద్వారా కమ్యూనిస్టుపక్షము అధికారములోనికి రాకలుగుట ఇదే మొదటిసారి. ఈ సంఘటన ప్రభావం భారతదేశంపైనే గాక అంతర్జాతీయ కమ్యూనిజముపై కూడ విశేషముగ నుండగలదు. కమ్యూనిస్టు రాజ్యస్థాపనకు ప్రజాస్వామిక పద్ధతులు ప్రయోజనపడ అనే వాదము పటాపంచలైనది.

దుర్ముఖిలో కాంగ్రెస్‌పక్షము ఈ విధముగ కొంత బలహీనమైనప్పటికిని శ్రీ నెహ్రూనాయకత్వము సుస్థిరమైనది. ఈ సంవత్సరము ఆసియా, ఆఫ్రికా, యూరప్ రాజ్యాల అధిపతులు ఎందరో మన దేశం వచ్చి ప్రథమ, ద్వితీయ ప్రణాళికలద్వారా మనము సాధించిన అభివృద్ధిని మెచ్చుకున్నారు. మన ప్రధానమంత్రి అమెరికా వెళ్లి ప్రపంచ వ్యవహారాలపై అధ్యక్షుడు శ్రీ ఐసెన్‌హోవర్‌తో సంప్రతింపులు జరిపివచ్చిరి. అమెరికా—భారతదేశాల మైత్రి స్థిరపడేందుకు శ్రీ నెహ్రూ అమెరికాపర్యటన దోహదము చేసినది. అంతర్జాతీయ వ్యవహారాల్లో, ఐక్యరాజ్యసమితి వేదికలపై భారతవాణికి చెల్లుబడి హెచ్చినది.

ఈ సంవత్సరము దేశమంతట గౌతమబుద్ధుని జయంతి ఉత్సవములు వైభవోపేతముగ జరిగినవి. బుద్ధభగవానుని ఉపదేశములను పునశ్చరణ చేసి, శాంతిసహనములలో, సత్యాహింసలలో జాతి అచంచల విశ్వాసాన్ని ప్రకటించినది. ఆ పథమును అనుసరించి పురోగమించుటకు భారతీయులు కృతనిశ్చయులైరి.

శాంతిసాధనకు దుర్ముఖ దారిచూపెను. నూతన సంవత్సరము మనల గమ్యస్థానమును చేర్చగలదని ఆశింపవచ్చును. నూతన సంవత్సరము ప్రపంచమునకు శాంతి సౌఖ్యములను ప్రసాదించుగాక! హేమలంబ యావదాంధ్రకు శుభప్రదముగుగాక!



# కాశ్మీర్ సమస్య

**శ్రీ కృష్ణ**

కాశ్మీర్ సమస్యను ఈసారి భద్రతామండలిలో పాకిస్తాన్ కదిపింది. ఆ సమస్య మామూలుగానే ఇక్కడ మన దేశంలోను, బయటి ప్రపంచంలోనూ గూడా బహుధా చర్చనీయమైన మవుతోంది. ఈ సందర్భంలో దీన్ని గూర్చి కొంత ఆత్మపరిశీలనం, అంతర పరీక్ష చేసికోవలసి వుంది. ఇది చర్చకు వచ్చేసరికి, భద్రతా మండలిలో తొమ్మిది రాజ్యాలు ఎందుకు భారతదేశానికి వ్యతిరేకంగా ఓటు చేశాయి? రష్యాగూడా, ఆదిలో, ఎందుకు తటస్థంగా వూరుకొని వుండిపోయింది? మన దేశీయాంగమంత్రి పండిత పంత్ గారు, ఇది ఇట్లా జరగడానికి కారణం, ఈ దేశాలు మనల్ని చూచి ఓర్వలేకపోవడమేనని అన్నారు. చూచి ఓర్వలేకపోవడం అంటే, మన గొప్పతనాన్ని చూచి, మనం గొప్పతనాన్ని పొందడాన్ని చూచి, ఓర్వలేకపోవడం అని అర్థం చెప్పారు. ఇతరులు ఇంకో విధంగా వ్యాఖ్యానిస్తున్నారు. భారతదేశ విదేశాంగవిధానం పూర్తిగా విఫలమైపోయింది. భద్రతామండలిలో ఏమి జరిగిందో, దాని అర్థం అదే అంటున్నారు. అయితే వీరు భారతదేశ తటస్థ విదేశాంగ విధానాన్ని కాదనడంలేదు. అది మంచిదే. అది అట్లా కొన్ని సంవత్సరాలపాటు సాగవలసిందే; ఇది మాకు అర్థం అవుతూనేవుంది. అర్థంకానిది ఏమిటంటే, ఇతరదేశాలకు భారతదేశం నీతులు బోధించడం; ఇతర దేశాలు ఏమి చెయ్యాలో, ఏమి చేయనక్కరలేదో, ప్రవచిస్తూ వుండటం; ఇది మాకు నచ్చడంలేదు అంటున్నారు.

సమితిముందుకు ఒక సమస్య అంటూ వస్తే, భారతదేశం కల్పించుకోకపోవడం అంటూ ఎప్పుడన్నా జరిగిందా? భారతదేశం వేలుపెట్టని సమస్య అంటూ అక్కడ ఏదన్నా వుందా? ఇందుకు సూయజ్ కాలువ వ్యవహారమే ప్రధానమైన తార్కాణం. బాగ్దాద్ సంధిలో లేనిరాజ్యాలు ఇంకా పెదిమలుగూడా కదపలేదు. భారతదేశం అమానుషమైన ఈ దురాక్రమణను ఖంగు ఖంగున నాలుగు దిక్కుల్లోను మోగేట్లు ఖండించింది. అయితే ఈ దురాక్రమణ భారతదేశం ఖండన మండనాలవల్ల ఆగలేదు. రష్యా "ఖబడ్దార్" అనేటప్పటికి ఆగిపోయింది. ప్రపంచంలో ఇంతవరకు ఏ ఒక్క ముస్లిందేశమూ, భారతదేశాన్ని కాశ్మీర్ విషయంలో బలపరిచిన పాపానపోలేదు. బ్రిటన్ ఫ్రాన్సులు క్రైస్తవదేశాలు కావచ్చు. కాని జీసస్ క్రీస్తులుమాత్రం కావు. అందువల్ల ఈ దేశాలు కాశ్మీర్ సమస్యను సానుభూతితో స్నేహంతో, ధర్మంగా పరిశీలించడం అన్నది మనం ఆశించవలసిన సంగతి కాదు. భారతదేశం సూయజ్ విషయంలో వారికి ఏమిచేసింది; మరిచిపోవడం వారిపద్ధతి కాదు. విదేశాంగ విధానం అన్నది ఏకముఖమార్గం కాదు. ఇతరులకు మనం ఏంచేస్తే, వాళ్ళు మనకు అదే చేస్తారు. అసలుకు వడ్డీ కట్టి వడ్డిస్తారు.

కాశ్మీర్ మీద బ్రిటిష్ పత్రికలు విరోధభావాన్ని వహించినందుకు మనంఅంతా వారిని విమర్శించాము. అయితే ఆ బ్రిటన్‌లో భారతదేశానికి, అతిపూర్విక మిత్రుడైన శ్రీ కింగ్స్లే మార్టిన్ గూడా భారతదేశాన్ని విమర్శించాడు. పోతే, సూయజ్ విషయంలో మనం, మనపత్రికలు వహించిన వైఖరి ఎటువంటిది? దానిసంగతి ఏమిటి?

సమితి అనండి, బ్రిటిష్ కామన్‌వెల్త్ అనండి, అవి "క్లబ్బు"ల వంటివి. అందులో ఒకసభ్యుణ్ణి, ఒకసభ్యుడు వీధి మొగదలలో నిలబడి ఆడిపోసినట్లు ఆడిపోస్తే, ఎవరిమర్యాదా అధికం కాదు. బ్రిటన్‌ను తిట్టేబదులు, కామన్‌వెల్త్‌లోంచి బయటపడటం మంచి పని. భద్రతామండలిలో కాశ్మీర్‌కు జరిగిన న్యాయాన్ని చూచుకున్న తర్వాత, సమితిలో వుండటంగూడా అనవసరమే అనిపిస్తోంది. తటస్థవైఖరి గలవారి సభ్యత్వమూ, సైనికకూటాల, మండలాల సభ్యత్వము, అక్కడ సాగవు. అవి పరస్పర విరుద్ధమైన సంగతులు.

కాశ్మీర్‌కు సంబంధించినంతవరకు, భారతదేశం పూర్వం చేసిన తప్పులు, ఇప్పుడు దాన్ని కట్టికుడుపుతున్నాయి. 1957 ఫిబ్రవరిలో భారతదేశం శ్రీ కృష్ణమీనన్‌ను భద్రతాసంఘానికి చెప్పమన్న విషయం ఇది. 'పాకిస్తాన్ కాశ్మీర్‌లో దురాక్రమణ చేసింది; ఆ దురాక్రమణను గురించి ఆదిలో మేము ఫిర్యాదు చేశాము' అని చెప్పుచున్నది. పాకిస్తానును దురాక్రమణదారుగా ప్రకటించవలసిందిగా కోరమన్నది. అయితే భారతదేశం ఆదిలో ఇంతిదిగా, ఇంత అసందిగ్ధంగా, స్పష్టంగా, పాకిస్తాన్ దురాక్రమణగురించి తీర్పు ఇవ్వవలసిందని భద్రతామండలిని అడిగిందా? దీనికి ప్రత్యుత్తరం శ్రీ మైఖేల్ బ్రెషెర్ అనే ఆయన పసిఫిక్ సంబంధాల పరిషత్తు అధ్వర్యాన ప్రకటించిన పుస్తకంలో వుంది. ఆయన ఈలా వ్రాశాడు; "భద్రతామండలిలో తన ప్రారంభ ప్రసంగంలో శ్రీ గోపాలస్వామి అయ్యంగారు చేసిన తప్పులలో ఈ క్రిందివి చెప్పుకోతగినవిగా వున్నాయి."

(1) కాశ్మీర్ మీద కొండజాతిదుండగులు దండయాత్ర ప్రారంభించినప్పుడు, పాకిస్తాన్‌కు ఆ దండయాత్రతో లాలూచీ వుందిఅని భారతదేశం ఫిర్యాదుచేసింది. అయితే భారతప్రతినిధి మాత్రం పాకిస్తాన్‌ను దురాక్రమణదారుగా ఖండించలేకపోయినారు. అది ఆయన చేతకాలేదనండి; లేక ఇష్టం లేక చెయ్యలేదనండి. ఎట్లా అన్నా, ఆయన పాకిస్తాన్ పేరు, కొండజాతి దుండగులు పేరు అని మాట్లాడ్డం మొదలుపెట్టారు. కొండజాతివాళ్ళు దోషులని వాదించడంచేత, పాకిస్తాన్‌లాలూచీని మండలి దృష్టికి తీసుకువచ్చే విషయంలో ఆయనవాదం అసమర్థమైపోయి కూర్చుంది

(2) కాశ్మీర్ మహారాజా తన సంస్థానాన్ని 1947 అక్టోబరు 24 న భారతదేశంలో చేర్చినప్పుడు, ఆ సంస్థానం భవిష్యత్తును ప్రజల ఇష్ట ప్రకారమే తేలుస్తామని భారతదేశం మాట ఇచ్చిన మాట నిజమే అయినా, అదే మాటను పదేపదే వక్కాణించి, ఈ ప్రజల భావాన్ని తెలుసుకోవడం అతిముఖ్యమైనవిషయం అయినట్లు ఆ మండలి తలకు శ్రీ గోపాలస్వామి అయ్యంగారు ఎక్కించారు' మండలిని ఏదో ఒప్పించాలనే దిలాసాలో, ఈ తప్పునే ఆయన ఒకే ఉపన్యాసంలో అనేకసార్లు చేశారు. "మండలి సభ్యులు భారత దేశం వర్తమాన నాయకత్వం యొక్క ప్రకృష్ట సిద్ధాంత విహితమైన శీలాన్ని, చరిత్రను గ్రహించాలి. సంస్థానం విలీనాన్ని ఆమోదించ డంలో, ఇప్పుడు ఆ సంస్థానం ఎదుర్కొంటున్న కష్టాన్ని తమకు లాభసాటిగా వినియోగించుకోవాలన్న భావం మాకు లేదు. అందు చేతనే మేము, సంస్థానపాలకుడికి, సంస్థానం భవిష్యత్తు, శాంతి అంటూ ఏర్పడగానే, జనవాక్యంద్వారా నిర్ధారితం అవుతుంది అని చెప్పాము. ఆ తర్వాత గూడా ఈ విషయాన్ని స్పష్టం చేశాము. అవసరమైతే, అంతర్జాతీయ పర్యవేక్షణలో ఈ జనవాక్యాన్ని జరి పిస్తాము అన్నాము."

ఇట్లా వాదించినందువల్ల, తాత్కాలికంగా ఆయన ఆ మండలి సానుభూతి పొందివుండవచ్చు. కాని 1948 లో 5 మాసాలపాటు జరిగిన చర్చల్లో, ఆ సానుభూతి అంతా కొట్టుకుపోయింది. అంతే కాక, ఈ రకమైన వాదాన్ని అక్కడ ఆయన సాగించి వున్నందు వల్ల, మండలిలో మనపట్ల శాశ్వతమైన అననుకూల వైఖరిగూడా ఏర్పడిపోయింది. మండలి సభ్యులలో కాశ్మీర్ చేరిక న్యాయంగా జరిగిందా అన్న అనుమానాలు బలిశాయి. పాకిస్తాన్ విదేశాంగ మంత్రి ఈ అనుమానాలను ఇంకా బాగా రెచ్చగొట్టగల్గారు. కాశ్మీర్‌లో జనవాక్యభాగాన్ని నొక్కిపల్కి, శ్రీ అయ్యం గారు, అక్కడ పాక్ దురాక్రమణయొక్క దోషతీవ్రతను తగ్గించివేశారు. భారతదేశమే, ఈ చేరికను, తాత్కాలికమైన దానినిగా భావిస్తున్నదని, నిరూపించడానికి, ఆయన అక్కడ నానాపాట్లు పడినందువల్ల, కొండజాతుల దండయాత్ర ముఖ్య మైనదే అయినా, కాశ్మీర్‌లో అట్టి పరిస్థితి ఏర్పడ్డానికి సామాన్య కారణం మాత్రమేనని, దీన్ని తేలిగ్గా తొలగించవచ్చునని, ఒక భావం, అక్కడ ఏర్పడిపోయింది.

(3) ఈ చిక్కును అంతర్జాతీయ పర్యవేక్షణలో జనవాక్యా న్ని జరిపించి, తీర్పు వేయవచ్చునన్న అభిప్రాయంగూడా కుదురుకు పోయింది. అంటే, జనవాక్యమే అతి ముఖ్యమైన విషయమైనట్లు వాదించి, శ్రీ అయ్యంగార్ మన వాదాన్నంతా పాడుచేశారు. పాకిస్తాన్ విదేశాంగమంత్రి, ఆ అవకాశాన్ని బాగా వినియో గించుకొని, కాశ్మీర్ వివాదంలో తనవాదం అంతను దానిమీద కొలుపెట్టి నడిపించారు.

(4) ఈ ఒక్క తప్పేగాక, శ్రీ అయ్యంగారు ఇంకో తప్పు గూడా చేసారు. ఈ రెండు తప్పులకు సన్నిహిత సంబంధంవుంది.

కాశ్మీర్ భారతదేశంలో చేరగా, ఆ విషయాన్ని భద్రతామండలికి ఎంత నచ్చేట్టుగా చెప్పాలో, అంత నచ్చేట్టుగాను చెప్పలేదు. న్యాయసిద్ధంగా అది ఎట్లా అప్రధృష్యమైందో రూపించలేదు. భారతదేశం కాశ్మీర్‌వాదం అంతా ఈ చేరికమీదనే ఆధారపడి వుంది. అయినా న్యాయసిద్ధంగా, ఇది చెల్లుబడి అయ్యే విషయం అని, దానికి తిరుగులేదని, శ్రీ అయ్యంగార్ మండలిముందు స్పష్టంగా వాదించలేకపోయారు. అట్లా అసలు చెప్పలేదని కాదు; చెప్పారు. కాని తగిన రుజువులు అవ్వీ చూపించిగాని, భారతదేశం విభజన ఒప్పందాల పద్ధతిని ఉటంకించిగాని ఒప్పించలేదు.

కాశ్మీర్ వచ్చి భారతదేశంలో చేరడానికి అయిన సంఘటనలను, ఆయన వివరించివున్న పట్టుల్లో, ఈ తప్పిదం అతిప్రబాహ్యమై కన్పిస్తుంది. భారతదేశంలో చేరతానంటూ మహారాజా పంపించిన అభ్యర్థనను, మౌంట్‌బాటన్ దాన్ని ఆమోదించడాన్ని, చదివి మండలికి విన్పించిన అనంతరం. శ్రీ అయ్యంగారు, అది అంత ముఖ్యమైన విషయంకాదో అన్నట్లు, "భారతదేశ ఉన్నతసిద్ధాంతి న్యాయకత్వాన్ని" గురించి మండలిని గ్రహించవలసిందంటూ ప్రార్థించారు. న్యాయసిద్ధమైన ఈ చేరికను నొక్కి వక్కాణించడానికి బదులు, కాశ్మీర్ జనవాక్యం జరగాలన్న దానిమీదకు, ఆ మండలి దృష్టిని మళ్ళించారు. జనవాక్యసేకరణ అన్నది భారత ప్రభుత్వం ఉదారబుద్ధితో చేసిన నిర్ణయం మాత్రమే గాని చేరికలో అంత ర్భాగం కాదని వారికి గట్టిగా చెప్పలేకపోయారు. ఇట్లా చెప్పలేకపోవడంవల్ల, ఈచేరిక అన్నది, జనవాక్యం జరిగినప్పుడే రూఢి అవుతుంది గాని, లేకపోతే కాదన్న భావం, ఆమండలిలో ఏర్పడిపోయింది.

(5) శ్రీ అయ్యంగారికి భారతదేశం వాదంలో వున్న ధర్మం అంటే ఎంతో నమ్మకం వున్నందువల్ల, తాను పాకిస్తాన్ మీద, గిరిజాతి వారి మీద చేసిన ఆరోపణలను రుజూచేసే సాక్ష్యాన్ని, దేన్నీ, ఆయన, ఆమండలి ముందు సరిగ్గా వుంచలేదు సరిగదా, ఆవిషయమై తగిన శ్రద్ధనుగూడా చూపించలేదు. భారతదేశవాదం తిరుగులేనిది కాబట్టి, వూరికే, ఆరోపణలు వల్లించుకుంటూ పోతే సరిపోతుందని, ఆయన భావించారు. ఒకవేళ తాను చెప్పే మాటలకు ఆధారాలను చూపించవలసి వచ్చినప్పుడు, అర్థం లేని మాటలతో, ఒకరి ఒప్పుదలకురాని మాటలతో, సరిపుచ్చుకుంటూ పోయారు. "వివరాలు ఇచ్చి మిమ్మల్ని విసిగించడం నాపని కాదు" అన్నది ఆయనకపటంత మాట అయిపోయింది. ఇట్లా అనడంవల్ల, భారతదేశం చేస్తున్న ఆరోపణలు, అంత ఆధారం కలవి కాదు అన్న భావం, ఆ మండలిలో కల్గివున్నా, కల్గివుండడానికి అవకాశం ఏర్పడింది. ఇంతకీ చెప్పవచ్చేదేమంటే, ఈయన ఇట్లా ఆధారాలుచూపించకుండా వాదించినందువల్ల, ఆచర్చలో, భారతదేశం స్పష్టమైన విజయాన్ని సాధించలేకపోయింది. భారతదేశవాదం బలహీనపడిపోయింది. ఆ అనంతరం శ్రీ జఫ్రుల్లా మాట్లాడినదానితో, పోల్చిచూస్తే, ఈ సంగతి బాగా వ్యక్తంఅవుతుంది. శ్రీ జఫ్రుల్లా, తాను మాట్లాడిన ప్రతిదానికి, పత్రికల వ్రాతల్లోంచి, రేడియో ప్రసారాలలోంచి, కళ్లతో చూసినవారి వృత్తాంతాలలోంచి, సాక్ష్యం చూపిస్తూ వచ్చారు. శ్రీ సెతల్వాడ్, మన వాదంలోని ఈ లోపాన్ని తీర్చాలని ప్రయత్నంచేశారుగాని, అప్పటికే, జరగవలసిన అపకారం జరిగిపోయింది. అప్పటినుంచి ఇక భద్రతామండలి చర్చల్లో మనం తేరుకొని వాదించిందిలేదు. ఉత్సాహం మన చేతులు దాటిపోయింది.

1930 అనంతరం కాశ్మీర్ రాజకీయాలను వివరిస్తూ, శ్రీ సెతల్వాడ్‌గూడా ఆ మండలిలో ఒక తప్పుచేశారు. ఆ రాజకీయ పరిస్థితిని, ఆ మండలిలో ఆయన సమీక్షించిన పద్ధతి వల్లే అనర్థంగావుంది: "1938 లో కాశ్మీర్ జాతీయ మహాసభ ఏర్పడింది. శ్రీ షేక్‌అబ్దుల్లా దానికి అధ్యక్షుడు. అప్పుడు అక్కడ ముస్లిం మహాసభ అని ఇంకోసభుంగూడా వుంది." అంటూ, ఈ పద్ధతిలో పరిస్థితిని వివరించినందువల్ల, ఆ ముస్లిం మహాసభ ముందు వున్నదని, దానిలోంచి, కాశ్మీర్ జాతీయ మహాసభ పుట్టిందని, ఒక భావం ఏర్పడ్డానికి అవకాశం ఏర్పడిపోయింది. ముస్లిం మహాసభతో శ్రీ షేక్‌అబ్దుల్లాకు ఎటువంటి సంబంధమూ లేదనే భావాన్నిగూడా ఆయన అక్కడ కల్గించారు. నిజానికి, ఆ ముస్లిం మహాసభ స్థాపకులలో శ్రీ అబ్దుల్లాగూడా ఒకరు. అందువల్ల 1947 లో 78% కాశ్మీర్ ముస్లింలకు ఆయన ఏకైక ప్రతినిధి కాదన్న భావంగూడా అక్కడ ఏర్పడింది.

(6) కాశ్మీర్ సమస్యను ఆదిలో భద్రతామండలి ముందుకు తెచ్చింది భారతదేశమే అయినా, కొన్ని సందర్భాలలో తానే, దాన్ని గురించి షరతులు విధించడము, ఆ మండలి ఈ సమస్యలో భారత పాకిస్తాన్ వాదాలపట్ల ప్రదర్శించిన వైఖరిపట్ల కోపాన్ని చూపుతూవుండడము గూడా జరుగుతూవచ్చింది. ఇది మనవాదం బలహీనతకు కారణం అయింది.

# నగరాజు

శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

ఓ హిమాలయ నగరాజ! నీ విశాల
శీతలస్వాంత! దివ్య సంస్కృతి వికాస!
గుండెబలమీవు ఆసియాఖండమునకు
నిన్ను వినుతింతు కవితాప్రసన్నవాణి.

వెండికొండను గళమున బొండుమల్లె
దండగా దాల్చుకొన్న నీ ధన్యచరిత
శివకళా ప్రతిపాదన శ్రీకమగుచు
యుగయుగంబులుగా నిల్చియున్నదోయి!

ఆర్ద్రమైనట్టి నీ హృదయంబునుండి
పొంగివచ్చెడు ప్రేమతరంగజాల
మై స్రవించెడు సింధు గంగాది వాహి
నీచయమ్ము మా బ్రతుకు పండించునోయి!

జిలుగు వన్నెలతోడ కాశ్మీరలక్ష్మి
చరణ పీఠమ్మునై సేయ, భరతమాత
ధర్మమణిమకుటమ్ముగా తలధరింప
అలరుమా! మానవశ్రేణి అంజలింప.

పరమపావనోదారమౌ భారతీయ
జీవితమునకు పర్యాయభావమైన
నీ మహోన్నతమూర్తిలో నిఖిలజగతి
ప్రతిఫలించును స్నేహసంబంధదీప్తి.

తరతరాలుగ గుండెలో దాచుకొన్న
బుద్ధదేవుని కరుణాప్రబోధగీతి
తిరిగి విన్పించు మీనాడు దిక్కులన్ని
సుప్రశాంతి మాధుర్యవీచులనుద్వేల.

పరుల బాధకు నిలువెల్ల కరగిపోవు
గుణము కలదోయి! నీయందు గూడుకట్టి
చల్లదనము వర్షించు నీ కళ్ళలోని
వెలుగురేకలు శాంతిని నిలుపుగాత!

రణభయోద్వేగ భావనీరసములైన
విశ్వవీథులు పులకించి, ప్రేముడింప
మంచుపన్నీరు చిలికించి, పంచశీల
ఆలపించుము ప్రాలేయశైలరాజ!

---

# మూడు రూపాయలు

"కంఠీల"

కృష్ణమూర్తి అదృష్టవంతుడు—కాకపోతే అతడు అడుగు పెట్టడమేమిటి రైలుపెట్టెలో, వెంటనే మద్రాసుమెయిల్ కూతపెట్టి కదలడమేమిటి—స్టేషన్ దాటి గోదావరినది వంతెనపై హాయిగా నిండు చూలాలివలె ప్రాకుతున్నట్లు నడుస్తోంది బండి. సంజచీకటి జగత్తును అప్పటికే తన ఒడిలోకి ఇముడ్చుకుంది. కుదుటబడ్డ గుండెతో నిలబడే పెట్టెలో తనకు చుట్టుప్రక్కల ఉన్నవాళ్లను అదోకలాగున పరిశీలించాడు. చటుక్కున అతన్ని బలంగా ఆకర్షించాడొక వ్యక్తి.

అతడు గ్రుడ్డివాడు కావడమే తనను ప్రత్యేకంగా ఆకర్షించడానికి కారణమా అని లోలోపలనే ప్రశ్నించుకున్నాడు కృష్ణమూర్తి. ఎలక్ట్రిక్ దీపపు క్రీనీడలో వాడి ఆపాదమస్తకమూ తేరిపారజూచాడు. నల్లసేనాపురాతికి మెరుగు పెడితే కాంతి లీనేటట్లు వాడి ఒంటిమీద మెరుస్తోంది విద్యుత్కాంతి. వాడు ధరించిన వస్త్రాలు రెండే రెండు. ఒకటి మాసి గోలకంపు కొడుతున్నదా అనే భ్రమగొలిపే చింకితువ్వాలు జబ్బమీదనుండి ఉవ్వెత్తుగా ఎదటకు పొడుచుకొచ్చిన రొమ్ముపైకి జనపాలతో క్రీలాడుతోంది. రెండోది కౌనుమడత కౌపీనం—పైదానికి సన్నిహితంగానే ఉన్నాయి ఛాయా, తీరూను. వాడుమాత్రం కదలకుండా శిలగా నిలుచున్నాడు. ఎక్కడో ఎగ్జిబిషనులో చూచిన తగ్గిపోయిన కంచువిగ్రహం హెర్క్యులీసుది గుర్తుకొచ్చింది. చిత్రపటంలో తాను చూసిన శ్రావణబెళ్గొళలోని దిగంబరజైన విగ్రహం లీలగా మెదిలింది కృష్ణమూర్తి మెదడులో. కళ్లగోతులలోంచి వేపకాయలలాగ పెల్లుబికే గ్రుడ్లు చీకటిలో కోడెద్దుల బండికి కన్నులు మిరుమిట్లు గొలుపుతూ ఎదురువచ్చే బస్సు లైట్ల వెలుగులో తళతళలాడే ఎద్దుల కన్నుగ్రుడ్లవలె ఆనాయి. కృష్ణమూర్తి దృష్టిలో ఆ గ్రుడ్డివాడు ప్రతిక్షణమూ బలీయంగా తిష్ఠ వేసుకు పోతున్నాడు. అప్పటిదాకా వాడు పెదవిమెదపలేదు. వాణ్ణిమాత్రం ఆత్రంగా పరిశీలిస్తూ తాను జనం మధ్య నిలబడ్డ సంగతి మరచిపోయాడు కృష్ణమూర్తి.

కొవ్వూరులో ఆగింది మెయిలు. కృష్ణమూర్తిని చకితపరుస్తూ ఆ గ్రుడ్డివాడు మాట్లాడాడు.

"బాబూ! దయగల మారాజులు ఆయమ్మకు కాస్తచోటు ఇవ్వండి. కొత్తకోడలు బాబూ-బుల్లి. పుట్టింటినుంచి వెడుతుంటాది" తన ప్రక్కనున్న ఒక యువతినుద్దేశించి ప్రాధేయపడుతున్నాడు వాడు. అప్పటిదాకా ఆమెను నేనెలా చూడకుండా వుండగలిగాను? మెర్సెరైజ్డ్ క్రొత్త వాయిలు చీర, పచ్చని ఆమె మనుకేత పాదాలు. ముందున్న బెంచిల కాళీలలోంచి వాసనల వెగజమ్మే చలిమిడి, సున్నికమ్మదనాలు ఒక దాని వెంబడి ఇంకొకటి దరదర ఆమెను పరిచయం చేశాయి. నవకరదగా, కుదిమట్టంగా, పుష్టిగా, అందంగా వుంది ఆమె. తాను సైతం గమనించని ఆమెను అంతవివరంగా ఆ గ్రుడ్డివాడెలాగ పసికట్టగలిగాడు? నిజమే ప్రక్కనున్న అతడు ఆమె పెనిమిటే-తనతో తీసుక వెడుతున్నాడు అనుకుని తనలో ధ్యాసను రెక్కలిప్పే గ్రుడ్డివాని పరిజ్ఞానానికి అచ్చెరువుపడుతున్నాడు - ఖంగున కంచువలె మ్రోగే కంఠంతో వాడు ఆ కొద్ది మాటలూ అని చుట్టుప్రక్కలవారిని విస్మయుల చేసి మౌనం దాల్చడం కృష్ణమూర్తిని అదోకలాగున ఊరించింది.

మెయిలు నిడదవోలు స్టేషనులో అడుగుపెట్టింది. ఎక్కేవాళ్లు ఎక్కుతున్నారు, దిగేవాళ్ళు దిగుతున్నారు. అటు ఇటు కొంచెం సేపుగా మసలుతున్న ధ్యానంనుండి కృష్ణమూర్తిని గ్రుడ్డివాని కంఠం తనవైపు గిరుక్కున మళ్ళించుకొంది.

"చెక్కరుగారు-ప్రసాదరావుగారేనా బాబూ! దండాలండి." అరే-వీడెవడో మహా అసాధారణుడువలె అవుపిస్తున్నాడు-లేకుంటే ఇట్టే పెట్టెలో ఎక్కిన టికెట్ ఎగ్జామినర్ని అజకట్టగలడా? అనుకున్నాడు కృష్ణమూర్తి.

వెంటనే ఒక వూహ అతనికి ఆసరా ఇచ్చింది. గంజిపెట్టి బాగా ఇస్త్రీచేసిన కాకీకోటు గరగర, చేతిలో టిక్కు టిక్కుమన్న కత్తెరా పరిచయం చేసివుంటాయి వాడికి అనిపించింది.

"ఏరా-గుడ్డీ-ఎందాకారా!" మామూలు ధోరణిలో ప్రయాణీకుల టిక్కెట్లను పరీక్షిస్తూనే ప్రశ్నించాడు ఎగ్జామినరు.

"ఏలూరు వెడుతుండా బాబుగారూ—ఇవాళ మధ్యాన్నం కోచీలో వచ్చిన కుంటోడు నాగేసు చెప్పాడండి మా కుర్రోడు కారుక్రింద బడ్డాడనీ, ఆసుపత్రిలో వుండాడనీని-చూడబోతున్నా."

"అరే—ఎంత పని జరిగిందీ!"

"బాబూ... నేచేసిన తప్పేనండి. ప్రొద్దుగూకలా కూడబెట్టిన డబ్బు—అ డు క్కుం టే—వచ్చింది—దేవుడిచ్చింది ఎదవా! బీడీలు త్రాగి అర్పేస్తావా అని రెండు తగిలించానండి. వాలుగ కోజారాడుండి. అంతే. మరి గబబడక లేదు. కంటికి కునుకు లేదు. తిండే పోదు నోటికి. ఇయ్యాళ నాగేసు చెప్పేదాకా పాణం కుదురు లేదుండి."

"అయ్యో! పాపం—ఎలాగుంటుందో?" ఎగ్జామినరు జాలి బుచ్చిన ఈ జాలి—"ఓహో! అంధుడయ్యిండి కోడివారిసుంచి ఎంతటి ఆప్యాయతను పెంజుకుంటున్నాడో" అని కదిపింది కృష్ణమూర్తిని.

తాడేపల్లిగూడెం వచ్చింది. కృష్ణమూర్తికి దాహమయ్యింది. సోడా అమ్ముతున్నారు బయట. నారింజపండ్లవాడు అణాకు ఒకటి అని కేకపెడుతున్నాడు. కృష్ణమూర్తి జేబులు తడుముకున్నాడు. చిల్లర కానీగూడా లేదు. టోటాటోటీగా పరీక్షించాడు- అతడు యిర్యూనివర్సిటీ ఎగ్జామినేషనుకు వెడుతున్నాడు— రేపు కట్టబోయే పోస్టలు సొమ్ముకు సరిపోయే మొత్తం పాటం కట్టబడ్డ పైకం వుంది. "దాన్ని మాత్రం దమ్మిడీసైతం అన్యథా ఖర్చు చెయ్యొద్దు. విజయవాడ స్టేషనులో దిగగానే నేరుగా వడికే

కళ్లు పోస్తలుకు. డబ్బు దుబారా చెయ్యకు" అని పదేపదే హెచ్చరించిన తల్లిమాటలు మారుమ్రోగాయి అతని చెవుల్లో. సోడా త్రాగాలనివుంది. నారింజకాయ ఒకటి ఒలుచుకు తినాలనివుంది. అయితే కృష్ణమూర్తి నోయి కట్టేసుకున్నాడు. చిన్నప్పటినుండి ఉగ్గుపాలతో వాళ్లమ్మ చెప్పే నీతులు మళ్లీ చిత్రంగా మసిలాయి అతని మనస్సులో. "ఇతరుల సొమ్ముకు ఆశపడకు—నీది పూచిక పుల్ల అయినా వృథా చెయ్యకు. సంపాదించడ మెంత కష్టమో ఖర్చు పెట్టడమంత తేలిక."

తాడేపల్లిగూడెమూ దాటిపోయింది. కృష్ణమూర్తికి కూచోడానికి కొంచెం చోటు దొరికింది. బల్లమీద ఆ క్రొత్తకోడలికి ప్రక్కనే తాపీగా చతికిలబడి చుట్టగాల్చుకుంటున్న కుర్రమగనికి ఇవతల ఇరుక్కున్నాడు. అతగాడు కొద్దిగాజరిగి మర్యాద చేశాడు.

"ఒరే—ఒక పాటపాడరా?" ఎగ్జామినరు ఆజ్ఞాపించాడు గ్రుడ్డివాణ్ణి.

"మనసు బావుండలేదు బాబూ! లేకుంటే రోజూ పాడే వాణ్ణిగా—దానివల్ల పోయిందేముందీ? నాలుగు డబ్బులు తెచ్చిపెట్టేదే అది" దీనంగా ప్రత్యుత్తరమిచ్చాడు వాడు.

"ఫర్వాలేదు పాడరా—ఇదిగో— పాట పాడుతూంటే మనసు కష్టం మరిచిపోతుంది" ఎగ్జామినరన్న ఈమాట గాయకునికీ, శ్రోతకీకూడా వర్తిస్తుంది.

గ్రుడ్డివాడు గొంతెత్తాడు. చీకటిలోంచి బాహ్యప్రపంచం ఉగాది అడుగుపెట్టబోతుంటే త్వరపడే వసంత వాతావరణ సూచనగా చల్లనిగాలిని ప్రయాణీకులకు పంచిపెడుతూ ఉక్కపోస్తున్న వారి శరీరానికి హాయిగూరుస్తుంటే ఆ గ్రుడ్డివాని ముఖతః వెలువడే ఆధ్యాత్మరామాయణ కీర్తన వారి మనసుల్ని ఎక్కడికో నెట్టివేస్తోంది. కమ్మగావుంటున్న ఆపాట కృష్ణమూర్తి ఆశ్చర్యాన్ని చిక్కబరుస్తోంది.

"రావణుడు మారీచుని మాయలేడివిగమ్మనీ" సీతమ్మను మిక్కిలిగా ఆకర్షించమనీ కోరుతున్నాడు. మామచెబుతున్నాడు "రాముడు సాక్షాత్తు విష్ణుమూర్తి—అయమ్మ మహాలక్ష్మి—ఆయన నిన్ను అంతమొందించడానికే అవతరించాడు—మానుకో ఈదురాలోచన."

"నాకంతా తెలుసు"—రావణుడంటాడు.

"ఔను అరుజన్మల్లో మిత్రులైవస్తారా—మూడు జన్మల్లో శత్రువులైవస్తారా? అంటే రెండోదానికే మ్రొక్కుతామన్నారుగా. వాళ్ళే రావణ కుంభకర్ణులు!" కృష్ణమూర్తి ఆలోచించాడు. మరొక మహోత్తరభావవీచిక అతని ఎదపై తొలకరి మెరపులా తళుక్కుమన్నది. "మనమనస్సు చెబుతూంటుంది. ఇదితప్పు—కూడదు—అని. కానీ ముక్కరంకశ్శకు పారలు గమ్మించి మనలను కానిపనులకు పురికొల్పుతుంది. తెలిసుండీగూడా మనిషి తప్పులు చేస్తుంటాడు—దీనికి అసలు తీర్మార్పనే వుండదు"—

గ్రుడ్డివాడు పాటను ఆపేశాడు. అలవాటున్నా ఎవరినీ చేయెత్తి కానీ యాచించలేదు. ఒకరిద్దరు కడుపు కరిగిన దాతలు తామే ముందుకువచ్చి యిచ్చిన కానీయో, అర్ధణాయో, అణాయో పుచ్చుకున్నాడు. మొత్తానికి వాడిమనసేమీ బావున్నసూచనలు అవుపించలేదు.

"ఇది రుబారాకాదు. ఒక దమ్మిడీయేనా ఇస్తే బావుండును. అయ్యో! పాపం!! దీనుడు. ఈ అంధుడికెంత కష్టమొచ్చిందీ? వీడి కుర్రాడెలాగుంటాడో. దేవుడు వీడికి ప్రాణాధారమైనవాణ్ణి బ్రతికించాలి." ఏమేమో గుణించుకొని మనసారా ధర్మంచెయ్యడానికి పైసాయైనా చేతకలిగివుండని తన దురవస్థకు చింతిస్తున్నాడు కృష్ణమూర్తి. ఏలూరుస్టేషను వచ్చేసింది. మెయిలు ఆగింది. గుడ్డివాడు దిగిపోయాడు. త్వరగా కృష్ణమూర్తి దృష్టిపథానికి దూరమయ్యాడు ఇంతవరకు అతన్ని ఆకట్టి ఆకట్టి ఆలోచనలతో నిలబెట్టిన ఆ అంధనారాయణుడు.

ఎప్పుడూ లేనంతగా జనం ఏలూరులో మెయిల్ ఎక్కారు. కృష్ణమూర్తి ఉన్న పెట్టె క్రిక్కిరిసి పోయింది జనంతో. దప్పిక అధికమయింది. కుళాయి దగ్గరకెళ్లవద్దామని లేచాడు. జనాన్ని నెట్టుకుంటూ గేటు దగ్గరకొచ్చాడు.- కమ్మిబట్టుకుని ఒక కాలు ముందుంచాడు ప్లాటుఫారముపై. రెండో పాదం ఎత్తుతుంటే దానికి అడుగు భాగంలో ఆనినవస్తు వొకటి అతన్ని అటుమళ్ళించింది. వంగి చూశాడు—అదేదో కాగితాల మడత—ఖాళీ సిగరెట్టుపెట్టెలోపలి ముక్కేమో-కాదు— అన్నట్లు అతని కళ్లు జిజ్ఞాసను అతని ఎదలోంచి పైకి తోడి అతని కేంద్రీకరణ శక్తిని అటు మళ్ళించాయి—అదొక మడత—చిన్న మడత—గరుకైన మడత—మనుషుల కాళ్ల త్రొక్కిడికి నలిగి మసిబూసుకొన్న మడత—చటుక్కున అతని చెయ్యి అటుమళ్లింది. దాన్ని అందుకుంది. గుప్పెట్లో పెట్టుకొంది. వేళ్లు గట్టిగా మూసి వాయి పిడికిలిని. అవస్తువు కృష్ణమూర్తిచే బంధింపబడింది హస్తంలో- కాదు అతన్ని బధించివేసింది. గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి—ఎవ్వరూ చూడ్డంలేదుగదా అదురుతూ హృదయం ప్రశ్నించినట్లయింది. చేయి జేబులోకి పోయింది. ఆమడత ప్రక్కబడింది అక్కడఒకమూల. కాళ్లు దడదడలాడుతు కుళాయి దగ్గరకు దేహాన్నిలాక్కెళ్లాయి. కడుపెడు మంచినీళ్ళు త్రాగాడు. కొద్ది నిమిషాలల్లో. అతడు ఎంతో మారిపోయాడు. లైటు వెలుగులో ఆ మడత విప్పాడు. అది ద్రవ్యం అన్యులసొత్తు- ఎవరిదో తెలియదు—

రెండురూపాయలకాగితం—దానిలో రూపాయికాయితం—వెరసి మూడురూపాయలు. ఎనిమిదిమడతలుగా మడచబడ్డవి. కళ్ళు జిగేలుమన్నాయి. ఆనందంతో మెరిసిపోయాయి - ఎంతో తృప్తి, పుష్టికలిగాయి. అయితే అవి సహజమైనవా కృత్రిమములా అని విమర్శించుకునే శక్తినిగురించిన ఊహేకలగలేదు. వెంటనే రెండు నారింజపండ్లు, మిఠాయి, పకోడీల పొట్లాలు కొనేశాడు అర్ధరూపాయి పెట్టి—అయితే ఆ మొత్తానికిగాను అతడు ఆ మూడు రూపాయలలోను ఏ కాగితమూ మార్చలేదు. తన పాంటుజేబులో పొట్లంవిప్పి ఒకరూపాయినోటు మార్చి ఆ పొట్లంలోనే భద్రపరచగలిగాడు ఆయాచితంగా తనకు లభించిన పైకం.

మెయిలు కదిలేటైము అయ్యింది. త్వరగా తనపెట్టెకు చేరుకునే కృష్ణమూర్తికి గుడ్డివాడు మళ్లీ కనుపించాడు. కొద్దినిమిషాల క్రితం జరిగిన సంఘటన అతనిదృష్టినుండి అన్నిటినీ దూరంచేసి తాత్కాలికంగా తానే వాటి స్థానాన్ని దురాక్రమణ చేయడంవల్ల తనకెదురైన గుడ్డివాణ్ణి, ఆస్థితిలో తటస్థపడ్డ ఆ అంధుణ్ణి కనీసం వాడికొక అణాయైనా ఇవ్వకుండా—తనకు అనుకోకుండా మూడు రూపాయలు దొరికాయిగనక — నిర్లక్ష్యం చెయ్యగలిగేవాడా? కృష్ణమూర్తిని ఇంచుమించు రాచుకుపోయినంత చేరువగా గూడా సాగిపోయాడు గుడ్డివాడు. దీన్ని ఎంతమాత్రం గమనించని కృష్ణమూర్తి, కృత్రిమతృప్తితో తూలిపోయే కృష్ణమూర్తి బండిఎక్కాడు. మెయిలు ఏలూరును దాటింది. కాలవాహినిలాగ విసురుగా సాగిపోయింది.

కృష్ణమూర్తి విజయవాడ స్టేషనులో దిగాడు. త్వర త్వరగా బయటకు నడచి మోడరన్ కేఫ్‌లో ప్రవేశించాడు. గోదావరి స్టేష

సులో మెయిలెక్కేటప్పుడు 'ఇంక ఇవాళకు భోజనం చెయ్యకూడ' దని నిశ్చయించుకున్నవాడు పెరుగు భోజనానికి టిక్కెట్టు తీసుకున్నాడు. తృప్తిగా భోంచేసి ఆవాపెట్టి కిళ్ళీ వేసుకున్నాడు. కాలేజీ హాస్టలుకు రిక్షామీద వెళ్ళాడు. తనకంటె ముందుగానే రూము మేటు విశ్వం వచ్చివుంటాడు అనుకున్నాడు. కాని అతడు రాలేదు సరే—రేపు ప్రొద్దుట లేకపోతే మధ్యాహ్నానికి దిగుతాడు అనుకొని గదిలో ప్రవేశించాడు కృష్ణమూర్తి.

లైటువేసి మంచంవాల్చుకొని పరుపు పరుచుకొని పడుకున్నాడు. తాను ఎంతో అదృష్టవంతుణ్ణని అనుకొంటున్నాడు. ఎంతో ఆనందం పొందుతున్నాడు. అయితే "ఈ రూపాయ లెవరివో-పారేసుకుని వుండివుంటారు - కావచ్చు. అలాగని తాను ఎవరివని ఎలాగడుగుతాడు బండిలో ప్రయాణీకుల్ని? ఒకవేళ మావే అంటారే అనుకొందాం-వీటికి ఆనవాలు? ఇంకొకడెవడైనా నావేఅనెయ్యొచ్చు రూపాయలు గనక-ఆ సందర్భంలో తనవికాని ఆ రూపాయల్ని అతగాడు గుంజుకునే కంటె తనే వాడుకోవడం ఉచితం గాదా - కాకపోయినా ఇప్పుడు ఇంత ముందుకొచ్చాక నాకీ కుతర్కమెందుకంట-ఏదో-భగవంతునికి నాకీ సొత్తు ప్రసాదించాలనిపించింది." పిచ్చిపిచ్చి ఆలోచనలు మాని నిద్రపోయాడు, కృష్ణమూర్తికి హాయిగా నిద్రబట్టింది. పెట్టెలో జాగ్రత్తగా వుంచబడ్డ పొట్లంలోని ఇతర నోట్లతోబాటు ఆ క్రొత్తనేస్తాలు మూడు రూపాయలు బిక్కుబిక్కుమంటు వుండిపోయాయి.

* * *

విశ్వం మరునాడు సాయంత్రం పూరీ మద్రాసు ప్యాసింజరులో వచ్చాడు. బండి గంటకుపైగా లేటుకావడం చేత రూము చేరుకునే సరికి ఏడు దాటింది. అప్పటిదాకా కృష్ణమూర్తి భోజనం చెయ్యలేదు-ఇద్దరూ కలసి మాట్లాడుకుంటూ సంతోషంగా భోంచేశారు.

పడుకునేటప్పుడు "అంతా కులాసాగానే వున్నారా? ఏమిటి విశేషాలు" అంటూ కృష్ణమూర్తి కదిపాడు విశ్వాన్ని.

"బాగానే ఉన్నారు. చెప్పుకోదగ్గ విశేషా లేవీ లేవుగానీ ఇవాళ ప్రొద్దుట ఒక సంగతి జరిగింది" అన్నాడు విశ్వం.

కృష్ణమూర్తి చెవులు పెదిలాయి - "ఏమిటదీ?" ఆత్రంగా ప్రశ్నించాడు.

"మా ఇల్లు చెరుకువాడ వారి సత్రం ప్రక్కనేగా" అంటుంటే పవర్‌పేట మెయిన్‌రోడ్డున బత్తేటివారి పార్కు ఎదురుగా వుంటే ఆ సత్రం గుర్తుకొచ్చి అవును" అన్నాడు.

"ఉదయం సత్రంకు వెళ్ళాను—ఎప్పుడూ లేనిది అక్కడున్న వాళ్ళను పరకాయించాలనిపించింది మూర్తీ! చెబితే నమ్మవ్-ఒక చిత్రమైన వ్యక్తి కనుపించాడు. కళ్ళు రెండూ లేవన్న మాటే గాని అవి వున్న వాళ్ళకంటె గూడా ఎంతో బందోబస్తుగా అవుపించాడు."

"ఆఁ—గుడ్డివాడా."

"గుడ్డివాడే—అయితేనేం మనకంటె బాగా గుర్తుపట్టెయ్యగలడు."

"ఎలాగుంటాడు?"

"వాడి స్వరూపమే ఒక ప్రత్యేకత." అంటూ విస్తారంగా వర్ణిస్తున్న విశ్వాన్ని చూస్తూ విస్తుపోతున్న కృష్ణమూర్తిలో మార్పు ఆ చీకటిలో పసికట్టలేక పోయాడు విశ్వం—" అతే—నిన్నరాత్రి ఏలూరు స్టేషనులో తన ఎడమను ఖాళీచేసి వెళ్ళిపోయిన గుడ్డివాడు మళ్ళీదాన్ని—అది తనకాణాచియైనట్లు—బలంగా లాక్కోవడానికి ప్రయత్నిస్తున్నాడు" అనిపించింది కృష్ణమూర్తికి.

మెయిలులో రావడం. వాడి కుర్రాడికి కలిగిన ప్రమాదం వివరాలు యిత్యాదులు విశ్వం ముఖతః విన్నాడు కృష్ణమూర్తి.

"పాపం! కుర్రాడు ఆసుపత్రిలో ఉంటే చూడడానికి వెళ్లాడట. బిచ్చగాళ్ళ వార్డులో వుంచారటవాణ్ణి—ధర్మాసుపత్రి—అయితేనేం. కొంచెం తడిచేస్తేనేగాని సంరక్షణ జరగదు. రెండో మూడో తెచ్చుకుంటేనేగాని వీల్లేదన్నారట."

"గుడ్డివాడు ఆ మొత్తం తెచ్చుకోగలిగేడా?" కృష్ణమూర్తి గుండె గతుక్కుమంది.

"చెపుతావిను—మూలిగే నక్కమీదనే తాటిపండు పడింది. గుడ్డివాడి కష్టార్జితం, అడుక్కొని సంపాదించుకొన్న డబ్బు, మూడు నెలలుగా నిలవ వుంచింది మూతేమూడు రూపాయలు ఎక్కడో పారవేసుకున్నాట్ట..." విశ్వం వినిపిస్తూనేవున్నాడు. కృష్ణమూర్తి గొంతులో తడి ఆరిపోయింది. గుండె విపరీతమైన వేగంతో కొట్టుకొని ఆగిపోతుందేమో అని అదరి పడ్డట్లయినాడు.

"మూడు......మూడు రూపాయలా?"

"ఔను. వాడికి ఎంత కర్మో—ఒక రెండు రూపాయల కాగితంట—ఇంకొకటి రూపాయి నోటట."

వింటూ తుత్తునియలయ్యేవాడికివలె వణుకుతూ కూలిపోతున్నాడు కృష్ణమూర్తి.

"వాడి భ్రాంతి ఎలాంటిదో, ఎన్నిరోలాలో చెప్పాడు పిచ్చివాడు! ఎనిమిది మడతలు పెట్టాడుట. కుంటినాగేసుచేత రెండింటి మీద శ్రీకారం చుట్టించాడట. ఔను మడతగోచీలో జాగ్రత్తగానే ముడిచాట్ట. కుర్రాడికి వచ్చిన ప్రమాదపు బాధతో మనసు సరిగా పనిచెయ్యలేదు. మరిపోయింది అంటాడు. ఎక్కడ పారేశావురా? అని అడిగాం. రైలులోనే పడిపోయివుండాలి. లేకపోతే ప్లాటుఫారమ్మీదే జారిపోయి వుంటాయి. గేటుదగ్గరికొచ్చి తడుముకొని మళ్ళీ వెనక్కివచ్చాడట" అంటుంటే తనకెదురై తనను రాసుకొంటూ పోయిన గుడ్డివాడిపట్ల ప్రదర్శించిన తన నిర్లక్ష్యం కంటిలో నలుసులాగ మెరిగింది.

"ఇంతకీ ఆ కుర్రాడి కెలాగుందో?"

"డబ్బు తీసుకెడితే ఏమో—వాడిచేత రాగికాసీ లేదాయె. మధ్యాహ్నందాకా యేడుస్తూ సత్రంలో కూర్చున్నాడు. అంతటి దుఃఖంలోను తన సొమ్ము దొరికినవాణ్ణి పల్లెత్తుమాటైనా అనలేదు. చూశావా వాడి సహృదయత!" ఇంకా విశ్వం వివరించే ఆ అంధుని ఘనత వినలేక పోతున్నాడు కృష్ణమూర్తి. కళ్లనీళ్ళు గ్రమ్మాయి.

"కృష్ణా! ఇంతవరకు అవిచ్ఛిన్నంగా అప్రతిహతంగా వచ్చిన నీ నైర్మల్యానికి నీకు తెలియకుండానే మసిదాకిందోయ్. ఎంత పొరబాటు జరిగింది. కూడదీసుకోబడగలదా? ఏమో చేయిజారిన మాణిక్యం దొరకాలి. అనుకోవాలి. పదిమందిలో బరిమీద పడగెత్తిన త్రాచుపాము ప్రాణాలతో బయటపడ్డది యొక్కడైనా వుందా! అతే, ఒకరిసొత్తుకై కలలోగూడా ఆశించకు అన్న మాతృవాక్యం ఎందుకు, ఎలాగ తాను విస్మరించగలిగాడు." తాను సర్వనాశనమైపోయినట్లు కుందుతున్నాడు. విశ్వంతో చెప్పకుండానే లేచి పెట్టె తాళంతీసి పైకం దాచిన పొట్లం విప్పి వేరుగావున్న మూడు రూపాయలు తీశాడు.

విశ్వం చూడగూడదని వీధిలోకి వచ్చి మునిసిపలు ఎలక్ట్రిక్ దీపం విరజిమ్మే అరుగుమీది వెలుగులో వ్రేళ్లతో తడిమి తడిమి

చూశాడు నోట్లు. స్ఫుటంగా అవుపించాయి శ్రీ కారాలు రెంటి పైనా. తను చేసిన పాపానికి నిష్కృతి లేదంటూ శ్రీరాముడు నిర్దయగా తన్ను శాసిస్తున్నట్లు తళతళ లాడాయి ఆ అక్షరాలు. కృష్ణమూర్తి మూర్ఛ పోయినట్లయ్యాడు. త్వరగా లోనికివచ్చి మంచంపై పడిపోయాడు. అతనికి ఆ క్షణంలో బావురుమని యేడుద్దామని పించింది. విశ్వంప్రక్కన ఉండబట్టిగాని లేకుంటే అంతపనీ జరిగిపోయేది.

విశ్వానికి నిద్రపట్టింది. కృష్ణమూర్తికి నిద్రరాలేదు. మనసు పరిపరివిధాల పోతుంటే కునుకెలా వస్తుందీ? ఎన్నో ఆలోచనలు అతని మనోవీధిలో చెలరేగి ఎదురుతాకే ఆస్కారంలేక తమ్ముతామే ఢీకొని నుగ్గునుగ్గైపోతున్నాయి. కలతచెందిన మనసుతో రాత్రి అంతా విపరీతంగా మథనపడి ఏం నిర్ణయించుకున్నాడో మౌనంలో నృత్యంచేసిన రజనీకాంతకే యెరుక!

వేకువజామున అయిదింటికి వేగంగా బయలుదేరి స్టేషనుకు వచ్చాడు. కలకత్తామెయిలు ఎక్కాడు పవర్పేటకు టిక్కెట్టు తీసుకుని మెయిలు గంటలను నిమిషాలుగా నిమిషాలను సెకనులుగా వలిచేసి క్షణంలో తన్ను పవర్ పేట చేర్చివేస్తే బావుండు ననిపించింది. పెద్దమెయిలు ఎందుకో విజయవాడలో గంటసేపు ఆగిపోయింది.

కృష్ణమూర్తి పవర్ పేట చేరుకునేసరికి తొమ్మిదయ్యింది. ఏకాఏకిని సత్రానికి పరుగుతీశాడు. అక్కడి బిచ్చగాళ్లందరినీ ఆ గ్రుడ్డివాణ్ణి గురించి భోగట్టా చేశాడు. "కళ్లులేని వాళ్లెందరో-వాడి పేరు?" ఒక కుంటివాడు ప్రశ్నించాడు. "అరే! ఎంత పొరబాటు జరిగిందీ. కొద్దిగంటలు వాణ్ణి ఎదరపెట్టుకుని, వాడికంత చేరువై



చతురంగ ప్రవీణుడు—లినోకట్ చిత్రం.

చిత్రకారుడు: శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి.

పేరు ఎందుకు తెలుసుకోలేకపోయాను చెపుమా!" అని నాలిక కరుచుకున్నాడు. తనకు గుర్తున్న ఆనవాళ్ళన్నీ చెప్పాడు.

"ఓ! వాడా. గుడ్డి నారాయుడు—ఆసుపత్రికి పోయాడు రాత్రి అనగా—కుర్రవాయాలకు ఎలాగుందో" సందేహాన్ని వెలిబుచ్చింది అతనికివచ్చిన సమాధానం-తిన్నగా ఆసుపత్రి కెళ్లాడు.

"మీరెవరో గొప్పవారిలాగున్నారు. వాడితో ఏం పనీ?" వార్డులో ప్రక్కమీదవున్న ఒకరోగి బిచ్చగాడే—ప్రశ్నించాడు.

"అవసరమైనపనుంది. వాడికి నేను కొంతడబ్బు ఇవ్వాలి."

"అయ్యయ్యో! ఎంతపని జరిగిందండీ! రాత్రి మీరొస్తే ఆ కుర్రగాడు బ్రతుకునేమో! రెండు రూపాయలకు వాడిప్రాణం తీసేసుకున్నాడు. ఏదో ఇంజీషనులు రెండిస్తే చాలు చేయిస్తా మన్నారు, రాత్రి పదిగంటలదాకా ఏడ్చేడు ముండావాడు—మమ్మందర్నీ అడిగాడు. మేమే దమ్మిడీలేనివాళ్లమాయె."

"అయితే ఆకొస్తాకూడా అయిపోయిందన్నమాట!"

"ఆ నిన్నటిరాత్రి పన్నెండుగంటలకు చనిపోయాడు. గుడ్డి నారాయుడికి ఊత, ప్రాణాధారంపోయింది. దేవుడు అలాగకూడా వాణ్ణి బ్రతుకనిచ్చాడుగాదు."

"నారాయుడిప్పుడెక్కడుంటాడు."

"శ్మశానానికి తీసుకుపోయారు శవాన్ని. గోలుగోలుమంటూ వెంటవెళ్ళాడు. "ఆసుపత్రి నౌకర్లు బయటకు యీడ్చిపారేసేటంతటి కుక్కచావు నీకొచ్చిందిరా కుర్రా" అని కంటికిమంటికి ఏకధారగా ఏడ్చాడు."

కృష్ణమూర్తి శ్మశానానికి చేరుకునేసరికి పదిగంటలయ్యింది. అప్పుడే కాడి చల్లారుతోంది. మంటలు మళ్లుమెంగం పట్టి. దాని



పొలానికి—లినోకట్ చిత్రం.

చిత్రకారుడు: శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి.

చుట్టూ ఎవరూ లేరు. ఔను. లేనివాళ్ళు పేదవాళ్లు. బికారులుపోతే శ్మశానందాకావచ్చేవాళ్ళెవరుంటారు? శ్మశానమంతా కలియ జూశాడు. ఏమిచేయడానికీ తోచక వెక్కివెక్కి ఏడ్చాడు.

మరోవైపునుంచి ఎవరో శవాన్ని మోసుకొస్తున్నారు. అది ఒక డబ్బుగల మారాజుకొడుకు పీనుగ...తల్లీ, తండ్రీ ఇతర పరివారము ఎలుగెత్తి ఏడుస్తున్నారు. ఆజనంలో ఒకరిని పిలిచి ఆత్రుతతో అడిగాడు వెర్రిగా "బాబూ! మీకెవరేనా గ్రుడ్డివాడు ఎదురయ్యాడా?" అని.

"దారిలో దసులుపడ్డాడు—పాపం! వాళ్ళకుర్రాడు ప్రమాదానికి గురియై దారుణంగా బాధపడి ఆసుపత్రిలో చనిపోయాడట" అని చెప్పి వారు కృష్ణమూర్తికి అటు దారిమాపారు.

కృష్ణమూర్తి వారి మాటలు పూర్తికాకుండానే ఆదెస అతివేగంగా "నారాయణా" అంటూ పిలుస్తూ పరుగెత్తాడు-పిచ్చిగా ఎన్నిసార్లో అరిచాడు. అతడు పెట్టిన ప్రతికేకా అతనికి తెలియకుండా భగవంతునికై అర్పణ చెయ్యబడ్డ స్తోత్రమే అయిపూరుకుంది. గ్రుడ్డివాని జాడతెలియలేదు కృష్ణమూర్తి గొంతు ఎండి చించుకున్నా—మధ్యాహ్నము నాలుగుగంటల వరకు ఏలూరు నగరమంతా కలియ దిరిగాడు కాని నారాయణ పత్తాలేదు.

కృష్ణమూర్తి అలసిపోయాడు. అతని జేబులో మూడు రూపాయలు అతని దుస్థితికి సానుభూతి ప్రదర్శించడానికి మారు హేళన చేస్తున్నట్టు వాటి మానం సూచించింది. రాత్రి ఏడు గంటలకు విజయవాడ చేరుకున్నాడు.

చేసిన పాపం చెబితే పోతుందని పవిత్రంగా విశ్వంతో చెప్పేసి కంట తడిపెట్టాడు. కర్తవ్యం బోధించమన్నాడు తనకు—విశ్వం బాగుగా యోచించి "ఇంక యెన్నడు ఆ రూపాయలు ఖర్చు పెట్టకు—జీవితంలో ఒక ప్రముఖ ఘట్టానికి మధురస్మృతిగా వీటిని భద్రపరచుకో—ఏసందర్భంలోను వాటిని జారవిడువకు. నీ అదృష్టంపండి ఎక్కడైనా నారాయణ దసులుపడితే నమస్కరించి ఇవ్వు" అన్నాడు. కృష్ణమూర్తి సరేనన్నాడు.

మరునాడు ఉగాదిపండుగ. ఎంతో సంతోషంగా గడుప వచ్చుని కృష్ణమూర్తి పండుగను గూర్చి కనినకల కల్లయై పోయింది. వర్ష ప్రతిపదా పర్వదినాన మిత్రుడు విశ్వం ప్రతిపాదించిన ప్రతిజ్ఞ పునః ప్రవచించుకున్నాడు—కృష్ణమూర్తికి స్ఫురింపకపోయినా ఈ దీక్షవల్ల అతడు ఎన్నడు మరువజాలని ఉపకారం గలిగింది. అతడు త్రికరణ శుద్ధిగా దాన్ని ఆ జన్మాంతము పాలిస్తే ఎన్నడు చేత ఎర్ర నియేగాని కలిగి వుండని దారిద్ర్యం అతన్ని బాధించదు. మానవుని పశుత్వానికి పడద్రోసే అవాంఛనీయ ప్రవృత్తి యొక్కటి అతని నింకెన్నడు ఆవహించలేదు. కృష్ణమూర్తి అదృష్టవంతుడు.

---

"మీకు వున్న రోగమేమిటో చెప్పండి...?"

"ఏమీ లేదండి... అప్పుడప్పుడు కడుపులో నొప్పి వేస్తుంది. ఆ సమయాల్లో నేను పడేబాధ భగవంతుడికే తెలియాలి..."

"అప్పుడప్పుడూ అంటే, యెన్నాళ్ళకోమారు?"

"మూడు నాలుగురోజుల కోమారు..."

"ఏ సమయాల్లో వస్తూవుంటుంది? రాత్రిపూటా? పగలా?"

"రాత్రిపూటే వుధృతంగా వుంటుందండీ..."

"వేళకి సరిగా ఆహారం తీసుకుంటున్నారా?"

"ఔనండీ!"

"సరే...మందు రాసి యిస్తాను. ఆసుపత్రికి వచ్చి తీసుకోండి. లేదు అంటే, మార్కెట్టులో కొనుక్కున్నా సరే దొరుకుతుంది"

"మార్కెట్టులో కొనుక్కుంటాలెండి..." అంది పద్మ వయ్యారంగా వళ్ళు విరుచుకుంటూ.

పద్మ తనకి యెదురుగా నిల్చుని అలా వళ్ళు విరుచుకోవడం, రామారావుకి యేదోలా అనిపించింది. ఇంతకు ముందు యెంతోమంది అందమైన యువతుల్ని చూశాడు. కొందరికి మందు లిచ్చాడు. కాని, పద్మలో వున్నంత ఆకర్షణ, కాదు—యేదో ప్రత్యేకమైన అందం, వాళ్ళల్లో లేదనిపించింది. పద్మను కళ్ళారా చూడాలని, మనసారా ఆమెతో మాట్లాడాలని, నవ్వుతూ కూర్చోవాలని, అతని హృదయంలో యెక్కడో ఓ వాంఛ యేర్పడింది. "సరే, మీ యిష్టం..." అని చీటీరాసి యిస్తూ "మరిక నేను వస్తానండి" అని లేచి నిల్చున్నాడు. పద్మ మంచం మీదున్న హేండు బేగ్ తీసి అందునుండి ఓ రెండు రూపాయిల నోటు బైటికి తీసి, "మీ ఫీజు..." అంటూ అందించి "మళ్లీ యెల్లుండి మీరో మారు రావాలి... మీ ఫీజు యిచ్చుకుంటాలెండి...ఆ భయమేమీ వద్దు..." అంది అతని మొహంలోకి తీక్షంగా చూస్తూ నవ్వి.

డాక్టరు రామారావు, మంచు ముక్కలా కరిగిపోయాడు. ఎంత అందంగా వుందీమె! ఆ నవ్వులో నవరత్నాలు కూడా రాలవచ్చు నేమో! విల్లులా వంగిన ఆ పెదాలు, నవ్వుతూవుంటే, చెక్కిలిపై యేర్పడ్డ చిన్న నొక్కు, ఆ మొహానికి యెంతో శోభని కలిగిస్తున్నాయి!...అనుకున్నాడు. మరోమారు ఆమె మొహంలోకి చూడాలనుకున్నాడు. కాని, అప్పటికే తను అసభ్యంగా ప్రవర్తిస్తున్నానేమో నన్న భయం ఆవరించటంతో యీ లోకంలోపడి "అలాగే లెండి" అంటూ బైటికి నడిచాడు. అతను వెళ్ళిపోయే వరకూ పద్మ ద్వారందగ్గరే నుంచింది. రోడ్డుమీద నడిచిపోతున్న వాళ్ళు ఆమె వేపు వింతగా చూస్తున్నారు...రామారావు మెదడు అసంఖ్యాకమైన ఆలోచనలతో నిండి, చిందరవందరయ్యింది. కాదూ మరి...పాపం, బ్రహ్మచారి!

ఆ రోజురాత్రి, డాక్టర్ రామారావు అనుభవించిన విరహ తాపం వర్ణనాతీతం...అతను మెడికల్ కాలేజీలో చదువుతున్న రోజుల్లో ఒకమ్మాయి ప్రేమపాశంలో పడినప్పుడుకూడా యింత విరహం అనుభవించలేదేమో! కన్నుమూ స్తేచాలు, నవ్వుతూన్న పద్మ మొహం అతని కళ్లెదుట కదులోంది. ఆ నవ్వులో యేం మహత్తు వుందో! అనుకున్నాడు. గోడ గడియారం పదకొండు గంటలు కొట్టింది. పన్నెండు కొట్టింది. కాని, రామారావుకి నిద్ర పట్టలేదు. ఎంత కళ్లు మూసుకుందుకు ప్రయత్నించినా, యేవో ఆలోచనలు. పద్మ యెవరు? ఒంటరిగా యెందుకుంటుంది? భర్త వున్నాడా? తలిదండ్రులున్నారా? తన యెదుట అలా యెందుకు ప్రవర్తించింది?. యీ ప్రశ్న పరంపరలు, రామారావు మెదడును ఆక్రమించు కున్నయ్...కాని, వాటికి సమాధానం ఒక్కటీ దొరకలేదు. ఆ ఆక్రమణ అలాగే వుండిపోయింది. మెదడుకి మరి స్వేచ్ఛ లేదు.

మరునటిరోజు రామారావు, ఆసుపత్రికి వెళ్లాడేగాని, అతని మనసంతా పద్మవేపేవుంది. ఒక్కసారి పరిచయం కలిగిందో లేదో, ఆమె తనని ఎందుకలా ఆకర్షించినది? ఆమెకీ తనకీవున్న అనుబంధం యేమిటి?...అనుకుని అతి కష్టంమీద మనసుని మళ్లించి, తన రోజువారీ పనిపై లగ్నం చేశాడు. ఎలాగో గడిచిందారోజు. ఆ సాయంత్రం పద్మయింటికి వెళ్ళాలనిపించింది. కాని, ఆమె ఆరోజు రమ్మనకుండా యెట్లా వెళ్లటం?...అందుకే ఆ ఆలోచన మాను కున్నాడు.

## 2

శ్రీ తలుచుకున్న దంటే, యెంతటి పనైనా చెయ్యగలదన్న విషయం అందరికీ తెలిసిందే! విశ్వామిత్రునివంటి నిగ్రహ శాలినే మార్చేసి తనవేపు తిప్పుకున్న శ్రీ, డాక్టరు రామారావుని మార్చడంలో వింత యేముంది? ఎటొచ్చీ, విశ్వామిత్రునియెదుట 'మేనక'...రామారావుయెదుట 'పద్మ' అయ్యారు మరి!

మూడో నాడు పద్మ చెప్పినట్టుగానే, వుదయం ఆసుపత్రిలో పని చూసుకుని తిన్నగా పద్మయింటికి బయల్దేరాడు. రామారావు వస్తాడన్న నమ్మకం వుండే గాబోలు, పద్మ బాగా ముస్తాబై కూర్చుంది. ఆరోజు ఆమె, రామారావు కళ్ళకి మరీ అందంగా అని పించింది. పసుపురంగు షిఫాన్‌చీర, దానికి జతగా యెరుపు వెల్వెట్ బ్లౌజూ తొడుక్కుని, యెంతో రమణీయంగా అనిపించింది. రామారావుని యెంతో ఆప్యాయంగా ఆహ్వానించింది. మొదటి సారిలా రామారావు అంతగా బిడియ పడలేదు. "మీ వంట్లో ఎలా వుందండీ?" కూర్చుంటూనే అన్నాడు. పద్మ అతనికి యెదురుగా మంచానికి చేరబడుతూ.

"మళ్లీ రాత్రి అపరిమితంగా నొప్పి లేచిందండీ! అప్పుడు సోడా త్రాగాక కాస్త వుపశమనం కలిగింది" అంది.

"క్రమంగా తగ్గుతుందిలెండి... నేనిప్పుడు రాసి యిచ్చిన మందు చాల తక్కువమంది వాడుతారు."

"మీరన్నట్టు క్రమంగా తగ్గుకురావాలిమరి..."

"అవుతే మరి నేను వెళ్ళొస్తానండీ. ఆమందునే వుపయోగిస్తూవుండండి. అప్పటికీ గుణం కన్పించకపోతే, అప్పుడు యింజక్షను యిస్తాను"

"ఇంజక్షను పేరుమాత్రం యెత్తకండి మీకు పుణ్యముంటుంది. నాకు ఆపేరు వింటేనే భయం..." అంది అప్పటికే బెదిరిపోయి నట్టు. రామారావుకి నవ్వు ఆగిందికాదు. ఆమెకూడా నవ్వింది. ఇద్దరి నవ్వులూ మిళితమై ఆగదిలో ప్రతిధ్వనించాయి.

"మీయిష్టంమరి..." అంటూ లేచాడు రామారావు.

"కూర్చోండి. కాఫీ త్రాగి పోదురుగాని..." అంటూ లోపలికిపోయి స్టౌమీదపెట్టి వుంచిన కాఫీని కప్పులోపోసి తెచ్చి అతనికి అందించింది' ఆమె చేతివ్రేళ్లు తగిలేసరికి రామారావు శరీరం గగుర్పొడిచిందంటే, ఆశ్చర్యంలేదు. ఖాళీకప్పు తిరుగను వుంచేసిన రామారావుకి పద్మ ఫీజు యివ్వబోయింది.

"అబ్బే! నేనివ్వాళేం, ప్రిస్క్రిప్షన్ యిచ్చానుగనుకనా, ఫీజు తీసుకోందుకు? వుంచండి" అన్నాడు నవ్వుతూ. అతనలా అంటాడని పద్మకి ముందే తెలుసు.

"మీరట్లాఅంటే, మరేంచెయ్యను? అప్పుడప్పుడు వస్తుండాలే... నేను రావటమంటే వీలుపడదు..." అంది పద్మ. రామారావు చప్పున యేదో జ్ఞప్తికి వచ్చినట్లయి, అడగటమా, మానటమా, అన్న సందిగ్ధంలోపడి చివరికి ఒక నిశ్చయానికివచ్చి.

"నిజంగా, పెద్దవాళ్ళెవరూ మీయింట్లో లేరేమిటండీ!" అడిగాడు. నిజానికి అది అప్రస్తుతప్రశ్న అయినాసరే అడిగేశాడు వుండ బట్టక. పద్మ తిన్నగా నవ్వింది.

"లేకేం వున్నారులెండి...మా మేనమామకూడా నాతోనే వుంటున్నాడు. కాని పగలంతా వుండడు. ఓమిల్లులో పని... వుదయం ఆరుగంటలకి వెళ్లిపోయి, సాయంత్రం యేడెనిమిదిగంటలకి వస్తాడు. మీరు పగలు యెప్పుడు రాదల్చుకున్నా రండి...ఏం భయంలేదు. అందరిలా, మనం చదువు, సంస్కారం వున్నవాళ్ళం కూడా. యేదోభయంతో వుండటం నాకస్సలు ఇష్టముండదు..." అంది అంతే! రామారావు సంతృప్తిగా చిరునవ్వునవ్వి బయల్దేరాడు.

* * * *

రోజులు కాలగర్భంలో కలిసిపోతున్నయ్. డాక్టర్ రామారావు ప్రతిరోజూ, ఓమారయినా పద్మ యిల్లు పావనంచేసేవాడు. వాళ్లపరిచయం చివరికి ప్రేమగామారి, రామారావుని వూపిరిసలప నివ్వడంలేదు. పద్మను రోజుకోమారయినా చూడకుండా వుండలేక పోతున్నాడు. ఇంతవరకూ, ఆసుపత్రి, రోగులు, వాళ్లకి మందులివ్వటం...యివే ఒక ధర్మంగా పెట్టుకుని, దినచర్యగా పెట్టుకున్న రామారావు యిప్పుడు బాగా మారిపోయాడు. ఇప్పు డతనికి ప్రపంచమంతా పద్మమయంగా అనుపిస్తోంది.

ఉదయం పదిన్నర అయ్యింది. డాక్టర్ రామారావు టేబిలు చుట్టూ మనుష్యులే...పక్క నేవున్న బెంచీ నిండిపోయింది. ఎంతకీ తరగని రోగుల్ని చూసి విసుక్కున్నాడు రామారావు. అతనిలో సహనం లోపించింది, కంపౌండర్ని పిలిచాడు.

"వీళ్ళందరికీ చీటీమీద సంతకంపెట్టి మందు లియ్యవోయ్..." అంటూ లేచాడు. బెంచీమీద కూచున్న ఒకాయన లేచి,

"మా యింటికి రండిసార్! అర్జంటుకేసు..." అన్నాడు.

"ఇప్పుడు నాకు తీరుబడి లేదండి...మరో డాక్టర్ని పిలవండి" అంతే అన్నాడు రామారావు. ఆ వ్యక్తి ప్రాధేయతనైనా విన్పించుకోకుండా వెళ్లిపోయాడు డాక్టరు. అందరూ ఆశ్చర్యంతో మొహాలు చూసుకున్నారు. ఎప్పుడూ కనీ, వినీ, యెరుగని మార్పు, డాక్టర్ రామారావులో యెందుకొచ్చిందీ యెవరికీ అర్థంకాలేదు. ఆఖరుకి కంపౌండరుకి కూడా అవగాహన కాలేదు.

ఇలా యెన్నోసార్లు జరిగింది. ఇన్నాళ్ళంతగా రోగుల విషయంలో అతను శ్రద్ధ తీసుకోవటంలేదు. అతనిలోవుండే ప్రతిభ వల్లనైతేనేం, మంచితనం వల్లనైతేనేం, ప్రతివాళ్లు అతన్నే ఆశ్రయించే వారింతవరకు. ఇప్పు డతనిలో ప్రతిభవున్నా, సహనం, ఓపిక లేనట్టనిపించి చాలమంది అతని దగ్గరికి రావటం మానుకున్నారు. ఒకప్పుడు రామారావుకి కాఫీ తాగేందుకు, కంపౌండరుకి సిగరెట్ కాల్చుకుందుక్కూడా తీరుబడిలేని ఆ ఆసుపత్రిలో రోగులు పల్చబడిపోయారు. అలా యెందుకు జరిగిందో, కారణం తెలుసునుగాని, ఆ కారణానికి కారణభూతమైన డాక్టరు రామారావులోని మార్పుకు కారణం మాత్రం తెలిసిందిగాదు కాంపౌండరుకి...అతనికేకాదు...ఎవరికీ తెలిసిందికాదు.

## 3

"షేప్ పద్మా! నిజంగా నువ్వు యెంతటి మునీశ్వరుణ్ణయినా, యిట్టే వలపర్చుకోగలవ్..." నవ్వుతూ అన్నాడు డాక్టరు ప్రభాకరం.

"నీ కోరిక నెరవేరినట్టేనా మరి!" నవ్వుతూ అంది పద్మ.

"ఓ! అందుకు సందేహమా డియర్...నే నెప్పుడూ తప్పుగా ప్లాను వెయ్యను. నే నెలా వూహించానో అలాగే జరిగింది. ఇక్కడున్న డాక్టర్లలో రామారావుది, నాదే పైచేయి. రామారావు నాకంటె ఒకమెట్టు యెక్కువలో వుండేవాడు. ఈ దెబ్బతో ఓ మెట్టు కిందికి దిగాడు. ఇప్పు డతని గురించి అంతా చెడ్డగా చెప్పుకున్నవాళ్ళే అధికం. ఇప్పుడు నా ఆసుపత్రిలో యిసుకవేస్తే రాలనంత వుమ్మిరిగా వుంది తెలుసా?"

"అలాగా! మరవుతే నాకు విముక్తి కలుగుతుందన్న మాటే! ఇకనైనా పెళ్ళంటూ చేసుకుంటావా? ఇన్నాళ్లూ యెలాగో యిది, అదీ, అంటూ నెట్టుకొచ్చావు. ఇంకెంత కాలం యిలా వుంటాం......యేదో, యీ కార్యం సాధించమన్నావు సాధించాను. నీమాట వుంచుకుంటావని నాకు తెలుసు ప్రభాకరం..." అంటూ అతనికి దగ్గరగా వచ్చి మొహంలోకి చూసింది పద్మ వుత్సాహంగా కాని, ఆవుత్సాహం ఆమెలో యెంతోసేపు నిలువలేదు.

ప్రభాకరం కాస్త గట్టిగా నవ్వేడు. ఆనవ్వులో విషజ్వాలలు వెలికి వచ్చినయ్. ఎంతో వికృతంగా వుందా నవ్వు. ఆనవ్వు విన్నాక పద్మ హృదయం బితుకు బితుకుమంది. "ఎందుకట్లా నవ్వుతున్నావు ప్రభాకరం?" అంది భయ విహ్వలయై "నవ్వక, యేడవమంటావా యేమిటి? ఇంకనీకు పెళ్లేమిటి పద్మా! రామారావుతో కులుకుతున్న దానవు...నిన్నెలా పెళ్లి చేసుకుంటాను?" గట్టిగా నవ్వుతూ అన్నాడు.

నిజంగా పద్మ, నిర్జీవప్రతిమలా తెల్లమొహం వేసింది...ఆమె శరీరం యావత్తూ, గడగడవణికి పోయింది. ఒకంతట నోట మాట రాలేదు.

"ఏమిటి ప్రభాకరం, అలా అంటున్నావు? నువ్వేగా, నన్ను స్వార్థంతో, నీ భవిష్యత్తు కోసం, నన్ను రామారావు దగ్గరికి పంపావు? అతణ్ణి నా ప్రేమవలలో బంధించమన్నావు! అందుకు మొదట్లో నేను ఒప్పుకోలేదు కూడా. అప్పుడు నువ్వేమన్నావు? మర్చిపోయావా? రామారావుని నా వలలో వేసుకుందుకు యెట్లా ప్రవర్తించినా సరే, నువ్వేమీ బాధపడనన్నావు. విశాల హృదయుడనన్నావు. అవన్నీ మర్చిపోతానన్నావు...అప్పుడే వివాహం చేసుకుంటానని వాగ్దాన మిచ్చావు. ఆమాటలన్నీ మర్చిపోయావా? నన్నిలా మోసంచేద్దామనే, యీ యెత్తువేశావా? నిన్ను నమ్ముకొని, తల్లి తండ్రుల్ని, కావాల్సిన వారిని విడిచి నీతో లేచి వచ్చినందుకు యిదేనా ఫలితం?..." రుద్ధకంఠంతో వలవలా యేడ్చింది పద్మ. కాని ఆమె యేడుపు ప్రభాకరాన్ని కరిగిస్తుందా? అచ్చే అతను నిశ్చలంగానే వున్నాడు.

"మాటలు యెన్నయినా చెప్తాం పద్మా! వాటికివిలువ యెక్కడుంది? అవన్నీ నిజమనుకొని నమ్మి, నువ్విలా ప్రవర్తిస్తుంటే, నిన్ను నేను మాత్రం నమ్మేదట్లా? అయినా, లేచివచ్చిన మనిషికి, నీతి నిలకడ యెక్కడుంటుంది. అందుకే నిన్ను యెలాగో వదిలించుకోవాలనుకున్నాను. ఆలోచించాను. ఒక్క దెబ్బతో రెండు పిట్టలు నేలకూలేలా ప్లాను వేశాను. నా పాచిక పారింది. అంతేచాలు. ఇక నీత్రోవ నువ్వు చూసుకోవచ్చు! నాకు సహాయపడినందుకు ధన్యవాదాలు...గుడ్ బై"...అంటూ చరాచరా బైటికి వెళ్ళి పోయాడు ప్రభాకరం.

'ప్రభాకరం!' అని గట్టిగా అరవాలనుకుందిగాని, పద్మకి ఆ మాట గొంతులోనే వుండిపోయింది. ఆమెకళ్లునీటిమయమయ్యాయి. చేతులు, కాళ్ళు, పెదాలు, వణుకుతున్నయ్. చాలాసేపు చీర చెంగు నోటపెట్టుకుని వలవలా యేడ్చింది. యెవరికీ విన్పించకుండా ఎంతసేపు అలా యేడ్చిందో, ఆమెకే తెలీదు. ఆనిశ్శబ్దంలో పక్క యింట్లోని గడియారం పదికొట్టడం విన్పించిందామెకు, లాంతరు కొడిగట్టుకుపోయి వెలుతురు అట్టేలేదు. అలా యెంతసేపని వుంటుంది? తలుపు గడియవేసివచ్చి మంచంపైవాలి దిండులో మొహాన్ని దాచుకొని, శక్తివున్నంతవరకూ యేడ్చింది. ప్రభాకరం యెంత

ద్రోహం చేశాడు? అసలు, తను అతనితో లేచిరావటమే ఓ పెద్ద పొరపాటు...అందుకు ప్రాయశ్చిత్తం యిప్పుడు అనుభవిస్తోంది. అప్పుడే తనుమాత్రం అనుకుందా, ప్రభాకరం యింతద్రోహం తల పెడతాడని! ఛీ! యేం బ్రతుకు తనది? ఇప్పుడు తను ఏంచెయ్యాలి? ఎక్కడికి పోవాలి? ఎక్కడికి పోయినా, యేంచేస్తుంది? ఈహీనపు బ్రతుకు బ్రతికేకంటె, శాశ్వతంగా యీలోకాన్ని విడిచిపెట్టడం మంచిది...అలా చనిపోయేముందు ప్రభాకరం పన్నిన పన్నాగం అమాయకుడైన రామారావుకి తెలియజేసి మరీమరణిస్తే బావుంటుంది. తను అనవసరంగా, ఒక నిర్దోషిని, ఒక మంచివాణ్ణి పాడుచేసింది... ఆపాపమంతా తననే చుట్టుకుంటుంది...కనీసం, తన అంత్య ఘడియల్లోనైనా రామారావుకి కనువిప్పు కలిగించాలి...అనుకుంది పద్మ. ఆరాత్రి ఆమెకి సరిగ్గా నిద్రపట్టడం లేదు పాపం!

## 4

ఉదయపు ఎండ కిటికీగుండా గదిలోపలికి చొరబడుతోంది. చిన్నగాలి తెరంగాలికి కిటికీగుడ్డ రెపరెపలాడుతోంది. పద్మ మంచం మీద కూర్చుని యేదో ఆలోచిస్తోంది. ఇంతలో తలుపుతట్టిన చప్పుడయింది. పద్మకి తెలుసు యెవరొచ్చారో! వెళ్ళి తలుపుతీసింది డాక్టర్ రామారావు తనెదురుగావున్న పద్మనుచూసి విభ్రాంతిపోయాడు. ఈమె మరో పద్మలా అగుపించింది. ఆమెజుత్తు రేగివుంది. కళ్ళు ఎర్రగా చింతనిప్పుల్లా వుండి, కనురెప్పలు పొంగి వున్నయ్. మొహంలో విషాదరేఖలు స్పష్టంగా అగుపిస్తున్నాయి. అయినా సరే, పద్మ అందంగానే అగుపించింది రామారావుకు.

"అలా వున్నావేం పద్మా!" లోపలికి వస్తూనే అన్నాడు రామారావు. పద్మ తలుపులు కొస్త దగ్గరగా చేరవేసి,

"అబ్బే యేమీ లేదులెండి..." అనేసింది తెచ్చిపెట్టుకున్న నవ్వుతో.

ఇటీవల వాళ్ళిద్దరి సంబోధనల్లో మార్పువచ్చింది. పద్మను మాత్రం రామారావు ఏకవచనంతోనే సంబోధిస్తాడు. పద్మ అతణ్ణి గౌరవిస్తుంది. అంతే!

"నాదగ్గర ఏదో దాస్తున్నావు పద్మా! చెప్పవూ? ఏమీ జరక్కుండా నువ్వింత దీనంగా యెప్పుడూ ఉండవు...చెప్పు పద్మా!" ప్రాధేయపడుతూ అడిగాడు రామారావు.

పద్మ నయనాలు, అప్రయత్నంగా అశ్రుపూరితాలయ్యాయి. ఆమెలో యెక్కడలేని దుఃఖమూ ఉప్పొంగి వాహినిగా ప్రవహించింది...ఉన్నట్టుండి ఒక్కమారు పెద్దగా నిట్టూర్చింది.

"రామారావుగారూ! నేను చాలా పాపాత్మురాలిని. మీకు తీరని అపకారం చేశాను. నన్ను క్షమించరూ!" అంటూ మొహాన్ని చేతుల్లో దాచుకుని భోరుమంది పద్మ.

డాక్టర్ రామారావుకి ఆమెప్రవర్తన యేమీ అర్థంకాక తెల్లమొహం వేశాడు.

"ఏమిటి పద్మా, నువ్వివేళ యిలా మాట్లాడుతున్నావు? నాకు నువ్వుచేసిన అపకారం ఏమిటి? పరిహాసమాడుతున్నావా?" ఆమె మొహంలోకి తీక్షణంగా చూస్తూ అన్నాడు.

"లేదండీ పరిహాసం కాదు...నిజం చెప్తున్నా! నేను నిజంగా కులటనైపోయాను. నాకు ప్రాయశ్చిత్తమంటూ యేదన్నా వుంటే, అది ఘోరాతి ఘోరమైనదై వుండాలి..." మళ్ళీ వెక్కి వెక్కి యేడ్వటం మొదలుపెట్టింది పద్మ. రామారావు ఆమెకి మరి కొస్త దగ్గరగా వచ్చి "ఏమయ్యింది పద్మా, చెప్పు!" అని రెట్టించి అడిగాడు.

"మీరు నన్ను క్షమిస్తానని వాగ్దానమివ్వండి చాలు..."

"అలాగే..."

"అయితే వినండి" అంటూ నిట్టూర్పు విడిచింది పద్మ "మీతో నేను చెప్పిందంతా అబద్ధమే! నాకు రోగమూ లేదు...నా మేన మామ యెవరూ లేరు...అంతా నాటకం..." అని ఆమె చెప్పబోతుంటే, రామారావు నివ్వెరపోయి

"అంతా నాటకమా! నాదగ్గర నాటకమాడేందుకు కారణం!" అన్నాడు.

కారణం, "నా ఖర్మ. అంతకుమించి మరేమీ చెప్పలేను. డాక్టరు ప్రభాకరాన్ని యెరిగే వుంటారు. అతను అప్పుడప్పుడు మావూరు వస్తుండేవాడు వాళ్ళ చినాన్నగారింటికి. వాళ్ళ యింటి యెదురుగానే మాయిల్లు కూడాను. నేనా అమాయకస్థితిలో అతని వలలోపడ్డాను. నన్ను యెన్నోమాటలు చెప్పి మోసంచెయ్యనని వాగ్దానమిచ్చి లేవదీసుకొచ్చాడు. కాని, పెళ్ళిచేసుకుందుకు యేదో ఒక ఆటంకం చెప్తూనే వున్నాడు. ఇటీవల నేను అతణ్ణి మరీ నిలదీసి అడిగాను. అప్పుడే యీ పన్నాగం పన్నాడు. మీకున్న పరపతిని, ప్రాక్టీసుని తగ్గించితే తన ప్రాక్టీసు పెరుగుతుందన్న దుర్బుద్ధి అతనిలో పెరిగింది. అంతే, అందుకు యెరగా నన్ను వినియోగించాడు. నన్ను మీదగ్గరికి పంపాడు. మొదట్లో నేను నిరాకరించా. కాని, అతను యీ కార్యం సఫలమైతేనేగాని, వివాహం చేసుకునే స్థితిలో తను లేనట్టు ఖచ్చితంగా చెప్పాడు. నన్ను ఆ తరువాత విశాలహృదయంతో స్వీకరిస్తానన్నాడు. నాకు మరో గత్యంతరం అగుపించలేదు. నేను మీదగ్గరికి వచ్చాను...తరువాత అంతా మీకు తెలిసిందే! మీరు నా వలలో పడ్డారు. నా అందానికి ముగ్ధులయ్యారు, నా మాటలన్నీ నిజమని నమ్మారు. ఎక్కువకాలం నాదగ్గరే గడిపేవారు. దాంతో మీ ప్రాక్టీసులో మార్పువచ్చింది. ప్రభాకరంకి చెయ్యినిండా పని తగిలింది...అతని యీప్సితార్థం యీడేరింది. కాని... కాని...అతని దురాలోచన, నేను ముందుగా అర్థం చేసుకోలేకపోయాను. అతని కుటిల స్వభావాన్ని తెలుసుకోలేకపోయాను. ఇప్పుడు నన్ను వివాహం చేసుకోందుకు నిరాకరిస్తున్నాడు. మీతో కులుకుతున్న పతితనని, యిన్ని కబుర్లుచెప్పిన ప్రభాకరం నామీద అభాండంవేసి తూలనాడి, నా దురదృష్టానికి నన్ను విడిచిపెట్టి పోయాడు. నన్ను వదిలించుకోవాలన్న సంకల్పంతో, మీ ప్రాక్టీసు తగ్గించాలన్న ఆలోచనతోనూ యీ యెత్తు వేశాట్ట......చూడండి. యెంత అన్యాయంచేశాడో! అయినా నేనేం విచారించలేదు... నా జీవితానికి విలువ యేనాడో పోయింది. నాకిప్పుడు మరో శరణ్యం లేదు...ఒక్క మృత్యువు తప్పించి. కాని, మీకీ నిజాన్ని వ్యక్తంచేసి, నా జీవితం ముగించాలన్న వాంఛని విడిచిపెట్టుకోలేక, యింతవరకూ జీవించివున్నాను. మీరునన్ను, నా నిస్సహాయతను, అర్థంచేసుకుని క్షమిస్తారో, లేక ద్వేషిస్తారో నాకు అనవసరం...ఇదీ నాకథ." అంటూ మొహం పక్కకి తిప్పుకుని చీరచెంగుతో కళ్ళు ఒత్తుకుంది పద్మ.

డాక్టర్ రామారావు అంతా విని పోత విగ్రహంలా చలనరహితంగా నిల్చుండిపోయాడు. అతని కిదంతా ఓ కలలా అగుపించింది. డాక్టరు ప్రభాకరంకి తనమీద యెందుకంత ద్వేషం? తనకి ప్రాక్టీసు అధికంగా వుందనేనా! కాని, బైటికి యెంత తియ్యనికబుర్లు చెబుతాడు? అనవసరంగా ఒక అమాయిక స్త్రీ జీవితంతో ఆటలాడి, ఆమె జీవిత సర్వస్వాన్ని పాడుచేశాడు. పోనీ, అతనికోసం, ఆమె తన వ్యక్తిత్వాన్ని సహితం విడిచిపెట్టుకుని యిలా ప్రవర్తించినా సరే ఆమెను కృతజ్ఞతతో స్వీకరించలేదు. ఛీ! ఛీ!! యేం మనిషి? మళ్ళీ యింత చదువు, సంస్కారమూ వున్నాయి. అవి అతనికి నేర్పినవన్నీ కుత్సితాలే గామోసు! పద్మవల్ల తప్పులేదే! తన జీవితం మంట గలుస్తుందేమోనన్న భయంతో అతణ్ణి నమ్మి యిటూ

ప్రవర్తించింది. ప్రభాకరం యిలా మోసంచేస్తాడని ఆమె యెప్పుడూ అనుకోలేదుపాపం! అనుకున్నాడు రామారావు. అతని హృదయం కోపానికీ, ద్వేషానికీ, బదులు జాలితో సానుభూతితో నిండిపోయింది. పద్మను క్షమించాలన్న విశాలత్వం అతనిలో ప్రవేశించింది.

"పద్మా! ఇందులో నిన్ను క్షమించాల్సింది యేమీ లేదు. నువ్వు నాదగ్గిరిలా నాటకమాడావూ అంటే, నీ జీవితాన్ని దృష్టిలో పెట్టుకుని అలాచేశావు. అలాంటప్పుడు స్వతహాగా నాకు అపకారం చెయ్యాలన్న తలంపు నీలో లేదు. పక్క విషయాలలో కుట్రపన్నినదంతా ప్రభాకరం. అతను నా ప్రాక్టీసు చెడగొట్టాడన్న బాధ నాకు లేదు. కాని, నీలాంటి ఓ అమాయికపు స్త్రీ జీవితాన్ని మోసంచేసి నాశనంచేశాడు. నీ జీవితం నాశనమవ్వడానికి వీల్లేదు...నీకిష్టమైతే, నిన్ను నేనే వివాహంచేసుకుంటాను..." అన్నాడు రామారావు.

పద్మ ఒక్కమారు ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసుకొని అతని వేపు తిరిగింది. ఆమె వళ్ళు పులకరించింది. చెక్కిళ్లు యెర్రబడ్డాయి. ఏమిటి వింటున్నాను? వాస్తవిక జగత్తులో వున్నానా? లేక స్వప్న జగత్తులో వున్నానా? అన్న అనుమానంకూడా ఆమెకి కలిగింది. అయినా, ఆ ఆనందం యెంతోసేపు వుండలేదు. తను కులటనన్న విషయం జ్ఞప్తికివచ్చి రామారావు జీవితంలో మచ్చ తేవటం యిష్టంలేకపోయింది.

"వద్దండీ రామారావుగారూ! మీరు నా ప్రేమలోపడి కొట్టుకుంటూ, ఆ మోజులో అలా అంటున్నారు... కాని, నేను కులటను...యౌవన మదంలో పరాయి పురుషునితో లేచివచ్చిన పాపాత్మురాలను. నావల్ల, మీ స్వచ్ఛమైన జీవితానికి అప్రతిష్ఠ, మాయని మచ్చను, తెచ్చుకోకండి" అంది పద్మ రుద్ధకంఠంతో.

"ఆ భయం నా కెప్పుడూ లేదు పద్మ! ఎవరేమనుకున్నాసరే, నిన్ను నేను వివాహం చేసుకొని తీరుతాను! నువ్వు లేచి వచ్చిన వ్యక్తివవుతే అవొచ్చు. అది తెలీక చేసినతప్పు. ఆ తప్పు కోసం జీవితాంతం నువ్వు శిక్ష అనుభవించటం కేవలం అన్యాయం. ప్రభాకరంలో మానవత్వం లేదు...ప్రేమంటే యేమిటో తెలీదు... మన వివాహం అయ్యాక అర్థం చేసుకోనీ! నువ్వేమీ అధైర్యపడకు పద్మ...నా ప్రాక్టీసు తగ్గిపోయిందన్న చెంగకూడా నాకేమీ లేదు. మళ్ళీ ఆ స్థితికి వచ్చెయ్యగలనన్న ఆత్మవిశ్వాసం నాలో వుంది" అన్నాడు రామారావు.

నిజమైన ఆనందాన్ని పద్మ ఆ క్షణంలో అనుభవించింది. కళ్లు ఒత్తుకొని అమాంతంగా రామారావు ఒడిలోకి వాలింది.

"ఎంత విశాల హృదయులండీమీరు!" అంటూ పద్మ ఆనంద బాష్పాలు అతని గుండెపై వర్షించింది.

"మరిక నేను వస్తాను పద్మా! సాయంత్రంవచ్చి నిన్ను తీసుకుపోతానులే"అంటూ వెళ్లిపోయాడు రామారావు. పద్మ, అతను కనుమాపుమేర దాటేవరకూ గుమ్మంముందే నిల్చుని, తరువాత లోపలికి వెళ్ళిపోయింది. ఆరోజు ఆమెలో వుద్భవించిన ఆనందం వర్ణనాతీతం!

## 5

"నువ్విలా యెన్నాళ్లు బ్రహ్మచారిగా వుంటావురారామం?" అన్నాడావేళ భోజనాలదగ్గర రామారావు తండ్రి.

"పోనీ, నీకు నచ్చిన అమ్మాయినే యెవర్నో చేసుకోరాదుట్రా! మేమేం వద్దంటామా? ఏదో మా కళ్లముందు, ఆ ముద్దూ ముచ్చటా చూడాలని మా తాపత్రయం..." అంది రామారావు తల్లి.

రామారావు తలిదండ్రులకు, యీ ప్రశ్నలు కంఠస్థ మయ్యాయంటే నిజం చెప్పాలంటే. ప్రతీదినం వాళ్లీ ప్రశ్నలతోనే రామారావుని విసిగించేస్తున్నారంటే ఆశ్చర్యంలేదు. కాని, యింత వరకూ రామారావు మౌనంగా వుండేవాడు. అతనికెందుకో యిన్నాళ్ళూ వివాహంమీద ఆసక్తి కలగలేదు. అల్లాంటిది, యిప్పుడతనిలో ఆభావం కలుగుతుందీ అంటే, దైవిక మేమోమరి.

"నాకు నచ్చిన అమ్మాయి యిన్నాళ్లకి దొరికిందమ్మా" అన్నాడు వుత్సాహంగా, రామారావు.

"వృద్ధ దంపతులు ఆశ్చర్యంతో 'ఆఁ' అన్నారు.

"ఎవర్రా?" అంది తల్లి ఆతృతగా.

"వుండిలే...సాయంత్రం తీసుకొస్తాను—" అన్నాడు రామారావు నెమ్మదిగా.

"ఎవరమ్మాయిరా? సాంప్రదాయమైన కుటుంబమేనా?" తండ్రి ప్రశ్న.

"అదంతా అడక్కండి నాన్నా! తర్వాత చెప్తాను. ఆమె నాకు నచ్చింది. వివాహం చేసుకుంటాను. అంతే! సాయంకాలం మనింటికే వచ్చేస్తుంది...రేపే మా యిద్దరం రిజిస్టర్డు పెళ్ళి చేసుకుంటాం..."

తలిదండ్రులు ఆశ్చర్యంగా కొడుకు వేపు చూశారు. "అదేం ఖర్మరా! ఇంత బ్రతుకూ బ్రతికి, యింతయిల్లు వుంచుకొని శోభగా, వైభవంగా వివాహం చేసుకుంటేకాదూ" ఇంక మళ్ళీ మళ్ళీ మనింట్లో శుభకార్యాలు జరుగుతాయి గనుకనా! "అన్నాడు తండ్రి నిరుత్సాహంగా.

"వద్దునాన్నా! అదంతా నాకు వెగటుగా వుంటుంది."

"పోనిద్దురూ! వాడిష్టం...వాడికి మాత్రం తెలీదా యేమిటి? మనమంటే పాతకాలపు వాళ్లం..." అంది తల్లి. ఇన్నాళ్లకి పెళ్ళి చేసుకుంటానని అన్న కొడుకు, యిల్లాంటి అడ్డులు పెడితే, మళ్లీ మనసు మార్చుకొని మానేస్తాడేమోనని ఆమె భయం. తండ్రికూడా వూరుకున్నాడు.

ఆరోజు సాయంత్రమే పద్మను తీసుకొచ్చేశాడు డాక్టర్ రామారావు. కోడల్ని చూసి అత్తమామలు మురిసిపోయారు. మరుచటిరోజే పెళ్ళి జరిగిపోయింది. పద్మ సంతోషానికి మేరలేకపోయింది. అదృష్టమంటే, తనదేననుకుంది.

ప్రభాకరంమాత్రం, అంతా విని అవమానంతో, అసూయతో కుమిలిపోయాడు పాపం!

# భారతదేశ పంచాంగ పద్ధతులు

శ్రీ కె. సుబ్బరామప్ప

భారతదేశంలో కాలమును గణించు పద్ధతి సూర్య సిద్ధాంతముపై ఆధారపడియున్నది. ఈ పద్ధతిని వైజ్ఞానికదృష్టినుండి చూచిన చాలమట్టుకు లోపదోషములు లేవని తోచుచున్నది. కాలగణన పద్ధతులను పరీక్షించిన సూర్యసిద్ధాంతమునకు మించిన గణింపు ప్రపంచమునందే లేదనవచ్చును. ఈ కాలగణనపద్ధతి జ్యోతిశ్శాస్త్రము ననుసరించి యున్నది. జ్యోతిష్కుల గణితశాఖ ప్రయోగశాలలలోని గణితశాస్త్రజ్ఞులకు మాత్రమే తెలియునట్టి యీ విధానము సామాన్యజనులకు గూడ సులభముగ నర్థమగునట్లు విశదీకరింపబడవలెను. సూర్యసిద్ధాంతమున వివరింపబడిన పద్ధతులు భవిష్యత్తునుగూర్చి తెల్పునవైనను, అగాధమైనట్టివైనను భారతీయ సాంప్రదాయమున అనూచానముగ వచ్చుచుండుటచే పరిచితముగనే యున్నవి. పాశ్చాత్యదేశములందలి ప్రాచీన పద్ధతులలో నున్నట్టి అవ్యవస్థలు దీనియందు కనుపింపవు.

## ఇది క్రీ॥ శ॥ 1961 కాని 1957 కాదు

పాశ్చాత్య సంప్రదాయ ప్రకారము, వారి లెక్కాచారరీత్యా ఏసుక్రీస్తు జన్మించినప్పటినుండి యిప్పటివరకును గడచిన సంవత్సరములు 1957 అయినను చారిత్రిక దృష్టినుండి పరికించిన యిది 1961 లేక 1963 వ సంవత్సరము కావలెను. చరిత్ర జ్యోతిశ్శాస్త్రములను ఆధారముగ గైకొని చూచిన ఏసుప్రవక్త క్రీ॥ పూ॥ 4 లేక 7 వ సంవత్సరములో జన్మించియుండవలెను. ఏసుక్రీస్తుయొక్క అవతారమును సూచించి నక్షత్రముననుసరించి 'మాగై' అను పండితుడు ఏసుయొక్క జన్మస్థలమును నిర్ణయించెనని బైబిల్ గ్రంథమున చెప్పబడియున్నది. అబెరబనెల్ అను యూదుడు శనిగురువుల సంయోగకాలమే మెసయ్యయొక్క జననకాలమని చెప్పెను. కెప్లర్ అను శాస్త్రజ్ఞుడు ఈయాధారముపైన లెక్కవేసి క్రీ॥ పూర్వము 7 వ సంవత్సరమునందు మే, అక్టోబర్ డిశంబరు నెలలలో శనిగురువుల సంయోగము మీనరాశిలో సంభవించినదని నిర్ధరించెను. బైబిల్‌లో చెప్పినట్లు ఆ నక్షత్రము కొంతకాలము పూర్వదిక్కుల కనుపించుచుండి మరి కొంతకాలమైన పిమ్మట అదృశ్యమై వెల్లిపోయి మఱల కనుపించినది. క్రీ॥ పూ॥ 6 వ సంవత్సరమున మార్చి 14-29 మధ్య శనిగురువులు సూర్యునిదగ్గర యుండి అదృశ్యమైనవి. పిమ్మట ఏప్రిల్ 4 వ తేదీన పశ్చిమదిక్కున కనుపించెను. డిశంబరు 9 వరకు నీరెండు గ్రహములు వెల్లిపోయియుండినందున సాంప్రదాయికముగ డిశంబరు 25 వ ఏసుక్రీస్తు పుట్టెనని భావించబడినది. ఇప్పుడు మనము క్రీ॥ పూ॥ 1 అని భావించెడి సంవత్సరమును డియోనిషియస్ ఎక్సిగుఅస్ అనువతడు రోమ్ నగరమును స్థాపించినది 753 అని చాల కాలము గడచిన పిమ్మట నిర్ధరించెను. కాబట్టి యీతడు మూడునాల్గు సంవత్సరములైనను పొరపాటు చేసి యుండవచ్చునని తెలియుచున్నది.

## దేశీయ పంచాంగ పద్ధతులు

భారతీయుల కాలగణనము కలియుగారంభము (క్రీ॥ పూ॥ 3102 ఫిబ్రవరి 17_18 మధ్యరాత్రి లేక 18 తేదీ అరుణోదయము) నుండియు శాలివాహన శకము (క్రీ. శ. 78) నుండియు లెక్కించుట ప్రచారములోనున్నది. ఇతర శకములను వత్సరారంభములును మాస, పక్ష, తిథి, వార, నక్షత్ర, యోగకరణములు మొదలైన దినములలో భేదములుండినను సార్వత్రికముగ నెల్లప్పుడు నుండెడి సౌరమాన వసంతఋతువునే లెక్కించి శక సంవత్సరమునే మూలముగ గైకొని దేశీయ పంచాంగము చేయవలసి వచ్చినది. వసంత ఋతువు వచ్చినప్పటినుండియే సంవత్సరారంభము చేయతగినదని వరాహమిహిరుడు మొదలగువారు చెప్పిన దానినే యిప్పటి విద్వాంసులగు శంకర బాలకృష్ణ దీక్షితుల వారును తిలక్ మొదలగు వారు కూడ సూచించినారు. అంతియేకాక మేఘనాథ సహా అధ్యక్షత క్రింద రచియింపబడిన పంచాంగ సంస్కరణ సంఘము వారు కూడ భారతీయ పంచాంగముల నన్నిటిని ఒకే పద్ధతికి తేవలయునను నుద్దేశముతో వసంతఋతు ప్రారంభమైన మరుదినమే వత్సరారంభమని శక సంవత్సరమును సౌరమానములను ఉపయోగపరచుకొన వచ్చునని యభిప్రాయమునిచ్చి ప్రభుత్వమువారు అక్టోబర్ 23, (1956 తేదీనఒక యుత్తర్వుచేసి 1957 మార్చి 22 తేదీన (శక 1879 చైత్ర ౧) దేశీయపంచాంగ ప్రకారము వర్షారంభమని ఘోషించిరి. ఈగణితమునే భారతీయ గజెట్, ఆలిండియా రేడియో గ్రిగోరియన్ తేదీతో నుపయోగించవలెనని యుత్తరువుచేసినది. 1952 నవంబర్ మాసమందు నియమింపబడిన సహా సంఘముయొక్క రిపోర్టును 1956 సంవత్సరమునందే రూపించినది. ఈసంవత్సరము 23-3-1956 చైత్రం ౧ నుండియే ప్రచారమునకు తేవలయునని అభిప్రాయము నిచ్చియుండిరి. ప్రభుత్వమువారు ఒక సంవత్సరమైన పిమ్మట ఆచరణలోనికి తేవలయునని నిర్ధరించిరి.

## సౌరమానము

గడచిన శకము 1878 (క్రీ॥ శ॥ 1956) మార్చినెల 21 తేదీ చైత్రమాసమును మొదటి దినమని లెక్కించవలయుననియు, దినమును అర్ధరాత్రినుండి లెక్కపెట్టవలెననియు ఋతు సంవత్సరమును 365. 242196 మొత్తము దినములని నిర్ధారణచేయుట చాలా మంచిదని ఆర్యభట్టుని కాలమునుండి జ్యోతిష్కులు శక సంవత్సరమునే యుపయోగించుటచేత యితర శకములు శాలివాహన శకాధారముపైననే చేయబడుటచేత శకసంవత్సరమునే యిప్పుడు గూడ నుపయోగపెట్టవలెనని సమితిగూడ యభిప్రాయపడినది. ఆర్యభట్ట వరాహమిహిరుల కాలమునుండి సుమారు 1400 సంవత్సరములు గడచినవి, గనుక 23.2 దినములకుముందే సవరించుటచేత సాయనపద్ధతిని అనుసరించవలయును. ఇప్పుడు మార్చి 21 ౧౮౭౮ శకమునుండీ సంవత్సరారంభము చేయబడుటచే ౧౮౭౮ శకము (సౌర) ఫాల్గుణమాసము సామాన్యముగ 30 దినములుండినను 6—7 దినములను చేర్చవలసివచ్చును. ఇప్పుడు భారతదేశమున ప్రచారమున నుండెడి సౌరమాన మాసములలో 29 నుండీ 31 దినములగుచున్నవి. వీనిలో 30 దినములుగల సౌరమానము ఒక్క నియమముతో 30, 31, 31, 31, 31, 30, 29, 29, 29, 29, 29, 30 అయినచో నొక్కొక్కప్పుడు సంక్రమణ సంబంధమైన లెక్కచే 32 దినములు గూడ నగుచున్నవి. సూర్యుడు 30 డిగ్రీలు ముందుకుపోవుకాలమునే

* డాక్టర్ యస్. శ్రీకంఠశాస్త్రిగారి కన్నడ వ్యాసము ననుసరించి వ్రాయబడినది.

గ్రహించి సౌరమాసములను లెక్క చేసిన మేషమాసము 30 ది, 12 గంటలు వృషభమాసం 31, మిథునం 31.7, కటకం 31.11, సింహం 31.6, కన్య 30.22, తుల 30.11, వృశ్చికం 29.19, ధనస్సు 29.14, మకరం 29.8, కుంభము 29.15 మీనం 30.6, అన్నియు 36 దినములు 6 గంటలగుచున్నవి. వ్యవహారమునకు 31, 31, 31, 31, 31, 31, 30, 30, 30, 29, 30, 30 అన్నియు చేరి 365 దినములనెంచుకొని మొదటి ఆరుమాసములకు ఒక్కొక్క దానికి 31 దినములు మిగిలిన ఆరుమాసములకు 29-30 దినములట్లు సులభముగ జ్ఞాపకముంచుకొనవచ్చును.

## పండుగల నిర్ణయము

ఈ సౌరమాసములకు సంబంధించిన అమావాస్య పూర్ణిమాంత నెలలకు ఏలాటి సంబంధము లేదు. తిథి నక్షత్రముల యాధారముచే నిశ్చయింపబడిన పండుగ పర్వములను పూర్వోదాహృతమైన రీతిని నిర్ధారణ చేయవలెను. మరి సంబంధము లేనటుచే ఆయా ఉగాదులను విషువత్పుణ్యకాలము మొదలగువానిని ఆయా పంచాంగముల చారముల కొనభాగములలో చూపవలెను. అమావాస్య పూర్ణిమలను మాత్రము ఎటువంటి పామరజనులైనను స్థూలముగ గుర్తించగలరు. వేదాంగ జ్యోతిష్యములలో యీ తిథులే ముఖ్యములైనవి. దర్శ పూర్ణమాస మొదలైన యజ్ఞములు చేయవలసివచ్చును. ఇదిగాక గ్రామవాసులు కూడ కార్తెలను, వర్షసూచక నక్షత్రములను (కార్తిప్రవేశ నక్షత్రము) లెక్కించుటచే నిరయన లెక్కాచారము ననుసరించి నట్టులేదు. దేశీయపంచాంగములో నిరయనరీతిగ కార్తిప్రవేశమును నిర్ధారణ చేయుటచేత సుమారు రెండు దినములు వెనుకకు నెట్టవలసి వచ్చును. దేశీయ పంచాగము ప్రకారము ఋతువర్ష ప్రచారమును తీసికొన్నయెడల యితర పద్ధతుల నన్నింటిని దాని ననుసరించియే పోవలెను. ఎఫిమరస్ సంఘమువారు తమ రిపోర్టులో శెలవు దినములను ఉజ్జయిని అక్షాంశమునకు సరిగా నిర్ధారణచేసి భారతదేశములోని యితర భాగములకు అన్వయించునట్లుగ సూచించిరి. హిందు, జైన, బౌద్ధ, క్రీస్తు, తురుష్కుల పండుగలను ఈ యాధారముచే నిర్ధారణ చేయవలసి వచ్చును. లేని యెడల ఒక్కొక ప్రాంతమునకు శెలవు దినములను మార్పు చేయవలసి వచ్చును. భారతీయుల పవిత్ర దినములగు సంవత్సర, ఆయన, ఋతు, మాస, పక్ష, తిథి, నక్షత్ర, వార, యోగ, కరణ, సంక్రమణ, సంక్రాంతి, విషువత్పుణ్యకాల, గ్రహణము మొదలగువాని నన్నింటిని అనుసరించినట్టివే. వైదికయజ్ఞములలోగూడ కాలవిధిజన ననుసరించి అనేక విధములుండెను.

అమావాస్య పూర్ణిమ నక్షత్రము లన్నియు ముఖ్యములైనను చాతుర్మాస్యము మొదలగు వానిని ఋతువుల ననుసరించియే చేయవలసివచ్చును. వాని ననుసరించువారు అనగ ప్రతి ఋతువునందును యజ్ఞయాగాదుల ననుష్ఠించువారు అగ్నిష్టోమము, అతిరాత్రము, అహోరాత్రము, మొదలగు యజ్ఞములను సంవత్సరములో నెక్కువగ నుండు దీర్ఘరాత్రుల ననుసరించి చేయవలసి యుండును. వేదాంగ జ్యోతిష సూర్య ప్రజ్ఞప్తి మొదలగు జైనగ్రంథములు అథర్వపరిశిష్టము పైతామహ సంహిత మొదలగు పురాతన గ్రంథములు పాత పంచాంగములు నిలిచియున్నవి. వేదకాలమున అయిదు సంవత్సరముల కొక యుగముండినది ఋతువర్షమును, నక్షత్ర వర్షమును సమన్వయము చేయవలసి యుండును. శ్లో॥ మాఘ శుక్ల ప్రపన్నాస్య పౌషకృష్ణ సమాపినః॥ అనగ యుగారంభమునందు మాఘశుద్ధపాడ్యమి దినమున సూర్య చంద్రులు ధనిష్ఠా నక్షత్రములో నుండి నప్పుడు ఉత్తరాయణ సంక్రాంతి కావలయును. పిమ్మట సంవత్సర, పరివత్సర, ఇదావత్సర, అనువత్సర, ఇద్వత్సర అనెడి ఐదు సంవత్సరములైన పిదప ఒక్క యుగము ముగిసెను, సూర్యచంద్రులు ఉత్తరాయణ కాలమునకు ధనిష్ఠా నక్షత్రమునకు వచ్చితీరవలెను. అనగ ఉగాది మాఘమాసమునుండి ఆరంభము కావలయుననది అమరసింహుడు కూడ యిట్లు చెప్పియున్నాడు.

"ద్వౌ ద్వౌ మాఘాది మాసౌస్యా దృతుస్తైరయనం త్రిభిః" అని.

ఇట్లుండ అయనములను విడిచి వసంతఋతువు ఆరంభకాలమును క్రమముగ వర్షారంభకాలముగ భావించుచువచ్చిరి. కలియుగారంభమును సౌర (మేషాది) మరియు చాంద్ర (చైత్రాది) అనియు సప్తర్షియుగమును పౌర్ణిమాది యనియు చైత్రాది యనియు శాలివాహన శకమును సౌరమేషాది లేదా చైత్రాది యనియు దక్షిణ భారతదేశమున అమావాస్యాంతముగను ఉత్తర భారతమున పూర్ణిమాంతముగను లెక్కించుచు వచ్చిరి.

విప్లవాత్మకమైన మార్పుగల విక్రమ శకమును గుజరాత్ దేశమున దక్షిణ విక్రమార్క శకమందురు. అది కార్తికాది అమావాస్యాంతముగ (అనగ దీపావళి పండుగనుండి) ఉత్తర భారతదేశమునను, ఇతర భాగములలో విక్రమార్క శకమని చైత్రాది పూర్ణిమాంతముగను వ్యవహరించుచున్నారు. కేరళ రాష్ట్రమున కొల్లం, ఉత్తర మలబారులో సౌరమాన కన్యామాసమునుండియు దక్షిణ మలబారులో సౌరమాన సింహమాసము నుండియు సంవత్సరారంభమగు చున్నది. ఒరిస్సా దేశమున విలాయతి సంవత్సరము సౌరమాన కన్యాదిగను, "అమ్లి" సంవత్సరము భాద్రపద శుద్ధ ౧౨ నను ఆరంభమగును. ఫసలి సంవత్సరము పూర్ణిమాంతమై ఆశ్వయుజ ప్రతిపత్తునుండి ప్రారంభమగును. కాని బొంబాయి రాష్ట్రమున కొన్ని భాగాలలో సుమారు జూన్, 5, 6, 7 తేదీలలో సూర్యుడు మృగ నక్షత్రానికి వచ్చినప్పుడు ప్రారంభమగును. (దక్షిణ ఫసలి మరియు మారాఠి సూర్ సన్) మదరాసు ఫసలి జూలై 1 తేదీనుండి సౌరసంవత్సరమైనది. తిరుత్ మరియు బీహార్ లలో లక్షణ సేన సంవత్సరము కార్తికాది అమావాస్యాంతము. శివాజియొక్క సంవత్సరారంభము జ్యేష్ఠ శుద్ధ త్రయోదశినుండి. ఇదిగాక క్రీస్తు, ముస్లిం, యూదులు, పార్సీలయొక్క సంవత్సరారంభములును వేరుగనున్నవి. వీనితో చేరి క్రొత్త సంవత్సరారంభము గూడా కలిసివచ్చుచున్నది. మున్ముందు ప్రపంచ పంచాంగమే రావచ్చును.

మొత్తముపై 1957 సంవత్సరము 1961 అని యుంచవలెను, అనునది భారతీయులకు విప్లవాత్మకమైన మార్పు అని కానుపించవచ్చును. 1757, 1857, కూడ భారతచరిత్రలో విప్లవములకు దారి తీసినవి. సిపాయీల మతికలహము మన స్వాతంత్ర్య సంగ్రామము యొక్క వత్సరారంభమని యెంచి శతవార్షికోత్సవమును చేయుటకు ఆలోచించుచున్నారు. సామాజిక ఆర్థిక క్షేత్రాలలో క్రొత్త పంచాంగ పద్ధతులను దశమాంశ నాణ్యపద్ధతియు అనేక విప్లవాత్మక పరిణామములకు దారి తీయగల వనుటలో సందేహము లేదు.

# నవభారతనిర్మాణానికి...

MA

ఈసిమెంటు
అధికంగా
తుంగభద్రా
ప్రోజెక్టు
ఇతరపెద్ద
ప్రాజెక్టుల
పనులకు వాడ
బడుచున్నది



## దుర్గా బ్రాండు

**పోర్టులేండు సిమెంటు**

*ఉపయోగించబడుచున్నది*

మీ భవనములను ఎక్కువ ధృఢముగాను
అందముగాను చేయును

## ఆంధ్ర సిమెంటు కంపెనీ లిమిటెడ్

రిజిస్టర్డ్ ఆఫీసు: 337 తంబు చెట్టి వీధి
మద్రాసు-1. Tele { Grams: ANDHRACEM
Phone: 3502

ఫాక్టరీ ఆఫీసు: బక్కింగ్‌హామ్‌పేట పోస్టు
విజయవాడ-2. Tele { Grams: CEMENTS
Phone: 557 (P.B.X)

# ఢాకినీ

## ముద్దుకృష్ణ

పాత్రలు: మదన్ మోహన్, భేతాళభట్టు,
తిమ్మావధాని, శుభాంగి, రంగా

• • తోటమధ్యన వున్న బంగాళాలో గది. కొత్తరకం కుర్చీలూ, బల్లలూ, తివాచీలు, పూసజ్జలూ, పటాలూ; కిటికీలకూ తలుపులకూ తెరలూ, అంతా అతి నవీనంగా అలంకారాలు.

శుభాంగి:

అతడె దాసు డనుమగదే
అనుమాన మదేలె సఖియ!
అతడె దాసుడనుమగదే!
కనికట్టులు కట్టినపుడు,
కనులమాయ కప్పినపుడు,
కనుగానవివలపే యిక
సకల మ్మనిపించి నపుడు!
అతడె దాసుడనుమగదే!

ప్రేమ గారడీని నడిపి
కామాతురు చేసినపుడు,
రారాయని కౌగిటిలో
చేరిచి, ముద్దిడిన యపుడు
అతడె దాసు డనుమగదే!

(పాట ఆపి) రంగా!

రంగ : (దూరాన్నుంచి) అమ్మగోరు! వొస్తన్నా! (వొస్తుంది)

శుభాంగి: ఏవే! ఆ జాకొమల్లిపూవు లేవే?

రంగ : అయిగో నమ్మగోరు, ఆబల్లమీదెట్టాను.

శుభాం: (పళ్లు కొరుకుతూ) ఆబల్లమీద యేడవకపోతే, ఆ ఫోటో మీదే తగిలెయ్య లేవూ?...ఓసి దరిద్రగొట్టా!

రంగ : బాబుగోరి పోటోకి పువ్వులు యెస్నెట్టొద్దన్నారుగందా అని......

శుభాం: ఓసి చవటా! నిన్న పంతులు రుసురుగా వున్నాడని... ఆ అలంకారం స్వంతచేతులతో తగలజేటట్లు నాటక మాడితే, రోజూ యీ చాకిరీ చేసెక్కడ యేడవనే?

రంగ : ఇంకే నేనేరుడతా నమ్మగోరు. [పోతోంది]

శుభాంగి: వోసే పిశ్శకు, ఇలారా! చూడూ, పొద్దున్న పువ్వు లిచ్చావా పెద్దరాణీగారికి?

రంగ : వోరికమ్మగోరు, బాబుగారి పెళ్లాంగోరికా?

శుభాంగి: ఆ! ఘట్టిగా మూడు ముళ్లూ వేయించుకున్న ఆ అమ్మ గోరే! ఆవిడ ముక్కుమూతీ యెలా విరుచుకున్నాది? యేవేం విసురులు విసిరింది?

రంగ : [భయపడుతూ మాట్లాడదు]

శుభాంగి: ఏమే! అలా గుడ్లు మిటకరిస్తావ్? యేం, నీకు ఇంతమేత పడేసిందా? వుండు కక్కిస్తా! [కొరడాయెత్తి కొట్ట బోతుంది]

రంగ : [భంగారుగా] వొద్దమ్మగోరు! కొట్టకండమ్మగోరు! సెప్తానండమ్మగోరు...

శుభాంగి: దెబ్బకి దెయ్యం లొంగుతుంది. రా అలాదారికి రా! చెప్పు... అక్కడ ఆవిడ, నోరుజారినముక్కల్లా చెప్పు...జాగ్రత్త వీపు చిట్లిపోతుంది...యేం కూసింది?

రంగ : ఏం కుయ్యలేదమ్మగోరు...

శుభాంగి: కుయ్యలేదేం, అపిభడవా [కమ్చీ పేలుస్తుంది]

రంగ : అమ్మో! కొట్టకండమ్మగోరు...సెప్తానమ్మగోరు...మరేం మరేం....అన్నారుగందా......"మాకెందుకే పువ్వులు? పువ్వులూ నవ్వులూ, గంధాలూ, అత్తర్లూ ముత్తాబులూ, అటువొంటోళ్లకి కావాలిగాని"...అన్నారు.

శుభాంగి: అవునుమరి; అత్తర్లూ, అందాలూ, ముస్తాబులూ, ముచ్చట్లూ మాదౌర్భాగ్యం; వంటింటి మసీ, అంటుపెట్టిన ఆవుపేడా వారి సౌభాగ్యం కాబట్టే, ఆకంపులు భరించ లేక అయ్యగారు మావెంట పడ్డారు...సరేలే, నువ్వెళ్లి వసారాలో పళ్లెంలో ఉప్మావుంచాను తిను. [రంగ వెళ్లి పోతుంది] రంగా!

రంగ : [తిరిగి వొస్తూ] అమ్మగోరు!

శుభాంగి: చూడూ, ఎవరు యెక్కడ యేమంటున్నా, విని, నాకు చెప్పాలి, తెలిసిందా?

రంగ : సెప్తానమ్మగోరు.

శుభాంగి: చూడు. యెవరో వొస్తున్నట్టున్నారు.

రంగ : [తొంగిచూసి) బాబుగోరూ, యెవ్వరో కొలంపా టోరూ వొస్తన్నారు.

శుభాంగి: సరేలే, నువ్వు వెళ్లు.

[మదన్ మోహన్, భేతాళభట్టు, తిమ్మావధాని ప్రవేశిస్తారు]

మోహన్: గురువుగారూ, ఇదిగో ఇదే మా శుభాంగి.

శుభాంగి: నమస్కారం!

భట్టు : సకలైశ్వర్య సిద్ధిరస్తు!

శుభాంగి: ఆ పడక కుర్చీలో దయచేయండి.

భట్టు : [కూర్చుంటూ] జై మహాకాళీ!

మోహన్: శుభా! వీరు భేతాళభట్టుగారు. మంత్రశాస్త్రప్రావీణ్యతలో మహాఘటికులు. వీరి గాలి తగిలితేచాలు, దెయ్యాలు గడగడలాడిపోతాయి!

భట్టు : మదన్‌మోహన్‌గారూ! ఇదొక మానవసేవ, అంతే.

మోహన్: విద్య వినయాన్ని కూరుస్తుంది; తమరు ఆభావంలోనే వుంటారు. శుభా, యితడు తిమ్మావధాని, భేతాళభట్టుగారి శిష్యుడు.

అవధాని: నమస్కారం!

శుభాంగి: తప్పు తప్పు. నాకు నమస్కారమా? తిమ్మన్నగారూ! మీరు భట్టుగారి శిష్యరికం వొదిలి, నా శిష్యరికం ప్రారంభిస్తే అప్పుడు యీ పద్ధతి! (నవ్వుతుంది.)

భట్టు : ఓరి అప్రాచ్యుడా! నీకు పేరు సార్థకంగా పెట్టారురా నీ పెద్దలు!

శుభాంగి: గురువుగారూ, తమవిద్యకి తమ పేరు సార్థకం అయిననాడు తమ శిష్యుడుకూడా సార్థకనాముడు కావటం, సహజం కదా!

భట్టు : శుభాంగీ! సంభాషణలో చమత్కారానికి నీ కులానికి పెట్టింది పేరు. మాది వృత్తి ఛాందసపుజాతి!

మో : గురువుగారూ, మాటేకాదు బుద్ధికూడా మహాచురుకు మాశుభాంగికి. బంగారానికి తావి అబ్బినట్టు ఆ సద్గుణ సంపద కూడా కలిసిరావడం ఆహా! నాఅదృష్టం.

శుభాంగి: ఆగండి...భట్టుగారూ, నన్ను పొగడడం ప్రారంభిస్తే మాపంతులుగారు భట్రాజులుంగారుగా మారిపోతారు... శిష్యుడుగారూ యిలారండి.

అవధాని: గురువుగారూ!

భట్టు : వెళ్ళిరా వెళ్ళు.

[శుభాంగీ, అవధానీ వెళ్తారు]

మోహన్: భట్టుగారూ, చూశారా, ఆ వినయం, ఏమి మనిషండీ! ఒక్కమాట పొగడ్తగా అన్నామా, ఒక్కక్షణమిక్కడ నిలవదు. సిగ్గే సింగారంగా చేసుకుందంటే నమ్మండి. ఎటువంటి మనిషి, ఎటువంటి కులంలో జన్మం!

భట్టు : మదన్‌మోహన్‌గారూ, యేం చెప్పగలం? ఈశ్వరసృష్టి దురవగాహం! ఇక్కడ ఒక చెట్టు వుంటుంది. దానిగింజ గాలికి యెగిరి, పోయిపోయి ఎక్కడో యే క్షేత్రంలోనో నాటుకుని, అక్కడ అనేక జీవాలకు ఆశ్రయమిచ్చే మహావృక్షంగా తయారవుతుంది...ప్రకృతి రహస్యాలను తరిచి తరిచి యీ ఘట్టానికి వొచ్చేటప్పటికి ఘట్టి చిక్కులో పడి, వేదాంతులు విస్తుపోయి, నమస్కరించి వూరుకున్నారు.

మోహ : చిత్రం చిత్రం! ఎంతటి వేదాంతికానీయండి, మా శుభాంగికి జోహారని నమస్కరించవలసిందే!

భట్టు : మా మంత్రశాస్త్రంలో కూడా భూతాల వర్ణనలో అనేక జాతుల్ని పేర్కొన్నారు. కొన్ని గ్రహాలున్నాయి చూడండి బాబూ, వాటిని మహారుషులతో పోల్చవలసిందే. తమ శుభాంగిని చూడగానే, "ఉన్నాసం వదనం వల్గు విపులం చారులోచనమ్" సాక్షాత్తూ పద్మినీ జాతి అని పోల్చుకున్నాను. శుభాంగి అనే నామధేయం యే ముహూర్తంలో వుంచారో కాని, అది మహాయోగ్యంగా కుదిరిందంటే నమ్మండి!

మో : దైవజ్ఞులు, మీరు గ్రహించగలరు! అసలు సంగతి వినండి; నాకు జాతకరీత్యా ద్వికళత్రయోగం వుంది. నా భార్య ఛాందసురాలైనా, యోగ్యురాలు. అందుచేత యీ కళత్రవియోగం యెలా తప్పించడమా అని ఆలోచించి, సంవత్సరంక్రితం శుభాంగిని తెచ్చి యీ బంగాళాలో కాపురం వుంచాను.

భట్టు : ఓహో, ఏం బుద్ధికుశలత, ఏం బుద్ధికుశలత! తమరు తెలివి అనే చక్రాన్ని విసిరి, బలవత్తర దుష్టగ్రహాల వక్రగమనాన్ని అరికట్టి ఆపివేశారు. భేష్! తారాబలాన్ని మించింది, మీ అసాధారణ బుద్ధికుశలత!

మో : కాని గురువుగారూ, వివాహయోగ్యత లేనిదే కళత్రం కానేరదనే ఆక్షేపణ......

భట్టు : ఆహా, లక్ష్యపెట్టదగిందికాదు యీ ఆక్షేపణ. మూడు ముళ్ళూ పడడమూ; ఏడడుగులు హోమగుండం చుట్టూ తిరగడమూనా, కళత్రాన్నీ కాపురాన్నీ సుఖవంతంచేసేవి? కాదుకాదు, ముమ్మాటికీకాదు. హృదయానికి హృదయం యెదురు స్పందించి, వొకరి రక్తనాళాలు వొకరి రక్తనాళాలతో అలా ముడులుపడిపోవాలి. 'సఖ్యం సాప్తపదీనం' అన్నాడంటే అర్థమేమిటి? జీవితమనే ప్రేమయాత్రలో ఏడు అడుగుకు తాను అడుగు కలుపుతూ, జీవితాంతవరకూ, ఆ నడక అలా సాగిరావడమన్నమాట! కాపురం సుఖకరం చేయడం అనేది ఒక కళ...అందుకనే కళని 'త్ర' కాపాడేది, అనే అర్థంలో కళత్ర శబ్దాన్ని సృష్టించారు మనవారు.

మోహన్: ఏమిటీ! కళత్రమంటే యిదా అర్థం?

శుభాం : [విరగబడి నవ్వుతూ ప్రవేశించి] ఏమి శిష్యుడండీ, తమకి ఫలహారానికి పళ్ళు వొలిపించి, గురువుగారికి కొబ్బరినీళ్ళిస్తే బాగుంటుందను, కాని, చెట్టెక్కడానికి తోటమాలి లేడన్నాను; అవతలగా అంగవస్త్రం నడుముకి బిగించి, సరిగ్గా తిమ్మన్న అన్నట్టు, ఆ చెట్టు చరచరా యెక్కిపోయాడు. గురువుగారూ, నాకు దానం చేస్తురూ యీ శిష్యుణ్ణి. ఇటువంటివాడుంటే చాలు, ఇరవైనాలుగు గంటలూ కాలక్షేపమే! [నవ్వుతూ వెళ్ళిపోతుంది]

మోహ : చూశారా, భట్టుగారూ? ఇట్లా అస్తమానూ పసిపిల్లలా అనుకుంది. ఓహో, అవన్నీ...!

భట్టు : బాబూ! హృదయం నిష్కల్మషంకాకుంటే, అలా పసిపిల్లలా నవ్వడంకష్టం. షోడశకళలతో నిండిన చంద్రబింబంలాంటి ఆమెముఖమూ, వెన్నెలవిరిసినట్టు ఆ మందహాసమూ మదన్‌మోహన్‌గారూ, ఇటువంటి స్త్రీ ఎక్కడవుంటే అక్కడ సిరీ సంపదా గలగలలాడవలసిందే.

మోహ : సరిగ్గా జ్ఞాపకంచేశారు...జాతకం చూసినవారందరూ రూఢిగా చెప్పారు, స్త్రీద్వారా నాకు అశేషధనప్రాప్తి వున్నదనీ, నిధులూ నిక్షేపాలూ లభిస్తాయనీ...

భట్టు : గ్రహాలకూటమి అలా అనుకూలపడినవాడు తప్పదు బాబూ, తప్పదు...

మోహ : దీనికితోడు యీవిచిత్రం వినండి. మాశుభాంగి యీమధ్య అదోరకంగా స్థిరంగా మారిపోయింది; పూజలూ పునస్కారాలూ, నోములూ, వ్రతాలూ, ఉపవాసాలూ దానాలూ తప్ప అన్యచింత లేదు. వీటి ఫలితమో ఏమిటో మరి, నిద్రలో ఊరికే కలవరిస్తుంది. భక్తిపారవశ్యంలో మైమరిచి నట్టయి; తనదృష్టికి నిధులూ నిక్షేపాలూ కన్పిస్తున్నట్టూ, లక్ష్మీదేవి కదిలివొస్తూంటే,ఆ గజ్జెల ఘలఘలలు వినపడుతూ వున్నట్టూ చిత్రాతిచిత్రవర్ణనలు చేస్తుంది.

భట్టు : నాకు సమస్తమూ అవగాహనయ్యింది. ఉన్నది ఒక్కటే చిక్కు; చూశారూ, మన పిట్టే తెంక్ లో వుంది, కాని, మనం తీసుకోవాలనుకుంటే ఆ జేటో ఆ చెక్కు రాయడం, అది యివ్వడం, ఆ పుస్తకాలలో రాతకోతలు కావడం ఇట్లాంటి తంతంతా వుంది చూశారూ, అట్లాగే యీ విషయంలో కూడా పెద్ద యిబ్బందేమీ లేదుకాని జరిగించవలసిన పూజలూ పునస్కారాలూ అవీ తప్పవు.

మోహ : అది అలా వుంచండి. ఇందాకా తమతో మనవి చేశాను చూశారూ, సంవత్సరంనుంచి పట్టుకుంది, పాడుగ్రహమో పిశాచమో, దాన్ని ముందు వొదిలించాలి.

భట్టు : ప్రపంచంలో మంచిచేసేవాడుంటే, వాడి పక్కనే మరొకడు చేరి దానికి అడ్డు తగులుతుంటాడు. గ్రహాలది కూడా బాబూ, మనలాంటి మానవప్రకృతే! ఈ దుష్ట గ్రహాన్ని పట్టి పారదోలామంటే...

మోహ : ఏం గ్రహమో కాని, యెప్పుడూ యెరగను యిటువంటి డబ్బు యిబ్బంది. లక్ష్మీనివాసంలా యెప్పుడూ పాతిక వేల రూపాయల రొఖం నిలవవుండేది. కాని యేం కర్మమో, సంవత్సరంనుంచి యేదైనాఅమ్మడమో, అప్పచేయడమో తప్పడం లేదు.

భట్టు : తమ జమీందారీఫాయాకు, యీ శుభాంగి తెంపవ కాపురంవల్ల ఖర్చు యెక్కువయిందేమో?

మోహ : రామరామ, రామరామ! అటువంటి పాపపు మాట అనరాదు. తనకోసం ఒక్క దమ్మిడీ ఖర్చుకానీయదు శుభాంగి. ఆ పదివేల రూపాయల నగలూ చేయించానని అన్యాయంగా నా భార్య మాటలు మిగిలింది కాని, శుభాంగి నగలు కావాలని నన్ను కోరలేదు! ఆ చంద్రహారం నేను తెచ్చినవాడే మండిపడి, ఆ హారాన్ని వీధిలోకి విసిరి పారేసి "కానుకొక్కదానికి నేను సుత్రాన్ని, బ్రతసీ కాను, లంచాలుపెడితే లభించే ప్రేమ కావలెనంటే పల్లపుపీతిని ప్రయత్నం చేసుకోండి" అని తన యింటికి బయలుదేర బోయింది. బ్రతిమాలి, బంధీ దింపి, మళ్ళీ యింటికి రప్పించి, భోజనం చేయించేటప్పటికి రాత్రి వొంటిగంట కంగుమని కొట్టారు!

భట్టు : ఓహో! ప్రతివ్రతలశ్రేణిలో వుండవలసినవ్యక్తి శుభాంగి.

మోహ : బాగా సెలవిచ్చారు గురువుగారూ! న్యాయంగా యోచించండి. నేను లక్షాధికారినైనందుకూ, నాభాయిదా జీవితానికీ, మరొక మనిషైతే యేం కావలసింది? తన స్వంత యింటికి పై అంతస్థుకి అయిదువేలు అయ్యిందో లేదో, అడుగడుగునా అడ్డుపడి ఆపడానికి ప్రయత్నించింది. కాని, ధారాళంగా ఖర్చు పెట్టనిచ్చిందా! ఎందుకు గురువుగారూ, మద్రాసు వెళ్లినప్పుడు రెండేసి మూడేసి వందలు పెట్టి, పదీ పన్నెండు చీరలు కొన్నానన్నమాటేగాని, నేను బోరుపెట్టి కట్టుకోమంటే తప్ప వాటిని ముట్టుకోనైనా ముట్టుకోదు.

భట్టు : మదన్‌మోహన్‌గారూ! నూటికీ కోటికీ యిటువంటి మనిషి వొక్కత్తె వుంటుంది. తమ అదృష్టం ఏం చెప్పను!

మోహ : ఏమి అదృష్టమో, తమరు సెలవిచ్చినట్టు, ఈ దుష్టగ్రహం ఆవహించింది మొదలు చేతిలో చిల్లిగవ్వ నిలవడం లేదంటే నమ్మండి.

భట్టు : ఈ గ్రహాలని చెప్పలేం బాబూ, ఆరోగ్యాన్ని హరిస్తుంది వొకటి; వొకటి ధనాన్ని దోచేస్తుంది; పిశాచ ప్రవేశం...

శుభాంగి: (ప్రవేశిస్తూ) గురువుగారూ, నా ప్రవేశం పిశాచాన్ని సూచిస్తుందా?

భట్టు : అమ్మమ్మమ్మ యెంతమాట!

మోహ : శుభా, యెప్పుడూ వేళాకోళమేనా, ఊరుకో!

అవ : (పూజాద్రవ్యాలతో పళ్ళెంపట్టుకుని ప్రవేశిస్తూ) గురువుగారూ అంతా సిద్ధం.

భట్టు : ఇంతసేపూ యెక్కడ అఘోరించావ్? బ్రహ్మచారీ శతమర్కటః అని కోతిలా చెట్లెక్కడానికిరా నీవు?

అవ : తమకోసం శుభాంగి రెండుకాయలు తీయమంటే తీశాను అంతే; ఇంతసేపూ పూజాద్రవ్యాలూ, పత్రీ, పసుపు తాళ్లూ, నీళ్లూ తయారుచేస్తున్నా.

శుభా : భట్టుగారూ, నా దోషానికి చీవాట్లు శిష్యుడికా? మీకు కావలసిన సామాగ్రి యిదిగో. [అవధానిచేతిలోనుంచి తీసుకుని, పళ్లెం కింద పెడుతుంది.]

భట్టు : మదన్‌మోహన్‌గారూ, యిక ప్రారంభించనా?

మోహ : అవశ్యం.

భట్టు : శుభాంగీ, కాస్సేపు యిటు రావొద్దు. ఇక మా ఉచ్చాటన ప్రారంభిస్తాం.

శుభా : నన్ను కూడా వుండమంటారేమో అని భయపడ్డాను. అదృష్టవంతురాల్ని సెలవు. [వెళ్తుంది]

భట్టు : మదన్‌మోహన్‌గారూ, మీరు కొంచెందూరంగా పద్మాసనం వేసుకొని కూర్చోండి. ఒరే అవధానీ, నీవు యిలారా, యీ కింద కూర్చో!

మోహ : [పద్మాసనం వేసి] గురువుగారూ, ఇలా.........

భట్టు : ఠీక్, అలాగే కూర్చోండి. కాని భయపడకండి. ఏదైనా ఖంగారుగావుంటే మీ అభిమాన దేవతని ధ్యానం చెయ్యండి.

భట్టు : [గొంతు మారుతుంది] శిష్యా!

అవ : గురువుగారూ!

భట్టు : విసురు, పసుపు నీళ్ళు విసురు, యీశాన్యమూలగా విసురు-

అవ : [దర్భలతో నీళ్ళు మాటిమాటికీ విసురుతుంటాడు.]

మోహ : [మంత్రాలు జోరవుతున్న కొద్దీ అదిరిపడుతుంటాడు.]

భట్టు : హ్రీం, హ్రాం, హ్రూం......ఛటక్ ఛటక్
కాళీ, మహాంకాళీ, కాలభైరవీ,
కపాలమాలాలంకారధారిణీ......
హ్రీం హ్రాం హ్రూం......ఛటాఛట్ ఝటాఝట్
ప్రచండ చండికాచండీ, చర్చికాచండవేగినీ!
హ్రీం హ్రాం హ్రూం!
లాకినీ ఢాకినీ, శాకినీ పంకినీ, రాకినీ రక్తవాహినీ!
హ్రీం హ్రాం హ్రూం!
ఘోరరూపా, ఘోరదంష్ట్రా, ఘోరఘోరతరాకృతీ!
హ్రీం హ్రాం హ్రూం!
[నిలువుగుడ్లతో ఈశాన్యమూలగా ఇంటికప్పుకేసి చూస్తూ]
ఛటక్ ఛటక్, ఛటక్ ఛటక్!—
శిష్యా చూడూ...యింటికప్పుకేసి...ఈశాన్యమూలగా...

అవ : [చూస్తాడు]

భట్టు : తీవ్రంగా!

అవ : ఆమూలనా?

భట్టు : ఆ మారుమూల, లీలగా కదులుతూ...అదిగో...అదిగో...

అవ : ఏమిటి గురువుగారూ...కదులుతూవుందా...ఆ, అదా! సాలెగూడు.

భట్టు : ఓరి కుంకా! ఎన్నాళ్లని నీతో వేగడము! స్థూలదృష్టితో చూడకురా చవటా అని కిందటిసారి చెప్పాను. నల్ల గుడ్లు రెండూ నాసికాగ్రానికి చేర్చి ఏకాగ్రతలో దృష్టినిలిపి, సూక్ష్మదృష్టితో చూడు!

అవ : [మెల్లకన్ను పెట్టి చూస్తాడు.]

భట్టు : ఆ...అదీ...అలా—చూడరా చూడూ...

అవ : [తీవ్రంగా చూస్తూ] చూస్తున్నా, చూస్తున్నా, గురువుగారూ, అదిగో కదులుతోంది...నల్లగా...

భట్టు : నల్లగా...అదిగో...ఆ పెద్ద రెక్కలు...

అవ : కళ్లలా యేవో రెండు...తళతళా మెరుస్తున్నాయి!

భట్టు : చూడూ...అదిగో నల్లని దీర్ఘనాసిక!

అవ : [కంగారుగా] గురువుగారూ, కదులుతోంది...

భట్టు : భయంలేదు...ఆకారాన్ని బట్టి పోల్చావా...ఏమిటి?

అవ : చిత్తం. శాకినీలా...

భట్టు : ఎన్నిసార్లు చెప్పానురా, శాకినికి ఆ ముక్కు అలా వుండదు...

అవ : కాదు కాదు గురువుగారూ, ఢాకినీ, ఢాకినీ...

భట్టు : తెలిసిందా యికనైనా—విసురు—పసుపునీరు—
హ్రీం హ్రాం హ్రూం...ఛటక్ ఛటక్
కాళీ, మహాంకాళీ, కాలభైరవీ, కపాలమాలాలంకార ధారిణీ!
హ్రీం హ్రాం హ్రూం...ఛటాఛట్ ఝటాఝట్
ప్రచండచండికాచండీ, చర్చికాచండవేగినీ!
హ్రీం హ్రాం హ్రూం!
లాకినీ ఢాకినీ, శాకినీ పంకినీ, రాకినీ రక్తవాహినీ!
హ్రీం హ్రాం హ్రూం!
ఘోరరూపా, ఘోరదంష్ట్రా, ఘోరఘోరతరాకృతీ!
హ్రీం హ్రాం హ్రూం!

ఛటక్ ఛటక్, ఛటక్ ఛటక్!—

మోహ : [కెవ్వుమని కేకవేస్తాడు.]

భట్టు : బాబూ భయపడకు, యేం భయంలేదు.

మోహ : గురువుగారూ, హఠాత్తుగా యెగిరితే, నిజంగా భూతమను కున్నాను, గబ్బిలం అనుకోలేదు.

భట్టు : హా! హా! అది వుత్త గబ్బిలమా? [నవ్వుతాడు] పిశాచాలకి నానా రూపమా! ఒక్కొక్క క్షణం ఒక్కొక్క రూపాన్ని తాల్చి ఆటలాడుతూంటవి. కానీయండి. ఇక భయం లేదు. ఇదమిద్ధమని తేలింది కనుక, దాని పంగతి కనుక్కుంటాను......తమ యేర్పాటులు తమరు చేయించండి. నే నిచ్చిన జాబితాప్రకారం అన్నీ తెప్పించండి. రాత్రి పదింటికి ప్రారంభిస్తాను. ముందు యీ పిశాచాన్ని వొదిలించి ఆతరువాత శుభాంగిని ముగ్గులో కూర్చోపెట్టి, రెండవ పూజ చేస్తాను. ఏ దేవత అనుగ్రహిస్తూ వుందో, మనకు లభించవలసినదానికి మార్గం ఏమిటో అంతా తేలి పోతుంది. తమరు శుభాంగితో చెప్పి...

మోహ : [బిగ్గరగా] శుభాంగీ.

శుభాంగి: [ఖంగారుగా ప్రవేశించి] గురువుగారూ, గుండెల్లో యేమో గాభరాగా వుంది. ఏమిటోనండీ! అదేమో......

[మోహన్‌ని పట్టుకుంటుంది]

భట్టు : భయంలేదు, భయంలేదు, యీ నీళ్లు చల్లనీయండి. శిష్యా, ఆ మంత్రించిన నీళ్లు యిలా తే—

భట్టు : హ్రీం హ్రీం... ఫటక్ ఫటక్
కాళీ మహాంకాళీ, కాలభైరవీ, కపాలమాలాలంకార ధారిణీ!
హ్రీం హ్రాం హ్రూం... ఫటాఫట్ ఝుటాఝుట్
ప్రచండ చండికా చండీ, చర్చికా చండవేగినీ!
హ్రీం హ్రాం హ్రూం!
లాకినీ ఢాకినీ, శాకినీ పంకినీ, రాకినీ రక్తవాహినీ!
హ్రీం హ్రాం హ్రూం!
ఘోరరూపా, ఘోరదంష్ట్రా, ఘోరఘోరతరాకృతీ!
హ్రీం హ్రాం హ్రూం!
ఫటక్ ఫటక్ ఫటక్ ఫటక్!

శుభాం : [మూర్ఛపోతూ, మోహన్‌మీదకు వాలిపోతుంది]

మోహ : [పట్టుకుంటూ, కంగారుగా] శుభా, శుభా... అయ్యో గురువుగారూ... కొయ్యలా అయిపోతూంది.

భట్టు : భయంలే, భయంలే, అలా అలా పట్టుకోండి. మంత్రించిన నీళ్ళు తగలగానే మైకం క్రమ్మింది... అది ఒక లక్షణం. మనకి గబ్బిలంలా ఆకారం... ఆమెకి మరో విధంగా... మీరు కంగారుపడకండి...
హ్రీం హ్రాం హ్రూం... ఫటక్ ఫటక్
కాళీ మహాంకాళీ, కాలభైరవీ, కపాలమాలాలంకారధారిణీ!
హ్రీం హ్రాం హ్రూం... ఫటాఫట్ ఝుటాఝుట్.
ప్రచండచండికాచండీ, చర్చికాచండవేగినీ! హ్రీం హ్రాం హ్రూం
లాకిని ఢాకినీ, శాకినీ పంకినీ, రాకినీ రక్తవాహినీ!
హ్రీం హ్రాం హ్రూం!
ఘోరరూపా, ఘోరదంష్ట్రా, ఘోరఘోరతరాకృతీ!
హ్రీం హ్రాం హ్రూం!
ఫటక్ ఫటక్, ఫటక్ ఫటక్!

శుభాం : [పెద్ద మూల్గు]

భట్టు : [గంభీరస్వరంతో] ఎవరునీవు, చెప్పు?

శుభాం : [మూర్ఛలో, దబాయింపుగా] నీవు యెవరురా?

భట్టు : నేనా? నీనట్టూ మట్టూ కనుక్కునే భేతాళభట్టుని...

శుభాం : రాకురా, నాజోలికి రాకు, నేను సామాన్యురాలిని కాను.

భట్టు : హ్రీం హ్రాం హ్రూం... ఫటక్ ఫటక్
కాళీ మహాంకాళీ, కాలభైరవీ,
కపాలమాలాలంకార ధారిణీ!
హ్రీం హ్రాం హ్రూం... ఫటాఫట్ ఝుటా ఝుట్
ప్రచండ చండికాచండీ, చర్చికాచండవేగినీ!
హ్రీం హ్రాం హ్రూం!
లాకినీ, ఢాకినీ, శాకినీ పంకినీ, రాకినీ రక్తవాహినీ!
హ్రీం హ్రాం హ్రూం!
ఘోరరూపా, ఘోరదంష్ట్రా, ఘోరఘోరతరాకృతీ!
హ్రీం హ్రాం హ్రూం!
ఫటక్ ఫటక్, ఫటక్ ఫటక్!
పలుకు—నీవెవరు? పలుకు!

శుభాం : (పిచ్చిగా నవ్వి) ఎవరినా? నా ఢాకను తట్టుకోలేవు! నేను ఢాకినీ! నిన్ను లొంగదీస్తా!

భట్టు : (అట్టహాసంగా నవ్వి) లొంగదీస్తావ్? నీసంగతి కనుక్కుంటా యీ రాత్రి!

శుభాం : (పెద్దగా మూల్గి) నేనూ కనుక్కుంటా యీ రాత్రే, నీసంగతి, హుం!

భట్టు : అయితే కాసుకో—కానీ—

శుభాం : హుం—కానీ—కాసుకో ఖబడ్దార్!
(భట్టు గుండెల మీదకు కాలు విసురుతుంది)

మోహ : అయ్యో, అయ్యో! శుభా! అపచారం, అపచారం!

భట్టు : ఫర్వాలేదు బాబూ, ఫర్వాలేదు. ఆమెను పూనింది పిశాచి; అందుచేతను ఆకాలుకూడా పిశాచికాలే, అది ఆమెకాలు కానేకాదు!

శుభాం : (కళ్ళు సగం తెరచి, అతి నీరసంగా) హాబ్బా!...ఇదేమిటి... నేను యెక్కడున్నాను? (లేవబోతుంది. మోహన్ పట్టుకుని, కూరోబెట్టబోతే అతనిమీదకు ఆని కూర్చుని, సగం తెరచిన కన్నులతో, మైకంతో మాట్లాడినట్టు మాట్లాడుతుంది.) ఆహా...ఆహా...ఎక్కడున్నాను? నేను యెక్కడున్నాను! ఏమిటి?...అదేమిటి... ఆఁ!...ఆ!...అదిగో...అవి, ఆ వెండి కొమ్ములు! అవేమిటి?...అవి......ఆ బంగారు డెక్కలు ......అవేమిటి?...ఆ తోకఆడింపు? ఆ...ఆ......ఆ డెక్కలతో తవ్వుతూంది...అదిగో అదిగో...భూమిలో ఘల్లుఘల్లుమంటూ వుంది! ఆ చప్పుడు...ఆ చప్పుడు [చెవులు మూసుకుంటూ] తవ్వుతూంది డెక్కలతో! తోక...తోక ఆడిస్తూంది...ఆ...ఆ...
[పక్కకి వొరిగిపోతుంది; మోహన్ ఆమెను పడుకో బెడతాడు]

భట్టు : బాబూ యిక భయంలేదు...శివవాహనం, నందికేసుడు అడ్డుకున్నాడు...ఇక పిశాచి భయంలేదు...

మోహ : సరిగ్గా పోల్చారు గురువుగారూ! మొన్ననే నందికేసుడి వ్రతం చేసింది.

భట్టు : ఆమెని అలా పడుకోనియ్యండి; తెలివివొచ్చిన తరువాత యీ మంత్రించిన నీళ్లు మజ్జిగలో కలిపి తాగించండి... నేను జాబితా పంపిస్తాను, ఆ ప్రకారం సామగ్రి అంతా సాయంకాలానికి తెప్పించండి...ఆమే మీరూ కూడా చీకటిపడేటప్పటికి స్నానంచేసి, పట్టువస్త్రాలు ధరించి, పవిత్రంగా వుండండి...మరి, నేను రాత్రికే కనపడడం ...[లేస్తాడు.]

మోహ : [లేచి, నమస్కరిస్తూ] గురువుగారూ, యీ రాత్రితో యిక వొదిలించెయ్యాలి మమ్మల్ని పట్టుకున్న మహాపిశాచాన్ని... మీరుణం తీర్చుకుంటాను.

భట్టు: మదన్‌మోహన్ గారూ, యీ రాత్రి నా పూజతో పిశాచం పుంజాలు తెంపుకొని మీ ప్రాంతాలకు రాకుండా పరారీ కావడం, మీకు ప్రత్యక్షంగా చూపిస్తాను... భయపడకండి! భేతాళభట్టు కొలువుపెట్టాక మరి మీకు భీతి అనవసరం... తిమ్మక్క, రారా... బాబూ సెలవు.

మోహ : నమస్కారం... సెలవు. (తెర)

## 2

* * గదిలోనుంచి మధ్యమధ్యను మంత్రాలు వినిపిస్తూవుంటవి. కొబ్బరికాయలు కొడుతూవున్న చప్పుడు వినిపిస్తూ వుంటుంది.

శుభాంగి: తిమ్మావధానీ! మరి నా శిష్యరికం పూర్తిగా అంగీకరించినట్టేనా?

అవధాని: అహో, అభాగినీ నిన్ను వొదిలినా, నీ శిష్యరికం నేను వొదలను... ఓహో పులిహోరా, బొబ్బట్లూ, యేం రుచిగావున్నాయి! నీ చేయి తగిలితే వంటకాలకి సహితం వొల్లమాలిన రుచి వొచ్చింది!

శుభాం : [సిగ్గుపడి] కబుర్లు బాగా నేరుస్తున్నావే!

అవ : నీ శిష్యరికం ప్రభావం!

శుభాం : నీ గురువుగారి సట్టంతా దాచకుండా నాకు చెప్పావుకదా; అలాగే గురువుగారు, నా రహస్యాలు అడిగితే చెప్పేస్తావా?

అవ : అక్కడ నేను సబూచిప్! వొక్కమాట చెప్పను. ఇన్నాళ్లనుంచీ నేను వెంట తిరుగుతున్నాను; ఎందరి దగ్గరో ఎన్నో వందలు లాగుతున్నాడు; పాతిక రూపాయలు పట్టుమని నా చేతిలో పెట్టిన పాపాన్ని పోలేదు. ఈయన్ని నమ్ముతానా?

శుభాం : నేనిచ్చిన పాతిక రూపాయలూ జాగ్రత్త పెట్టుకున్నావా?

అవ : శుభాంగీ, నిజం చెప్తాను కోప్పడవుకదా!

శుభాం : ఏం, నాదగ్గర దాపరికాలుంచనన్నావ్?

అవ : వెంకటేశ్వరస్వామిమీద ప్రమాణం చేయించావు; ఇక నీ దగ్గర అబద్ధమాడితే, నాకు గతులుంటాయా?

శుభాం : అయితే ఆ పాతికా యేంచేశావ్?

అవ : కోప్పడకు, పెళ్ళీడుకొచ్చిన పిల్లదానికి సుద్దులు అసలు లేవని, మా చెల్లెలికిచ్చాను.

శుభా : [నవ్వి] భేష్, మంచిపనిచేశావ్! చెల్లెలుందని చెప్పావు కాదేం. ఇప్పుడు రాత్రి పది దాటింది; పొద్దున్నే మరొక పాతిక రూపాయలు యిస్తాను. వాటితో సుద్దులు కొనుక్కో!

అవ : వొద్దు వొద్దు, వొక్కసారి యాభైరూపాయిలే!

శుభా : పుచ్చుకోక తప్పదు; నా అజ్ఞ దాటనన్నావు, ఖబడ్దార్!

అవ నీకు దయగలిగినా, కలిసి మేలాగుంది!

శుభా : ఇంతతో కాదు. నేను చెప్పినట్టు అంతా కానియ్యి! మద్రాసులో మూర్ఖుడు గాని నాలిమూహా!

అవ : [ఉత్సాహంగా] ఏమిటీ, ప్రయాణం ఖాయమేనా?

శుభా : నీవు తెలివిగా, జాగ్రత్తగా, చెప్పినట్టు చేశావా, నేను చెప్పినదంతా ఖాయం.

అవ : తప్పు అనేది నావల్ల జరిగిందా, నీ మొకంకొరికి తాళ్ళు తింటాను.

శుభా : ఛా: అంతమాట అనకు. మరి, మరొకపనికూడా చెయ్యాలి.

అవ : చెప్పు తక్షణం......

శుభాంగి: చూడూ, పది దాటుతూవుంది. తలుపు కొస్తతీసి, గురువుగారు ఏఘట్టంలో వున్నారో చూడు.

అవధాని: [తొంగిచూసి] శుభాంగీ! పిశాచవారణ ఘట్టం పూర్తి కావొస్తూంది. ఇక నీవు లోపలికి వెళ్ళవలసివుంటుంది. నిన్ను ముగ్గులో కూర్చోబెట్టి పూజచేస్తారు.

శుభాంగి: అయితే విను; నేను లోపలికి వెళ్లగానే, పంతులినితీసుకువెళ్ళి ఇంటివెనుక నూతిదగ్గర రావిచెట్టుకింద కూర్చోబెట్టి, ఇందాక నేను చెప్పినప్రకారం సరిగ్గా చెయ్యి...పంతులు గాభరాపడ్డప్పుడు ఆంజనేయదండకం చదువు...ఏం... చెప్పినట్టుగా చేస్తావా?

అవధాని: ఇదంతా యావన్మాత్రం తప్పకుండా చేయకపోతే, నీ యిష్టం వొచ్చిన......

శుభాంగి: ఆగాగు. నువ్వు చేయగలవు, నాకు తెలుసు. అదుగో, పంతులు వొస్తున్నాడు. నేను గురువుగారి దగ్గరకు వెళ్తా.

[గదిలోకి వెళ్తుంది. మంత్రాలు జోరవుతాయి]

మోహన్: ఏం అవధాన్లు, వొంటరిగా వున్నావ్? పూజ యెంతవరకూ వొచ్చింది? శుభాంగి యేది?

అవధాని: పూజ మొదటి ఘట్టం పూర్తికావొస్తూవుంది. శుభాంగి గురువుగారి యెదరను కూర్చుంది. బహుశా, యిక పిశాచం పూనటం, దానిని వొదలగొట్టటం జరుగుతుంది. మనం యిక్కడ వుండరాదు.

మోహ : రావిచెట్టుకింద కూర్చుని, గంటవరకూ జపం చెయ్యమని శుభాంగి చెప్పింది.

అవధాని: డాకినీ యే రూపంలో, యెలా పారిపోతుందో తోటలో నిలిచి చూడమన్నారు గురువుగారు. రాండి; మీరు రావిచెట్టుకింద జపం ప్రారంభించండి. ఇక్కడే వుంటే ప్రమాదం, రాండి.

[ఇద్దరూ వెళ్తారు]

[రెండు నిమిషాలు నిశ్శబ్దం. ఇంతలో మంత్రాలు ఆగిపోతాయి. కెవ్వున కేకవేసి, భేతాళభట్టు గదిలోంచి బైటికి గెంతుతాడు. శుభాంగి చీరకుచ్చెళ్లు దోపుకుంటూ వచ్చి, భట్టుకి అడ్డు నిలుస్తుంది. భట్టు గజగజ వణుకుతూ, ఇంగా

రుగా మాట్లాడుతారు. శుభాంగి దబాయింపు గొంతుకతో మాట్లాడుతుంది.]

భట్టు : హొహ్హో హొహ్హో హొ...తల్లీ...దొరలు...నన్ను దొరలు పీడ(బొమ్మరాక్షి). నన్ను...నన్ను పట్టుకుంటే...

శుభాంగి: (గంభీరస్వరంతో) నేను ఢాకినిని!

భట్టు : చిత్తం...తల్లీ, చిత్తం...నన్ను దొరలు...

శుభాంగి : వొదలను...నాకు లొంగు; నిన్ను నేను ఆవహిస్తాను. లొంగకపోయావా, నీ బ్రతుకు అల్లరిచేస్తాను.

భట్టు : శుభాంగీ! ఇది...యిది...చెరులు కావు...నిరు పేదని...నావల్ల...

శుభాంగి : చదువ్వు...నీవల్ల నాకేం లాభం. విను, వణకకు...వణక కంటే!

భట్టు : [గజగజలాడిపోతూ] చిత్తం చిత్తం! వొణకను...వొణకను తల్లీ! వొణకను...

శుభాంగి: పొట్టకూటికి గతిలేకపోతే, యిదామార్గం? భేతాళ భట్టు వేం?

భట్టు : గతిలేక...బుద్ధిలేనిపనికి పూనుకున్నాను...

శుభాంగి: బుద్ధిచెప్తాను వుండు.

భట్టు : తల్లీ...దీనుణ్ణి...

శుభాంగి: ఎందుకు పూరికే ఖంగారుపడి చస్తావ్...విను.

భట్టు : ఆ...వింటాను.

శుభా : దౌర్భాగ్యుడా...ఎందుకా ఉక్కిరిబిక్కిరి...కొస్త మంచినీళ్ళు త్రాగు. [మంచినీళ్లు యిస్తుంది. భట్టు గటగటా త్రాగేస్తాడు]...ఖంగారు తగ్గిందా?

భట్టు : హమ్మా! [గ్లాసుకిందపెట్టి, పెద్దనిట్టూర్పు వొదులుతాడు]

శుభా : భేతాళభట్టని పటాటోపంతో, మంత్రశాస్త్రం యేకరువు పెట్టావు! వెండికొమ్ములూ, బంగారుడెక్కలూ, ఘల్లు ఘల్లని భూమిలో చప్పుడూ అంటే తిరపతి వెంకటేశ్వర్లనీ, భూమిలో నిధుల్ని కదిలించబోతున్నాడనీ యేమనక; నందికేశ్వరుడూ నా తలకాయా అంటావేం?

భట్టు : శుభాంగీ, యేదో జీవనోపాధికి యేమ్చేయమన్ను; అంత తెలివి నాకుంటే యీగతి...

శుభా : నీకు తెలివిలేకపోతే, నేను నేర్పుతాను. వదిరాళ్లు నీచేతిలో పడేటట్టు చేస్తాను.

భట్టు : నీదయ...

శుభా : పిచ్చివాడా, నీకైనా నాకైనా, కొక్కటేబాధ...తెలివి తేటలు ఉపయోగించి పైసాలు పలికించుకోవడం...చెప్పినట్టు వింటావా? ఢాకినిని వొదలగొట్టావనీ, వెంకటేశ్వర స్వామి కటాక్షాన్ని సంపాదించి, నిధులూ నిక్షేపాలూ దొరికేటట్టు చేస్తున్నావనీ, ఊరంతా పేరుమోగేటట్టు చేస్తాను. నాకు యెదురుతిరగడానికి యత్నించావా మళ్లీ ఢాకినీని ప్రవేశపెడతాను...నిన్ను పిలకపట్టి రప్పించి కాగాగోల చేసి నీ బ్రతుకు బయటపెడతాను.

భట్టు : శుభాంగీ, నా మాటనమ్ము...ఇదిగో, గాయత్రీసాక్షి. అక్షరాలా నీవుచెప్పినట్టు చేస్తాను.

శుభా . అయితే విను, ఢాకినీ వొదిలిపోయింది. నీ ఢాకకు తట్టుకో లేక బండరాయిగామారి నూతిలోపడిపోయింది!

భట్టు : విచిత్రం! వినలేదెప్పుడూ యిటువంటిమాట...ఢాకినీ రాయిగామారి నూతిలోపడిందంటే నమ్ముతారా?

శుభా : నీ కెందుకులే ఆగోల. తిమ్మన్న చేత రాయి నూతిలో పడే యించి, పంతులుతో అలాచెప్పించాను. తరువాత, శ్రీ వెంకటేశ్వరస్వామి వెండికొమ్ములతో బంగారు డెక్కలతో వృషభరూపంగా భూమిని తవ్వుతున్నాడు; భూమిలో నిధులూ నిక్షేపాలూ ఘల్లుఘల్లని ప్రతిధ్వని స్తున్నాయి. ఇదీ నీపాఠం, అర్థమయ్యిందా?

భట్టు : తెలిసింది. అలాగే అంటాను.

శుభాం : [వెక్కిరింపుగా] అంటాను...! గంగిరెద్దులా తలూపడం కాదు. పంతులు తలకి ఔగా యెక్కించు. ఇప్పుడు నేనొక నాటకమాడుతాను; ఆ సమయంలో పంతులుచేత తిరుపతి వెంకటేశ్వర్లుకి మొక్కించి, ముహూర్తం పెట్టి, తిరుపతి ప్రయాణం పెట్టించు. అర్థమయ్యిందా?

భట్టు : అర్థమైంది అలాగే...

శుభాం : అదిగో ఆ తొందరే పనికిరాదు. విను, పంతులు మొన్ననే పొలమమ్మాడు, పదిహేను వేలూ రొఖం నిలవవుంది. తిరుపతికి తరలించామా, అక్కడనుంచి చెన్నపట్నం ప్రయాణం; పట్నంలో పడ్డామంటే కావలసినవన్నీ కొని పించి తెగినంతగా డబ్బు కరిగిస్తాను. ఆ తరువాత చెప్తాను, నేనువున్నానం, ఆ గొడవ అంతా; నా చేతిలో పడిన దానిలోనుంచి పది రాళ్ళు నీకూ ప్రయోజనం చూపిస్తాను. తెలిసిందా!

భట్టు : శుభాంగీ, బుద్ధికి బృహస్పతిలా వున్నావు. నీలాంటిదాని శిష్యరికం చేసివుంటే...

శుభాం : ఇప్పుడైనా మించిందిలేదు. ఇక యిప్పటికి చాలు. పిలు, పంతుల్ని పిలు!

భట్టు : అదిగో వారే వొస్తున్నారు; మా తిమ్మడుకూడా...

శుభాం : అయితే ఇదిగో నన్ను పట్టుకో, నేను మూర్ఛపోతున్నాను. హుం...[మూలుగుతూ వూగుతుంది]

మోహ : అయ్యొ అయ్యొ! గురువుగారూ అదేమిటి?

భట్టు : భరవాలేదు, భయపడకండి, యిలా పట్టుకోండి—

[శుభాంగి, పంతులుమీదికి వాలిపోతుంది; పంతులు ఆమెను పట్టుకుంటాడు]

భట్టు : [విదరను విలిచి, శుభాంగిని కనిపెడుతూ] బాబూ ఎలా, కైతేనేం పిశాచం వొదిలిపోయింది; రాయిగా మారి నూతిలో పడిపోయింది.

మోహ : అవును చప్పుడు విన్నాను!

శుభాం : [భట్టుని దొంగచూపు చూస్తుంది]

భట్టు : వినండి, శ్రీ వెంకటేశ్వరస్వామి శుభాంగిని పూనివున్నారు. వెంటనే తిరుపతికి వెళ్ళి దివ్యదర్శనం చేయగానే, స్వామి అనుగ్రహం కలుగుతుంది; ఆ తరవాతను, ఆ నిధులూ నిక్షే పాలూ దొరికితీరుతాయి ... బాబూ, "వెంకటేశ్వర స్వామీ, వెంటనే నీ దర్శనానికి వొస్తున్నాము" అని మొక్కుకోండి.

మోహ : చిత్తం గురువుగారూ, అలాగే మొక్కుకుంటాను.

శుభా : [భట్టుని కళ్లతో హెచ్చరిస్తుంది]

భట్టు : [కుర్చీని దగ్గరగా లాగి] ఆమెను యీ కుర్చీకి ఆనించి; లేవండి, మొక్కుకోండి...

మోహ : [శుభాంగిని కుర్చీకి ఆన్చి, కూర్చోబెట్టి, యెదరకు వెళ్ళి చేతులు జోడించి నిలబడుతాడు.]

భట్టు : [శుభాంగికేసి చూస్తాడు]

శుభా : [కళ్లెర్రజేసి భట్టుని చూసి, పెద్దమూలుగు మూలిగి, హూ హో అంటూ వూగుతుంది-]

భట్టు : [ఖంగారుగా] బాబూ; బాబూ హారతి, హారతి పట్టుకు రాండి...త్వరగా...

మోహ : [పరిగెడుతాడు]

శుభా : [చీవాట్లు పెడుతూ] ఏం తెలివి? తిరపతి, తిరపతని, దేవు ళ్లాడుతావేం? వెంటనే తిరపతీ, తిరువాలి అన్ని తీర్థ యాత్రలూ అని మొక్కించు... [పక్కకి చూసి] జాగ్రత్త...హుం, హుం...(ఊగుతూవుంటుంది.)

మోహ : [హారతితో ప్రవేశిస్తాడు]

భట్టు : [హారతి తాను అందుకుని] బాబూ, తక్షణం తిరపతీ, తిర ణాలి అన్ని యాత్రలూ అని మొక్కండి.

మోహ : [నమస్కరిస్తూ] తిరపతీ అన్నియాత్రలూ చేయిస్తాను స్వామీ.

శుభా : [ఊగిపోతూ మూలుగుతుంది]

భట్టు : బాబూ, లేవదీయండి, లేవదీయండి. వెంకటేశ్వర్లు పూనారు...

మోహ : [శుభాంగిని లేవదీస్తాడు. అతని మీదికి వొరిగి, హోహూ అంటూ వూగుతూ వుంటుంది]

భట్టు : [ఆమెకు హారతి యిస్తూ. దండకం చదువుతాడు]

శుభా [దండకం జోరైన కొలదీ, మరీమరీ వూగిపోతుంది]

భట్టు : శ్రీ మన్మహాశేషశైలాంతరావాస, త్రైలోక్య సంపూజితాంభోజపాదా, సదా భక్తకోటీమనోరాజవీథీ విహారా, మహారాజ రాజార్పితానేక మాణిక్యకాంతి చ్ఛటోదారహారావళీరంజితోరస్థలా, వెంకటేశప్రభూ, నిన్ను భావింతునే, నిన్ను సేవింతునే, భక్తమందారమా, నమ్ముకున్నానుగా, మొక్కుకున్నానుగా, నామొరా లింపవా, నన్ను పాలింపవా, దేవ, నావేదనల్ తీర్చి, నాకోర్కె తీర్చి, పైరింపుమా నన్ను, సేవాసమాసన్న వైకుంఠ, సీమంతినీచామరోల్లోలబాలానిలామోదితస్వాంత, దేవా నమస్తే, నమస్తే, నమః.

[భట్టు హారతి తిప్పుతూవుంటే, శుభాంగి మరీమరీ వూగుతూవుంటుంది. మోహన్ పట్టుకోలేక గాభరాపడుతూ వుంటాడు.]

తెర



# ఆర్యుల ఆదినివాసము భారతదేశమే

శ్రీ జటావల్లభుల పురుషోత్తము

ఆర్యులు ఆదిలో మధ్యాసియాఖండలోనో, యూరపులోనో, ఉత్తర ధ్రువ ప్రాంతముననో, మరియొక్కడనో నివసించుచుండి తరువాత కొంతకాలమునకు భారతదేశముపై దండయాత్రచేసి యప్పటి కక్కడనుండిన ద్రావిడులను దక్షిణమునకు పారద్రోలి సప్తసింధు ప్రాంతమును, గంగా యమునా నదుల మైదానములను, మధ్య భారతమును, ప్రాగ్భారతమును, పశ్చిమ దక్షిణ భారతములను క్రమముగా నాక్రమించుకొనిరని ఆధునిక చరిత్రపరిశోధకులు కొందరభిప్రాయపడిరి. ఈ యభిప్రాయములనే చారిత్రక సిద్ధాంతములనుగా చరిత్ర రచయితలు వ్రాయుచు వచ్చుచున్నందునను, ఆ చరిత్ర గ్రంథములే మొదటినుండియు మన యాధునిక విద్యాలయములలో బోధింపబడుచుండినందునను, ఒకటవ ఫారము మొదలు ఎం. ఏ. వరకును ఏ తరగతిలోను ఈ సిద్ధాంతములపై ఖండనములను విద్యార్థులకు బోధింపకున్నందునను ఆర్యులు పైనుండి భారతదేశమునకు వచ్చిరనుట శంకింపరాని పరమసత్యమను భావము మన విద్యావంతులలో వ్యాపించినది. కాని యార్యుల యాదినివాసమునుగూర్చి చిరకాలపరిశోధన గావించిన కొందరు పాశ్చాత్యులును, భారతీయులును ఆర్యులు పైనుండి రాలేదనియు, భారతదేశమే యార్యుల యాదినివాసమనియు, ఇక్కడనుండియే యితరదేశముల కేగిరనియు నిరూపణము చేయుచు వ్రాసిన యుద్గ్రంథములు తగినంత వ్యాప్తిలోనికి వచ్చుతో నా సిద్ధాంతములు పటాపంచలగునను నమ్మకము ఈ విషయమున పరిశీలనము గావించిన వారికి కలుగక మానదు. ఆర్యులు పైనుండి వచ్చినారను వాదము ఎంత దుర్బలములో, భారతదేశమే యార్యుల యాదినివాసమను సిద్ధాంత మెంత పటిష్ఠమైనదో సంగ్రహముగా పరిశీలింతము.

కుమారు 200 సంవత్సరములక్రిందట యూరపియనులు వేదములను ఇతర సంస్కృతగ్రంథములను చదువుటకు ప్రారంభించిరి. ఆ పిమ్మట వారిలో కొందరు పరిశోధకులు ఆర్యుల ఆదినివాసమును గూర్చియు, వేదముల కాలమును గూర్చియు తమ యభిప్రాయములను వెలిబుచ్చిరి. ఎల్ఫిన్‌స్టన్, కర్జన్ మున్నగు విద్వాంసులు భారతదేశమే యార్యుల యాదినివాసమని అసందిగ్ధముగా ప్రకటించిరి. తరువాత ననేకులు పాశ్చాత్యవిద్వాంసులకు భారతదేశమునుండియే ఆర్యులు, ఆర్యవిజ్ఞానము ప్రపంచమంతయు వ్యాపించెనను భావము దుర్భరముగా తోచెను. వారు అతిదుర్బలము లయిన హేతువులను జూపి యార్యాదినివాసము మధ్యాసియాలోనో, కాస్పియన్ సముద్ర ప్రాంతముననో, రష్యాప్రాంతముననో యుండెనని స్థాపించుటకు యత్నించిరి. ఈ స్థితిలో లోకమాన్యతిలక్ పాశ్చాత్యుల శాస్త్రమే యైన భూగర్భశాస్త్రము నాధారముగా తీసికొని యార్యులాదిలో ఉత్తరధ్రువ ప్రాంతములో నుండిరను సిద్ధాంతమును ప్రతిపాదించి యదివరకుండిన యభిప్రాయముల నన్నింటిని కొట్టివైచినారు. తిలకుగారి 'ఆర్క్టిక్ హోం' అను గ్రంథమువలన స్పష్టమైనది యేమనగా: ఆర్యులనివాసమునుగూర్చిన సిద్ధాంతములన్నియు ఊహామాత్రములే కాని యప్రతిహతములైన సత్యములు కావనునదిమాత్రమే.

తిలకుగారి తర్వాత ముగ్గురు భారతీయ పరిశోధకులు ఆర్యుల నివాసము భారతదేశమేయని నిరూపించుచు ఉద్గ్రంథములను రచించిరి. కలకత్తా విశ్వవిద్యాలయాచార్యులు అవినాశ్ చంద్రదాసుగారు 1921 వ సంవత్సరములో "ఋగ్వేదిక్ ఇండియా" అను గ్రంథమును 1915 లో పావగీ యను మహారాష్ట్ర విద్వాంసులు "ఆర్యావర్తిక్ హోం" అను గ్రంథమును. 1930 లో ఢిల్లీ విశ్వవిద్యాలయాచార్యులు లక్ష్మీధర కల్లాగారు "ది హోం ఆఫ్ ది ఆర్యాన్స్" అను గ్రంథమును రచించి "భారతదేశ" వాదము నతిదక్షతతో నిలబెట్టిరి. ఈ ముగ్గురును కూడ తిలకుగారి గ్రంథము భారతీయ వాదమున కవకాశమిచ్చుచునే యున్నదని యనేకోదాహరణములను చూపించి యున్నారు. తిలకుగారి గ్రంథమునుబట్టి ఆర్యులకు ఉత్తర ధ్రువపరిచయ మున్నదని తెలియునే కాని యక్కడనే వారి యాది నివాసమని తెలియదని పావగీ నిరూపించెను.

చిత్రమేమన: ఏతద్విషయవిచారణమును సమగ్రముగా గావించి ఉద్గ్రంథస్థాయిలో, ఉపక్రమోపసంహారాది మర్యాదలను, పరపక్ష ఖండనాది సమగ్ర విమర్శనమును గావించిన యీ భారతీయ విద్వాంసుల యభిప్రాయములకు నేటి చరిత్రగ్రంథములలో తావేలేకపోవుచుండగా "నాకిట్లు తోచుచున్నది" "ఇది యిట్లయుండవలయును" మొదలైన ప్రకటనలను గావించిన పాశ్చాత్య విద్వాంసుల అభిప్రాయములే నేడు చారిత్రక సిద్ధాంతములుగా చెల్లుబడుచున్నవి. పాశ్చాత్యులెవ్వరును కూడ వీరివలె ఆర్యుల నివాసమునుగూర్చి యుద్గ్రంథములను రచించియే యుండలేదు. భారతీయుల ఉద్గ్రంథములకంటె నీ పాశ్చాత్యుల "యభిప్రాయము"లకే నేటివరకు విద్యాలయములలో గౌరవాదరములు లభించుచున్నను క్రమముగా భారత నివాసవాదమే నిలబడగలదనుట

యుక్త్యుక్తము కాదు. ఏ సమస్యనైనను పాశ్చాత్యులు చూపిన దారిలోనే కాక స్వతంత్ర ధోరణిలో కూడ నాలోచించుకొని క్రమముగా స్వతంత్ర భారతీయులకు కలిగితీరును.

భారతేతర నివాసవాదములను సంగ్రహముగా సమీక్షించుచు నవియే భారత వాదమునకెట్లు దారితీయగలవో చూతము.

## యూరపు సిద్ధాంతము

ఆదిలో భారతనివాస సిద్ధాంతమును ప్రతిపాదించిన పాశ్చాత్య విద్వాంసులను ఖండించుచు 1851 వ సంవత్సరములో లాథామ్ అను పాశ్చాత్యుడు యూరపు సిద్ధాంతమును ప్రతిపాదించెను. బెన్ఫీ పండితుడు దీనిని సమర్థించుచు నిట్లు వాదించెను: "యూరపులో నివసించు ఎలుగుగొడ్డు, తోడేలు మున్నగు జంతువులను తెలుపు పదములు ఇండోజర్మానిక్ భాషలన్నింటిలోను ఉన్నందునను, భారత పర్షియాలలో నివసించు సింహము, పులి, ఒంటె మున్నగు జంతువుల పేర్లు యూరపు భాషలకును భారత పర్షియాలకును సమానముగా లేనందువల్లను ఆర్యులు సమష్టిగా ఒకచోట నుండునప్పటికీ జంతువులు వారికి తెలియవనియు, అందువలన యూరపులోనే వీరు సమష్టిగా నుండిరనియు, అటనుండి విడిచిపోయిరనియు చెప్పవలసి యున్నది. అట్లే వృక్షనామములను బట్టియు తెలియుచున్నది. మంచును తెలుపుపదములు యూరపు భాషలన్నింటిలోను సమానముగా నుండుటయు దీనికి బలమిచ్చుచున్నది."

ఇండియాలోను పర్షియాలోను కన్పట్టు జంతువులకు యూరపు భాషలలో పేర్లు లేనంతమాత్రముచేత అక్కడివా రాదిలో భారతమునుండి గాని ఇరాన్ నుండిగాని వెళ్ళినవారు కారని తెలియుచున్న దనుట న్యాయ్యము కాదు. వారిక్కడ నుండి వెళ్లి నప్పటికి ఆపదములను తమతో తీసికొనియే వెళ్ళియుందురు. కాని వారి నూతన నివాసమైన యూరపులో ఆజంతువులు లేనందున ఆ పేర్లను వారు జ్ఞప్తియందుంచుకొన నక్కరలేకపోయెను. ఆ తరము వారు జ్ఞప్తియందుంచుకొనినను తరువాత తరములు వారు మరచి పోవుట తథ్యము. కావున ఆ జంతువులపేర్లు యూరపు భాషలలో లేకుండుట భారత సిద్ధాంతమును బాధింపజాలదు—అట్లే యూరపులోని జంతువులు భారతదేశములో కూడ కన్పట్టునవి యగుటచే నందును నిందును ఆ నామములు సామాన్యముగా కన్పట్టుట సహజము. ఆ పాశ్చాత్యులు భారతదేశమునుండి వెళ్ళినవారే యనియు వీరు వెళ్లినప్పటికి భారతదేశమునుండి తీసికొని వెళ్ళిన పదములనే నిలబెట్టుకొనినారనియు, ఆ జంతువు లక్కడను ఇక్కడను గూడ నుండుటయే దానికి కారణమనియు భావించుటలో నేమియు నాక్షేపణము లేదు.

ఈ రీతిగా యూరపు వాదులు చెప్పిన యుక్తులు వారి కుపకరించక పోగా పైగా భారత వాదమునే సమర్థించునవిగా నున్నవి.

బీచ్ అను వృక్షవాచక పదము యూరపు భాషలన్నింటి యందును ఉన్నందునను, భారతభాషలలో లేనందునను, మరియు బీచ్ వృక్షములు లేని యూరపు ప్రాంతములలో కూడ నాపద మేదో రూపములో మరొక వృక్షపరముగా వాడబడుచుండుట చేతను యూరపు జాతులన్నియు, బీచ్ వృక్షములు హెచ్చుగా పెరు చుండిన ప్రదేశములో కొంత కాలముండి యటనుండి విడిపో యుండవలయుననియు, బీచ్ వృక్షములు హెచ్చుగా నున్న ములు నల్లసముద్ర ప్రాంతమున నున్నవనియు వీరు చెప్పుచున్నా

ఈవాదముకూడ భారతసిద్ధాంతమునే యెట్లుసమర్థించు చూతము. "బీచ్"కిని తత్సదృశ పదములకును యూరపుభాషలలో అర్థభేదము విపరీతముగానున్నది. గ్రీకుభాషలో దానిరూప ఫేగాస్ (ఫగాస్)గా నుండుటయేకాక దానియర్థము "బీ వృక్షము కాదు; "ఓక్ వృక్షము." తూర్పుయూరపులో దానియర్థ "ఎల్మ్" వృక్షము. మరియు నీశబ్దరూపము లాయా దేశముల భేదించుచు నెట్టిస్థితిలో నున్నవనగా అన్నిరూపములును స సంస్కృతములోని బకుశశబ్దమునుండి పుట్టినవనుటకు వీలుగానున్న సంస్కృతము బకు (శ), పర్షియన్ 'బుక్' జర్మన్ బక్, గ్ర ఫేగాస్ (ఫేగాస్) లాటిన్ ఫేగస్, ప్రాచీన ఇంగ్లీషు బీక్, ఇంగ్లీషు బీచ్. విశేషమేమన: పాశ్చాత్యులే యేర్పరచిన భా శాస్త్ర నియమములనుబట్టే 'బకు' 'ఫేగ్' గాను 'బీక్' 'బీచ్' గా మారును. ఇందు మొదటిదానికి "గ్రిమ్స్ లా" వర్తించును. రెం దానికి "తాలవ్యీకరణ" సిద్ధాంతము వర్తించును. వట్టియూహలవ కాక భాషాశాస్త్ర మర్యాదలనుబట్టియే బకుశ శబ్దములను యీ పదములన్నియు వచ్చినట్లు తేలుచుండుటచే నిదికూడ యూర సిద్ధాంతమును కాక భారతసిద్ధాంతమునే బలపరచును. ఇట్లే పాశ్చా త్యు లుదాహరించిన యితరవృక్షవాచక శబ్దములు భారతవాదము సమర్థించుచున్నవి.

మంచును తెలుపుపదములు సజాతీయములై యూరపు భాష లోను భారతార్యభాషలలోను ఉన్నందున ఆర్యులు మొదట మం హెచ్చుగానుండిన ప్రదేశమునుండి బయలుదేరి యుండవలయున పాశ్చాత్యులు సూచించినారు. ఇదియు భారతవాదమున కడ్డురా ఆర్యులు మొదట హిమాలయములలో నివసించుచుండిరను వాదము బహు సమర్థముగా నిరూపించిన శ్రీ లక్ష్మీధర కల్లాగారు మం మిక్కుటముగాగల హిమాలయములనుండి ప్రపంచ మంతటను ఆర్యు వ్యాపించినారనుట కీ హిమవాచకపదములు మిక్కిలి సహకరించున తెలిపియున్నారు. యూరపులోని హిమవాచకపదములలో నుండియు మిగిలినవి పుట్టినవనుటకు వీలు లేకుండుటచేతను, అ యన్నియు భారతార్యభాషలోని హిమశబ్దమునుండి వచ్చినవ స్పష్టమగుచుండుటచేతను హిమవాచకపదములు భారతవాదము సమర్థించుచున్నవి.

భారతీయార్యులు ఏనుగునకు హస్తిన్ శబ్దము వాడుటచే వా దేశమునకు సహజాలు కారనియు, ఇక్కడకు వచ్చునప్పటికి వా ఏనుగును చూచియుండనందున ఆశ్చర్యముతో "చేయిగలది" అ అర్థమువచ్చెడి శబ్దమును ఏనుగుకు వాడిరనియు, ఆర్యులు భా దేశమే ఆదినివాసముగా గలవారగుచో ఏనుగును చూచి అంతయాశ్చర్య పడి యుండరనియు మాక్డొనెల్ పండితుడు వ్రాసియున్నా హస్తిన్ శబ్దమే ఆశ్చర్యమును వెల్లడించునదియగుచో నార్యులు ఆశ్చర్యమును గల్గింపని జంతువే లేదని యాయా జంతునామములను బ

మనకు తెలియగలదు. వానరము (వికల్పముగా మనుష్యుడు), కచ్ఛపము (తోకతో నీటినిత్రాగునది, తాబేలు) భౌవము (భౌయని యరచునది, కుక్క)—ఈరీతిగా అన్ని పదములు ఆశ్చర్యమును తెలుపునవియేయగును. ఈ జంతువు లేవియూ లేని ప్రదేశమునుండి యార్యులు భారతదేశమునకు వచ్చినారనవలసియుండును. ఆర్యులు మధ్యాసియానుండి వచ్చియున్నను మరెచ్చటనుండి వచ్చియున్నను ఈ జంతువులను వారెరిగియేయున్నారుకదా! కావున పాశ్చాత్యాదివాదము లేవియూ సామర్థ్యమును సూచింపవు.

## మధ్యాసియా వాదము

ఆదిలో నార్యులు మధ్యాసియాలోనుండి తరువాత నలుదిక్కులకును ప్రాకిరనువాదమున కాధారముగా నీ క్రింది యంశములు చేకొనబడినవి: (1) అటు యూరపులోను ఇటు ఆసియాలోని ఇరాను భారతదేశములలోను ఆర్యులు వ్యాపించియున్నందున వారు మొదట యూరపు ఆసియాలకు రెంటికిని అనుసంధానముగా నున్న మధ్యాసియాలో నుండియుండవలయును. (2) ఇండోయూరపియన్ అనెడు ప్రాచీనార్యభాషకు యూరపు భాషలకంటె అవెస్తా వైదిక భాషలే దగ్గఱగా నున్నందున ఆర్యులు ఆదిలో నుండిన ప్రదేశము యూరపు దేశములకంటె ఇరాను భారతదేశములకే దగ్గరగా నుండవలయును. ఏలనన: ప్రజలు దూరముగా వలస పోవుచున్న కొలదియు వారిభాష యెక్కుడుగా మారిపోవుచుండును. (3) 'ఫైలాలజీ' యను భాషాసాదృశ్యశాస్త్రములో కృషి చేసిన వారు ఇండోజర్మానిక్ భాషలు రెండు తెగలుగా నున్నట్లు చూచినారు. ఒక తెగలో శవర్ణమున్నచోట రెండవ తెగలో కకారమున్నట్లు తెలియుచున్నది. ఉ: శతమ్ అని యొక తెగలోను కెంటుమ్ అని యొక తెగలోను ఉండును. అవెస్తా సంస్కృత భాషలు మొదటి తెగలోనివి. వానికి శతమ్ భాషలని పేరు. యూరపియన్ భాషలు కెంటుం తెగలోనివి. శవర్ణకకారములు రెండింటికిని సంబంధించినదిగా ఇండోయూరపియన్ భాషలో నొక అక్షరముండెడిదనియు ఆ సంధిప్రాయమైన అక్షరము ఈ రెండు భాషా వర్గములను మాట్లాడువారి దేశములకును నడుమ అనగా మధ్యాసియా ప్రాంతమున ఉండియుండవలయుననియు మధ్యాసియావాదుల అభిప్రాయము.

పైని తెలిపిన మూడంశములలో నేదియు మధ్యాసియా వాదమును సమర్థింపజాలదు; భారత వాదమును ప్రతిఘటింపజాలదు; మీదుమిక్కిలి రెండంశములు భారతవాదమును సమర్థించునవిగానే యున్నవి. అది యెట్లో చూతము: నలుదేశములకును వలసపోవు వారు అన్నింటికంటె మధ్యస్థలమును చూచుకొని అక్కడనుండి బయలుదేరుట వలసలచరిత్రలలో ఎక్కడను లేదు. ఈ పద్ధతిని ఆర్యులకంటగట్టి చూచుటలో నర్థము లేదు. మూలభాషకు అవెస్తా వేద భాషలు దగ్గరవగుటయే ఆ భాషలను మాట్లాడువారి దేశములకు మూలభాష మాట్లాడెడివారి దేశము సమీపమున నున్నదని చెప్పుటకు వీలు కలుగునేని మూలభాషకు అవెస్తాకంటె వేదభాషయే దగ్గర యగుటచే ఆదిలో ఆర్యులుండిన స్థలము ఇరానుకంటె భారతమునకే దగ్గరగా నుండవలసివచ్చును. కాని మధ్యాసియా అట్లు లేదు. కావున నది ఆర్యుల యాదినివాస మగుటకు వీలులేదు. మీదుమిక్కిలి ఆదినివాసము భారతదేశమో దాని సమీపప్రదేశమో యనవలసివచ్చును. అట్లే శతమ్, కెంటుమ్ విభాగముకూడ మధ్యాసియాను నిరూపింపజాలదు. ఆర్యులు భారతదేశములోనే యుండి యటనుండి వలస వెళ్లగా వెళ్లగా వారి భాష మారుటలో కొన్ని తాలవ్యములు కంఠ్యములుగా మారినవనుకొనుటలో విప్రతిపత్తి లేదు. ఆ దేశముల కార్యులు వలస వెళ్లుటలో శవర్ణము కంఠ్యముగా మార్పుటకు కారణము మార్గమధ్యమునందలి అనార్యుల సంపర్కమే యనియు, ఆ యనార్యులభాషలలో కంఠ్యములు హెచ్చనియు గ్రియర్‌సన్ వంటి భాషావేత్తయే యంగీకరించియున్నాడు.

మాక్సుముల్లర్, మోనియర్ విలియంస్, విట్నీ మున్నగు అతిరథులెందరో మధ్యాసియా వారులై యుండియు, దీనిని తగిన ఉపపత్తులతో సమర్థించుకొనజాలక పోవుటయే యీ సిద్ధాంతము యొక్క దౌర్బల్యము వెల్లడియగుచున్నది.

మధ్యాసియావాదముపై తరువాత రానున్న ఆక్షేపణలను మాక్సుముల్లరు మున్నగువారు ఊహించియుండకపోవచ్చును. నేటికిని ఆ వాదమును సమర్థించువారైనను ఆక్షేపణములకు సమాధానము చెప్పజాలకుండుటచె ఆవాదము నిప్పటికైనను వైజ్ఞానికులు విడువవలసియుండును.

## ఇతరవాదములు

ఋగ్వేదములోని కొన్ని వర్ణనలనుబట్టి ఆర్యులు మిక్కిలి శీతల ప్రదేశములో నుండిరని తెలియుచున్నదనియు, భూగర్భశాస్త్రమును బట్టి 8000 సంవత్సరముల క్రిందట అట్టిప్రదేశము సైబీరియా యనుట సరిపోవుననియు డీ మోర్గన్ అను విద్వాంసుడు వ్రాసినాడు. ఆకాలములో హిమాలయపర్వతముకూడ అట్టి శీతలప్రదేశమేయని భూగర్భశాస్త్రమునుబట్టి తెలియుచున్నది. అట్టిచో హిమాలయమే యార్యులకు మొదటి నివాసమని యంగీకరించుటలో నాక్షేపణయుండజాలదు. వేదములు వెలువడిన స్థలమే ఆవర్ణనమున కనుకూలముగానుండగా నది వెనుకటిస్థితిని తెలుపుచున్నదని భావించుట "అర్కేచేన్మధు విందేత కిమర్థం పర్వతం వ్రజేత్" అను న్యాయమున అసంగతమగును.

పారసీక గ్రంథమైన వెండిడాడ్‌లో నొకచోట పారసీకార్యులు బాక్ట్రియానుండి వచ్చిరని చెప్పబడినది. దీని నాధారముగా చేసికొని కొందరు బాక్ట్రియాయే ఆర్యుల ఆదినివాసమనిరి. ఆర్యులు ఆసియాలోను, యూరపులోను అనేకస్థలములలో అధివాసములను చేసికొనుచు ప్రయాణములను గావించిరి. ప్రతిప్రాంతమునకును వారు ఏదో యొకచోటునుండి చేరుకొనిరి. అట్లు మధ్యనివాసములుగానుండిన వానిలో బాక్ట్రియా యొకటని మాత్రమే వెండిడాడ్ వలన తేలును.

భారతీయార్యులతో కలహించి పారసీకార్యులిచ్చటనుండి పర్షియా జేరిరను విషయము మనకు వెండిడాడ్‌కంటె ప్రాచీనగ్రంథమైన అవెస్తానుండియే తెలియుచున్నందున బాక్ట్రియా ప్రసంగమును పైవిధముగానే అర్థము చేసుకొనవలయును.

క్రీ. పూ. 1800 ప్రాంతమునాటి సిరియా దేశమునందలి శిల్పములలో ప్రాచీనార్యుల చిత్రణము కన్పట్టుచుండుటచె ఆర్యుల ఆది

నివాసము సిరియా ప్రాంతమేయని మేయర్ నిర్ణయించెను. ఇటీవల జరిగిన మొహంజదారో (సింధు), హరప్ప (పంజాబు) లలో జరిగిన త్రవ్వకముల ఫలితముగా అచ్చటి ఆర్యనాగరికత క్రీ. పూ. 3000 నాటిదని సర్ జాన్ మార్షల్ మున్నగు పాశ్చాత్యులే యంగీకరించి యున్నారు. ఆర్యనాగరకతా సూచకముగా ధ్యానస్థుడైన యొక యోగి విగ్రహ మచ్చట లభించినది. అది క్రీ. పూ. 3000 సంవత్సరములనాటిదని పరిశోధకులు నిర్ణయించిరి. ఇట్లే అనేక సాక్ష్యముల వలన నేను భారతీయార్యుల నాగరికత క్రీ. పూ. 3000 నాటికి ఉన్నతస్థితిలోనుండెనని తెలియుచుండగా క్రీ. పూ. 1500 ప్రాంతమున సిరియాలో నుండినవారే తరువాత కొలదికాలమునకు భారతదేశమునకు వచ్చి యిచట నాగరకతను నెలకొల్పుకొని రనుట అసంగతము.

## జలప్రళయము

గత శతాబ్దములో పాశ్చాత్యవిద్వాంసులు భారతీయార్యచరిత్రనుగురించి యెంతనిరంకుశముగా సిద్ధాంతములను లేవదీసిరో తెల్పు మరొక యంశము నిట చూతము. శుక్ల యజుర్వేదమునకు సంబంధించిన శతపథ బ్రాహ్మణములో జలప్రళయమునకు సంబంధించిన గాథ కలదు. ఈ గాథయే మహాభారతములోను భాగవతపురాణములోను కలదు. భూమి జలములో మునిగిపోగా మనువు సృష్టి బీజముల నన్నింటిని ఒక నావలో నుంచుకొని మేరుపర్వతమువద్ద వానిని కాపాడెనని యీ గాథలో కలదు. ఇట్టి కథ యొకటి బేబిలన్ ప్రాంతములో సెమెటిక్ జాతివారిలో హీబ్రూభాషలో రచింపబడి యుండెను. ఈ హీబ్రూ గాథను చూచి వేదములలోను, భాగవతములోను ఈ కథను భారతీయార్యులు వ్రాసికొన్నారని పాశ్చాత్యులు తేలికగా పలికి యీ బేబిలన్ ప్రాంతమునుండి భారతదేశమునకు వలస వెళ్లినవారు కావుననే యీ రీతిగా వారా హీబ్రూ గాథను జ్ఞప్తియందుంచుకొని తమ భాషలో వ్రాసికొనుట సంభవించెనని వారు చెప్పిరి. ఇది యెంత హాస్యాస్పదమో పాశ్చాత్యుల రచనలనుబట్టియే తెలియుచున్నది. ఈ హీబ్రూ గాథ క్రీ. శ. ఒకటి రెండు శతాబ్దములలో బయలుదేరినది. శతపథ బ్రాహ్మణమునకు పాశ్చాత్యులు నిర్ణయించిన కాలము క్రీ. పూ. 1000 సంవత్సరములు. తిలకుగారు నిర్ణయించినకాలము క్రీ. పూ. 2500. సాంప్రదాయికముగా మహాభారతమున కంగీకరింపబడిన కాలము క్రీ. పూ. సుమారు 1000 సంవత్సరముల క్రిందటిదై యున్నది. దీని నంగీకరింపని వారు కూడ హీబ్రూ గాథాకాలముకంటె భారతీయ గాథాకాలము మిక్కిలి ప్రాచీనమని యంగీకరించుటచే బేబిలన్ సిద్ధాంతము కూడ పరాస్తమైనది.

## భారత వాదపటిష్ఠత

భారతేతర దేశవాదము లన్నియు నీ రీతిగా నిస్సారములయి భారత వాదమునకే తుదకు తావిచ్చు స్థితిలోనికి వచ్చినవి. భారత వాదమును నిలబెట్టు కొన్ని స్వతంత్రోపపత్తుల నిపుడు పరికింతము.

ఆధునిక భాషాసాదృశ్య శాస్త్రవేత్తలు తమ ఊహాశక్తితో నిర్మించుకొన్న ఇండో-యూరపియన్ అను మాతృభాషలో పదస్వరము, వాక్యస్వరము అత్యంతము ప్రాముఖ్యము వహించి యున్నవి. ఈ స్వరము లొక్క వేదభాషలో తప్ప మరియే యితర ఇండో-జర్మానిక్ భాషలోను లేవు. ఆదిలో నార్యులు యూరపులోనో యెచటనోయుండి వేలకొలది మైళ్ళు ప్రయాణముచేసి స్వరపరిణామహేతువైన శీతోష్ణస్థితి పరిణామమునకు కూడ లోనై సంవత్సరముల కాలము నిలకడలేక మార్గములో అనార్యభాషల సంపర్కమునకు లోనగుచు భారతదేశమునకు వచ్చియున్నచో పదవాక్యస్వరముల స్వచ్ఛత తప్పక దెబ్బతిని యుండెడిది. స్వరము మిక్కిలి సున్నితమైనది. దూరదేశములలో కష్టప్రయాణము చేసినవారి స్వరము మారకపోవుటయు, ఉన్నచోటనే ఉండిపోయినవారు స్వరమును పోగొట్టుకొనుటయు అసహజము. కావున భారతీయార్యులు పైనుండి వచ్చినవారు కారు.

అంతియేకాక ప్రాచీన ఇండో - యూరపియన్ భాషలో నున్నవని భాషాసాదృశ్య శాస్త్రవేత్తలు చెప్పిన బహుసంఖ్యాకములైన శబ్దరూపములు, వ్యాకరణ నిష్పన్నరూపవిధానములు, కృదంతములలో, సుబంతములలో, తిఙంతములలో నుండదగిన రూపబాహుళ్యము — ఇవి యన్నియు భారతీయార్యుల వేదభాషలో నిలబడినవేకాని మరి యే యూరపు భాషలోకాని అవెస్తాలోకాని నిలబడలేదు. ఇట్లు శబ్దములను కూడ చెక్కు చెదరక నిలబెట్టుకొను అవకాశము దేశద్రిమ్మరులై బహుకష్టములకోర్చి, మార్గమధ్యమున అనార్యుల సంపర్కమును పొందుచు వేలకొలది మైళ్ళు ప్రయాణము చేయువారి కుండదు. కావున భారతదేశమే యార్యుల యాది నివాసము.

యూరపియన్ భాషలలో ధాన్యము, వ్రీహి, యవ, తేనెటీగ, ఆవు, గొఱ్ఱె, గుఱ్ఱము, హంస, కోవెల, ఉన్ని, గుడ్లగూబ, తాబేలు, పాము, తేగ మున్నగు వానికి పేర్లున్నవి. ఇట్టివానిలో కొన్నింటికి కొన్ని దేశములలోను, కొన్నింటికి కొన్ని దేశములలోను పేర్లున్నవి; అన్నింటికిని అన్ని దేశములలోను లేవు. భారతీయార్యభాషలో మాత్రము అన్ని పేర్లును కలవు. ఈ రీతిగా నే యొక ఇండో జర్మానిక్ భాషయు మిగిలిన అన్ని భాషలకు ప్రాతినిధ్యము వహింపజాలకుండగా సంస్కృతము మాత్రము ఎల్లభాషలకును ప్రాతినిధ్యము వహించుచుండుటచే నా భాషలకన్నింటికి సంస్కృతము మాతృక యనియు, భారతదేశమునుండియే యార్యు లాయా దేశములకు భిన్నభిన్న కాలములలో వలస వెళ్లిరనియు స్పష్టమగుచున్నది.

విపులమైన వేదవాఙ్మయములో ఆర్యులకు మరొక చోట పూర్వనివాస మొకటి యుండెనను సూచన యిసుమంతయు లేదు. పారశీల గ్రంథములలో అనేక స్థలములలో తమ పూర్వనివాస పరామర్శ కలదు.

యూరపులో నాగరకత ప్రారంభమైనప్పటినుండియు కూడ భారతీయార్య నాగరకతా ప్రాభవ మక్కడ కన్పట్టుచున్నది. ఆసియాలోను, రెండు ఖండముల సంధిలోను కూడ నది ప్రస్ఫుటముగా గోచరించుచున్నది. నేటికి 3500 సంవత్సరముల క్రిందట బాబిలన్ ప్రాంతములో లిఖింపబడిన యొక శాసనము పరిశోధకులకులభించినది. అందు మిత్రవరుణ, నాసత్యాది దేవతలు సాక్షులుగా పేర్కొన

బడినారు. ఆర్యులు పైనుండి భారతదేశమునకు రాలేదు సరికదా యీయా దేశములకు నిక్కడి విజ్ఞానమును, సంస్కృతిని వారు తీసికొని వెళ్లుటయు సంభవించెను.

ఇండో-జర్మానిక్ కుటుంబమునకు చెందిన భాషలకు తల్లి భాష యెక్కడ మాట్లాడబడుచుండెనో యక్కడ నుండియే యార్యులు విడిపోయి యాయా దేశమునకు పోయినారని యందరు నంగీకరించుచున్నారు. ఆ తల్లిభాష వైదికభాషయే యగునేని భారతదేశమునుండియే యార్యులు పై దేశముల కేగినారని తెలియగలదు. ఫైలాలజీయను భాషాశాస్త్రమునకు మూలపురుషుడైన ఆడెలంగ్ పండితుడు ఇండోయూరోపియన్ అనునది వైదికభాషయే కాని మరొకటి కాదని కంఠోక్తిగా చెప్పినాడు. భారతదేశమే ఆర్యుల ఆదినివాసమనియు ఆదిలో విశేషముగా కాశ్మీరులోనే యార్యులు చిరకాలముండి తరువాత భారతదేశములోని యితర ప్రాంతములకు వ్యాపించి నారనియు నాతడు భావించినాడు. మిర యనగా వైదికభాషలో సరస్సు. కశ్యపుని పేరనుండిన సరస్సు కాశ్యపసరస్సు. ఆ సమీప ప్రదేశమే కాశ్మీరమని ఆడెలంగ్, లక్ష్మీధరకల్లా మున్నగు విద్వాంసు లభిప్రాయపడిరి.

కాశ్యపమిర యొకప్పుడు పొంగినదనియు సమీపమందలి జనులు ఇతర ప్రదేశములకు పోయిరనియు నొక కథ విపులముగా ప్రాచీన కాలములోనే సంస్కృతభాషలో రచింపబడిన నీలమత మను గ్రంథములో తెలుపబడినది. భారతదేశమునుండి యార్యులు ఇతర దేశములకు వెళ్లుటకు కారణములలో నిదియొకటియై యుండవచ్చును.

భారతీయార్య భాష యితరార్య భాషలకు తల్లి యని చెప్పుట లోని విశేష మెట్టిదో చూచిన చో కాని భారతదేశమునుండి యార్యులు పై దేశముల కేగినారను భావము రూఢముగా గ్రహించుట శక్యము కాదు; తల్లి పోలికలు కుమార్తె లందరియందును పంచి పెట్టబడి యుండునట్లు భారతీయార్యభాషాలక్షణములు యూరపియన్ భాష లన్నింటియందును పంచిపెట్టబడియున్నవి. ఉదాహరణమునకు యూరపు భాషలలోని గ్రహదేవతానామములన్నియు పరస్పర సాదృశ్యము కలదిగా గోచరింపవు. కాని సంస్కృత భాషతో వీని నన్నింటిని అతుకవచ్చును. లాటిన్ మార్స్, గ్రీక్ యురేనస్. స్లావోనిక్ పెర్కూనా; ట్యూటానిక్ మనస్, ఐరేనియన్ యిమ—ఈ పదములు వేరువేరుగా ఆయాభాషలకే చెందినవై యితర భాషా పదసాదృశ్యము లేకయున్నవి. కాని యన్నియు సంస్కృతములో కలియుచున్నవి. మరుత్, వరుణ, పర్జన్య, మను, యమశబ్దములతో క్రమముగా నివి జన్యజనక సంబంధమును గల్గియున్నవి. ఈ రీతిగా భారతీయార్యభాషనుండియే అన్ని ఇండోయూరపియన్ భాషలును బయలువెడలినట్లు భారతదేశమునుండియే యార్యులు ప్రపంచములోని వివిధ ప్రాంతములకు వెడలిరనియు, దీనిని తలక్రిందులు చేసి యార్యులు పైనుండి యిటకు వచ్చిరనుట సమర్థింపదగినది కాదనియు నానాటికి జరుగుచున్న గవేషణమువలన విద్వాంసులకు తెలియుచున్నది.

బహుక్లిష్టమైన యీ సమస్య నింత చిన్నవ్యాసములో ప్రదర్శించుటలో ముఖ్యాంశములనే యెన్నింటినో వదల వలసి వచ్చుచున్నది. కాని దీని ప్రాముఖ్యమునుబట్టి దిక్ప్రదర్శనముగా నైనను నిట్లు నిరూపింపవలసి వచ్చినది.



# కాలచక్రం నిలిచింది

**బుచ్చిబాబు**

ముకుందాన్ని తెంటుకూరు పిచ్చాసుపత్రిలో పెట్టారన్న వార్త విన్నప్పుడు కాలచక్రం నిలిచిపోయినట్లనిపించింది. ఆరుగురు అన్నదమ్ముల్లో నాలుగోవాడు ముకుందం. నలభైయేళ్ళ నడివయస్కుడు. చదువుకున్నవాడు. వత్తితవల్ల సంక్రమించిన రెండు మేడలూ, వొక తోట, యాభైఎకరాల భూమీ గల స్థితిపరుడు. మామగారు జిల్లా కలెక్టరు. జ్ఞాపకం వొచ్చినప్పుడల్లా కాలక్షేపానికి బి. ఎల్. పరీక్షకి కడుతుంటాడుగాని, ఉద్యోగం చేసే అవసరంగాని, అభిలాషగాని అతనికి లేవు. అన్నదమ్ములందరూ మంచి పదవుల్లో వున్నారు. కుటుంబంలో ఎవరికీ పిచ్చెత్తినట్లు లేదు. మనోవ్యాకులత చీకూ చింతా లేకుండా హాయిగా జీవితం గడిచిపోతున్నప్పుడు, ముకుందం పిచ్చాసుపత్రిలో ఎందుకు గడపవల్సి వొచ్చిందో నా కర్థం కాలేదు. నాకు పిచ్చెత్తినట్లయింది. కాలచక్రం కదలనట్లనిపించింది. కాలచక్రం కవిమెళకువ. రచనా శిల్పంలో అదొక నిసుకు. నా గొడవ ఎవరిక్కావాలి?

రెండవ ప్రపంచ సంగ్రామం ప్రారంభమైందన్న వార్త తెలిసినప్పుడూ, మహాత్ముడు పరమపదించాడన్న వార్త విన్నప్పుడూ వొక క్షణం పాటు కాలచక్రం నిలిచిపోయినట్లనిపించింది. మళ్లీ ముకుందం పిచ్చివిషయం తెలిసినప్పుడు అట్లాంటి అనుభవం కలిగింది. వైమానికుడు సహారా ఎడారనుకుని నేలమీదకి దిగి అడుగుపెట్టగానే ఎటుచూసినా మంచే. జలపాతం వొంపుదగ్గర నిలిచిపోయింది. ఇట్లాంటివి జరిగినప్పుడు భ్రాంతికి లోబడతాం. గుండె కొట్టుకోడంలో వొక లయ, క్రమం వుంటాయిట. మధ్యలో వొకసారి కొట్టుకోడం మానేసి—వొక 'బీట్' విడిచేసి, తరవాత మళ్ళా మామూలుగా గుండె కొట్టుకోవడం అసంభవం కాదని వైద్యశాస్త్రజ్ఞులు చెబుతున్నారు. మధ్యనున్న స్థలంగుండా ప్రయాణం చెయ్యకుండానే, వొక పదార్థం వొకచోటునుండి మరోచోటుకి చేరుకోవడం సంభవమేనని భౌతిక శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. ఇట్లాంటివి సంభవమైనప్పుడు ముకుందానికి పిచ్చెత్తడం మాత్రం ఎందుకు సంభవం కాకూడదనుకుని సమాధానపడినా, ఆ అనుభూతి అన్వేషణకి నన్ను పురిగొల్పింది. వ్రాస్తే, ముకుందం వ్యక్తిత్వం విశదపడుతుందేమో నన్న ఆశతో యీ రచనకి వుపక్రమించాను.

ముకుందం అనేకమంది సామాన్యవ్యక్తులలో వొకడైతే అతన్నిగురించి నేను పట్టించుకోను. ఓరకంగా అతను అపూర్వ వ్యక్తి. ఆధునిక యుగంలో ఆనందాన్ని సాధించగల వ్యక్తులు అరుదు. నాతోటి మానవులలో 'నా జీవితం హాయిగా, సంతోషంగా గడిచి పోతోంది' అని అన్నవారు నాకు తటస్థపడలేదు. మనలో ప్రతివారికీ ఏదో లోటు. ఆరోగ్యం వుండదు, అవకాశాలుండవు. డబ్బుండదు. ప్రేమకొరక్క చెడిపోతాం. తిండికోసం పనిచేసి పొందిన తీరికలో యింకా పనిచేస్తాం. ఏకాంతం లేదు. ఇల్లొక జైలు. ఇందులోంచి తప్పించుకుని గుంపులో కలిసిపోతాం. మరో వ్యక్తి సమక్షంలో గాని మనం సజీవులమై వున్న విషయం బుజువు కాదు. కుళ్లు, కృత్రిమత, జాడ్యం, దాస్యం, నిద్రలో కూడా విరామంలేని మనోవ్యాకులత—యీ మహాసంద్రగోళంలో పరిభ్రమిస్తూవున్న యీ వ్యక్తులందరికీ ఎందుకు పిచ్చెత్తలేదా అన్న సంశయం వొస్తుంది. పిచ్చెత్తకుండా, మామూలుగా వున్నవారుంటే కదా. పిచ్చిముకుందాన్ని కొలిచి విలువకట్టడానికి!

ఆనందమయజీవి ముకుందం. ఆ విధంగా అతను అపూర్వమైన వ్యక్తి. మరో విశేషం వుంది. ముకుందంలాంటి వ్యక్తులు మన సంఘంలో చాలామంది వున్నారు. ఆ రకం మనస్తత్వం గలవారికి అతను ప్రతినిధి. ఎప్పుడో వొకప్పుడు ముకుందాన్ని, అతని తెగ వారిని, కలుసుకోక తప్పదు. వారిని మీరు ప్రేమించవొచ్చు; ద్వేషించవొచ్చు. కాని వారి బారినుండి తప్పించుకు పారిపోలేరు. ఆఫీసుల్లో, క్లబ్బుల్లో, పార్కుల్లో, సినిమాహాలుల్లో, దుకాణాలలో, రైలుప్రయాణంలో, ఎక్కడో అక్కడ అతన్ని మీరు కలుసుకునే వుంటారు. ఎవరతను? అతనొక మాటకారి. వాసుకు రాయుడు. అతను మాట్లాడటం మొదలుపెడితే, మరి ఆగడు; ఎవరూ అతన్ని ఆపలేరు. పిడుగు పైన బడినప్పుడు ఎవరు తప్పించుకోగలరు? జలపాతాన్ని అరచేతితో ఆపడం ఎంత సులువో అతని నాలుక పరిభ్రమణాన్ని ఆపడం అంత సులువు. ఈ పాటికి మీరు గ్రహించేవుంటారు. ఆంగ్లంలో అతన్ని 'బోర్' అంటారు. ఎన్నో హాస్యపత్రికలు, ఎందరో హాస్యరచయితలు అతని వూసులు చెప్పుకుని రోజులు గడుపుకుంటున్నారు.

అతని గాథలు వేనోళ్ల వింటాం. అతనొక పురాణపురుషుడు.

ముకుందం మంత్రజాలంలో చిక్కుకుని, గిలగిల తన్నుకుని, బైటపడిన వాళ్లల్లో, నే వొకణ్ణి. అతన్ని ద్వేషించాను; విమర్శించాను; నిర్మూలం చెయ్యాలని సంకల్పించాను; వెక్కిరించాను, హేళన చేశాను. జాలిపడ్డాను; చివరికి ప్రేమించాను. అతను లేని యీ ప్రపంచానికి నా కర్థం కనబడలేదు. అతన్ని పిచ్చాసుపత్రిలో పెట్టిన యీ ప్రపంచానికి పిచ్చి.

ఈ రకంగా ప్రపంచంపై కోపించి నేను సాధించిందేదీ లేదు. అందుచేత తమాయించుకుని ముకుందంతో నా పరిచయాన్ని ఉద్రేకరహితమైన దృక్పథంతో స్మరిస్తాను.

ముకుందాన్ని గురించి కుతూహలపడటానికి ఏ వేవో చాలా కారణాలు చెప్పాను కాని అసలు విషయం వొదిలేశాను. అతనితో

దూరపుబంధుత్వం వుంది. ఆవిడ తాలూకు దూరపుచుట్టం—నా తాలూకే అని చెప్పుకోడంలో చిన్నతనం వుందని కాదుస్మండి– అసలు విషయం అది.

ఆదివారం ఉదయం తొమ్మిదైంది.

వీధిలోకని తైలుజేరి పదిమెట్లు దిగాను. పదకొండో మెట్టు మీద ముకుందం ప్రత్యక్షంగా తటస్థపడ్డాడు. తను ఫలానా అని పరిచయం చేసుకున్నాడు.

"ఓహో అల్లాగా—మిమ్మల్ని గురించి వినడమే కాని ఎప్పుడూ చూడలేదు—రండి, రండి, లోపలి కెళదాం." అని ఆహ్వానించాను. భుజంమీద చెయ్యేసి నన్ను నిలిపేశాడు.

"నన్ను గురించి విన్నానన్న మాట. చూసింతర్వాత, 'ఇతే మిత్రా ఎందుకు చూశాను?' అని అనిపించలేదుకదా! ఏ ముసిలాడినో, ముక్కాడినో అనుకున్నారా? అమ్మాయి చెప్పిందేమో లెండి. నే నంత పెద్దవాణ్ణి—అంటే ముసలివాణ్ణి—కానండోయ్. అసలు ముసిలాళ్లు అంటూవుండరని నా దృఢవిశ్వాసం. ప్రతివాడికీ తనకున్న వయస్సుకి పదిహేనేళ్లు తర్వాతేగాని వార్ధక్యం అంటూ వుండదు. నాకు నలభై అయితే, యాభైఅయితేగాని వాళ్లందరూ ముసిలాళ్లన్న మాట. నా కరవై అయితే, డెభ్భై అయితేగాని వాళ్లందరూ వృద్ధులన్నమాట. అదీ 'థీరీ.' మీకు ముప్పై-అవునా? మీ వుద్దేశం, నలభైఅయిదు దాటిన వాళ్లంతా ముసిలాళ్లు. నేనిక్కడి కెందుకొచ్చానని మీ ప్రశ్న— మీకు తెలీదేమో — అమ్మాయి చెప్పలేదేమో—ఇక్కడ బ్రిడ్జి మాచస్ వున్నాయి. అందుకొచ్చాను. నేను బ్రిడ్జి ఆటగాణ్ణిలెండి. మీకొచ్చా? ఆంధ్రలో ఎక్కడ టూర్నమెంటయినా, మావాళ్ళు నన్ను పంపిస్తూవుంటారు, యింకెవరూ లేనట్లు. ఏంచేస్తాం. పెద్దలు మనమీద వో భారం పడేసింతర్వాత. మనం నిర్వర్తించక తప్పదు. క్రితంనెల బెంగుళూరులో రన్నరప్—పేపర్లో చూశారుగా. అంటే బెంగుళూరు లోకల్ పత్రికల్లో పడ్డాయిటలెండి—ఇక్కడ మన పత్రికలు యూస్‌లెస్. విశ్వవుద్దేశంలో బ్రిడ్జి వొక ఆటేగాదు. నేనే ఇంగ్లండ్‌లో పుట్టివుంటే, యీ నా ఆటకి, పార్లమెంట్ మెంబర్‌గా చేసెయ్యరూ! మావాళ్లు వొచ్చేయేడు ఇంగ్లండు పంపుతామంటున్నారు నన్ను—భారం పడింతర్వాత..."

"...లోపలి కెడదాం..."

"ఓడలోనే వెడతాననుకోండి. నాకే ఎయిర్ ట్రావెల్ సుతరామూ యిష్టంలేదు స్మాండి. ఎందుకంటారా. విల్లువ్రాసిగాని విమానం ఎక్కడం మూర్ఖత్వం. విమానంఎక్కి నేను క్షేమంగా గమ్యస్థానం చేరుకుంటాను అని ధీమాగా చెప్పగల విమానయాత్రికుణ్ణి యీ జగత్తులో మీరు నాకు చూపగలరా స్వామీ! నిరుడు బిల్లియర్డ్స్ మాచెస్‌కి విమానంలో సిమ్లా ప్రయాణం తగిలింది. ఎల్లాగో తప్పించుకున్నా వెళ్ళకుండా. ఇంతకీ మరో ఏడాదిపాటు నూకలు మనకీ భూ ప్రపంచంమీద వ్రాసిపెట్టాడు పరమాత్మ. ఎందుకు వెళ్ళ లేదని సిమ్లా—అమ్మాయి చెప్పే వుంటుందేమో లెండి..."

"రండి—కూర్చుని, కాఫీపుచ్చుకుని సావకాశంగా మాట్లాడుకుందాం."

అని మెట్లెక్కాను. ఆయన అరో మెట్టుమీద నిలిచి పోయాడు.

"నాకు కాఫీఅనీ, టీ అనీ పట్టింపులు లేవు. ఏదైనా పుచ్చుకుంటాను. అసలు లేకపోయినా, అయ్యో లేకపోయిందే అని ఇదవను. ఒకసారి చెరుకుపల్లి జమీందారుగారు డిన్నరిచ్చారు. మజ్జిగనుకుని కాఫీ వొడ్డించారు."

నేను లోపలికెళ్లి ఆవిడ చెవిని యీ వార్తపడేసి, కుర్చీలు బల్లలు కొంత సర్ది యివతలికొచ్చాను. ఆయన మూడో మెట్టుమీద నిలబడి మాట్లాడుతున్నాడు— మెట్లకొంపల్ని గురించి.

"తంజావూర్లో వో చెట్టియార్ యింటికి వెళ్ళాం..."

దీర్ఘోపన్యాసానికి తావివ్వకుండా, ఎక్కడికక్కడ విల దొక్కడం మంచిదనుకొని అడ్డప్రశ్నల కుపక్రమించాను.

"తంజావూరా? ఎవరెవరెళ్లారు?"

"మామగారితో — కోయంబత్తూరునుండి కార్లో వెళ్లాం, ఆ చెట్టియారింటికి నాలుగువోట్ల మెట్లున్నాయి. మధ్యహాల్లో మామగారూ నేనూ విడిపోయాం. నేను వరండా మెట్లమీదుగా వెళ్లాను. వాళ్లు ముందు అరుగులమీద మెట్లగుండా వెళ్లినట్లున్నారు. ఈ రెండు మెట్లవరుసలూ పైన బాల్కనీలో కలిసినట్లున్నాయి— టపీమని ఆ చెట్టియారు నేను గుద్దుకున్నాం."—నవ్వడం సాగించాడు.

చెట్టియార్ ఘట్టం ముగిసినందుకు నిట్టూర్చాను. ఇంతలో ఆవిడా లోపల్నుంచి వొచ్చింది. చిరునవ్వుతో 'ఎప్పుడు రాక డం?' అని అడిగింది.

ఇదొక అర్థంలేని ప్రశ్న.

"సామా న్లేవీ?"

అంత బొత్తుగా అర్థంలేని ప్రశ్న కాదేమో. "తెకొచ్చి నాలుగు రోజులైంది—సరిగ్గా చెప్పాలంటే మూడున్నర రోజులు. క్లబ్బుగదుల్లో విడిది. టెన్నిస్ మాచెస్ అవుతున్నాయిగా. మా పిన మామగారు పెద్ద టెన్నిస్ ఆటగాడులే—నాతో ఆడితే, వో సెట్టుకి రెండు గేములుకూడా గెలవలేడు—అయినా మామగార్ల ఆటమెచ్చుకోడంతప్ప యీ అల్లుళ్లు ఏం చేయగలరు? మీరు టెన్నిస్ ఆడ తారా?"

"అబ్బే లేదండి"

"సాయంత్రం ఉభయులూ రండి, నా ఆటకూడా చూద్దురు గాని. మొన్న విజయనగరంలో మన వాళ్లంతా వొచ్చారు. నాకు తెలుసులే ఎందుకు నవ్వుతున్నావో. చిన్నప్పుడు ఆటలూ పాటలూ ఏమీరావు, యీ ఆట ఎల్లా గొచ్చిందా అని. ఇల్వపురం జమిందారు తమ్ముడూ నేను స్నేహితులం. వాళ్లు జెర్మనీనుంచి వో కోర్ట్‌ని తెప్పించారు. రాత్రుళ్లు గ్యాస్ లైట్లు పెట్టుకుని ఆడేవాళ్లం."

"కాఫీ పుచ్చుగోండి..."—కొంత చప్పరించాడు.

"సామాన్లు క్లబ్బులో పెట్టాను. మీరిక్కడున్నారని మొన్న తెలిసింది. పనే చూసి పోదామని. చుట్టాల్ని చూడకపోతే మా ఆవిడ వూరుకోదు. మామరదలు వోసారి నెల్లూర్లో వొక స్నేహితురాలింటి

దగ్గర తిరిగిందిట. కిందటేడు నరసయ్యనాయుడుగారి చైర్మన్ ఎలక్షన్ల సందర్భంలో వెళ్లారట్లాగు. మరదలుపిల్ల అక్కడుందని నాకేం తెలుసు? ఆమెను చూడకుండా వొచ్చినందుకు మాఆవిడ వారం రోజులు నాతో మాట్లాడలేదు— అంటే నేయింట్లో ఆవిడతో వున్న, పదినిముషాలూనూ. నాకు ఏకాంతంగా యింట్లో వుండే ప్రాప్తిలేదంటే నమ్మండి. పనిలేదు తీరుబడీ లేదన్న సామ్యంగా వుంది."

"మరదలుకి పెండ్లిసంబంధాలు చూస్తున్నారా?" అని అడిగింది, ఆవిడ.

"ఆవిడ పెళ్ళి చేసుకుంటుందీ? నాకు నమ్మకంలేదు. ఆయన కట్నం దమ్మిడీ యివ్వనంటాడు. ఆ గడింపంతా ఏం చేస్తాడో, కర్మ! పిసినిగొట్టు కాదు. అదోక ఆదర్శంట. మరి నాకెల్లాయిచ్చాడు— కటికసొమ్ము పదివేలు. డిన్నర్కి నాలుగు వేలయిందిట—గవర్నర్ గారి అంతరంగిక కార్యదర్శి అతిథిగా విచ్చేశాడులే; బాణ సంచాకి వెయ్యి,వూరేగింపు విమానానికి ఐదొందలు—ఆరోజుల్లో— ఇప్పుడైతే, ఖర్చంతా వొయ్యాతైవేలవును. మాకొచ్చిన పెళ్లి బహుమతులు. కో ఐదారు వేలుంటాయి. కట్నాలద్వారా, సగం కర్చు రాబట్టాడనుకో — నువ్వొచ్చావుగా — నీకింకా అప్పుడికి పెళ్ళి కాలేదుగా. కట్నాలు పుచ్చుగోడం మనబోటి చదువుకున్న వాళ్లకి పొరబాటే—కాదన్ను. కాని సంఘంలో కోఆచారం వున్నతర్వాత పాటించక తప్పుతుందా? సరే-సరోజకి ఎంత సేపూ, చదువూ, సంగీతం-సినిమాలు, పిక్చర్లు పిక్నిక్లు, పెళ్ళి చేసుకోవాలన్న వుద్దేశమే లేదు. ఏమాటకామాటే చెప్పాలి-మా ఆవిడ ఎంత చదువుకున్నదైనా, పూర్వకాలపు మనిషే అనాలి. కొంతంత దైవభక్తి,పూజ పునస్కారం, యాత్ర, కొలువు—కలెక్టర్ గారు వారి హయాంలో చేసిన దుండగాలు, దురంతాలకి పరిహారార్థం పురాణ కాలక్షేపం, గీతాపారాయణం ఆదివారం జరిపించి, పండితుల్ని సత్కరించే ఆచారం వుండబట్టే, అమ్మాయికి యిదంతా అబ్బిం దనుకో. మనం తప్పించుకున్నాం. సరోజ కివి గిట్టవు. నాకుమల్లే. అందుకనే లోలోపల నేనంటే యిష్టం అనుకుంటా."

"నువ్వు వంట విషయం చూడు" అన్నాను ఆవిడ నుద్దేశించి.

"నాకోసం వంట చెయ్యకండి. క్లబ్బులో డిన్నరుంది. కబుర్లు చెప్పుకుందాం. మీరు వొంటకెవర్నైనా పెట్టుగోండి. లేకపోతే ఇదే చిక్కు. ఇంటికెవరేనా వొస్తే, వారితో మాట్లాడే అవకాశం వుండదు. ఓసారి సేలం సబ్ కలెక్టర్-మళయాళీ-భార్యా సమేతంగా గుంటూరొచ్చాడు. అత్తగారు వొంటకనీ, అమ్మాయి కాఫీకనీ లోపలి కెళ్ళారు, పనిమనిషి పేరమ్మని వొప్పచెప్పి! ఆవిడకి కాలక్షేపం ఎల్లా జరుగుతుంది. పేరమ్మ ఏం మాట్లాడుతుంది? బువ్వమ్మలా గుడ్లప్పగించి అల్లా నిలబడిమాన్తా నిలబడింది. పేరమ్మ ఫేమస్గా వుంటుందిలే-ఇదుగో యీ సినిమాలొచ్చిం తర్వాత అది మరీ సినిమా స్టార్లా తయారైంది. మా ఆవిడా, సరోజ యిచ్చిన జాకెట్లే వుంటాయి వో డజను. వీళ్లకి సైజు కుదరక దానికి బహూకరిస్తుంటారులే. దాన్ని చూసి సరోజ అనుకుంది కాబోలు-ఇంగ్లీషులో సంభాషణ సాగించింది ఆవిడ. ఇదేమో నవ్విందట. మళ్ళా ఆవిడ ఇంగ్లీషులో ఏదో అడిగిందిట. పేరమ్మ లోపలికెళ్ళి చీపురు తీసుకొచ్చిందిట వూడుద్దామనుకుని. ఆవిడ కోపంతో చరచరా నడుచుకుంటూ బైట కెళ్ళి, మామగారి డ్రైవర్ని పిలిపించి, కార్లో ట్రావెలర్స్ బంగళా కెళ్ళిపోవడం-మామగారు పేరమ్మని మానిపిస్తానని బెదిరించడం, అది లబోదిబోమని ఏడవడం- నేవెళ్ళి సర్దుబాటుచేసి, వో వంటలక్కని కుదర్చడం, వొచ్చిన అతిథుల్ని ఎల్లా వినోదపరచాలో తెలియచెప్పడం-వారి కుటుంబ చరిత్రలో వొక అపూర్వఘట్టం..."

"కాసేపు నే అల్లా వెళ్ళొస్తాను మీరు పత్రిక చూస్తూ వుండండి." అన్నాను. ప్రశ్నార్థకంగా చూశాడు ముకుందం.

"సినిమాకా?"

ఎట్లా కనుక్కున్నాడో చిత్రం! అసలు నిజంగా సినిమాకనే బైలుదేరాను. కొంతంత అబద్ధం ఆడాను.

"డాక్టర్ మాధవయ్య గారింట్లోంచి టెలిఫోన్ చేసి, రాత్రికి ఏం ఆటాడుతున్నారో కనుక్కొద్దామని బైలుదేరాను." అన్నాను.

"అయినా, అమ్మాయిలేకుండా మీరొక్కరూ సినిమాకెళ్లడం ధావ్యమా చెప్పండి? మా కళ్యాణి వూరుకోదు. నేను వాళ్ళింట్లో వుంటే ఎక్కడికెళ్లినా ఇద్దరం కలిసెళ్ళాల్సిందే..."

"ఆమెను కూడా యిప్పుడు మీతో తీసుకురాలేకేం?" అన్నాను.

"ఆవిడకి ఆటలుచూడ్డం అంటే విసుగు. లెక్చర్లు, క్లబ్బులు, పార్టీలు, ఇవేవీగిట్టవు. నాకివి లేకపోతే గడవదు. మళ్ళా సరోజ అల్లాకాదు..."

ఆయనింకా మాట్లాడుతూనేవున్నాడు. నేను బైటికినడిచాను. వెడుతూ మాపనివాడు ముసలయ్యని అయ్యగారికి ఏం కావాలో కనుక్కుంటూ వుండమని చెప్పి వెళ్ళాను. ఓగంటలో తిరిగొచ్చాను. ఆయన ముసలయ్యతో మాట్లాడుతున్నాడు. ముసలయ్యవింటూన్నట్లు లేదు. గోడకిజేర్లబడి కునికిపాట్లు పడుతున్నాడు.

"పోరంబోకు పొలం కో ఎకరం నాకప్పచెప్పు. రెండేళ్ళల్లో బంగారం పండిస్తాను. మామాగారి దో రెండెకరం బీడుంది. జిల్లా వ్యవసాయాధికారి నాస్నేహితుడులే. అతని సలహామీద కావల్సిన ఎరువు అదీ వేశాను. ఇవాళ పదివేలిచ్చి కళ్లుమూసుకు కొంటామని ఎగడుతున్నారు. నువ్వురాత్రి పొలం కాడుంటావా?"

"మాట్లాడవేం ముసలయ్యా—నిన్నే అయ్యగారేదో అడుగు తున్నారు."

"అంతే వెగండి." అని దూరంగావెళ్లి చుట్టుముట్టించే తతంగం జరుపుతున్నాడు.

"ముసలయ్య మా మామగారి పొలంకాపు. కొత్త పాయంగా వుంటాడు. ఇప్పుడు పొలంపనులేమీ లేవని, ఇక్కడికి పంపించారు" అన్నాను.

"పొలంలో పామునిమాపి జరుగుతునే ఘటంలా వున్నాడు. పామునిపట్టడం నేరిస్తేగాని, ఎవరికీ పొలంలో పనిచేసే అధికారం

సుఖమైన కాన్పు
ఆరోగ్యమైన
ముద్దులొల్కు బిడ్డలు
కావలసిన

# "శుభో"

కంటె మంచి టానిక్ లేదు. మధురముగనుండి,
అన్ని తత్వములకు సరిపడును.

సీసా రూ. 4/-     మూడుసీసాలపై పోస్టేజి ఉచితం.

ఎన్నవనెల గర్భమో తెలుపుచూ ఆర్డరివ్వండి.



ఆంధ్ర బ్రాంచి:

## సి. వి. ఆర్. కార్పొరేషన్

పోస్టుబాక్సు-82, విజయవాడ.

# నారసింహ లేహ్యము




బంగారు చేర్చబడినది: ఇది మిక్కిలి వీర్యవృద్ధిని, బలమును, కలిగించుటలో అత్యుత్తమమైనది. మేహములు, నిర్బలత, విస్మృతుల, శుక్లనష్టము, మూత్రము వెంట శుక్లము పడుట, అతిమూత్రము, మొదలగువాటిని ఖండించి బలమును, కాంతిని, వీర్యశక్తిని కలిగించుటలో అమోఘమైనది. 2 డబ్బీలు చాలును. 20 తులముల డబ్బి రు. 3-4-0.

వ.రా:—ప్రతి 20 తులముల లేహ్యమునకున్నూ 8/4 తులం లోహభస్మ సింధూరముగాని, వంగభస్మ సింధూరము గాని కలిపి సేవించిన సమస్త రోగములు శీఘ్రముగా మారించుటలో సందియము లేదు.

వాతప్రకృతికి:-లోహభస్మం ¼ తులం రు. 3-0-0

ఉష్ణప్రకృతికి:-వంగభస్మం ¼ తులం రు. 2-4-0

పోస్టేజి ప్రత్యేకము. అన్ని ఔషధములతో జవాబు కార్డు వ్రాయుట ఉచితము.

## పి. సి. ఏ. అండ్ కంపెనీ

ఆయుర్వేద సమాజము.

పెరిదేపి : : నెల్లూరుజిల్లా.



మీరు
మేయర్స్ పంపు ఎచ్చటవాడిన
అచ్చట నీరు ఎల్లప్పుడు
ధారాళముగా వచ్చును.

మీరు మయర్స్ ఆటోమేటిక్ పంపు వాడినచో ఉత్పత్తి స్థానమునుండి మీకు నీరు ఆగకుండా ధారాళముగా రాగలదు. సునాయాసముగను, చాలకాలమువరకు ఉండి, సకల సౌకర్యముల చేకూర్చిన మీ యింటిని ఆరోగ్యవంతముగ చేయును. మయర్స్ పంపును కొని, మీ యింటిని సకల వద్దతిలో ఉంచుకొనుడు.

# MYERS AUTOMATIC ELECTRIC PUMPS



## వాటర్ సప్లయి స్పెషలిస్ట్స్

45, తంబుచెట్టి వీధి, మద్రాసు - 1.

లేదంటాను. ఓసారి రాత్రులపూటలో సాయంత్రం వేళల్లోంచి వొస్తున్నాం. కాలికేదో మెత్తగా తగిలింది. నేను గమనించలా.

రాత్రి పెళ్ళింట్లో భోజనాలకి కూర్చున్నాం. రెంయ్యిమని నా విస్తరిముందుగా వొచ్చి పడగెత్తింది. అందరూ అదిరిపోయ్యారు. మీరెవ్వరు భయపడకండి నాకోసం వొచ్చింది అన్నాను. కిమిన్నాస్తి. కరణంగారి భుజంపైన సిల్కు కండువాతీసి చటుక్కున గిరవాటెట్టా. దాన్ని కరిచేసి అందులో ఇరుక్కుపోయి, లుంగ చుట్టుకుపోయింది. మరోసారి హైలకరం రాజాగారింట్లో..."

'విను ముసలయ్యా!' అని నే కేకేసి, స్నానాని కెళ్ళాను. వొచ్చాను. ఆయన ముసలయ్యతో ఏదో చెప్పుకుంటూ పోతున్నాడు. పులి వేట విషయం.

"చెప్పండి, చెప్పండి" అంటూ కుర్చీలో కూర్చుని పత్రిక చదువుకుంటున్నాను.

"నాకెప్పట్నుంచో పులిని దగ్గరగా ఓ ఫోటో తియ్యాలని మనసు. అయ్యప్పురం జమీందారు బావగారొకాయన వొచ్చాడు. నలుగురైదుగురం అడవిలోకి ప్రయాణం కట్టాం. మేకని ఎరగాకట్టి చెట్టెక్కాం.

రెండుగంటలవరకూ నిశ్శబ్దం. తరవాత కోతులు కిచ కిచలాడాయి...దూరంగా గర్జింపు వినబడింది. నే కూర్చున్న చోటునుండి మేక కనబడటంలేదు. ఎప్పుడొచ్చిందో ఎప్పుడెళ్ళిందో, మేక అరుపు నిలిచిపోయింది. మరోగంటకి దిగి మెల్లిగా నడచిపోయ్యాం. ఒక మైలు వెళ్ళింతర్వాత మేక కళేబరంలో తినగా మిగిలిన భాగాలు ఆకులతో కప్పబడివున్నాయి. దానిచుట్టూ వొక వల అల్లి, అల్లిక తాళ్ళని కెమెరా క్లిక్‌కి ముడేసి, కెమెరా దూరంగా పొదలో వుంచాం. పులివొస్తుంది. వలమీద కాలుపెడుతుంది. క్లిక్‌మంటుంది. ఫోటో పడిపోతుంది. అదీ ఏర్పాటు. ఇంతలో ఏదో చప్పుడైంది. నాతో వున్నవాళ్ళు చెట్టెక్కారు. వెనక్కి తిరిగితిని కదా, అర ఫర్లాంగుదూరంలో నాకేసి వొస్తోంది పెద్దపులి..."

"భోజనానికి లేవండి..."

అంది మా ఆవిడ. ముకుందం కథలో లీనమైపోయి, వినిపించుకున్నట్టు లేదు.

"అప్పుడేం చేశానని మీ వూహ? కదలకుండా, వూపిరి బిగబట్టి, పులి కళ్ళల్లోకి చూస్తూ స్తంభించి పోయ్యాను. అది కూడా అల్లానే, నిర్ఘాంతపడి నా మొహంలోకి చూస్తూ నిలబడిపోయింది. చూపు తప్పించకుండా, మెల్లగా వొక్కొక్క అడుగే వెనక్కి వేసుకుంటూ, ఓ ఫర్లాంగు వొచ్చేశాను. అది విసుగెత్తి పారి పోయింది..."

"భోజనానికి..."

"ఆనాడు నేను కదిలివుంటే, పులికి భోజనం దొరికివుండును. ఇవ్వాళ నాకు భోజనంపెట్టే అవకాశమే లేకపోను..."

ఒహోం! హాం! హాం! అంటూ ముకుందం దీర్ఘంగా నవ్వి, ఆ కుర్చీలోంచి లేచి పడక్కుర్చీలో కాళ్ళు జాచి విశాలంగా పడుకున్నాడు.

పన్నెండున్నర దాటింది: నా కాకలిగావుంది. పుట్టంతా మునిగి పోయినట్లు ఆయన్ని ఓ ప్రశ్న అడిగాను.

"ఏమండీ—వేటకి వెళ్ళినప్పుడు, తుపాకులూ అవీ తీసుకెళతారుగదా, మరి పెద్దపులి మీదకి వొస్తున్నప్పుడు తుపాకీ పేల్చలేక పోయారా?"

ముకుందంగారికి చాలా కోపం వొచ్చింది. ఆయన దగ్గర తుపాకీ వుండివుంటే ఆ క్షణంలో నన్ను పేల్చేసి వుండును ఆ ప్రశ్న అడిగినందుకు.

"ఇంకోవిషయం—మీకు ప్రతి విషయం, తుపాకీ విషయం బొత్తిగా తెలీదనుకుంటా. తుపాకీ సరైన పొజిషన్‌లోకి తీసుకు రావడానికి కొంత చేతుల కదలిక అవసరం. ఏమాత్రం కదలిక జరిగినా, వెంటనే వొచ్చి మీదపడి చంపేస్తుంది పులి. అంచేత దాని కళ్ళల్లోకి చూస్తే అది భయపడి పారిపోతుంది. అట్లాంటి సందర్భాలలో మన తెలివి పనిచెయ్యదు. శరీరం బుద్ధికి తెలీకుండా, తన జాగ్రత్త అది పడుతుంది: ఓసారి అరవిందుని ఆశ్రమానికెళ్ళాం—కలెక్టరుఫ్యామిలీతో.

రాత్రి విడిదిలో మంచాలున్నాయి పక్కలేసి సిద్ధంగా. స్వామీజీ వొట్టికింద బెంచీ దిండుగాపెట్టుకుని పడున్నారు. మంచంమీదకి రండి అన్నాను. వొద్దు అందరం కిందేపడుకుందాం అన్నారు. ఆయనమాట తీసెయ్యలేక, అల్లాగే పడుకున్నాం. ప్రొద్దున్నే అక్కడివాళ్ళొచ్చి మంచం ఎత్తారు. జానెడుపాముకు తెత్రి, దిండుకింద విశ్రమిస్తోంది. అంటే ఏంజరిగిందన్నమాట. మంచంమీద అపాయం వుండిపొచ్చు అని ఆయన శరీరం పసికట్టిందన్నమాట. — పంచేంద్రియాలు కాక, — ఆరో శక్తి అన్నమాట. అరవిందుడు వ్రాశారు కూడాను — ఒక యోగి హిమాలయ పర్వతాలలో తపస్సుచేసి ఆత్మశుద్ధి సాధించినందువల్ల లోకానికేం వుపయోగం అని వొక దొరగారు ప్రశ్నించారట. అప్పుడు ఆయన అన్నారుట......"

"చాలా పొద్దోయింది. మీకోసం క్లబ్బులో అందరూ కనిపెట్టుకుంటారేమో" అన్నాను.

"నాకోసం ఎవ్వరూ కనిపెట్టుకోరు. ఓ పదునిమిషాల చూస్తారు — హాయిగా తింటారు, ఎవరాకలి వారిది..."

"మరి మీ కాకలిగాలేదా?"

"ఆ ప్రశ్నకి సమాధానం మా కళ్యాణే చెప్పాలి. ఓసారి అమ్మే నేను, వాళ్ళచుట్టాలింటికి పెళ్ళికెళ్ళాం..."

"నా కాకలేస్తోందండి — మీరూ లేవండి — భోజనాల దగ్గర మాట్లాడుకుందాం" అన్నాను. ముకుందం మాట్లాడుతూనే వున్నాడు. నేను భోజనానికి లేచి ఆయన్ని కుర్చీలోంచి లేవదీయ బోయ్యాను.

"కొందరిలా నాకు వేళకు భోజనం అనే పట్టింపులేదు. అప్పుడప్పుడూ భోజనం మానెయ్యడం మామూలే - మీరు కూర్చుని కానివ్వండి. ఏం? ఎంతవరకూ చెప్పాను! ఆ—కళ్యాణి నేనూ వెళ్ళాం. వొడ్డించారు......"

"వొడ్డించాను. లేవండి-" అన్నది ఆవిడ.

"మీ రిద్దరు కూర్చుని తింటుంటే చూడాలనివుంది. కూర్చోండి."

వొంటిగంటన్నరైంది. భోం చేశాం. తాంబూలం వేసుకున్నా. ఆయన కాస్త మజ్జిగమాత్రం పుచ్చుకున్నాడు. మైసూరులో తాంబూలాన్ని గురించి చెప్పడం మొదలెట్టాడు. నాకు నిద్రొస్తోంది. ఆదివారం వోగంట నిద్రించడం నా కలవాటు. ఆవులించాను. కాసేపు విశ్రమిస్తారా — అని వ్యంగ్యంగా అడిగి, గదిలో పక్క పర్చాను. మైసూరు దసరావుత్సవాలని వర్ణిస్తున్నాడు.

"ఇల్లా వుపవాసా లుంటే మీరు నీరసించిపోరు? ఆకలితో కబుర్లేం చెప్పగలరు?" అని తెగించి అడిగేశాను.

"ఆ ప్రశ్నే మా కళ్యాణీ అడుగుతుంది. చాలామందికి నిద్ర, తిండి, అవసరం. నాకవంత ముఖ్యంకావు. ఓసారి రాజారావు గారింట్లో పేకాటకి కూర్చున్నాం..."

ఇంతలో నీళ్లల్లో మునిగిపోతున్నవాడికి తాడుదొరికినట్లు, పక్కింటి కుటుంబరావు, పత్రిక తీసుకెడదామని వొచ్చాడు. వొకర్ని వొకరికి పరిచయం చేశాను. కుటుంబరావు స్కూలు మేష్టరు. ముకుందంగారు వెంటనే ఆయన చదువు, మేష్టర్లు, పరీక్ష అనుభవాలు చెప్పడం లంకించుకున్నాడు. అమాయకుడు కుటుంబరావు ఆయింద్రజాలంలో చిక్కుకున్నాడు. నేవెళ్లి వెన్ను వాల్చాను.

లేచేటప్పటికి మూడుకావొస్తోంది. కుటుంబరావు లేడు. మా ఆవిడుంది. సరోజ చదువువిషయం చెబుతున్నాడు.

"స్త్రీల ముందు అనకూడదుగాని, పురుషుణ్ని ఘనకార్యాలకి ప్రేరేపించేది స్త్రీలే—ఆ స్త్రీలే ఆ ఘనకార్యం కాస్తా సాధించనీకుండా అటంక పరుస్తారు. లా కాలేజీలో సుశీలని వుండేది. ఆమె మెప్పుకోసం మలయప్పన్ అనే మళయాళీ సోదరుడు బాగా చదివి యూనివర్సిటీ ఫస్టుగా ప్యాసయ్యాడు. ఎమ్ ఎల్ డిగ్రీ తెచ్చుకున్నాడు. వారిద్దరూ వివాహం చేసుకున్నారు. అంతే—అతన్ని కోర్టు కెళ్ళనివ్వదు—ఇరవై నాలుగ్గంటలూ తననిచూస్తూ, మెచ్చుకుంటూ, వినోదించమంటుంది. ఏమైందని మీ ఊహ—ఆరునెల్లలో ఆమెని విడిచిపెట్టాడు..."

నవ్వడం సాగించాడు. ఆవిడను కాఫీ విషయం చూడమని లోపలికి పంపించాను.

"మీరు మొహం కడుక్కోండి. కాఫీ తాగి అల్లా షైలు చేరదాం. మీ క్లబ్బులో ఆటలకి టైమవుతోందేమో..." అన్నాను.

"నేను మా క్లబ్‌లో ఆడటం అనేది దైవాధీనం. వాళ్ళకి తెలుసు. అందుచేత నాకు ప్రతిగా మరో ఆటగాడు లేకుండా నన్ను పంపించరు. ఓసారిల్లాగే ఊటీ వెళ్ళాం..."

నా గుండెలో రాయి పడింది. ఈ లెక్కని, బైటకెళ్ళడానికి కాని, మరోపని చూసుకోడానికి కాని వీల్లేదు. ఏంచెయ్యను?

"వారి నావిధంగా భంగపర్చడం భావ్యంకాదు. పదండి నేనూ వొస్తాను. మీఆట చూడ్లేదు..." అన్నాను.

"నా ఆట ఇప్పుడేముంది; యువకులాట చూడకపోవడమే మంచిది. నే ఆడకపోవడం నాకూ మంచిదే. అదుగో ఆ రాజమండ్రిలో చెయ్యి, కాలూ, రెండు వొకేసారి వణికాయి. డాక్టర్ నెలవరకూ కదల్చకపోవడం మంచిదన్నాడు—నాకు వీలవుతుందా. వీళ్లు నువ్వొస్తే కాని వల్లకాదని చంపుకుతింటారు. కాళ్ళు చేతులూ మెదడ్నీ పనిచెయ్యనియ్యవు. ఆఖరికి బ్రిడ్జికూడా యిహా ఆడలేను."

"పోనీ మనం వెళ్ళి చూస్తూ వాళ్లకి ప్రోత్సహిద్దాం—"

లాభం లేకపోయింది. పరమశివన్ అనే తమిళసోదరుడి వృత్తాంతం చెబుతున్నాడు. నే నిప్పుడంతా వికరువు పెడతానని భయపడకండి. అది నాతరంకాదు. ఆపూట ఆయన మా యింట్లో వుండగా మాట్లాడినవన్నీ పూరాగా వ్రాయాలంటే సవాలక్ష గ్రంథం అవుతుంది. నేనేకాదు—ఎవ్వరికీ అది సాధ్యంకాదు. ఆయన వొక ఏడాదిలో మాట్లాడిన వాటిని వ్రాయాలంటే, వేదజనుమంది చిత్రగుప్తులు, తమ అసిస్టెంట్లతో, ఐదారు సంవత్సరాలు కృషిచేస్తే సాధ్యపడుతుందేమో—అదేనా షార్టుహాండులో వ్రాయడం వారికి వొచ్చుంటేమాట. ముకుందం పొట్టిగా, సన్నగా వుంటాడు. గిరజాల జుట్టు, చామనచాయ, గడ్డంకింద మచ్చ, కళైన మొహం. కంఠం సన్నంగా వుంటుంది. స్ఫుటంగా, ప్రతి అక్షరం సాగదీస్తూ నోరారా ఉచ్చరిస్తాడు. అతనొక ధ్వని ప్రచారక యంత్రం. ఒకభాషాసంస్థ. కాలం నిల్చిపోనట్లు, గోళాలపరిభ్రమణం ఆగిపోనట్లు, ఆయనలో వుద్భవమయ్యే ధ్వనిపరంపరలకి విరామంలేదు. అడ్డుప్రశ్నలు, ఊకొట్టడాలు ఆయన కక్కర్లేదు. వింటున్నట్లు తల పంకించడంతో నిమిత్తంలేదు. మనం చూస్తున్నప్పుడే సూర్యుడు కాంతికిరణాలను ప్రచారం చేస్తున్నాడా? మనం కోరినప్పుడే నిండుచంద్రుడు దర్శనమిస్తున్నాడా? ప్రియురాలొచ్చేవరకూ ఆగమంటే పువ్వు పరిమళించడం మానుకుంటుందా? నిద్రపోయిన కాసేపు, మౌనంగా వుంటాడనుకుంటున్నారా? అది భ్రమ. మేఘం వెనకాల సూర్యుడు వెలుగుతూవుంటాడు. మనకి కనబడదు. శిఖరం వెనక చందమామ మనకి కనబడకపోవొచ్చు. అంతమాత్రంచేత లేడంటామా? ఎడారిలో వాడినపువ్వు, సంద్రాలలోతుల్లో ధగధగ మెరిసే వజ్రం—మనకేం తెలుసు. మనం ఎంతఅల్పులం! ఎక్స్‌రే యంత్రాన్ని ప్రయోగించి నిద్రిస్తుండగా ఆయన మెదడును పరీక్షించండి. ఒకమహాకావ్యం అల్లుతూవుంటుంది ఆ మెదడు. మెదడులో ధ్వని కదలికని వ్రాసేపరికరాన్ని యే శాస్త్రజ్ఞుడో ముందుముందు తయారుచేసి తీరుతాడు. అప్పుడింక ఆనువిక యుగంలో మహాకావ్యాలలోపం వుండదు.

ఆరుకావొస్తోంది. ముకుందంగారు స్వీయగాథలో పడ్డారు. తనని భార్య కళ్యాణి ఏవిధంగా ప్రేమించి పెళ్ళిచేసుకున్నదీ—పొరపాటు—ఏవిధంగా పెళ్ళిచేసుకున్నతర్వాత, ప్రేమించడం మొదలెట్టిందీ. అదే శాశ్వతమైన ప్రేమ—ప్రేమంటే ఏమిటి? ఒక అరగంట లెక్చరిచ్చాడు. సొమ్మసిల్లి పోయాను. ప్రేమలో వైరాగ్యానికి తావుందా? పవిత్రమైన ప్రేమ యీ యంత్రయుగంలో సాధ్యమా? మార్క్సు సిద్ధాంతాలకి ప్రేమకి వున్న సంబంధం ఏమిటి? ప్లేటో ఏమన్నాడు. వేమన్న పద్యం చూడండి.

వాల్మీకి రామాయణం తీసుకోండి. పోతన్న భాగవతం తియ్యండి. అమెరికా విడాకుల కథకీళ్లు—మాస్కోలో విడాకులసంఖ్య—సంతానవిరోధం ఆవశ్యకత—పెరిగిపోతున్న జనాభా—మన దేశంలో మూఢాచారాలు.

"నాకు పిల్లలు లేరు. వుండరుకూడా. వుంటే, నాజీవితంలో వున్న ఆనందం వారికి సాధ్యంకారు. ఆస్తి పంచుకుంటారు. ప్రేమ పంచుకుంటారు. సంతోషం పంచుకుంటారు. వారికి సంతానం కలుగుతుందిగా! నేను తాతనవుతాను. కళ్యాణి అమ్మమ్మవుతుంది. వారిసంతానం బలహీనులవుతారు. ఆస్తి సన్నగిల్లి పోతోంది. వారి సంతానానికి తినేటందుకు తిండేవుండదు. సంఘపతనం..."

అయన సంతానంకూడా అయనలాగే తయారవుతే, యింకే మన్నావుంది! ఊహించలేకపొయ్యాను.

"నా సంతానం మూగవాళ్ళవుతారు—అమ్మపోలికే ఐతే—ఎందుకంటారా! కళ్యాణి అంత నాలా మాటకారికాదు. ఆవిడ కంఠమాధుర్యం వొక అపూర్వ అనుభవం..."

ఏడుపొస్తోంది. ఏమిటి చెయ్యడం! ఆవిడ కాస్తంత టీ, దోసెలు తెచ్చింది. ఆయన దోసెలు తిన్నాడు. నాపళ్లెంలోనివి కూడా దగ్గరకు లాక్కుని కబుర్లు చెబుతూ తినేశాడు. టీ త్రాగాం. ఇంతలో దైవం కటాక్షించాడు. ఫైరింజన్ మాగుమ్మం ముందు నుంచి చప్పుడు చేస్తూ వెళ్లింది. ఎక్కడో ఇళ్లు తగలడుతున్నా యంటూ ముసలయ్య వచ్చాడు "రండి చూద్దాం"అంటూ ఆయన్ని లేవతీసి మెట్లు కిందికి నడిపించాను. వెనక అహోబలరావుగారిల్లు తగులడిన చరిత్ర చెబుతున్నాడు. నడుచుకుంటూ వెళ్లాం. క్లబ్బుకి కొంచం దగ్గరలో గుడిసెలు తగులడుతున్నయి. క్లబ్బులోవాళ్లుకూడా చూడ్డాని కొచ్చారు. ఆ ఎరుగున్నవాళ్ల గుంపులో కలిసిపొయ్యాడు. మళ్ళా రాత్రి కనిపిస్తా అన్నాడు. తప్పకుండా అన్నాను. ఆ క్లబ్బు మిత్రుల్ని పట్టుకున్నాడు. అంతా ఆ ప్రవాహంలో కొట్టుకు పొయ్యారు. నేయింటి కొచ్చేశాను.

ముకుందాన్ని మళ్ళా మూడేళ్ళ తర్వాత కలుసుకున్నాను. ఆరోజుల్లో పెద్ద గాలీవాన వొచ్చి, రైళ్లు నిలిచిపోవడం జరిగింది. రైళ్ళు తిన్నగాలేవని మా ఆవిడ పుట్టింట్లో వుండిపోయింది. కారియర్ భోజనం తెప్పించింది కాదు.

సాయంత్రం అయింది. రైళ్లవిషయం కనుక్కుందా మని బైలుదేరుతుండగా మెట్లమధ్యలో ముకుందం డీకొన్నాడు. ఏడాది క్రితం ముకుందం భార్య టైఫాయిడ్ జ్వరం వొచ్చి చనిపోయింది. సానుభూతిజాబు వ్రాశాను. కలుసుకోడం యిదే మొదటిసారి, పరామర్శకి వాక్యాలు కూరుస్తుండగా, ముకుందం వాటిని వుచ్ఛరించే అవకాశం యివ్వకుండా తనే సాగించాడు.

"ఈరోజుల్లో రైళ్ళు మరీ అధ్వాన్నమయ్యా యనుకో. ఆలస్యంగా రావడానికి, నిలిచిపోడానికి యీ తుఫాను వొసాకు. వుత్తప్పుడు ప్రతిరైలు రోజూ ఆలస్యం. తుఫానొస్తే వో వారం. అంతే తేడా. గుంటూరునుంచి బండిదిగాను. ఎక్స్‌ప్రెస్ పదిగంటలు లేటు. సరే ఆప్లాట్‌ఫారంలో యిరుక్కుని రోజులొప్ప తగిలించుకోడం ఎందుకని, మిత్రుల్ని చూసిపోదామని వొచ్చాను. అర్జంటుగా ఢిల్లీ కెళ్ళాలి.

'మావూళ్ళో రైతులంతా—భూముల్ని గురించి వొకొ తకాసనం వొస్తోందిగా—దానిలో తికమకలు చాలావున్నాయిలే. వారికున్న అభ్యంతరాలని పిటిషన్‌ద్వారా, ఢిల్లీలో కేంద్రప్రభుత్వానికి విన్నవించమని, ఆ పిటిషన్ వ్రాయించి, ఆ నాయకత్వం నామీద పడేశారు. ఇట్లాంటివి చాలాచేశానులే. వెనక గుర్నాథంగారి ఇంటి తగాదా—ఢిల్లీకి తీసుకెళ్ళాను. ఇళ్లశాఖవారు నేఎత్తిన లా పాయింట్లకి భిన్నులై, సుప్రీంకోర్టులో ప్రథమస్థానం వహించనందుకు ఆశ్చర్యపడ్డారు. మనకెక్కడ తీరుతుంది. అయినా, కళ్యాణి పోయింతర్వాత, నా పాతవ్యాపకాలన్నీ మానుకున్నాను. జీవితం పట్ల నా దృష్టే మారిపోయింది. నే నిప్పుడేవీ పట్టించుకోడం లేదు. ఇప్పుడుకూడా ఆ రైతులంతా చంపుకుతింటే, సరే పరోపకారార్థం యీశరీరం అన్న సామ్యంగా, ఊఁ అన్నాను. ఇంక వొవిషయం నెత్తిన వేసుకున్నతర్వాత, దానంతు తేల్చేవరకూ వూరుకోనని నీకు తెలుసుగా!"

"పాపం కళ్యాణి..."

"ఏంపాపం. పుట్టింతర్వాత చావుతప్పదుకదా. అన్ని మంచి లక్షణాలుండి, వొక ఆదర్శప్రాయమైనవ్యక్తిగా, నలుగురికీ కన్నెర్రగావున్న కళ్యాణి చాలాకాలం బ్రతకదని లోలోపల అనిపించేదిహ్మా! అంతమంచిగా వుండకూడదనుకో - యీ ప్రపంచంలో దేవుళ్లు వోర్చలేరుట. గ్రీకు పురాణగాథలు..."

"రండి లోపలి కెడదాం..."

"ఎవ్వళ్ళం టైఫాయిడ్ అనుకోలేదు. అరడజనుమంది స్పెషలిస్టులు పూనుకున్న రోగి ఆయువుమూడినట్టే. ఇరవై రోజులయ్యాక ఫలానాఅని నిర్ణయించారు. కాంప్లికేషన్ వుందేమో చూడండన్నా—నామాట పెడచెవినిపెట్టారు. ఆమెకు తెలుసు బ్రతకనని. నన్ను దగ్గరకురమ్మంది. మంచం బద్దీమీద కూర్చున్నాను. నా రెండు చేతులూ పట్టుకుంది. ఆమెకళ్లు చాలాపెద్దవిలే. నీరసించిందేమో, మరీ పెద్దవిగా కనిపించాయి. కన్నీరుతో. 'మీరు సరోజను చేసుకోండి' అంది. నాకు ఏడుపులోనవ్వొచ్చింది.

చనిపొయ్యేవారికి బ్రతికున్నవారంటే అంత తాపత్రయం వుంటుంది కాబోలు."

"రండి......"

"లోపలికెందుకు—బైటకెళ్ళి టీ తాగొద్దాం. ఈ ఆడాళ్ళున్నారే—భలేఅసాధ్యులబ్బాయ్. వాళ్లకి కొన్నివిషయాల్లో దూరదృష్టివుంది. ఏకాంతంగా మొగాడు పొయ్యేపోకళ్ళు, వేసే వేషాలు, యిట్టే పసిగట్టేస్తారు. వాళ్ళింటిపక్కన మోహనరావని వుండేవాడు. గౌరవమైన కుటుంబీకుడు. వాళ్లింట్లో పనిచేసేపిల్ల వోసారి కళ్యాణితో అన్నదిట ఏదోమాటల సందర్భంలో 'అమ్మగారు చాలామంచివారండి' అమ్మగారంటే మోహనరావు సతీమణి అన్నమాట. అర్ధరాత్రి కళ్యాణి నాతోఅంది—ఏమందో తెలుసా? "ఆ పనిపిల్లకి ఆరోమాసం—తండ్రి మోహనరావు ఆ పనిపిల్లని తీసు

వెళ్ళిపోయ్యాడు. ఎందుకు చెప్పొచ్చానంటే, కళ్యాణి విషయం యిట్టే గ్రహించింది"

"ఇటు రండి—రోడ్డు నడుంగా లారీలు ఆపేను." అని ఆయన్ని పక్కగా లాగాను. హోటలికెళ్ళాం.

"సరోజ పెళ్ళంటే యిష్టం లేనట్లు, మొగాడంటే గిట్టనట్లు, నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తుందా—అదంతా నటనేననుకో. నన్ను తెగ వేళాకోళం చేసేదికే. సరోజ వాళ్ళక్కంత చక్కందికాదు. కాని అంతకంటె గడసరి—జాణ—ఉత్త అమాయకుణ్ణి, మాఆవిడన్నట్లు. సరోజనిగురించి నాకే యితర అభిప్రాయం, అప్పుడూ లేదు ఇప్పుడూ లేదు. కళ్యాణిని తృప్తిపరచడంకోసం సరేలే, అని వాగ్దానపూర్వకంగా అన్నాను. కాని నాకు నిజంగా ఆమెను చేసుకోవాలన్న ఉద్దేశం లేదు. ఎందుకంటావా, మనది బిజీ లైఫ్—పెండ్లికి ప్రేమకీ టైమ్ లేదు. ఈ ఆడాళ్ళున్నారే, మన జీవితం అంతా వారి సముఖానా, వారి ఆరాధనలో గడపమంటారు. నాకది సాధ్యం కాదు. సరోజ తల్లికూడా, ఆమెను చేసుకోమని చాలా మందిచేత చెప్పించింది. ఆఖరికి ఏమైందో తెలుసా ?"

టీ త్రాగి మళ్ళా యింటివేపు బైలుదేరాం. అతను మాట్లాడుతూనేవున్నాడు. నా ఆలోచనలు నేను వేరే సాగిస్తున్నాను. ముకుందానికి వస్తు సేకరణలో పక్షపాతం లేదు. అతని కన్ని వస్తువులూ, ఉదంతాలూ, వ్యక్తులూ సమానమే. అన్నీ అతని వాగ్దేవిని సమంగా పురికొల్పి, సమమైన కీవితో ధ్వనులను ప్రసారం చేస్తాయి. భార్య మరణం, సరోజపెళ్ళి, సుర్నాథంగారి యిల్లు, హాకీ ఆటలో రంగయ్యనాయుడు వోటమి, కిల్లీలో సున్నం ఎక్కువవడం యివన్నీ అతనికి మహాకావ్యాలే. ఎక్కువ తక్కువలు లేకుండా, వేదాంతిలా నిశ్చలమనస్కుడై వితర్కిస్తాడు. మౌనం యోగితపస్సు, భావ, ధ్వని యితని తపస్సు. ఊహ ద్వారా వొక ప్రపంచాన్ని శాసించాడు. ఆ జగత్తుకి అతను చక్రవర్తి. మనం అంతా అతని ప్రజలం. రాజుగారు మాట్లాడేటప్పుడు, అందరూ నిశ్శబ్దంగా వుండాలి.

అతను చవిచూడని అనుభవం లేదు—లోనుగాని ఉద్రేకం లేదు. జయించని తృష్ణ లేదు; తరచి చూడని రహస్యానుభవం లేదు. కనని కల లేదు; ఆడని అబద్ధం లేదు; తెలియని సత్యం లేదు. రాజ్యవిస్తీర్ణము, సరిహద్దులు తెలియని చక్రవర్తిలాగా, భార్య మరణంతో, అతను మానసికంగా పేట్రేగిపొయ్యాడు. జీవితగమనం వేగం తగ్గి నిదానంగా జరుగుతోంది—కాని అతని ఆరాటం, ఆవేదన వేగిరపడుతున్నాయి. ఏదో సిద్ధాంతం, సందేశం, జీవితదృక్పథం అల్లి, మనందర్నీ అందులో చిక్కించుకుని, స్థిమితపడదామని అతనికి తెలియని, సంకల్పం లాగుంది. ఏదో భార్యపట్ల చిన్న అపచారం చేశాడు. దాన్ని తనకుతాను సమర్థించుకుని, పోయిన వ్యక్తి క్షమాపణ పొంది, సమాధాన పడటంకోసం, యీ వేగిరపాటు—యీ భాషా ప్రయుక్తవ్యక్తి స్వైరవిహారం, యీ నాదబ్రహ్మ స్మశాన నృత్యం, యీ వాగ్గేయకారుని చివరి ముక్తాయింపు.

"ఏమైందని అడగవేం?" అంటున్నాడు వెర్రివాడు. అతన్ని గూర్చిన ఆలోచనలు నన్ను వేదాంత శిఖరానికి చేరేశాయి. ఏది, ఏమైతే ఎవరిక్కావాలి? అనంత విశ్వంలోని ప్రచండ నిశ్శబ్దాన్ని, వొక్క మాటతో, వొక్క అర్థశూన్యమైన ధ్వనితో ప్రాచీన ప్రశాంత గాంభీర్యాన్ని భంగపరుస్తున్నాడా యీ వెర్రి మానవుడు!

పైకి మాత్రం, 'చెప్పండి' అన్నాను.

"సరోజ నన్ను చేసుకోనని కచ్చితంగా చెప్పేసింది. ఎందుకనీ?" ఆమెకు నామీద వుండబట్టేగా. తనకు నామీద వున్న ప్రేమని మరోలా ప్రకటించలేకపోయింది. అక్క బ్రతికి వున్నప్పుడు, ఎంత గారం, ఆప్యాయత, ఆదరణ. స్నేహం చూపిందనుకున్నావ్. అది వెన్నెల రాత్రి, కల్యాణి రంగమ్మగారితో గుళ్లో కెళ్ళింది. అప్పుడే క్లబ్బునుంచి వొచ్చి స్నానంచేసి, డ్రెస్ చేసుకుంటున్నా. గదిలోకొచ్చింది సరోజ. అద్దంలో నా మొహం కేసి చూసింది.

నువ్వు ఆలయానికి వెళ్ళలేదా అని అడిగా.

'ఆ ప్రశ్న నేనే అడుగుదామను కుంటున్నా—నాకేం కోర్కెలు లేవు.' అన్నది.. 'అంటే?' అన్నాను.

'పిల్లలు కావాలని వొక్క భార్య మాత్రం ప్రదక్షిణాలు చేస్తే చాలదు. నువ్వూ చెయ్యాలి' అంది. 'మంచి భర్తని ప్రసాదించమని నువ్వూ కోరుకోవొచ్చుగా.' అన్నాను, నవ్వుతూ. 'నాకట్లాంటి కోర్కెలూ, లేవు, నమ్మకాలూ లేవు' అంది. 'అంతా మానవ ప్రయత్నమేగాని దేవుడి ప్రమేయం లేదంటావు. నీ నమ్మకాలు, ఆదర్శాలు, ప్రయత్నాలు, వాటి ఫలితాలు కాస్తంత యీ అల్పుడి చెవిని పడెయ్యి' అన్నా, వేళాకోళంగా.

'ప్రయత్నం చెయ్యనిదే నాకు పెళ్ళి కాదంటావ్!

'పిల్లలకోసం మా ప్రయత్నం లాంటిదే అనుకోకూడదూ?' అని, తువ్వాలు భుజాన వేసుకుని డాబామీదికి నడిచాను. నా సంభాషణంతా అద్దంలో సరోజతోనే. నాకేసి అదోలా చూసింది—అట్లా గనిపించింది. పదినిమిషాల్లో డాబామీదికి తనూవొచ్చింది,

'కోపం వొచ్చిందా?'

'ఎవరిమీద?'

'నామీద'

'ఎందుకు?'

'మొగాళ్ళకెందుకు కోపమొస్తుందో నాకేం తెలుసు?'

'ఇంకా నీకే వొచ్చింది కోపం, అవునా?'

'ఎందుకో?'

'స్త్రీమనస్సు తెలియు బ్రహ్మతరంబా?'

'నాకు తెలిసినంత వరకూ చెప్తా—భయం లేదు. రోడ్డువంపు చూస్తున్నాలే. అక్కయ్య రావడం లేదు.' అన్నది. నాకు నిజంగా కోపంవొచ్చింది. 'అక్కయ్యంటే నువ్వు భయపడాలి—నీ మనస్సులో ఏదోవుంటే' అన్నాను. సరోజకి కోపంవొచ్చినట్లుంది. "అక్కయ్యముందు నీ అమాయకపు అవతారం నాకు తెలియదనా - అక్కయ్యకి తెలీదనుకోకేం—నామనస్సులో ఏదో వుందట. మహా కనిపెట్టావులే—నామనస్సులో ఎవరున్నా లేకపోయినా,

నువ్వుమాత్రం లేవు" అని కిందికి వెళ్ళిపోయింది. అది ప్రేమ కాకపోతే, ఏమిటంటావ్?"

ఇంటికి చేరుకుని వరండాలోకి కుర్చీలు లాక్కుని కూర్చున్నాం. భోజనానికి హోటలికెళ్లడమా, కారియర్ తెప్పించడమా అన్న ఆలోచన సాగనియ్యకుండా మళ్ళీ మొదలెట్టాడు. ఇంక రాత్రంతా జాగారమే! ఏపరమాత్మకీ నాపైన కటాక్షం కలగదూ! నేను మాట్లాడడం మొదలెడితే!—ఒక యత్నం చేశా.

"చూడండి—మీరు సరోజపై మరికొంత ఆప్యాయత కనబరిస్తే......"

"చాల్లెండి: సరోజవిషయం మీకెరుగరు. కొందరి స్త్రీలంతే. వాళ్లని తిట్టి, హింసించి, బాధపెట్టిన వారిని గాని కనికరించరు. ఓ సారి......"

ఇంక లాభం లేదు. ఆయత్నం విరమించి, చంద్రుడికేసి చూస్తూ నా పగటి కలలు కంటూ కూర్చున్నాను. పగటి కలలు మానవ హృదయానికి స్వర్గం లాంటివి. నాకు క్రాస్‌వర్డ్ పజిల్‌లో ఇరవై వేలొస్తే ఎల్లా ఖర్చు పెట్టేదీ, వూహించుకుంటాను. సరోజను—నేమాశ్చేదనుకోండి—వివాహమాడి వుంటే నా జీవితం ఎల్లావుండేదీ వూహించుకుంటాను. ముకుందం కబుర్లని కళ్యాణి ఎల్లా భరించగలిగిందో? ఆమె దగ్గర కూడా యిల్లాగే మాట్లాడతాడా—ఆవిడ వింటుందా. ఇప్పుడు ముకుందం ఏమంటున్నాడో వింటామని పగటి కలని తుడిచేసి, అతనికేసి చూశాను.

"మా ఆవిడంటుంది—నేను తన దగ్గరవున్నప్పుడుకంటే దూరంగా వున్నప్పుడు తనకి దగ్గరగా వున్నట్లు వుంటుందిట. అల్లా గంటుంది గాని, దూరంగా వుంటే 'ఎప్పుడొస్తారు!' అని టెలిగ్రాంలమీద టెలిగ్రాం లిస్తుంది. దగ్గరగా వుంటే ఎప్పుడు వెడతారు బాబూ—అన్నట్లుగా ప్రవర్తిస్తుంది—మీకూ అల్లాగే అనిపిస్తుంది కాదూ?"

ఒక్కసారి ఉలిక్కిపడి కుర్చీలోంచి లేచాను.

"ఇంకా నయం—ఎంతమాట!" అన్నాను. ఇంక నాకు ఆ రాత్రికి మోక్షం లేదు. హాయిగా ఆయనకి లొంగిపోయి, ఆ ధ్వని సాగరంలో పూర్తిగ మునగడం మంచిదనుకుంటూండగా, దైవం నా భక్తికి మెచ్చి పరంధామయ్యని పంపించాడు. తుపానులో రైలు దొరక్క యిరుక్కుపోయిన వ్యక్తులలో పరంధామయ్య వొకడు. నాకు స్నేహితుడు. ప్రసిద్ధ రచయిత. ఆయన్ని ముకుందానికి వప్పగించి నేను కొంతంత స్వేచ్ఛ పొందొచ్చు.

"పరంధామయ్య గారని—'హోయిగోశ్చ హోహోలులు' అనే యాత్రాగ్రంథం వ్రాశారు. అమెరికా, జపానుదేశాలు తిరిగొచ్చారు." అని ముకుందానికి పరిచయం చేశాను.

"అయ్యొ ఆయన్ని ఎరక్కేం...వెనకటికి వోసారి చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారికి పట్టాభిపురంలో సన్మానం తలపెట్టారు. మామామ గారి తండ్రి అధ్యక్షులుట......"

పరంధామయ్య పాపం అనుకుని కారియర్ విషయం చూస్తానని బైటకొచ్చి నిశ్శబ్దంగా గాలి పీల్చానని రహస్యంగా వొప్పుకుంటున్నా స్వార్థపరుణ్ణి.

బస్‌స్టాండ్‌దగ్గరగాని మునలయ్యకి చుట్టకాల్చుకునేటందుకు సరైనస్థలం దొరకలేదు. అక్కడ దొరికాడు. తీసుకొచ్చి, కారియర్‌యిచ్చి హోటల్‌కి పంపించాను. ఎనిమిదికావొస్తోంది. పరంధామయ్య—సాహిత్యసభల్లో గంటలు గంటలు ఉపన్యసించే పరంధామయ్య ఆ ప్రవాహంలో వుక్కిరిబిక్కిరవుతున్నాడు. నన్ను చూడగానే లేచాడు.

"ఇంతకీ యీాయనెవరో పరిచయం చేశావుకాదు." అన్నాడు కొంతకోపంగా. సమాధానంచెప్పేప్రాప్తి నాకు లేదు. ముకుందం దొరకపుచ్చుకున్నాడు.

"నేనూ రచయితనే—వో వెయ్యిపేజీల గ్రంథం వ్రాశాను"

"ఎప్పుడూ చెప్పారు కాదేం. అచ్చయిందా?" అన్నాడు ఎల్లాగో సందుచేసుకుని.

"అంటే బుర్రలో వ్రాశాను. కాగితంమీద వ్రాయడం ప్రారంభించాలి. చాలా పెద్దగ్రంథం, రెండువేల పేజీలు పట్టొచ్చు. ఇంకా పేరుపెట్టలేదనుకో—"

ఏంపేరుపెడితే బాగుంటుందంటారు?

"విషయమేమిటో తెలిస్తే..." పరంధామయ్య వాక్యం మరోలోకంలో పూర్తవుతుంది.

"అదేచెబుదా మనుకుంటున్నా. మొన్న వ్యవసాయశాఖ వారికి పిటిషన్ పెట్టానా—నేనూ లాయర్నే—వినా లాపదాలు వాడకుండా, అతిసులువైన సరళమైన భాషలో వ్రాశానేమో—ఎందుకంటే మా మామగారింట్లో వంటాయన శరభయ్యకి కూడా యిట్టే అర్థమైంది. విషయం బోధపడగానే ముక్కుమీద వేలేసుకున్నాడు."

పరంధామయ్య దగ్గరుండడంవల్ల కాబోలు, కొంచంధైర్యం చిక్కి సందేహనివృత్తి కుపక్రమించాను.

"మీ మామగారింట్లో వున్నది వొంటలక్కగా." అన్నాను ముకుందాన్ని పట్టివేయించగలిగానని గర్వపడుతూ.

"సరేలే—అది డెప్పడో వెళ్లిపోయింది, వెండి ముక్కుపొడుం డబ్బీ, అరడజ వెండిపళ్లాలూ తీసుకొని. నే నారాతీశాను. అత్తగారూ వాళ్ళూ ఆడదాన్ని యాగీచెయ్యడ మెందుకని వూరుకొన్నారు. శరభయ్యని కుదిర్చిపెట్టింది నేనే—వాడున్నాడే, వంటచెయ్యడంలో భీముడు. "అతనిచేతి భోజనం వొక్కసారి తిన్నట్లయితే, పొట్టి శ్రీరాములు యీనాటికీ జీవించేవుండును. నా గ్రంథంలో వొక అధ్యాయం అతన్నిగురించే."

"మీరు వ్రాసేగ్రంథం స్వీయచరిత్రన్నమాట..."

"అసలువిషయం చెప్పనివ్వండి — చాలామంది చంపుకు తింటున్నారు, మీ చరిత్ర వ్రాయండని — నాకు తీరికేదీ? జీవించదల్చుకున్నవారికి గ్రంథరచన పడదేమో. వోసారి..."

భూకంపం ఏప్రాంతంలో ఏసమయంలో చెలరేగుతుందో ఎవరు చెప్పగలరు! పెద్ద బీటలు తీసింది. పరంధామయ్య నేనూ అందులో పడిపోయ్యాం—వో పావుగంట. తెప్పరిల్లి 'దాహం' అన్నాడు పరంధామయ్య.-అని తనే లోపలికెళ్ళాడు.

"శరభయ్య మాకక్కర్లేదంటే నాదగ్గరే అట్టేపెట్టేసుకున్నాను. పేరమ్మని నాదగ్గరే వుంచుకున్నాను-ఏం చెయ్యను తెనుగుభాష లోపం-వుంచుకోక తప్పదు. చురుకైనపిల్ల. మొగుణ్ణి వొదిలేసింది.—వాడే వొదిలేశాడనుకో—రంగం వెళ్లాడు. రాజకీయాలు వొదులుకున్నాను. ఆటలు పాటలు వొదులుకున్నాను. కృష్ణా రామా అనుకుంటూ, పొలం, తోట చూసుకుంటూ కడుపులో చల్ల..."

ఇంతలో 'బాబోయ్' అని లోపల్నుంచి పరంధామయ్యగారు కేకేశారు. తొందరగా వెళ్లాం. ఆయనకి తేలుకుట్టిందిట. కాలు గట్టిగా అదిమిపట్టి, "మంత్రగాళ్ళెవరో కాస్త చూడండి. ఇది మామూలు తేలుకాదు." అని బాధపడుతున్నాడు. నేను కాలుకు మూలలా చూస్తున్నాను. 'కనబడదేం?' అన్నాను. "నీకు స్వాగతం యిస్తూ ఎదురుగా వొస్తుంది మరీ—మందేం లేదూ! డాక్టరెవరూ లేరూ?" అంటున్నాడు.

ముకుందం మళ్లీ మొదలెట్టాడు. "ఓసారి పేరమ్మకిలాగే తేలుకుట్టింది. దానికెంత బాధకలిగిందంటే, 'మామా తేలుకుట్టిందర్రోయ్,' అని కేకేసింది. కాదు చీమన్నాను నేను. ఏడవడం మొదలెట్టారు..."

"డాక్టర్ని తీసుకురండి—మంత్రం వెయ్యలేరూ..."

"మీరిక్కడే వుండండి, డాక్టర్ని తీసుకొస్తాను." అని సైకిలు తీశాను. "నువ్వు తిరిగొచ్చేటప్పటికి నా ప్రాణం పోతుంది. ఉండు—నేనే వొస్తాను."

నేను పరంధామయ్యను తీసుకుని బైటకెళ్ళి ఓ రిక్షా మాట్లాడి అందులో ఎక్కాం.

"మీకు మంచి స్టైలులో, అలారమ్ మోగినట్లు—తేలుకుట్టిందండి. లేకపోతే నా రైలు తప్పను. ప్రొద్దున పదింటికి దిగాను. పదిగంటలు లేటన్నారు. అంటే, ఎనిమిదింటికన్న మాట. ఇప్పుడు పావుతక్కువ ఎనిమిది. కాబట్టి నాకు రైలందుతుంది. మనకి ఢిల్లీ ప్రయాణం తప్పదు. ఓసారి నేను లాబర్ కమిషనర్ రంగనాథం ఢిల్లీ ప్రయాణం కట్టాం. నాగపూర్ చేరేప్పటికి..." రిక్షా మళ్ళీ తిరిగింది. ఓ జట్కా ఆపుచేయించి, ముకుందాన్ని అందులో ఎక్కమని సెలవుతీసుకున్నాం. మమ్మల్ని తనవూరు ఆహ్వానించాడు. అల్లాగే అన్నాం. ఏదో చెబుతున్నాడు—జట్కా దూరంగా వెళ్ళింది. రిక్షావాణ్ణి తిన్నగా హోటల్ కి పట్టమన్నాడు పరంధామయ్య. "కారియర్ యింటికొస్తుందిగా" అన్నాను. ఇంటికెళితే యీసారి నిజంగా తేలుకుడుతుందన్నాడు పరంధామయ్య!

ఇది జరిగింతర్వాత ముకుందాన్ని నేను కలుసుకోలేదు. అటు వెడుతూ ఓసారి పరంధామయ్య, ముకుందం బంగళాని, తోటని చూసి, ఓపూట భోజనంచేసి వొచ్చినట్లు, వివరాలన్నీ వుత్తరం ద్వారా తెలియబరిచాడు. శరభయ్యవొంట అద్భుతంట. పేరమ్మ బ్యూటీట. రోజూ పదిమంది తక్కువుండరట భోజనానికి. ఆయనకున్న పలుకుబడి, పేరు, అంతా శరభయ్య వొంటమూలంగానేట. అతని స్వీయ చరిత్ర క్లుప్తంగా నాలుగుగంటలు చెప్పాడుట. అది వినగానే తిన్నదంతా అరిగిపోయిందిట. 'నాసంభాషణ వల్ల కీర్తంకాని పదార్థంలేదు' అని ముకుందం నిర్వచనం చేశాడుట.

అట్లాంటి ముకుందానికి ఎందుకు మతి భ్రమించి, పిచ్చాసుపత్రిలో వుండాల్సివొచ్చిందో నాకు బోధపడలేదు. కొద్దిగా మానసిక శాస్త్రం నేనూ చదివాను. సంసార సుఖంలేకపోవడం అతివాగుడికి ఓ కారణంగా చెప్తారు. ప్రేమతృష్ణ మాటలద్వారా తీర్చుకుని తృప్తి పడటం చిహ్నం. నాకిది సరైనకారణంగా తోచలేదు. కృత్రిమంగా వూహిస్తే ఏవేవో చిత్రమైన కారణాలు కల్పించవొచ్చు. జాడ్యం ఎంత కృత్రిమమైందో, దానికి మందు కూడా అపూర్వంగా వుంటుంది. గుడ్డివాడు విపరీత వెద్దలాంటిది. మానసికశాస్త్రంలో మందు, తగులుతే తగులుతుంది, లేకపోతే లేదు. నేమొదట్లో అనుకున్న కారణమే నాకిప్పటికీ సమంజసంగా కనబడుతోంది. ముకుందం మంచివాడు; స్వార్థరహితుడు. జీవితంలో ఏదీ కోరకుండా, అన్నీ తెచ్చుకుని సర్వమూ వొదులుకున్న యోగి. విలువలు కట్టని విమర్శకుడు. సిద్ధాంతాలు అమాయకప్రజ నెత్తిన రుద్దని వేదాంతి. అయినా అతనిబారినుండి పారిపోడానికి నేనూ యత్నం చేశాను. భార్య విసుగెత్తి ఇంకచాలు బాబు అనుకుని పరమపదించింది. సరోజ పెళ్ళి చేసుకోనంది. అందరూ అతన్నుండిపారిపోయి అతన్ని ఏకాకినిచేశారు. నాకళ్లంట అప్రయత్నంగా నీళ్లు తిరిగాయి. పాపం అతనేం అపచారంచేశాడు! రెండురూపాయలిచ్చి-కర్నాటక సంగీతవిద్వాంసుడు, వయొలిన్, మృదంగం విద్వాంసులు కలిసి మూడుగంటలు ముమ్మొనయుద్ధం సాగిస్తే చూసి, విని "అహా, ఎంత అద్భుతంగా వుందండీ" అని చెప్పుకోడం లేదు! మనం ఖర్చుపెట్టిన రెండురూపాయలనీ సమర్థించేటందుకు కాక, మరెందుకు మనం మెచ్చుకోడం! కానీ ఖర్చులేకుండా ముకుందం మనకి వినోదం కలిగిస్తే, ఏవగింపా! అతనికి పేర్లెట్టి హేళనచెయ్యడమా!

నీతిలో మెళకువలు తెలిసున్నవాడు ముకుందం. ఏనాడో భార్యకి అపచారం చేశాడు. దాన్ని ఎదుర్కొన్నాడు. తను సమాధానం పడలేకపోయ్యాడు. సంఘానికి చెప్పేసి, పాపపరిహారాని కుపక్రమించాడు మాటలద్వారా. అదీ నాకు తోచినకారణం. అతనా జీవితంలో కన్నీ కోరడు. ప్రతిఫలంకోరని సంభాషణ—అతనిమాట పడిపోయిందంటే నాకిప్రపంచంలో ఏదో తీరనిలోటు కనబడింది. అతనిభార్య కళ్యాణి అన్నట్లు, అతను దూరంగావున్న కొద్దీ దగ్గరగా వొచ్చినట్లుంటాడు. దగ్గరగావుంటే తప్పించుకు తిరుగుతాను. నాకు తెలుసులేదు.

అతని జీవితంలో ఏదో లోటుంది. దాన్ని శోధించి ఎవ్వరూ బైటపెట్టకుండా అతను 'మాటలు' అనే వల అల్లుకున్నాడు. అతన్ని కదిపి మాట్లాడిస్తే అదేమిటో బైటపడును. కాని ఇప్పుడు అవకాశం లేదు. అతనికి మాటపోయింది. కాలచక్రం నిలిచినట్లయింది. దిగులుగా కూర్చున్నాను. "పోనీ వోసారివెళ్ళి చూసిరాకూడదూ!" అంది మాఆవిడ.

ఆ రాత్రే బెంగుళూరు ప్రయాణం అయ్యాను. హాస్పిటల్ కి వెళ్లేప్పటికి సాయంత్రం నాలుగైంది. బైట ముకుందం తమ్ముణ్ణి కలుసుకున్నాను. అతను చెప్పాడు కొన్ని సంగతులు. పని పిల్ల పేరమ్మ, వంటాయన శరభయ్యతో లేచిపోయిందిట. వాళ్లని వెదుక్కుంటూ తిరిగాడుట ముకుందం. పేరమ్మని రైల్వేస్టేషన్ లో

పట్టుకున్నాడుట. ఇద్దరినీ యింటికి రమ్మనమని ప్రతిమలాడాట్ట. జీతం ఎక్కువ చేస్తానన్నాడుట రానందిట. ఏదో వాగిందిట. అతని మామగార్ని, భార్యని, సరోజని—వాళ్ల కుటుంబాన్ని చులకన చేస్తూ మాట్లాడిందిట. లెంపకాయ కొట్టాడుట. మళ్లా ఏదో అందిట 'నేనందుకు కావాల్సివొచ్చానా? ఇప్పుడేనంటి ఏమంటారో!' అని సవాల్ చేసినట్లు మాట్లాడిందిట. పళ్లు బిగపట్టి మొహం ఎర్రగా అయి, చేతులతో రక్కేటట్లుగా అభినయం చేశాట్ట కాని నోటంట మాటరాలేదుట. ఇవన్నీ పేరమ్మ చెప్పిందిట.

జీవితంలో ఏదీ ఆశించనివాడికి అసంతృప్తి వుండదు. కోరింది లభించలేదన్నప్పుడు వొచ్చే కోపం రాదు. ముకుందం ఉద్రేకాలకి అతీతుడు. కార్యశూరులు కోపానికి గురవుతారు. అతను ఏ కార్యం తలపెట్టడు, చెయ్యడు, కోపం అంటే ఏమిటో ఎరగని అమాయకుడు. అట్లాంటి ముకుందాన్ని పేరమ్మ రెచ్చగొట్టింది. కోపం తెప్పించింది. దాని తీవ్రతకి అతని శరీరం తట్టుకోలేక పోయింది. వ్యక్తిత్వానికి 'షాక్' తగిలింది. తేరుకోలేక పోయాడు. 'మాట' అతని ఆయుధం, అతని ఆయువు పట్టు, దాన్నే సవాల్ చేసింది పేరమ్మ, ఆయువుపట్టుమీద దెబ్బ కొట్టింది. ఊహాజగత్తు, పేలిపోయింది. మానసికగోళాలు ఢీకొన్నాయి. వాటిమధ్య నలిగి కాలచక్రం నిలిచిపోయింది.

లోపలికెళ్ళి చూశాను. దిగులుగా, కూర్చున్నాడు. పెరిగిన గడ్డంలో తెల్ల వెంట్రుకలున్నాయి, కళ్లకింద గీతలున్నాయి. జుట్టంతా చిందరవందరగా వుంది. పిచ్చివాడులా వున్నాడు. నన్ను చూశాడు. నాకళ్లల్లోకి లోతుగా చూశాడు. ఏమీ మార్పు లేదు అతని ముఖంలో. మందహాసం లేదు. నేను ఫలానా అన్న చైతన్యం లేదు. నాకు జాలేసింది. ఇల్లాగన్నాను

“ముకుందంగారూ—మీరు జీవితంలో అన్నీ సాధించారు. వొక్క పెళ్ళి తప్ప, మౌనంగా, నిశ్శబ్దంగా వుండటంతప్ప అన్నీ సాధించారు. మీరు నిండైన, పరిపూర్ణులైన ధన్యజీవులు.”

ఏదో చప్పుడైంది—సంకెళ్లు వూడిపడ్డట్లు, సముద్రం వెనక్కి వెళ్ళి ఎండినట్లు, భూకంపం బీటలు మూసుకుని లోలోన అణగారినట్లు, కాలచక్రం వొక్కసారి కదిలినట్లు—

“ఆ—నేను మాట్లాడలేనంటారా? నేను మూగనా—నిశ్శబ్దమా—మౌనమా... ఎందుకు మాట్లాడలేను. వినడం చేతకాని వారికి మాట్లాడ్డం చేతకాదు. వాళ్లేమూగవారు. ఓసారి విజయనగరంలో అష్టావధానం జరిగింది. పదిమందీ పది ప్రశ్నలడుగుతారు. వారికి సమాధానాలు, గంట తర్వాత, క్రమంలో చెప్పాలి. నేనో ప్రశ్న అడిగాను, తికమకగా—కాకి గూటిలో చిలుక పిల్ల వుంటే తోడేలు చెట్టుకింద వున్నప్పుడు, పెద్దపులి అరుస్తే, భయపడేది, చిలుకపిల్లా, కాకా, తోడేలా—క్రమంలో చెప్పాలి...”

అల్లా ముకుందంగారు యథావిధిగా తన ధోరణి సాగించారు. ఆయన మాట్లాడిన వాక్యానికి ప్రతిధ్వని లేదు. వాక్యం ముగించినప్పుడు కదా ప్రతిధ్వని వినబడేది! ఆముగింపు లేదు—ఆ ప్రతిధ్వని లేదు.

ఈకథలో ముకుందానికి అన్యాయం చేశానా ఎక్కువ చేశానా అని తిరిగిచూశాను. ఒకచోట చేశాను. రెండోసారి నన్ను కలుసుకున్నప్పుడు 'రండి టీ తాగొద్దాం' అని ముకుందం అన్నట్టుగా వ్రాశాను. అది పొరపాటు. అట్లా ముకుందం అనలేదు. అనడు. టీకి, భోజనాలకీ, స్థూలజగత్తులో శారీరకావసరాలకీ అతనికి టైము లేదు. వీటితో ఆ ఊహాసామ్రాజ్య చక్రవర్తికి నిమిత్తం లేదు. అతను హాస్పిటల్లో వున్న ఆవారంరోజులే కాలచక్రానికి విరామం.



# నన్నయ చిత్రించిన రాజరాజు

శ్రీ దివాకర్ల వేంకటావధాని

రాజరాజు నలువది సంవత్సరములకుఁ బైగా చాళుక్య సామ్రాజ్యమును బరిపాలించి యుండెను. ఆ పరిపాలన కాలమున జగద్ధితమునకై యాతఁ డొనరించిన మహాకార్యము లెన్నో యుండవచ్చును. కాని యవియన్నియు నొక యెత్తుఁ ఆంధ్ర వాఙ్మయమునకాతఁడు గావించిన సేవా విశేష మొక యెత్తు. కావ్యగీత ప్రియుఁడైన యీ మహారాజు ప్రేరణ ప్రోత్సాహములే లేకుండినచో నా కాలమున నాంధ్ర భారత మవతరించుట కవకాశమే లేకయుండును. ఈ విధముగా నాతఁడాంధ్రులకు, నాంధ్రభాషకు, నాంధ్ర దేశమునకుఁ గలిగించిన మే లింతింతనరానిది. స్వార్థరహితమైన యీ సేవ కారణముగా నాతఁడు గాంచిన ఫలితమును నపారమైనదే. ఏలయన నాంధ్రభారత రచనారంభ మాతని కీర్తి చంద్రిక కనవరత శరత్కాలమై యపరిమితౌజ్జ్వల్యము నావహించుచున్నది.

రాజరాజు నన్నయ నాంధ్రమున భారతము రచియింపుమని కోరెనే గాని దానిని దన కంకితము చేయుమని కోరియుండలేదు. నన్నయయు నా మహాకావ్యము నతని కంకితము చేసినను జేయకపోయినను, అవతారికారంభమున నతని గుణగణములను వర్ణించుచో కాక యాశ్వాసాద్యంతములం దర్థవంతములైన యనేక విశేషణములచే నతని సంబోధించి శౌర్యత్యాగ నయ క్షమా వివేకాదులకు నతని గుణములకును, నిర్మలమైన కీర్తికిని అక్షరరూపమైన మూర్తి తీర్చి దిద్దినాఁడు. ఆ త్రిలింగ భాష మా దివ్యమూర్తి యాంధ్రజనుల ప్రేమల సాక్షాత్కరించుచునే యుండును.

శాసనకావ్యకర్తలు శాసనములలో నాయా రాజేంద్రులనుగూర్చి పలు విధములుగాఁ బ్రశస్తి వాక్యములను రచించుచుందురు. ఈ ప్రశస్తులలో సాధారణముగాఁ గులాచారయశశ్శౌర్య త్యాగ శీలాదుల వర్ణనమును, "కీర్తి, ప్రజారాగ, ప్రతాపాజ్ఞా, నయ, క్షమా, వివేకారిపురీదాహ, ధర్మ సంగ్రామ" ప్రభృతులను విశేషగుణముల ప్రశంసయుఁ గనవచ్చుచుండును. ఒక్కొక్కప్పు డందా రాజునకు విరుద్ధులైన శత్రువుల గుణగణములను విస్తరించి, యట్టివారి నవలీలగా జయించుటచే నతనికిఁ గలుగు నుత్కర్షను పైతము ప్రదర్శింప వచ్చును.[1] రాజరాజనరేంద్రుని కోరుమిల్లి దాన తామ్రశాసనమిందుకు దృష్టాంతము. భారతమున నన్నయ కావించిన రాజరాజ వర్ణనము కూడఁ బయి విధముల శాసనము లందలి ప్రశస్తి వర్ణనమును దలపించుచున్నది. ఇందు యథార్థ గుణగణవర్ణనముతోపా టనుస్యూతముగాఁ దద్వంశీయులు వహించుచు వచ్చిన బిరుదులును, లాక్షణికులు నాయకుని కుండవలెనని చెప్పిన సాంప్రదాయిక లక్షణములును, కొన్ని గోచరింపవచ్చును. కవితావశమున నిం దచ్చటచ్చట నతిశయోక్తులు చొచ్చుటకును నవకాశము లేకపోలేదు. ఇటని యిందలివిషయ మంతయు నయథార్థ కల్పనగాఁ బరిగణించుట మాత్ర ముచితము కాదు. అలంకారాసక్తిచే నరుదెంచునట్టి యతిశయోక్తుల నెఱుంగుట కంత కష్టపడ నవసరము లేదు. అట్టి వానిని గొన్నిటిని దొలఁగించి చూచినచో నన్నయ నిర్మించిన రాజ రాజు నిర్మలమూర్తి మనకు సుస్పష్ట రేఖలతో సాక్షాత్కరించి తీరును. నన్నయ నిత్యసత్యవచనుఁడునుఁ మిత భాషియు నగుటచే నాతని వర్ణనములం దట్లు వర్ణనీయములైన విషయము లంతగా గోచరింపవు.

నన్నయ వర్ణించిన రాజరాజు గుణగణములలో నెల్లఁ బ్రముఖములైన వాతని తేజః శౌర్య పరాక్రమములు. అతఁడు విక్రమాదిత్య నిభుఁడు. విభాకర తేజుఁడు. వీరావతారుఁడు. మృగరాజ పరాక్రముఁడు. అన్యరాజ తేజోజయశాలి యైన యాతని శౌర్య మప్రతిమానమైనది. నిజభుజ విక్రమముచే నాతఁడరాతి రాజ విగ్రహముల నోడించి యపరాజిత భూరి భుజాకృపాణ ధారాజల శాంత శాత్రవ పరాగుఁడై యొప్పారెను. "నిస్తేజిత వైరి వీర, దండితాహిత వీర, పరంతప, రిపుప్రలయ ప్రతాప, విక్రమోద్వేజితాహిత, జితారి విరోధి ప్రళయాంతక, భూరిప్రతాప పరిభూత విరోధివర్గ" మన్న సంబోధన లాతఁడు వైరివీరుల నిర్జించుటయందుఁ జూపిన సామర్థ్యమును వేయి విధముల వక్కాణించుచున్నవి. నన్నయ రాజరాజు శౌర్యపరాక్రమముల నింత యధికముగా వర్ణించుట కేవలస్తోత్ర ప్రియత్వముచేఁ గాదు. ఆ మహారాజు తాను రాజ్యమును బరిపాలించిన నాలుగు దశాబ్దుల కాలములో మూఁడు నాలుగు సారులైన వైరివీరుల నిర్జించి నష్టప్రాయమైన సింహాసనమును మరల సంపాదించుకొనవలసివచ్చెను. విమలాదిత్యుఁడు క్రీ. శ. 1019 లో మరణింపఁగా నెనువెంటనే రాజరాజు చాళుక్య సింహాసన మధిష్ఠింపవలసియుండెను. కాని యాతఁడు తరువాతి మూఁడేండ్లవఱకును దాయాదులయు శత్రువులయు నిరోధముచేఁ బట్టాభిషేకము నిర్వర్తించుకొనఁజాలకపోయెను. ఈ దాయాదు లెవ్వరను విషయమున భిన్నాభిప్రాయము లున్నవి. రాజరాజు సవతితమ్ముఁడైన విజయాదిత్యుఁడే తండ్రి మరణానంతరము చాళుక్య సింహాసనము నాక్రమించి రాజరాజున కాటంకము కల్గించెనని శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగా రభిప్రాయపడుచున్నారు. శ్రీ భావరాజు వేంకట కృష్ణారావుగా రప్పటికి విజయాదిత్యుఁడు బాలుఁడై యుండెననియు, శైశవము నందే యాతని హృదయక్షేత్రమున రాజ్యకాంక్ష మొలకెత్తెనని తరువాతి కాలపు శాసనము లేవియు సూచించుట లేదనియుఁ

1 అథవా తద్విరుద్ధస్య వర్ణయిత్వా బహూన్ గుణాన్
తజ్జయా న్నాయకోత్కర్ష చవర్ణనం మతం క్వచిత్ ।

దల్పి, యిమ్మడి చాళుక్యభీముని దాయాదులైన రాజమార్తాండ కంక విజయాదిత్యుల సంతతివారైన విరవద్యపుర పిఠాపుర చాళుక్యులే కాక కళింగములోని సర్వసిద్ధి చాళుక్యులు గూడ వేంగీసామ్రాజ్యమునకై రాజరాజుతోఁ బోరాడి యుండురనియుఁ, వా యదను చూచుకొని కళింగరాజైన మధుకామార్ణవుఁడు సైతము రాజరాజు నెదిరించి యుండుననియును రచించి యున్నారు.1 వీరిలో నెవ్వరు విరోధించినను వారి నోడించి పాలఁద్రోలు వఱకు రాజరాజు పట్టాభిషిక్తుఁడగుట కానుకూల్య మొందవి యుండ లేదు. అతఁడు "వైరి వేదండ గండ విదారి ఘోర తిరాసి భాసి భుజార్గళుఁడై" ఘోరాజి ముఖమున విజయప్రమదా సమాలింగనసౌఖ్యము ననుభవించుటకు మూఁడేండ్లు పట్టెను.2 ఈవిషయము నే కోరుమిల్లి తామ్రశాసనమున శేతనభట్టు "రాజ(రాజన్య3 సేవ్యయైన పృథివీరాజ్యలక్ష్మిని రాజరాజు భుజబలముచే భరించెనని చెప్పియున్నాఁడు. కోదండపార్థుఁడును, బరాక్రమ (పియధాముఁడును నగుటచేతనే రాజరాజు సింహాసనమునకువచ్చియు రాకముందే సంఘటిల్లిన యీ వైరినిరోధమును నిరసించి జగద్వలయ భాసుర సముద్యత్తేజుఁడును, వీర (శ్రీవనితాశ్రిత భూరిస్థిర బాహు దండుఁడునై విజయ వైభవము నందఁజాలెను.

ఇట్లాతఁడు "నిత్యలక్ష్మీ జయాభిరాముఁడై" (క్రీ. శ. 1022 వ సంవత్సరమునఁ బట్టాభిషేక మహోత్సవమును నిర్వర్తించుకొనఁ జాలెను. తరువాత నాతఁడు సుమారు తొమ్మిది సంవత్సరముల కాలము "నానావని నాథ కిరీట తటీ విలసద్రత్న సంఘటిత పదకమలుఁడై" సామ్రాజ్యమును సర్వజనానురంజనముగాఁ బరిపాలించెను. ఇంతలో నాతని యదృష్టచక్రము నేమి మూలల నట్లో గాని కావలసివచ్చెను. చాళుక్య సింహాసనాక్రమణమునకుఁ దగిన సమయ మెప్పు డరుదెంచునా యని యెదురుచూచుచున్న విజయాదిత్యుఁ డొక విప్లవమును లేవదీసి, రాజరాజును సింహాసన భ్రష్టు నొనరించి, 1081 జూన్ 27-వ తేదీన విష్ణువర్ధన విజయాదిత్యుఁడను పేరఁ బట్టాభిషిక్తుఁడయ్యెను. ఈ సందర్భమున నాతనికిఁ బశ్చిమచాళుక్య చక్రవర్తియైన రెండవ జయసింహుని సాహాయ్యసంపద లభించి యుండును. కొంతె మించుమించుగా నీకాలమునకే చెందియుండు కలిదిండి తామ్రశాసనము పశ్చిమ చాళుక్యులు వేంగిపైఁ గావించిన దండయాత్రను సూచించుచుండుట యిందుకుఁ బ్రామాణముగా నున్నది. రాజరాజు థైర్యామర ధరణీధరుఁడయ్యును ప్రబలమైన శత్రుధాటి కాగలేక సాయమర్థించుటకై చోళ రాజధానియైన గంగాపురి కరిగెను. రాజేంద్ర చోళుఁ డాతని ప్రార్థన నంగీకరించి రాజరాజ బ్రహ్మ మహారాజు, ఉత్తమ చోళచోళ కోన్, ఉత్తమ చోళ మిలాడ్, ఉదై ఎలాన్ అను మువ్వురు సేనానాయకుల యాధిపత్యమున పెద్ద సైన్యమును వేంగిదేశమునకుఁ బంపెను. ఆ సేనవచ్చి పశ్చిమ చాళుక్య సైన్యమును కలిదిండి యొద్దఁ దాఁకెను. ఈ యుద్ధమున నే పక్షమునకు విజయము చేకూరెనో చెప్పఁజాలము. ఏలయన నందిరు పక్షము లందలి సేనానాయకులును వీరస్వర్గము నలంకరించిరి. కాని తరువాత రాజరాజు యుద్ధ నిహతులైన యా చోళ సేనాపతుల మువ్వురికిని స్మారక చిహ్నములుగా మూఁడు దేవాలయములు నిర్మించియుండుటచేఁ జోళుల తోడ్పాటుచే నాతఁడు సింహాసనమునఁ బునః ప్రతిష్ఠాపితుఁడైన ట్లూహించుట కవకాశము కలుగుచున్నది. ఇట్లు వీరోగ్రాజి విజయుఁడై యాతఁడు పోయిన సింహాసనమును మరల సంపాదించి యేఁబదియొకేండ్ల కాలము రాజ్య మొనరింపఁ జాలెను. ఈ సమయమునఁగూడ నాతని కప్పు డప్పుడు పశ్చిమచాళుక్యులవలన వలజడి కలుగుచునే యుండెను.

క్రీ. శ. 1042 లో రెండవ జయసింహుఁడును దరువాత రెండేండ్లకు రాజేంద్ర చోళుఁడును దివంగతులగుటచే త్రైలోక్య మల్ల ఆహవమల్ల సోమేశ్వరుఁడును రాజాధిరాజును గ్రమముగాఁ బశ్చిమ చాళుక్య చోళ సింహాసనముల నధిష్ఠించిరి. వేంగీ విషయము కారణముగా వా రిరువురికిని మరల యుద్ధ మారంభమాయెను. ఈ సారి చోళులు నిర్విరామముగా దండయాత్రలు సల్పుచుండినను లెక్కచేయక పశ్చిమ చాళుక్యులు వేంగీ రాజ్యమునందలి చాల భాగము నాక్రమింపఁజాలిరి. రాజరాజు పూర్తిగా రాజ్యభ్రష్టుఁడు కాక స్వల్పభాగమును మాత్ర మేలుచుండినట్లు క్రీ. శ. 1047 లో వేయఁబడిన ద్రాక్షారామ భీమేశ్వరాలయము నందలి యొక శాసనము వలనఁ దెలియుచున్నది. (ARE 188 of 1898) వేంగీ దేశ మట్లు పరాధీనమై పోవుటకు సహింపఁజాలక చోళ చక్రవర్తియైన రాజాధిరాజు పశ్చిమ చాళుక్యుల నెదిరించుటకై నాలుగైదుసార్లు పెద్ద సేనలను బంపెను. ఆ సేనలు పశ్చిమ చాళుక్యసేనల నోడింపఁ జాలినను వేంగీదేశమును మాత్రము వారి బారినుండి తప్పింపలేక పోయెను. చోళసేనలు కూడఁ దన కెరిధముగను తోడ్పడలేకపోవుట చూచి పశ్చిమ చాళుక్యులతో నింకను బోరు సల్పుచుండుచో నున్న రాజ్యము కూడఁబోవు నేమో యను భయముచే రాజరాజు క్రీ. శ. 1051 లో వారితో సంధిచేసికొనెను. ఈ సంధివలన రాజరాజు తన రాజ్యమును దాను సంపాదించినను బశ్చిమ చాళుక్య చక్రవర్తి సార్వభౌమత్వము నంగీకరింపవలసి వచ్చెను. ఈ సందర్భమున నే యాహవమల్ల సోమేశ్వరుని ప్రధానులలో నొకఁడును, నన్నయ భట్టారకుని సహాధ్యాయుఁడునైన నారాయణభట్టు పశ్చిమ చాళుక్యుల ప్రతినిధిగా రాజరాజు కొలువున కరుదెంచుట సంభవించెను. క్రీ. శ. 1051-52 లో రాజరా జాతనికి నందమపూడి గ్రామము నగ్రహారముగా నొసంగెను. అతఁడు భారత రచనమున నన్నయకు వలెనే రాజకీయ వ్యవహారములలో రాజరాజునకును గొంతతోడ్పడి యుండవచ్చును.

వేంగీ దేశమును పశ్చిమ చాళుక్యుల బారినుండి కాపాడుటకై చోళ చక్రవర్తి ప్రయత్నము లొనరించుచునే యుండెను. ఆప్రయత్నములవలన నేమియు లాభము కలుగకుండుటయే కాక కొప్పం యుద్ధరంగమునఁ గలిగిన పరాజయమునకు ఫలముగాఁ జోళులు గంగవాడి రాష్ట్రమునుగూడఁ గోల్పోవలసి వచ్చెను. దానితో రాజరాజునకుఁ జోళుల సాయముపై నాశ సన్నగిల్లెను.

1 The Eastern Chalukyas of Vengi (P. 218, 219)

2. రాజరాజ నరేంద్రుఁడు పు. 100.

3. రాజ(రాజన్య సేవ్య మధృత భుజబలా (రాజ్య లక్ష్మీం పృథివ్యాః.

అందుచే నాతఁడు క్రీ. శ. 1061 లో మరణించు వఱకును బశ్చిమ చాళుక్యుల సామ్రాజ్యమునకు లోఁబడియే యుండవలసివచ్చెను. అతని మరణానంతరము విజయాదిత్యుఁడు బలవంతముగా సింహాసనము నాక్రమించి తన కుమారుఁడైన శక్తివర్మనందుఁ బ్రతిష్ఠించెను. పశ్చిమ చాళుక్యులతో సంధి కావించుకొన్న పిమ్మటనే రాజరాజు కొంత ప్రశాంతిముగా రాజ్యమేలఁ జాలుటయు, నాతని ప్రేరణమున నన్నయ భారతాంధ్రీకరణమునకుఁ బూనుటయు సంభవించి యుండును.

ఈ విధముగా రాజరాజు పరిపాలించిన కాలమంతయు యుద్ధములతోనే కడచిపోయెను. అతఁడు చోళుల సాహాయ్య మర్థించినమాట సత్యమేయైనను దాను కేవలము వారిపై నాధారపడి యూరకుండలేదు. సమయము చిక్కినప్పుడెల్ల నాతఁ డరాతుల నపారధైర్య సాహసములతో నెదిరించి పోరాడుచునే యుండెను. ఆ యుద్ధములలో నాతఁడు ప్రదర్శించిన ధైర్యశౌర్య పరాక్రమముల నెఱింగినవాఁడు కావుననే నన్నయ వాని నాశ్వాసాద్యంత పద్యములలో నంత విస్తృతముగా విసుగులేక వర్ణించియున్నాఁడు. రాజరాజు రణరంగముల వీరరసావతారమో యన విహరించి "పరమండలంబుల ధరణీపతుల నదిమి కప్పంబుల ముదముతోఁ గొనుచును, బలిమిసీయని భూమివలయపతుల నుక్కడించుచు, దిక్కుల దనయాజ్ఞ వెలిగించుచు, భీతుల శరణన్నఁ గాచుచుఁ బలరిపు లలనాసన కమల హారిణలాంఛన మూర్తియై నిర్వక్రప్రక్రమమున" వర్తిల్లిన వాఁడే కాని సామాన్యుఁడు కాఁడు. అతని పరాక్రమమును వర్ణించుచు నన్నయ వాడిన విశేషణము లన్నియు నీ విషయమునకు సాక్ష్యములై యున్నవి. నందమపూడి శాసనమున నన్నయ రచించిన

"యస్యస్ఫార భుజాకృపాణ దళితారాతీభ కుంభస్థల
ప్రోన్ముక్తామల వృత్తి మౌక్తిక చయ స్సంగ్రామ రంగాంతరే
ధత్తే వీరరస క్రియాభి నయన ప్రస్తావ నా లక్ష్మితాం
వీర శ్రీ రచితాంజలి ప్రవిసర త్పుష్పోపహార క్రియః"

అను శ్లోకముకూడ నాలంకారికమైన యతిశయోక్తితో గూడి యున్నను నన్నయకు రాజరాజు భుజబలముఁ గల ప్రత్యయమును జక్కఁగాఁ బ్రతిపాదించుచున్నది.

రాజరాజు వీర్యవిక్రమాది తీవ్రగుణములకే కాక దానదయా సౌజన్యాది మృదుగుణములకుఁ గూడఁ గూడలియై వ్యసన వివర్జితమైన యకలంక చరిత్రసంపదచే నఖిల జగజ్జేగీయమానుఁడై విరాజిల్లుచుండెను. "అఖిల జగజ్జేగీయమాన నానాగుణరత్న రత్నాకరుఁడు, గుణధాముఁడు, బుధనుత సుగుణాధారుఁడు, గుణరాజితుఁడు, భూరిగుణరత్నభూషణుఁడు. రాజనూరి సభాంతర భ్రాజిత సద్గుణుఁడు" మున్నగు విశేషణము లిందుకుఁ దార్కాణములు. అతనికిఁ గరంబిష్టంబులైయుండు నేను వస్తువులలో సంతత దానశీలతయు, కవిత్వాసు సాంగత్యమును పేర్కొనబడి యున్నవి. "అగ్రజన్ములకు ననుగ్రహమునఁ బారుతేరమహాగ్రహారంబు లిచ్చుచు, దేవభోగముల మహావిభూతిఁ దనరఁ జేయుచు" నాతఁడు నానా వినోదియై తనరారుచుండెను. అతఁడు కరుణారసపూర్ణుఁడు, కృపారస బంధురుఁడు, దయాలాప చతురాస్యుఁడు, ధర్మదయార్ద్ర విబద్ధబుద్ధి, అతని సౌజన్య మింతింతనరానిది. సంతతమైన క్షమయు, సకల జనానందకరమైన సౌజన్యమును నాతనికి పెట్టని యాభరణములు. వినయ మాతనికి చిన్నతో పుట్టిన విద్య. సత్యధర్మము లాతనికి సంతతారాధ్యములు. నిత్య సత్యధన ధన్యుఁడనియు, వినయసత్య నిత్యోదయుఁడనియు, సత్యోదితుఁ డనియు, నిత్యనిరంతర ధర్మమతి యనియు, నన్నయ యాతనిఁ బలుపార్లు వర్ణించి యున్నాఁడు. నిరవద్యుఁడై విమల విచారముల కునికిపట్టై, జగత్పావన శుభచరితచే నిఖిల ధరాదేవస్తుత్యుఁడై యాతఁడు ధరణీతలమున కపూర్వ మండనమై భాసిల్లెను. ఇన్ని గుణముల కాలవాలమై యుండిన కతమున నే నన్నయ యాతని నాదిరాజ నిభుఁడని ప్రశంసించి యుండెను.

వైదికధర్మము నెడను దదనుబంధులగు యజ్ఞయాగాదుల యెడను రాజ రాజునకుఁగల ప్రీతి యపారమైనది. "పరమ ధర్మవిదుఁడు, ధర్మవిశారదుఁడు, ధర్మనిత్య ప్రారంభవిభాసి, ధర్మవిచారోద్దాముఁడు, మున్నగు విశేషణములందు నన్నయవాడిన ధర్మపదమునకుఁ బ్రధానముగా వైదికధర్మమనియే యభిప్రాయము. వేదప్రోక్తములగు ధర్మములలో వర్ణాశ్రమ ధర్మానుసరణమును, యాగాది కర్మాచరణమును బ్రధానములైనవి. రాజరాజు సమస్తవర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమ నొప్పారి నలనృగ భగీరథ రామచరిత్రాభిరాముఁడను ప్రశస్తి వహించియుండెను. ఆదిక్షత్రి చరిత్రుఁడను విశేషణము కూడ నీయర్థమునే సూచించుచున్నది. "బహుభాషల బహువిధముల బహుజనములవలన వినుచు భారతబద్ధ స్పృహులగు వారికి బహు యాగంబులఫలంబు పరమార్థము"నని యాతఁడు చెప్పుటలో నతనికి యాగాది కర్మానుచరణమునెడ యభినివేశము తేటతెల్లమగుచున్నది. యాగాచరణమున కగ్రజమ్ముల తోడ్పాటవసరము. వేద సంరక్షణము వారి యధీనమైయున్నది. అందుచేతనే "బ్రాహ్మణా వేదపాలకాః" అను నానుడి యేర్పడినది. వేదరక్షణ వైదిక కర్మాచరణములతో విప్రవరేణ్యులకున్న సంబంధమును బురస్కరించుకొని రాజరాజువారి యెడభక్తి ప్రపత్తులు కలిగి మెలఁగుచుండెను. ధరణీసురవర సురభూజరాజమై, విప్రకులము నెల్లఁ బ్రోచుచు వారొసంగు నాశీపరంపరలు నిత్యవివృద్ధి చేకూర్పుచుండ (ధరా దేవాశీః పరంపరా వర్ధిత నిత్యోదయుఁడు) నాతఁడు సంతతాభ్యుదయుఁడై చెన్నారుచుండెను. వేదముల తరువాతఁ బ్రమాణభూతములైనవి స్మృతులు. శ్రుతిచోదితములైన ధర్మములనే స్మృతులు స్పష్టముగా బోధించుచుండును. అట్టి స్మృతికర్తలలో మనువు ప్రధానుఁడు. అతఁడు వైదికధర్మములను స్మృతి రూపమున నిబంధించుటయే కాక యట్లాచరించి తరువాతి రాజుల కందఱికి నాదర్శప్రాయుఁడై వర్తిల్లెను. రాజరాజు మనుమార్గుఁడై, మనునిభశుభచరిత్రుఁడై యొప్పారె ననుట యాతని వైదిక మార్గానుసరణ తత్పరతకే దృష్టాంతము. చతుర్యుగములందును ధర్మము త్రేతోత్తర పరిహీణమై సన్నగిల్లుచుండును. హనుమంతుఁడు భీమునకుఁ జతుర్యుగాచారవర్తనములఁ జెప్పు సందర్భమున "కలియుగమునందు ధర్మము బలమతి వర్తిల్ల నేకపాదంబున" నని కలియుగ స్వరూప

మాట చెప్పియుండెను. కలియుగము దురితముల కాలవాలము. చళుక్యమన్మథుఁడైన రాజరాజు "ఘనదురితానుబంధ కలికాలజదోష కుఠారసంహతిం దన యుదయ ప్రభావమున దవ్వుగఁజోపి, జగజ్జనానురంజనముగ రాజ్యసంతతి నిరంతర విభూతి"తో ధర్మదయార్ద్ర నిబద్ధబుద్ధియయి వర్తిల్లెను. నన్నయ యాతని "కలికాలభరత" యని సంబోధించెను. దుష్యంతకుమారుఁడైన భరతుఁడు ద్వాపర యుగమునం దుండినవాఁడు. నన్నయ యాదిపర్వచతుర్థాశ్వాసమున (109) నాతని—

"భరతుఁ డశేష భూ భువన భార ధురంధరుఁడై వసుంధరం
బరఁగి యనేక యాగముల బాయక భాస్కర జహ్నుకన్యకా
సురుచిర తీరదేశముల సుశ్రుతుఁడై యొనరించి భూరి భూ
సురులకు నిచ్చె దక్షిణలు భూరి సువర్ణ గవాశ్వహస్తులన్"

అని వర్ణించి యుండెను. ఈ పద్య మాతని వైదిక కర్మాచరణ ప్రవణత్వమును బహువిధముల వ్యక్తము చేయుచున్నది. రాజరాజు కలికాల భరతుఁ డనుటలో యుగ భేద మున్నను అతఁడు యాగాది వైదిక కర్మాచరణ తత్పరుఁడై భరతునివలె వర్తించెనను నర్థము స్ఫురించుచున్నది. నందంపూడి శాసనములో నన్నయ నయశాలియైన రాజరాజు మనుమార్గమున క్షితితలమును సంరక్షించుచుండఁ బ్రీతులై ప్రజలు నిజచరిత్ర పవిత్రతోదయములచేఁ గలికాల కలంక పంకమును బ్రక్షాళించుచుండిరని వ్రాసియుండెను. దీనివలన రాజరాజు కలియుగమునందే వర్తించినను అప్రతిమానమైన ధర్మాభిలాషచే లోకమున యుగాంతరధర్మములఁ బ్రతిష్ఠించి కృతకృత్యుఁ డయ్యెనని తెలియుచున్నది.

రాజరాజు విద్యా వివేకములకు నిధానము. వివేక విభ్రాజిత, వివేక చతురానన, విద్యావిలాస మున్నగు విశేషణము లిందుకు నిదర్శనములు. విమల ధీరమణీయుఁడైన యీ మహారాజు సాహిత్యము నందే కాక శాస్త్రములందును నిష్ణాతుఁడై వాణీ లీలాస్పదుఁడు సరస్వతీ విలసన్ముఖాంభోజుఁడు నని ప్రశస్తి కెక్కియుండెను. అతఁ డనేక పురాణములు వినెను; ఉదాత్త రసాన్విత కావ్య నాటకక్రమములు పెక్కు చూచెను. అర్థ ధర్మశాస్త్రముల తెఱం గెఱింగెను! జగత్త్రిపూజ్యములైన యీశ్వరాగమములందు భక్తిమై హృదయము నిల్పెను. మహాభారత శ్రవణ మన్న నాతని కెంతో యాసక్తి. ఇట్లు శాస్త్ర సాహిత్యములం దాటితేరి కావ్యగీతప్రియుఁడై యలరారుటయే కాక యీ రాజేంద్రుఁడు రాజనీతియందును, నిఖిల రాజవిద్యలయందును నిపుణుఁడై గంధసింధుర హయశిక్షారూఢ దక్షుఁడై, రాజలోకమున కొజ్జబంతియై రాజిల్లుచుండెను. నయబంధుర, నిఖిల రాజ విద్యానిధి, నృపవిద్యాపాలక, పార్థివ విద్యాధరా మున్నగు విశేషణము లీ విషయమును వెల్లడించుచున్నవి.

రాజరాజు స్వయముగా విద్వాంసుఁడై యుండుటచే మనీషి విద్యాశ్రేయ తత్త్వవిత్త్వమున నేర్పరియై కవిపండితుల నుచిత విధమున సత్కరించుచుండెను. 'విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమ'మ్మను నానుడి యున్నదియేకదా! శిష్టజనబృందమును, కవిపండిత సమాజమును, బంధుమిత్రవర్గమును నాతనిచే బహువిధములైన మన్ననలబడసి యాతని సౌజన్యమును రసజ్ఞతను గొనియాడుచుండిరి, కవీంద్రసమాజ సురసద్మజ, సూరినిధాన, బుధజన చింతామణి, శిష్టపరిపాలన శక్త, విశిష్టాంభోజమిత్ర, సుహృన్నిధాన, మిత్ర విద్వదంభోజ వనసరోజమిత్ర, బాంధవాంభోజ వనద్యుమణి యను విశేషణము లాతని విద్వత్కవి పోషణమును, బంధుప్రీతిని విశదము చేయుచున్నవి.

విద్యా వివేకములకు నిధియై యంతర సౌందర్యమున నలరారుటయేగాక రాజరాజు కాంతిదీప్తులకు నిధానమై యపూర్వ దేహ సౌందర్య విశేషముచే నపరమన్మథుఁడన నొప్పారుచుండెను. "రాజ మనోహరుఁడు, తుహినకరుఁడురుకాంతిన్" అను విశేషణము లాతని సౌమ్యమైన యాకృతిని, కాంతినిధి, దీప్తినిధియను సంబోధన లాతని శరీరకాంతి సంపదను వెల్లడించుచున్నవి. యువతీ మదనుఁడు, భువనైక సుందరుఁడు, భావభవ విభవసుభగుఁడు, మన్మథాకారుఁడు, తరుణావతారుఁడు మున్నగు విశేషణము లనన్య సామాన్యమైన యాతని రూపవైభవమును చెప్పక చెప్పుచున్నవి. ఇట్లు రూపగుణోపేతుఁడైన యీ చాళుక్య మన్మథుఁడు "భూరిసంపదఁ దలపూవు వాడని భోగియై, నిరంతరానందమునఁ గాలము బుచ్చుచుండెను." "పూర్వదిక్ప్రిథు విలాస, వాసవమూర్తి, నానావిధ విభవ విభాసమాన, నిరంతరానందమతీ,"యను విశేషణము లీ విషయమును వ్యక్తము చేయుచున్నవి. రాజరాజు పార్వతీపతి పదాబ్జధ్యాన పూజామహోత్సవమునం దధికమైన ప్రీతి కలవాఁడు. "మృడప్రియుఁడు, మహారి దయాలబ్ధ సుస్థిరైశ్వర్యుఁడు,' మున్నగు విశేషణము లీ విషయమును స్థిరపఱచుచున్నవి. వేంగీచాళుక్యులందఱికి వలె నాతనికిని దక్షవాటి భీమేశ్వర దేవుఁడు కులదైవము. భీమేశ్వర కృత నిత్యప్రసాదుఁడని నన్నయ యాతని వర్ణించియుండెను. "జగత్త్రి పూజ్యములైన యీశ్వరాగమము లందాతఁడు భక్తిమై హృదయము నిలిపి" పురారాతి పూజనాసక్తమతియై కాలము పుచ్చియుండెను. ఇట్లని యాతఁడు వీరశైవుఁడని మనము భావింప నక్కఱలేదు. వైదిక ధర్మమన్నను, వర్ణాశ్రమాచారము లన్నను, వైదిక కర్మాచరణ మన్నను అతని కింతింతనరాని ప్రీతి. వేదవిప్రు లతనికిఁ బరమపూజ్యులు. వేదశాస్త్రముల యభివృద్ధికై యాతఁ డనేక దానము లొసంగియుండెను. వేంగీ చాళుక్య సింహాసన మధిష్ఠించిన రాజు లందఱును బరమ బ్రహ్మణ్యులు, పరమ భట్టారకులు; పరమ మాహేశ్వరులు; "శుద్ధ విష్ణువర్ధనాదులు కొందఱు పరమభాగవతు లౌదురుగాక" అంత మాత్రమున వారు వైదికాచారపరాయణులు కాకపోలేదు. అది రాజచాళుక్య వంశమర్యాద, "వేంగీశ్వరులు బౌద్ధ ధర్మోపాసకులపై, శైవ మునులపై, శ్రావకులపై ఆదరాభిమానములు చూపి యీ యా ధర్మములను బోషింతురుగాక. దానధర్మములను జేయుదురుగాక, పరమ బ్రహ్మణ్యులును, బరమ మాహేశ్వరులును నైతీరవలయును. బ్రాహ్మణ ధర్మమవలంబించి పరమ బ్రహ్మణ్యుఁడు కానివాఁడు, ఈశ్వరాగమములందు మనసు నిలిపి పరమ మాహేశ్వరాచారపరుఁడు కానివాఁడు, రాజచళుక్య వంశజుఁడు వేంగీసింహాసనమునఁ గూర్చుండరాదు. అనర్హుడతఁడు" (రాజరాజనరేంద్రుఁడు పుట 92)

ధరణీ రక్షణమున రాజరాజు కడుంగడు దక్షుఁడు. రత్నాకర పరివృత సకలధరాకాంతుఁడైన యాతఁడు నిఖిల మహీవలయోద్వహ బాహు మండలుఁడును, నిఖిలమహీ రక్షామణియునై నిజవంశ

లాంఛనమునందలి వరాహమూర్తిచే భువనోద్ధరణ మొనర్చుచుండెను. నన్నయయు విష్ణుమూర్తి, విష్ణుసన్నిభ, నారాయణమూర్తి, నారాయణాఖ్య యని సంబోధించి యాతని భువనోద్ధరణ దక్షతను, విష్ణ్వంశ సంభూతత్వమును, ధ్వనింపఁజేసియుండెను.

రాజరాజనరేంద్రుఁడు "విలసచ్చాళుక్యాన్వయ పయోధిశశి" యుత్తమ చాళుక్యుఁడు, వర చళుక్యాన్వయాభరణుఁడు, శ్రీమచ్చళుక్యవంశశిఖామణి, విలసచ్చళుక్యవంశ తిలకుఁడు, చళుక్య మన్మథుఁడు' అని నన్నయ పలుచోట్ల నాతని వర్ణించియున్నాఁడు. ఈ చాళుక్యులు శైవులైన బ్రాహ్మణోపేత క్షత్రియులని శ్రీ. శ్రీ. చిలుకూరి వీరభద్రరావుగారు రాజరాజనరేంద్ర సంచికలో నిరూపించియున్నారు. (పుట 77). వీరు మానవ్యసగోత్రులనియు, హారీతీపుత్రులనియు, మాతృగణ పరిపాలితులనియు, స్వామిమహాసేన పాదానుధ్యాతులనియు, శాసనములు వర్ణించుచున్నవి. నన్నయకూడ రాజరాజనరేంద్రు నొక్కచో మానవ్యస గోత్ర పవిత్రయని సంబోధించియున్నాడు. విమలాదిత్యుని రణస్థిపూఁడి శాసనమునందును, ఇతరవాతి రాజరాజనరేంద్రుని శాసనములందును విజయాదిత్యుఁడు త్రిలోచన పల్లవునితోడి యుద్ధమున మరణించిన పిమ్మట నంతర్వత్ని యైన యాతని మహాదేవి పురోహితునితో గూడ ముడివేముయను అగ్రహారమున కరిగి దద్వాస్తవ్యుఁడైన విష్ణుభట్ట సోమయాజిచే దుహితృ నిర్విశేషముగా నభిరక్షితయై విష్ణువర్ధనుని గనెననియు, నామె యా కుమారునికి మానవ్యసగోత్ర, హారీతీపుత్రాది ద్విపక్ష గోత్రక్రమోచితములైన కర్మలు చేయించి యతనిఁ బెంచి పెద్దఁగా నొనర్చెననియుఁ జెప్పఁబడియున్నది. విష్ణువర్ధనుని కాపేరును హారీతీపుత్రగోత్ర సంజ్ఞయు, మాతామహ సమానుఁడైన విష్ణుభట్ట సోమయాజివలనఁ గలిగెనని యూహింపఁదగియున్న"దని శ్రీ. శ్రీ. జయంతి రామయ్య పంతులుగారు వ్రాసియున్నారు (రాజ. న సం. 76). దీనిని బట్టి చాళుక్యులు పితృపరంపరను బట్టి మానవ్యస గోత్రమునకును, మాతామహకల్పుఁడైన విష్ణుభట్ట సోమయాజిని బట్టి హారీతీ పుత్ర గోత్రమునకును జెందిన వారని దెలియుచున్నది. కాని యిట్లనుకొనుట కొక యాటంకము గోచరించుచున్నది. చాళుక్యులకు, బూర్వులైన కదంబుల శాసనములలోఁగూడ వారు మానవ్యస గోత్రులనియు హారీతీపుత్రులనియు స్వామిమహాసేనమాతృగణాధ్యాతాభిషిక్తులనియు వ్రాయఁబడియున్నది. (మృగేశ్వరవర్మ కదంబకని తామ్రశాసనము) అందుచే శ్రీ. శ్రీ. చిలుకూరి వీరభద్రరావుగారు "బహుశః చాళుక్యులు మానవ్యస గోత్రులును హారీతీ పుత్రులును నైన కదంబులను జయించుటచేత వారి వలెనే వీరును మానవ్యసగోత్రులమనియు, హారీతీపుత్రులమనియుఁ జెప్పుకొని యుండిరేమో" యని సంశయమును వెలిబుచ్చియున్నారు. (రాజ. న. సం. 76) వారికా గోత్రసంజ్ఞ కలిగిన తెఱఁగున కీ యూహ తక్క వేఱాధారములు కానవచ్చుటలేదు. చాళుక్యరాజులలోఁ బలువురికి విష్ణువర్ధన బిరుదనామము కలదు. నన్నయయు రాజరాజును విష్ణువర్ధన నృపతి, విష్ణువర్ధన భూపతియని రెండుమూడుచోట్ల సంబోధించియున్నాఁడు. విష్ణుభట్టసోమయాజిచే వర్ధితుఁడై చాళుక్యవంశ వర్ధనుఁడైన విష్ణువర్ధనునిబట్టి యావంశమువారీ నామమును దాల్చియుందురు.

రాజరాజు నన్నయను భారతము నాంధ్రీకరింపుమని కోరు సందర్భమున "హిమకరుఁ దొట్టి పూరు భరతాది కురుప్రభు పాండు భూపతుల్ క్రమమున వంశకర్తలనఁగా మహినొప్పిన యస్మదీయవంశ" మని చెప్పి తనది చంద్రవంశమని సూచించియున్నాడు. విమలాదిత్యుని రణస్థిపూండి శాసనమున భీమునభట్టు చాళుక్యవంశక్రమమును జంద్రునినుండియు వర్ణించియుండెను. దానినిబట్టి తరువాత నన్నయభట్టుకూడ చాళుక్యులను చంద్రవంశ సంభూతులుగానే పేర్కొనియుండిరి.[1] రాజరాజనరేంద్రుని మనుమఁడగు వీరచోడుని చెల్లూరి శాసనమునఁగూడ నట్లే వ్రాయఁబడియున్నది. "కాని వేంగీదేశమును పాలించిన కుబ్జవిష్ణువర్ధనుఁడు మొదలు విమలాదిత్యుని వఱకును 26 గురు చాళుక్యరాజులు పరిపాలనముచేసి, శాసనములు వ్రాయించినను, వానియం దెచ్చటను జాళుక్యవంశము చంద్రవంశాంతర్గతమని చెప్పబడియుండలేదు. పశ్చిమ చాళుక్యుల శాసనములలోఁగూడ నీరీతి వంశవర్ణనము కానరాదు. పదునొకండవ శతాబ్దిలో విమలాదిత్యుఁడు సూర్యవంశీయుఁడని వ్యవహరింపఁబడెడి రాజరాజచోడ మహీపతి కూతురగు కుందవాంబాదేవిని వివాహమాడిన పిమ్మటఁ జాళుక్యవంశము చంద్రవంశాంతర్గతమైనదిగా భీమన భట్టుచేఁ దొలుఁదొలత నభివర్ణింపఁబడె"నని వ్రాసి (రాజ.న. సం. 75) శ్రీ॥ శ్రీ॥ వీరభద్రరావుగారు "ఈ రాజవంశములవారును వారి బాంధవులును బ్రాహ్మణులలో గలసిపోయిన పిమ్మట వారికడ భృత్యులుగా నుండువారు తమ తమ పుత్రికుల కాపేరులను—అనఁగా చోడరాజు, చాళుక్యరాజు, వల్లభరాజు, గంగరాజు మొదలగు నామములను—పెట్టుటచే వారి సంతతివారు దానిం దెలిసికొనక వారిని సూర్యవంశపు రాజులని, చంద్రవంశపు రాజులని వ్యవహరింప నారంభించిరి. కొంతకాలమునకు వీర లున్నత పదవులను బొందిన తోడనే యిటీవలి కవివర్యులు కొందఱు వీరినిగూడ సూర్యవంశరాజులని చంద్రవంశపురాజులని తమ కృతులలో స్తోత్రపాఠములు వినిపించిరి. దీనిని సత్యమని తత్కాలపువారును, అజ్ఞులైన ప్రజలును విశ్వసింప నారంభించి"రని· తెలిపియుండిరి. (పుట 103) దీనినిబట్టి చాళుక్యులు చంద్రవంశాంతర్గతులనుట తరువాతి భట్టాదులచేఁ గల్పితమైన కథయే కాని సత్యముకాదని వారు తలంచిన ట్లవగతమగుచున్నది. ఇందలి యాథార్థ్యమును నిరూపించి తెలుపుట కవకాశములేదు. కాని యొక్కవిషయము మాత్రము వారి యూహను బలపఱచునట్లుగాఁ గానఁబడుచున్నది. నన్నయ పెక్కుచోట్ల రాజరాజకులమును గూర్చి ప్రస్తావించియున్నాఁడు. ఆది పర్వపష్ఠాశ్వాసాంతమున నొక్కచోట మాత్రమే మాతఁడు "శీతాంశువంశప్రకాశ" అను సంబోధనము వాడి, తక్కిన చోట్లనెల్లఁ జంద్రపర్యాయమైన రాజశబ్దమునే ప్రయోగించియున్నాఁడు. "రాజకులైక భూషణుఁడు రాజకులాగ్రగణ్యుడు, రాజకులశేఖరుఁడు. రాజాన్వయ తిలకుఁడు, రాజకులోత్తముఁడు, రాజవంశ వార్ధి చంద్రుఁడు, రాజవంశరత్నము, మున్నగు విశేషణము లిందుకుఁ దార్కాణములు, స్పష్టముగాఁ జంద్రశబ్దమునకో తత్పర్యాయమైన

1. శ్రీత్రోద్వంశగురూ బభూవు రతులా యస్యమ్బురక్తేజసా మూర్త్యా చంద్రమసో నిరస్తతమసః....జగద్భూషణ-కోరుమిల్లి శాసనము. యహోన్నమవంశ తిలక। శశవత్సరేషు - నందమపూఁడి శాసనము.

*FACTS OF FLUORESCENT LIGHTING : Number One in a Series*




# Blueprint for Lamps...

From the drawing board to the final stage of production Philips Fluorescent Lamps undergo rigid quality control and reliability tests. These lamps maintain an even strength of luminosity throughout their effective life—guaranteed to the established International Standards. The light output of Philips Fluorescent Lamps is three times as great as that of an ordinary incandescent lamp—for the same current consumption.

In different wattages ranging from 20 watt to 80 watt. Either-straight or circular. Available in all the normal shades—from daylight to the equivalent colour of incandescent light. Philips, who have done much for the development of fluorescent lighting, also manufacture essential lighting accessories: Control Gear, Lamp Holders, Trough Fittings—all carrying forward the tradition of Philips *dependability.*

## PHILIPS FLUORESCENT

**PLANNED LIGHTING**
For advice on lighting problems consult Philips Lighting Service Bureau, Calcutta, Bombay, Delhi, Madras, Patna, Lucknow.




**Lamps and Fittings**

సుశ్లోకబద్ధములో వాడక యిన్నిచోట్ల నాతఁడు రెండవయర్థమునకుఁ గూడఁ దావిచ్చు రాజశబ్దమునే వాడియుండుట శ్రీ. శే. వీరభద్రరావు గారి యూహ సత్యమేమోయను సందేహమును కలిగించుచున్నది.

చాళుక్య లసలు క్షత్రియు లగుదురా కాదా యను విషయము కూడ సందేహాస్పదముగనే యున్నది. బిల్హణకవి విక్రమాంకదేవ చరిత్రమున నొక్కచోటఁ జాళుక్య వంశమును విష్ణుపాద సంజాతమైన సురాపగతోఁ బోల్చియుండుటచే నందుఁ జాళుక్యులు పాదజాలనెడి విషయము ధ్వనించుచున్నదని కొందఱభిప్రాయ పడుచున్నారు.1 బిల్హణుఁడీ యుపమానమున నింత యంతరార్థము నిమిడ్చెనో లేదో చెప్పఁజాలము. అదికాక క్రీ. శ. 7 వ శతాబ్దికిఁ బూర్వమే చాళుక్యులు క్షత్రియులై యుండిరనుటకు విశ్వసనీయములైన నిదర్శనములు లభించుచున్నవి. క్రీ, శ. 543 నాటి బాదామి దుర్గ శాసనములోఁ జాళుక్యవల్లభేశ్వరుఁడు (పులకేశి 1) తాను శ్రౌత విధానముచే నశ్వమేధాది యజ్ఞముల నాచరించి యున్నట్లు చెప్పుకొని యున్నాఁడు2. నేరూరు తామ్రశాసనమున నాతని కుమారుఁడైన మంగళేశుఁ డాతఁ డశ్వమేధము నేగాక యగ్నిష్టోమ వాజపేయ, పౌండరీక బహు సువర్ణ యాగములనుగూడ నిర్వర్తించి నట్లు వ్రాయించియున్నారు.3 ఈ యాగములను ద్విజులు—అందును ముఖ్యముగా బ్రాహ్మణ క్షత్రియులు తప్ప నితరు లాచరించుటకు వీలులేదు. ఇది యిటుండఁ గ్రీ. శ. 7 వ శతాబ్ది పూర్వార్ధమున మన దేశమున సంచరించిన చైనాయాత్రికుఁడైన హ్యూయన్ త్సాంగ్ రెండవ పులకేశి క్షత్రియుఁడని స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు.

(Huien Tsang's Travels Walter vol, II page 239. He was Kshatria by birth and his name was Pu-lo-ki-she)

దీనినిబట్టి క్రీ. శ. 7 వ శతాబ్దిలోఁ జాళుక్యులు క్షత్రియులుగా బరిగణింపఁ బడుచుండిరని నిశ్చితముగాఁ దెలియుచున్నది.

రాజరాజు విమలాదిత్య తనూజుఁడనియు, విమలాదిత్యాగ్ర తనూజుఁడనియు, కులదీపకుఁడనియు, వంశవర్ధనుఁడనియు నన్నయ రెండుచోట్ల వర్ణించియున్నాఁడు. విమలాదిత్యుని కుమారులైన రాజరాజ విజయాదిత్యులలో రాజరాజే జ్యేష్ఠుఁడనుట నిర్వివాదమే యైనను సోదరులకు వయోభేద మంతగా లేకపోవుటచేతను, విజయాదిత్యుఁడు కూడ తండ్రి యనంతరము రాజగుటకు యత్నించుట సహజమగుటచేతను, అగ్రతనూజుఁ డనుటచే సర్వథా రాజరాజే రాజ్యార్హుఁడని చెప్పుటకో యన విమలాదిత్యాగ్ర తనూజయను సంబోధనము సుద్దేశపూర్వకముగా వాడినట్లు తోఁచుచున్నది. చతురాశ్వాసాంత పద్యములలో నాతఁడు రాజరాజును "సమస్త భువనాశ్రయ సత్యాశ్రయ కులశేఖర"యని సంబోధించి యున్నాఁడు. సమస్త భువనాశ్రయ బిరుదము మండ దానశాసనమునఁ బరిగ్రహీతమైన అంకయకుఁగూడ వాడబడియున్నది. (సమస్త భువనాశ్రయ బ్రహ్మమహారాజ ఇతి ప్రసిద్ధాయ). అంక యను బ్రహ్మమహారాజ పదవీ భాజితు నొసఁగునప్పుడే రాజరాజతనికి సమస్త భువనాశ్రయ బిరుదమును గూడ నొసంగియుండును. సమస్త భువనాశ్రయ బిరుదము కళ్యాణీ చాళుక్యుల శాసనములలో నే కాని, తూర్పు చాళుక్యుల శాసనములలోఁ దఱచుగాఁ గానరాదు. అది వారు సాధారణముగా వహించు బిరుదపరంపరలోనిదికాదు. రెండవ అమ్మరాజ విజయాదిత్యుఁ డొక శాసనములో J. A. H. R. S-ii 247) (శ్రీ సమస్తభువనాశ్రయ శ్రీ విజయాదిత్యమహారాజ పరమేశ్వరః) అని యీబిరుదమును వాడుకొని యుండెను. అతని తరువాత మరల నెవ్వరు నా బిరుదమును ధరించి యుండలేదు. సత్యాశ్రయ కులశేఖరబిరుదముకూడ నిట్టిదే. అది కళ్యాణీచాళుక్యులు తఱుచుగా ధరించుచుండు సత్యాశ్రయకులతిలక బిరుదమునకు రూపాంతరము. ఈ బిరుదమును ధరించుటకుఁ గళ్యాణీచాళుక్యుల కెంత యధికారము కలదో రాజరాజునకుఁగూడ నంతేయధికార మున్నది. ఏలయన వారివలె నీతఁడును గూడ బాదామి చాళుక్యరాజ్య స్థాపకుఁడైన ప్రథమ సత్యాశ్రయపులకేశి సంతతిలోనివాఁడే. కాని యీ పై రెండు బిరుదములను కలిపి వాడుకొన్నవారు తూర్పు చాళుక్యరాజులలో నొక్క రాజరాజుతక్క నింకెవ్వరును గానరారు. క్రీ. శ. 1052 వఱకు నతఁడు చోళులతోఁ గలిసి పశ్చిమ చాళుక్యులతోఁ బోరాడుచుండెను తరువాతఁ దనరాజ్యమునందలి చాలభాగమును వారాక్రమించుకొనుటచే నింక లాభము లేదని నిశ్చయించి పశ్చిమ చాళుక్యరాజు సార్వభౌమత్వము నంగీకరించుచు నాతనితో సంధి గావించుకొనెను. నూత్నసిద్ధమైన ఈస్నేహమునకు దార్కాణముగా నతఁడు పశ్చిమ చాళుక్యులకు సర్వసామాన్యమైన యీ పైరెండు బిరుదములను ధరించి యుండును. దీనినిబట్టి భారత రచనము క్రీ.శ. 1058 తరువాతనే జరిగియుండునని భావింపవచ్చును. నిజ వంశీయు లెవ్వరును ధరింపని యీబిరుదముల నాతఁడిట్లు వాడుకొనుటకుఁ గారణాంతరము కానఁబడదు.

ఈ విధముగా నన్నయ రాజరాజు పితృవంశమును సూచించు బిరుదముల భారతాశ్వాసాద్యంత పద్యములలో నెడనెడ వాడియుండెను మాతృవంశమునకు సంబంధించిన దొక్కటియు నెచ్చటను వాడియుండలేదు. అతని మాతామహునిఁగాని, మేనమామను గాని, తల్లినిగాని భార్యనుగాని యాతఁ డెచ్చటను పేర్కొనకపోవుటకుఁ గారణము తెలియదు. "కుందవాంబా కుమార! అమ్మంగ దేవీప్రియ!" మొదలుగాఁ గొన్ని సంబోధనల నాతఁడు వాడుట కవకాశము లేక పోలేదు. శ్రీ భావరాజు వేంకటకృష్ణారావుగారు సూచించినట్లు "ఆ చివరి కాలములో చోళ భూపతుల రాజనీతి చాళుక్య దాయాదులకు హితవు గాకుండెఁ గాఁబోలును." ప్రభు చిత్తవృత్తి కనుగుణముగా నన్నయయు నందుచేతనే యాశ్వాసాద్యంత పద్యములలో నెచ్చటను వారి ప్రశక్తి తెచ్చినవాఁడు కాఁడు.

నన్నయ రాజరాజునకు వాడిన సంబుద్ధ్యంతములోఁ గొన్ని సర్వరాజ సామాన్యములైనవి కలవు, "రాజమార్తాండ! రాజకంఠీరవ! పరగండ భైరవ! వైరి వీర రస వైద్య! త్రిభువనాంకుశ! రాజనారాయణ! పరగండ భేరుండక! బిరుదాంకభీమ! రాజసర్వజ్ఞ!" మున్నగున

1. Eastern Chalukyas of Vengi (Page 9)
2. అశ్వమేధాది యజ్ఞానాం యజ్వా శ్రౌతవిధానతః
3. I A VI Page 161. అగ్నిష్టోమ వాజపేయ పౌండరీక బహు సువర్ణాశ్వమేధావభృథస్నాన పవిత్రీకృతశిరః—వల్లభో వల్లభః.

విట్టిచే. నన్నయ తనకుఁ బూర్వము చాళుక్య రాజులచే వేయింపఁ బడిన శాసనము లన్నింటితో బరిచయము గలవాఁ డగుటచే నందలి కొన్ని విశేషణములను రాజరాజునకుఁగూడ వాడియుండెను. మొదటి విజయాదిత్యుఁడు దాల్చిన బిరుదములలో "విక్రమరామ!" యను నదొకటి. దాని ననుసరించియే నన్నయ రాజరాజును "పరాక్రమ రాఘవ" యని సంబోధించెను. అయిదవ విజయాదిత్యుఁడు వహించిన "నిరవద్య" యను బిరుదము రాజరాజునకుఁగూడ వాడఁబడినది. శక్తివర్మ చాళుక్య చంద్రుఁడను బిరుదము వహింపఁగా నన్నయ దాని నించుక పొడిగించి రాజరాజును "విలసచ్చాళుక్యాన్వయాంభోధి సంపూర్ణ శశీ" యని సంబోధించెను. రాజనారాయణ, నారాయణాఖ్య యను బిరుదములు రెండవ యమ్మరాజు దాల్చిన రాజనారాయణ బిరుదమునకును, రాజసర్వజ్ఞ బిరుదము పాశ్చాత్యచాళుక్య చక్రవర్తియైన యాఱవ విక్రమాదిత్యుఁడు వహించిన రాయసర్వజ్ఞ బిరుదమునకును రూపాంతరములే. ఇట్టిబిరుదంకభీమ, త్రిభువనాంకుశ బిరుదములు కూడ రాజరాజు క్రొత్తగా ధరించునవి కావు. విమలాదిత్యుఁడు పైతము వానిని వహించియుండె ననుటకు శాసన నిదర్శనము లున్నవి. (రణస్థిపూఁడి 14) కలిదిండి శాసనమున రాజరాజు "పరగండ భైరవ విభుఁడ"ని కీర్తింపఁబడినాఁడు. నన్నయభారతమున దానినే కాక దానితో సమానార్థకమైన పరగండ భేరుండక బిరుదమునుగూడ రాజరాజునకు వాడియున్నాఁడు. ఈ బిరుదము లన్నియు రాజరాజు పరాక్రమమును, అభిజాత్యమును, అరినిరసనదక్షతను, వెల్లడిచేయుచున్నవి.

నన్నయవాడిన విశేషణములవలన రాజరాజు శరీరసౌష్ఠవమును, పరాక్రమ స్ఫూర్తియు, హృదయ సంపదయు, చక్కఁగా వ్యక్తము చేయఁబడుచున్నవి. ఉత్తముఁడైన భూపతి కుండవలసిన గుణవిశేషము లన్నియు నాతనియందుఁ బుంజీకృతములై యున్నవి. అందు చేతనే యాతని పాలనమునఁ బ్రజ లత్యంతప్రీతులై యతనికి నిరంతర మహాభ్యుదయమును వాంఛించుచుండిరి. 'భువినుత పుణ్యచరిత్ర! సప్తసముద్ర ముద్రితాఖిలవసుధాజనగీతకీర్తి! భూజనపూజ్యమాన! లోకజనస్తుత్య! ధరిత్రీ జనమతిచారిత్ర!' మున్నగు విశేషణములు జనులకు రాజరాజు పైఁగల భక్తిప్రీతులను సూచించుచున్నవి. చోడుఁడైన మధురాంతకుఁడు కూడ నాతని గుణగణములను వంశగౌరవమును విని, సంతోషించి, తన కూఁతురైన యమ్మంగదేవి నతని కగ్రమహిషిగా నొసంగెనని కలిదిండి తామ్రశాసనము చెప్పుచున్నది.

"సత్కృత్వా పరితుష్య తంత్ర వినయ శ్లాఘాభిమానోన్నతిం
ప్రజ్ఞా విక్రమ సత్యశౌచ పటుతా సౌర్యత్వమాదీ న్యసౌ
చోడేశో మధురాంతకస్య తనయా మమ్మంగదేవీం సతీం
చాళుక్యాభరణస్య చాగ్రమహిషీం స్నేహాదయాచ్చాకరోత్"

దీనినిబట్టి యా చోడరాజు మేనల్లునికిఁ గూఁతు నిచ్చుట కేవల బంధుప్రీతిచేఁ గాక గుణగౌరవముచేతనే యని తెలియుచున్నది. అతఁ డెంత గొప్పవాఁడైనను ఆత్మగౌరవమునకు హానికరమని తోఁచినచో రాజరాజు సంబంధము నంగీకరించియే యుండకపోవును. అతఁ డభిమాన మహార్ఘుఁడు. నన్నయ వాడిన విశేషణములలో నెల్ల నిది రాజరాజు వ్యక్తిత్వము నెంతో సూటిగా విశదముగాఁ బ్రకటనము చేయుచున్నది.

రాజరాజు గుణసంపద గలిగి త్యాగగరిమకు మెచ్చి, పండితులును, కవులును నతని బహువిధములఁ బ్రస్తుతించుచుండిరి. అందుచేఁ దుషార సుధాహారహీర సన్నిభమైన యాతని నిర్మలకీర్తి సర్వజగత్పరిపూరితమై జననేత్ర చకోరములకు శారద చంద్రికవలె ననూనప్రీతి సంధించుచుండెను. నన్నయ యాతని కీర్తిని పలుచోట్ల మహోత్సాహముతో వర్ణించియున్నాఁడు. విశుద్ధ యశశ్శరదిందుచంద్రికా రాజితసర్వలోక! విభ్రాజిత శుభ్ర కీర్తి పరిపాండుర సర్వదిగంతరాళ! శుభయశః పరిశోభిత! శతద్యుతి విశదయశః ప్రసర శోభితసర్వలోక! మహోయశో రాజహంస సరోజనీవనరమ్య దిఙ్ముఖ! శారద నీరద నీహార హార నిభ శుభకీర్తి! హారాహీరరాజవర హంస తుషారకుంద స్ఫారయశః ప్రసర పాండురిత త్రిలోక!" యనుశ్రుతి శుభగములైన సమాసములలో రాజరాజు కీర్తివలె నన్నయ యుత్సాహమును ద్యోతిత మగుచున్నది.

తమప్రభువులను గావ్యనాయకులతో నభేదాధ్యవసాయము కల్పించి వర్ణించు నాచారము కన్నడకవులలో విరివిగా నున్నది. పంపడు విక్రమార్జున విజయములోఁ జెక్కుచోట్ల నరికేసరికిని అర్జునునకును నభేదము పాటించియుండెను. తెలుఁగు కవులలో నన్నెచోడుఁడు, కన్నడకావ్యమునందలి పెక్కితర సంప్రదాయముల వలెనే యీ సంప్రదాయమును గూడ ననుకరించియుండెను. కుమారసంభవమున నాతఁడు శివునకును మల్లికార్జునునకును నభేదము కల్పించిన తావులు చాల నున్నవి. నన్నయ యట్లభేద కల్పనము చేసిన చోట్లు లేవు కాని యుత్తములైన చంద్రవంశపురాజుల వర్ణించుపట్ల నాతఁడు రాజరాజును దృష్టియందిడు కొని వర్ణించెనేమో యని సందేహింపఁజేయు పద్యము లనేకము లున్నవి. భరతునిఁ గూర్చి యాతఁడు వర్ణించిన పద్య మిందుకు ముందే యుదాహరింపఁబడినది. జనమేజయుఁడు శ్రుతశ్రవసు ననుమతింబున సోమశ్రవసుఁ దనకుఁ బురోహితునిఁ గావించుకొని, వాని నభీష్ట సత్కారంబుల సంతుష్టునిఁ జేసి, తదుపదేశమున యాగము లొనరించుచు రాజ్యము చేయుచుండెనను సందర్భమున నన్నయ వ్రాసినపద్యము సరిగా రాజరాజును వర్ణించుచున్నట్లున్నది.1 దీనికి సంస్కృత భారతమున నాధారము లేకుండుట యీ విషయమును మఱింత బలపఱచుచున్నది. పరీక్షితుఁడు తక్షక విషాగ్నిదగ్ధుఁడై పరలోకగతుఁడైన పిమ్మట పురోహిత పురస్సరాశేష భూసురవరులు యథావిధిఁ బరలోకక్రియలు నిర్వర్తించిరని చెప్పి మంత్రులు జనమేజయునితో

"ఆయుష్మంతుఁడవై ల
క్ష్మీయుత బాల్యంబునంద మీ యన్వయ రా

---

1. ఆయుత కీర్తితో వివిధ యాగములన్ సురధారుణీసురా
మ్నాయము సాహితాహుతి సమంచిత దక్షిణ లిచ్చి తన్పుచుం
జేయుచు నుండె రాజ్యము విశిష్ట జనస్తుత వర్తమాన ల
క్ష్మీయుతుఁ డుత్తముండు జనమేజయుఁడాది నరేంద్ర
మార్గుఁడై" (ఆది. ౧-౪౪)

క్ష్మాయత్త మహీభారం
బాయత భుజ నీవు దాల్చి తభిషిక్తుఁడవై" (ఆది. 2 ఆ. 201)

పెంచితి ధర్మమార్గమునఁ బ్రీతి యొనర్చుచు ధారుణీ ప్రజన్
మంచి యనేక యాగముల మానుగ దక్షిణ లిచ్చి విప్రులన్
నించితి సజ్జనస్తుతుల నిర్మలమైన యశంబు దిక్కులన్
సంచితపుణ్య సర్వగుణసంపద నెవ్వరు నీ సమానులే"

(ఆది. 2 ఆ. 202)

అని పలికిరి. ఈ పద్యము లర్థభావముల పరిపాటి ననుసరించి చూడ నన్నయ రాజరాజుతోఁ జెప్పుచున్నట్లున్నవి. సర్పయాగమును నివారించు నుద్దేశముతో నాస్తీకుఁడు జనమేజయ సర్పసదనమున కరిగి యాతని స్తుతించిన యీ క్రింది పద్యములు విమలాదిత్యుని మరణానంతరము తన సింహాసనాధిరోహణమున కాటంకము కలిగించిన దాయాదులను శత్రువులను నిర్జించి, వైభవమునఁ బట్టాభిషిక్తుఁడైన రాజరాజును గూర్చి నన్నయ పలికినట్లున్నవి.

"రజనీనాథకులైకభూషణుఁడవై రాజర్షివై ధారుణీ
ప్రజ నెల్లన్ దయతోడ ధర్మచరితం బాలించుచుం బొంటి ధ
ర్మజు నా భాగు భగీరథున్ దశరథున్ మాంధాతృ రామున్ రఘున్
విజయుం బోలితి సద్గుణంబుల జగద్విఖ్యాత పారిక్షితా !

(ఆది ప. 2 ఆ. 224)

"కులజలయంబునవారి కోరిన కోర్కి కిం దగ నీవు పొం
దిన కులంబు వెలుంగఁ బుట్టి దృఢంబుగా నృపలక్ష్మితో
నవనిరాజ్య భరంబు దాల్చిన యంతమందె మఖంబులన్
దివిరి యిష్ట ధనంబు లిచ్చుటఁ దృప్తులైరి మహోద్విజుల్" (224)

"నల నృగభగీరథ రామచరిత్రాభిరామా !" అని నన్నయ రాజరాజు నరణ్యపర్వ తృతీయాశ్వాసాదిని సంబోధించిన విశేషణముతో నిందలి మొదటిపద్యమును బోల్చి చూచినచోఁ బైని చెప్పఁబడిన విషయమునందలి యాథార్థ్యము తేటతెల్లమగును. ఇట్లే నన్నయ దుష్యంతుని, నహుషుని వర్ణించిన (ఆది. 3-98, ఆది-4-8) పద్యములు కూడ రాజరాజును స్ఫురణకు దెచ్చుచున్నవి.

నన్నయ యాశ్వాసాద్యంత పద్యములలో వాడిన విశేషణపరంపరచే రాజరాజు రూపగుణవిక్రమాదుల కతురమైన రమ్యమూర్తి తీర్చి దిద్దినాఁడు. వాని నన్నిటిని కలిపి చదివినచో నిరవద్యమైన, సర్వరాజలోకాదర్శమైన, రాజరాజు పవిత్రచరిత్రయు, రూపసౌష్ఠవమును, పరాక్రమాది గుణసంపదయుఁ బ్రత్యక్షములై తోఁచును. ఆంధ్ర భారత రచనకు నన్నయను ప్రేరేచి యా రాజచంద్రుఁడు కాంచిన మహాఫల మిదియే. ఆంధ్రవాణి దాల్చిన యాద్యకావ్యమూర్తితో నాతని యుజ్జ్వల కీర్తిమూర్తియు నాంధ్రలోకమున నజరామరమై నిలిచిపోయినది.

# కూనలమ్మ కోన

శ్రీ మధురాంతకం రాజారాం

రెక్కలతెలుపులు కిర్రున తెరుచుకున్నాయి. ద్వారంలో నుంచి వడగాలి రివ్వురివ్వున లోపలికి కొట్టింది. గాలి దెబ్బకు టేబిలుమీదవున్న కాగితాలన్నీ పైకెగిరి గదంతటా చెల్లాచెదరుగా పడిపోయాయి. అన్నీ ఒకేరకం కాగితాలు. పైన ఎరుపు, క్రింద పసుపు పూతలో స్వర్ణాక్షరాలు ధగధగమని మెరిసిపోతున్న శుభలేఖలు!

చీపురు చేతపట్టుకుని లోపల అడుగుపెట్టిన నాగరత్నం గదిలో గాలిపటాల్లా ఎగురుతున్న శుభలేఖల్ని చూచి నివ్వెరపోయింది. నాగరత్నానికి చదువురాదు. వినా అవి పెళ్ళిపత్రికలని పోల్చుకో డానికి కావలసినంత లౌకికజ్ఞానం మాత్రం ఆమెకు లేకపోలేదు.

నాగరత్నం ఒక పత్రికను చేతికి తీసుకుంది. గదిలో దీపం వెలగడంలేదు. ఇంటిలో ఎందరు పనిమనుషులున్నా, ఆ గదిలో చెత్త ఊడ్చి దీపం వెలిగించే చొరవ వాళ్ళకెవ్వరికీ లేదు. తరతరాలుగా ఆ బాధ్యత, కాకుంటే అధికారం ఆ యింటి గృహిణికి మాత్రమే పరిమితం. రంగనాథంగారి భార్య తనబాధ్యతలకు, అధికారాలకు స్వస్తివాచకం పలుకుతూ కళ్ళుమూసుకపోయి ఏడాది కావస్తోంది. ఈ ఏడాదిపొడుగునా సంజవేళల్లో గదితలుపులుతీసి, చెత్తఊడ్చి దీపం వెలిగించడం నాగరత్నానికి అలవాటయింది. ఆగదికి, నాగరత్నానికీ వున్న సంబంధం అంతమాత్రమే కాదు. ఆగదితలుపులు తెరచినప్పుడు, లోపల నిలువుటద్దంముందు నిలుచున్నప్పుడు టేబిలుకు ఆనుకున్నప్పుడు ఎన్నో మధురభావనలు ఆమె చిత్తంలో కదను త్రొక్కుతాయి. ఎన్నో మధురస్మృతులు ఆమె హృదయాన్ని వివశం చేసివేస్తాయి. వెన్నెలలాంటి ఆ అనుభూతిలో హేమంతంలో చలికి వణకిపోతూ కాళ్లుచేతులు ముడుచుకుని ప్రియుడి కడుపులో దూరుకపోయే అతివ చెంచితలా ఆమె పరవశించిపోతుంది.

నాగరత్నానికి ఏడో ఏడు జరుగుతుండగా ఆమె తల్లి చనిపోయింది. అప్పటికి నాగలింగానికి నాలుగేళ్లు. నాగరత్నాని కింకా కలగా జ్ఞాపకం వుంది. నాగులాడి పొదల మధ్య పూరిపాక. పాకలో ఒకవైపున అమ్మ పొయిదగ్గర వంట చేసుకుంటూవుంటే తను గడపదగ్గర కూచుని తమ్ముడితో ఆడుకుంటూ వుండేది. ప్రొద్దు పుట్టకముందే బయటకు వెళ్ళిపోతే, మళ్లీ ఏ రాత్రివేళప్పుడో నాన్న యింటికివచ్చేవాడు. అమ్మ ఎందుకో ఎప్పుడూ భయపడుతూ వుండేది. 'ఎందుకే అమ్మా నువ్వు భయపడ్డం' అని తనొకనాడు తరచితరచి అడిగితే 'ఇది జగడాలకొంప తల్లీ! మాటెత్తితే దెబ్బలు మండుతూ కళ్ళూ, కటాక్షా కావలసివస్తాయి. ఆ తర్వాత కాళ్లు పాడయ్యేది, చేతులు పాడయ్యేదీ, తలకే ఎగిరిపొయ్యేదీ దిక్కులు తెలియదు' అంటూ నిట్టూర్చింది. అమ్మ చాలా మంచిది. నాన్న త్రాగివచ్చి తిట్టినా, కొట్టినా, పల్లెత్తుమాట అనేదికాదు. తనకు తలదువ్వి, జడవేసి పూలుముడిచి 'నలుపు రూపయితే నేం! నా తల్లి కళ్లల్లో దీపాలెలుగుతాయి' అంటూ ముద్దాడేది. లోకం పాపిష్టిది! పచ్చి అని పట్టి ఎరుగని, ఎంతు అని వించిఎరుగని అమ్మకుకూడా ఈ లోకంలో కష్టాలు వచ్చాయి. ఓ అర్ధరాత్రివేళ, నాన్న యింట్లో లేడు. అమ్మతనొకచేతి తమ్ముడినొకచేత బరబరాబయటకులాక్కు పోయింది. అమ్మో, తలచుకుంటే యిప్పటికీ గుండె గుబగుబలాడి పోతుంది! అదేం మంట. పూరి బుస్సుబుస్సని మండుతుంటోంది. వాసాలు చిటచిట లాడిపోతూ ఎగిరెగిరి దూరంగా పడు తున్నాయి. అంత మంటలోనూ వద్దన్నా వినక అమ్మ లోపలికి పరుగెత్తి నాలుగైదు కడవల్ని బయటకు తెచ్చుకుంది. చివరి సారి ఆమె బయటికి వస్తుండగా ద్వారబంధం విరిగి తలపైన పడింది. తులవకాయలున్న కడవను నేలపైన్నే విడిచి అమ్మ అక్కడే పడిపోయింది. అంతే ఇక కళ్ళు తెరువలేదు. 'పాపం, వట్టిమనిషి కూడా కాదు' అని ఆ తర్వాత అందరూ చెప్పుకోగా తనకు తెలిసింది. అమ్మ చనిపోయిన క్రొత్తలో కడుపుతోవున్న మనిషి చస్తే కాటకాలొస్తా యనుకున్నారు. ఆ మాటకొస్తే ఈ కూన లమ్మ కోనలో కాటకం లేని దెప్పుడు?

ఇంతకన్నా నాగరత్నానికి తన తల్లినిగురించి తెలిసిందేమీ లేదు. కాని తండ్రితో ఆమెకున్న పరిచయంతో పోల్చిచూస్తే అదే ఎక్కువనిపిస్తుంది. హమేషా త్రాగుడువల్ల ఎరుపెక్కిన కళ్ళతో నోటిలోనుంచీ నాసికారంధ్రాల్లోనుంచీ బుస్సుబుస్సని సుళ్లు తిరుగుతూవచ్చే నాసెడు పొగచుట్ట కాలూకు కెల్లటి పొగలతో నిరంతరం మత్తులో జోగుతూ కావచ్చే ఆ ఉగ్రస్వరూపంలో నాగరత్నాని కేనాడూ పితృత్వం పొడగట్టలేదు. తల్లి చనిపోయిన తర్వాత కూతురికీ తండ్రికీ మధ్య ఎడము సన్నగిల్లినమాట నిజమే. కానీ తీరా విన్నపడేవేళకు బావ పగిలిపోయింది. ఏడేళ్ళ దుర్భిక్షం తర్వాత లేకలేక ఆకసంలో కన్పించిన కారుమబ్బు హిూదపడి పటాపంచలు చేసివేసే సుడిగాలిలా, విధి అప్పుడప్పుడే పితృవాత్సల్యా నికి నోచుకుంటున్న నాగరత్నాన్ని చిన్నచూపుచూచి వరసయ్యను తీసుకెళ్ళి కటకటాల్లో పారవేసింది. ఒకటి రెండేళ్లు కాదు. పదహారేళ్ళ సుదీర్ఘ ప్రవాసం! అప్పట్లో నాగరత్నానికి కారణం సరిగ్గా తెలిసిందికాదు. అది రంగనాథంగారు క్రొత్తగా కొత్త కొన్న రోజులు. ఓ రోజు సాయంత్రం ప్రొద్దు గూటిలో పడిపోతున్న వనగా కాటువచ్చి ముసలిముందు ఆగింది.

ముందట రంగనాథంగారు, ఆయన వెనుక నరసయ్య కారులో నుంచి దిగి అదరా బాదరా మేడపైకి వెళ్ళిపోయారు. ఊళ్ళో జనమంతా కారుచుట్టూ ప్రోగయింది. రక్తపుమడుగులో మునిగి తేలివచ్చిన తెప్పగానీ, అదికారుగాదు! గడియల్లో పోలీసు స్టేషనుకు కబురు వెళ్లింది. అనాటికే కూనలమ్మకోనకు ప్రత్యేకంగా ఓ పోలీసు స్టేషను ఏర్పడి ఎంతోకాలమయింది. అమాటకొస్తే ఒకటికి రెండు పోలీసుస్టేషనులున్నా వాటికి కూనలమ్మకోనలో వూపిరి సలుపని నిర్విరామ కార్యకలాపా లుండకపోవు. కబురందగానే సబ్ యిన్స్పెక్టరు బొక్కలు గట్టుకుని పరతెంచి వచ్చారు. కేసును పకడ్బందీగా రూపొందించుకోడానికి అతనికి పరిస్థితులన్నీ అనుకూలించాయి. వేడినెత్తురులో అరకొరగా జలకమాడిన కారు భవనం ముందు ప్రత్యక్ష సాక్ష్యంగా ప్రదర్శింపబడుతోంది. పైగా నేరస్థుడే స్వయంగా తన అపరాధాన్ని ఒప్పుకుంటున్నాడు. తనకు కారు నడపడం సరిగ్గా చేతకాదు. అయ్యగారు వెనుక సీటులో కూచుని మరామేకు కదిలించడం నేర్పుతుండగా తను యిప్పుడిప్పుడే డ్రయివింగ్ నేర్చుకుంటున్నాడు. కారు రాకను చూచి గూడా సింగప్ప పైదొలగకుండా త్రోవలో నిల్చున్నాడు. కాలం చేస్తుంది! ఆ వేగంలో కారు సింగప్పను తాకింది. సింగప్ప కారు కడ్డంగా పడిపోయాడు. కారు సింగప్పపైన్నే వెళ్ళిపోయింది.

పోలీసులు నరసయ్యచేతికి బేడీలు తగిలించారు. నాగరత్నానికి బేడీలంటే ఏమిటో తెలిసీ తెలియని వయస్సు. ఐనా తండ్రి ఎక్కడికో వెళ్ళిపోతున్నాడనీ, అతడు తిరిగిరావడానికి చాలాకాలం పట్టవచ్చునని ఆమె కర్థమయింది. నాగరత్నం నరసయ్య కాళ్ళకు చుట్టుకుని 'మళ్ళీ ఎప్పుడొస్తావు నాన్నా' అని అడిగింది. నరసయ్య బేడీలున్న చేతుల్లోనే కుమార్తెను పైకెత్తుకుని ఆమె తలను రొమ్ముకు హత్తుకున్నాడు. వాతావరణ ప్రభావాలకు చలించని కర్కశపాషాణంలాంటి నరసయ్య ముఖంలోకి ఇది అది అని ఊహించడానికి వీలుకాని మార్పేదో ఆ క్షణాన చూపరులకు గోచరించింది. అతడి పెదవులు అప్రయత్నంగా కంపించిపోయాయి. కంటిరెప్పలు క్రిందికీ మీదికీ నాలుగైదుసార్లు కొట్టుకున్నాయి. అతడి కళ్ళు కుమారుడికోసం జనంలో అటూ, ఇటూ పరికించాయి. కాని నాగలింగం కనిపించలేదు. పిసింద్రీలాంటి ఆ ఆకళ్లె పసికుంక ఏ అమ్మ పెట్టిన అన్నంతిని ఏ పసువులకొట్టంలోపడి నిద్రపోతున్నాడో ఎవరికి తెలుసు! నరసయ్య నాగరత్నాన్ని తీసుకెళ్లి రంగనాథంగారి ఎదుట నిలబడ్డాడు. రంగనాథంగారు చేతులు చాపారు. కానీ నరసయ్య కుమార్తెను రంగనాథంగారి చేతుల్లో వుంచలేదు. వంగి ఆయన పాదాలచెంత కూర్చోబెట్టాడు. మళ్లీ నిటారుగా నిలబడి గిరుక్కున వెనుదిరిగి, తిరిగిచూడకుండా వీధివెంబడే వెళ్లిపోయాడు!

నరసయ్య రక్షకభటుల్ని వెంబడించలేదు. రక్షకభటులే నరసయ్యను వెంబడించారు!

అంతే ఊళ్ళో నరసయ్య అలా వెళ్ళిపోతున్నందుకు ఒక్క నాగరత్నంమాత్రమే కన్నీరు మున్నీరుగా విలపించింది.

నెలకు రెండు మూడు వాయిదాలుగా నాలుగైదు నెలలపాటు న్యాయస్థానంలో కూనలమ్మకోన కారుప్రమాదంపైన విచారణ జరిగింది. వాయిదాకు వాయిదాకు క్రొత్తవిషయాలు బయటపడ్డాయి. తనకూ సింగప్పకూ ఆదినుంచీ ప్రబలవైరముందని నిందితుడు అంగీకరించాడు. జ్యూరీసభ్యులు ఒకరిముఖం ఒకరు చూచుకున్నారు. ఈ ప్రమాదం ఐచ్ఛికంగా గూడా జరిగివుండవచ్చుననుకోడానికి అవకాశం లేకపోలేదని వాళ్లు అభిప్రాయపడ్డారు. అంతటితో కేసు తల్లక్రిందులైపోయింది. కారుప్రమాదం దారుణమైన ఖూనీ వ్యవహారంగా పరిణమించింది!

నరసయ్య ప్రవాసగతుడైనవాటికి నాగరత్నాని కింకా పదేళ్లు నిండలేదు. లంకలాంటి ఆ భవంతిలో ఆమెకు నిర్దిష్టమైన పనంటూ ఏదీ లేదు. కానీ పల్చటి ఒంటిపైన పరికిణీ వేసుకోడానికి తగిన ఆ వయసులో నాగరత్నం చిటారుకొమ్మలో కూర్చుని చింతచిగురు కోసింది. మేడకునిచ్చెన వేసి పదినిలువులెత్తున్న గోడలకన్నింటికీ వింటి దబ్బలా వంగి సున్నంకొట్టింది. తొలికోడిపలకరింపుకే లేచి, మహల్లో తలుపులు వాకిళ్లు తెరచి 'లేవండి, లేవండి' అంటూ ఇంకా పడక వీడని వాళ్ళ కర్ణకుహరాలలో శంఖధ్వానాలు చేసింది. ఇంతకూ ఈ యింటికీపిల్ల ఏవరు? పరిచారికలా పనిచేస్తూ, స్వంతమనిషిలా బాధ్యత వహిస్తూ, యింటి పెద్దలా అందరి బాగోగుల్ని తెలుసుకుంటూ కురంగంలా యింటా బయటా కలయతిరిగే ఈ అమ్మాయికి ఈ యింటిలో వున్న స్థానమేమిటి? ఏమో, ఏమిటో ఆలోచించిన వాళ్ళెవరూ లేరు.

రంగనాథంగారి భార్యపేరు వరలక్ష్మి. వరలక్ష్మికి దేవుడిచ్చిన వరమల్లా ఒక్కటే ఒక్కటి. ఆమె లౌకికవ్యవహారాలన్నింటిపట్లా నిర్లిప్తత వహిస్తుంది. సంతానం కలగడంలో జాప్యం కలగనూ కలగనూ ఆమె దృష్టి పూజాపురస్కారాలవైపు తీర్థయాత్రలవైపు మళ్ళింది. ఒక్కొక్కసారి తీర్థయాత్రకు బయలుదేరితే ఆమె ఏడెనిమిది పుణ్యక్షేత్రాలు దర్శించుకుని ఏ రెండుమూడు నెలలకో తిరిగి వచ్చేది.

వచ్చినరోజు సాయంత్రమో, లేకుంటే ఆ మరునాటి ఉదయమో రంగనాథంగారు "ఏం, అప్పుడే తిరిగొచ్చేశావు" అని భార్యను పలకరించేవారు.

భగవంతుడు వరలక్ష్మికి యివ్వడానికి మరచిపోయిన సుగుణాలలో మాటకారితనం ముఖ్యమయినది. అథవా మాట్లాడినా, ఆమె అసంబద్ధంగా మాట్లాడుతుంది.

"ఏం లేదు. మరీ...మిమ్మల్ని చూడాలని బుద్ధి పడింది' అనుకుని..." అంటూ ఆమె నసిగేది.

రంగనాథంగారు ఫక్కున నవ్వి, "నీ బుద్ధినేం చేద్దామా అని చాలరోజులనుంచీ ఆలోచిస్తున్నాను. అది ఒకసారి తిరుపతి వేంకటేశ్వరుడి పైకి వెళుతుంది. మరోకసారి పానకాలరాయుడి పైకి వెళుతుంది. ఇంకోకసారి కదిరి నరసింహస్వామిపైకి వెళుతుంది. కానీ కడకు ఎప్పుడు లేచినా రాళ్లవంక దగ్గరే తెల్లవారినట్లు అది నాపైకి వచ్చి వ్రాలిపోతుంది. అంటే నీకు వచ్చిన పూజావిగ్రహాలలో నాది చిట్టచివరి దన్నమాట! ఇదుగో నాగరత్నం! కొత్త కర్పూరమూ, ఒక కొబ్బరికాయా పట్టుకురా. మీ అక్క పూజచేసుకోనీ" అన్నారు.

వరలక్ష్మి ముఖం వెలవెలపోయింది. అది పరాగమో, పరిహాసమో, లేక మొదటినుంచీ భర్త తన పట్ల కనబరుస్తున్న నిరాదరణ తాలూకు విశ్వరూపమో ఆమెకు అర్థమయ్యేదికాదు.

భర్త దూరంగా వెళ్లిపోగానే వరలక్ష్మి నాగరత్నాన్ని దగ్గరకు పిలిచి "అది కాదే నాగరత్నం! నీళ్లు త్రాగేసినట్లు మీ మావయ్య అలా గడగడా మాట్లాడేస్తారే! ఆయన మాటలు నీకేమైనా అర్థమౌతాయా?" అని అడిగింది.

"ఆయన మాటలు అర్థమైనా కాకపోయినా యిప్పుడొచ్చిన చిక్కంతా నీతోనే అక్కా! నువ్వు యింట్లో వుంటావు. కానీ యింటి సంగతులు పట్టించుకోవు. ఎక్కడికో వెళ్తావు. మళ్ళీ నీకిష్టమొచ్చినప్పుడు తిరిగొస్తావు. ఇలాగైతే ఎలా జరుగుతుందని! గడియారానికి కీయిచ్చినట్టు రోజు కొకసారి నేనొకతె నున్నానండోయ్! అంటూ ఆడది మగవాడి చెవి నులుముతుండాలి."

అప్పటికి నాగరత్నంలో యౌవనం మొగ్గ తొడిగింది. ఆ యౌవనోదయావసరంలో కాలపురుషుని కుంచె రెండు మూడేళ్ళ పాటు నిర్విరామంగా నాగరత్నం ఆకృతికి మెరుగులు దిద్దింది. బాల్యంలో గెంతడం అన్న పేరుతో చలామణీ అయిన ఆమె నడక, యౌవనంలో అదొక నాట్యంలా చూపరుల కళ్లకు భాసించింది. చేతులు త్రిప్పి, త్రిప్పి మాట్లాడడం అదొక అభినయంలా గోచరించింది. అప్పుడామె నవ్వితే వెకిలి నవ్వని అపహాసించినవారు యిప్పుడామె నవ్వితే రతనాలు రాలిపడ్డవని ఉత్ప్రేక్షించింది. నిజమే! ప్రకృతి చిత్రమైంది. ఈ ప్రకృతిలో ఒక అసహ్యకరమైన పురుగు తనకు కాలం రాగానే సృష్టిసౌందర్యానికి తార్కాణప్రాయంగా అందాల సీతాకోకచిలుకగా పరిణామం చెంది టెక్కలాడించుకుంటూ ఎగిరిపోతోంది. ఈ పరిణామంతో పోల్చిచూస్తే నాగరత్నంలో వచ్చిన మార్పు చాలా స్వల్పం! పుట్టుకతో ఆమె రత్నంకాదు, రత్నం ఎరుపుగా ఉంటుందేమో! పోనీ, పుట్టుకతో ఆమె ఇంద్రనీలం! యౌవనంచేసిన పనల్లా ఒక్కటే. మణికి సాన పెట్టింది. అంతటితో ఇంద్రనీలం మెరుగులు గ్రక్కింది.

ఓరోజు మధ్యాహ్నం మూడుగంటలవేళ నిద్రలేచి సిగరెట్టు ముట్టించుకుంటూ మేడమెట్లు దిగుతున్నారు రంగనాథంగారు. హాల్లో ముక్కాలిపీటపైన కూర్చుని వరలక్ష్మి నాగరత్నానికి తల దువ్వి జడవేస్తోంది. పువ్వుల వాయిల్ చీరపైన తెల్లటి జాకెట్టు తొడిగి, తల వంచుకుని అరమోడ్పుకన్నులతో కూర్చునివుంది నాగరత్నం. దిగుతూ దిగుతూవున్న రంగనాథంగారు ఓ మెట్టుమీద ఆగి అలాగే అప్రతిభులై నిల్చుండిపోయారు. నాగరత్నంలో ఏ ప్రత్యేకతను చూచి ఆయన విస్మయచకితులైపోయారో ఊహించడం కష్టం! ముఖకవళికలను చూచి మనసులో మెదిలే భావాల్ని గ్రహించవచ్చుననే మనశ్శాస్త్ర సిద్ధాంతానికి రంగనాథంగారొక మినహాయింపు! బహుశా ఆయన దృష్టి నాగరత్నం కళ్ళపైన పడివుండవచ్చు. అవి అజంతా నాగసుందరి నయనాల్లా మొదటి చూపుకు దేన్నో చూస్తున్నట్టు కనిపించినా, కడకు దేన్నీ చూడనట్టే గోచరమౌతున్నాయి. ఒకవేళ ఆయన నిగనిగలాడిపోతున్న నీలాలకాలపైన వరలక్ష్మి అర్థచంద్రాకారంగా ముడుస్తున్న మల్లెపువ్వుల్ని చూచి వుండవచ్చు. ఆ పుష్పప్రభ వాయిల్ చీరలో ఒదుగుతూ పకుతూ చిక్కబడిపోయివున్న జవ్వనపుసిరులన్నింటికీ మకుటాయమానంగా ప్రకాశిస్తోంది.

రంగనాథంగారు చరచరా మెట్లు దిగి, ఒక కుర్చీని వరలక్ష్మికి దగ్గరగా లాక్కుని అందులో కూచున్నారు.

వరలక్ష్మి తలపైకెత్తి రంగనాథంగారిని చూస్తూ "అదేమిటండీ! మన నాగరత్నమే! ఎప్పుడూ చూచి ఎరగనట్టు, అలా చూస్తున్నారేం" అంది.

"ఉండక్కయ్యా! నేను చెబుతాను. మావయ్య చూపు లెలావున్నాయో తెలుసా! రాత్రి నేను లాంతరు లోపలపెట్టి తలుపులు మూసేద్దామని వరండాలోకి వెళ్లాను. దీపంచుట్టూ అవేవో చిన్న పురుగులు తిరుగుతున్నాయి. నీడలోనుంచి ఓ కప్ప వాటివైపు చూస్తోంది. చూచిచూచి, ఉన్నట్టుండి ఒక గంతువేసి, నాలుకచాపి పురుగును నోట్లో వేసుకుని మరుక్షణాన్నే మళ్ళీ నీడలోకి వెళ్ళిపోయింది."

"అంటే ఏమిటంటే" అని విరగబడి నవ్వేశారు రంగనాథంగారు. నవ్వినవ్వి "నేనాకప్పలా నాగరత్నాన్ని చూస్తున్నానన్న మాట వరలక్ష్మీ! నువ్విలా కూచునివుండగానే నేను దీన్ని అంగిట్లో వేసుకుని వెళ్ళిపోతున్నాను" అన్నారు.

"నోట్లో వేసుకోడానికిదేమైనా మిఠాయా? తల దువ్వి పూలు ముడిచి చక్కబెడితే చూడ చక్కగా వుంటుందిగదా అని...."

వరలక్ష్మికి అడ్డుతగిలి "ఈ సింగారింపులు చేసుకుంటే నువ్వు చక్కగా వుండవూ" అన్నారు రంగనాథంగారు.

"నాకేముంది! ముసలిదాన్నయిపోతున్నాను"

"నువ్వెప్పుడూ ముసలిదానివికావు వరలక్ష్మీ!" రంగనాథంగారు భార్యను జాలిగాచూస్తూ అన్నారు.

"ఐతే యికనేం మావయ్యా! మారాజులా నువ్వు రెండో పెళ్ళి చేసుకోవచ్చునే!" అంది నాగరత్నం.

"ఎవరొద్దన్నారు. ఎవరో ఎందుకు? కావలిస్తే నాగరత్నాన్నే చేసుకోండి" అంది వరలక్ష్మి.

"అగాగు—ఎవరిని చేసుకోవచ్చో, ఎవరిని చేసుకోగూడదో నువ్వే చెప్పేస్తే ఎలాగు? నన్నూ ఆలోచించుకోనివ్వు" అని సిగరెట్టును పీల్చి పీల్చి ఆఖరుకు బారెడు పొడుగు ధూమమాలికను గాలిలోకి వదలిపెట్టారు రంగనాథంగారు.

ఈ సంఘటన జరిగిన తర్వాత వరలక్ష్మి కొంచెం యించుమించుగా మూడేళ్ళు మాత్రం బ్రతికింది. ఆమూడేళ్లలో ఆమె కనీసం నెలకు రెండుమూడుసార్లు నాగరత్నంతో అంతరంగికంగా "ఏమిటే, నాగరత్నం! నీయిష్టం మేమిటో చెప్పనేలేదే మరి! నీకిష్టమైతే ఊఁ అను! ఆ శుభకార్యం కాస్తా జరిగిపోతే నాకెంతో హాయిగా వుంటుంది. ఎలాగు నాకు బిడ్డలులేకపోయారు. నీ కడుపునైనా ఒక కాయగాస్తే..." అని అడుగుతూ వచ్చింది. నాగరత్నానికి ఏం చెప్పాలో తోచేదికాదు. అసలీమాటను అవునని,

కాదని తేల్చి చెప్పవలసిన మనిషి నాగరత్నం కాదు. ఆసంగతి వరలక్ష్మికి కూడా తెలుసు. కానీ ఎవరిదగ్గర ఈ ప్రసక్తి తేవాలో వారిదగ్గర మాత్రం వరలక్ష్మి నోరు పెగిలి, మాట బయటికి వచ్చేది కాదు.

పదిరోజులు జ్వరం కాసిందన్న నిందతో వరలక్ష్మి బొందెలో నుంచి వేరుపడి జీవుడు అనంతవాయువుల్లో కలిసిపోయాడు. గోదాన, భూదాన, హిరణ్యదానాది సత్కార్యాలతో అంత్యక్రియలు యథావిధిగా జరిగిపోయాయి. భార్యావియోగంవల్ల రంగనాథంగారు భిన్నులైపోయారని కూనలమ్మకోనలో జనం చెప్పుకున్నారు. భార్య చనిపోయిననాటినుంచీ ఉత్తరక్రియలు పరిసమాప్తికి వచ్చిన పదహారోనాటివరకూ రంగనాథంగారు గడ్డం గీసుకోని మాటనిజమే! ఆ పదహారోజుల్లో ఆయనకు దేశం నలుమూలలనుంచీ తండోపతండంగా సానుభూతి లేఖలు వచ్చాయి. అన్ని లేఖలూ ఒకేఒక విషయాన్ని వివిధభంగిమల్లో ఉద్ఘోషించాయి. "ఇది మీకు రాదగిన కష్టంగాదు. ఐనా దీనికి తట్టుకోగల మనస్సంయమనాన్ని భగవంతుడు మీకు ప్రసాదించగలడు. అవధుల్లేని మీ జీవనోత్సాహంలో పాలు పంచుకోడానికైనా మీకొక సహచారిణి అత్యవసరం. కానీ మీకు సహధర్మచారిణి లేని కొఱత తాత్కాలికమేననీ త్వరలో అది తీరిపోగలదనీ భావిస్తున్నాము."

వరలక్ష్మి చనిపోయి రెండుమూడు నెలలు గడచిపోయిన తర్వాత నాగరత్నం ఓ రోజు సాయంత్రం రంగనాథంగారిగదిని శుభ్రపరచడానికి మేడమీదికి వెళ్ళింది. రంగనాథంగారు వాలుకుర్చీలో కూచుని ఏవో లెక్కలు చూచుకుంటున్నారు. ఎన్నికలసంరంభంలో ఒక మిత్రుడికి పలుకుదోడుగా వెళ్ళి నెలరోజుల తర్వాత ఆ నాటి ఉదయమే ఆయన యింటికి తిరిగివచ్చారు. నాగరత్నం తలవంచుకుని ధూళిలేగకుండా మెల్లగా గదిలో చెత్తవూడ్చివేస్తూ వాలుకుర్చీకి దగ్గరగా వచ్చింది. మీటనొక్కగానే యంత్రం పనిచేయడానికి ప్రారంభించినట్టు గదిలో అప్పుడొక హఠాత్సంఘటన జరిగింది. రంగనాథంగారు చేతినిచాచి నాగరత్నాన్ని తమవైపుకు లాగేశారు. ఆ విసురులో తోటకూరకాడలా అల్లల్లాడిపోతూ నాగరత్నం రంగనాథంగారిమీద కూలబడిపోయింది.

నాగరత్నానికి ఇది సరిక్రొత్త అనుభవం కాదు!

వరలక్ష్మి బ్రతికి వున్నరోజుల్లో నాలుగైదుసార్లు యిలాగే జరిగింది. మొదటిసారి నాగరత్నం మరీ కుర్రదానిలా రంగనాథంగారి చేతిని కొరికివేసి తుర్రున పారిపోయింది. ఈ మాట వరలక్ష్మితో చెబుదామనికూడా అనుకుంది. కానీ తను చెప్పడానికి జంకుగొంకులు పడుతుండగానే వరలక్ష్మి "ఏమిటే నాగరత్నం! మీ మావయ్య చేతిని అలా కొరికేశావు?" అని విస్మయంగా ప్రశ్నించింది. నాగరత్నం బిత్తరపోయింది. అయితే తను, రంగనాథంగారు దగ్గరికి లాక్కుని ఉక్కుచేతులతో ఉక్కిరిబిక్కిరి చేస్తున్నా ఊఁ ఆఁ అనకుండా ఊరికే వుండిపోవాలన్న మాట!

ఇలాంటి క్లిష్టపరిస్థితుల్లో యిదివరకూ తను ప్రతిఘటించినట్టే ఈసారి కూడా నాగరత్నం రంగనాథంగారి చేతుల్లోనుంచి జారిపోవడానికి ప్రయత్నిస్తూ "విడిచిపెట్టు మావయ్యా! ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు? నీకేం? నువ్వు మగమారాజువి. వచ్చేది నాకేగా" అంది.

రంగనాథంగారు నాగరత్నం అమాయకత్వానికి జాలిపడ్డట్టు మెల్లగా నవ్వేస్తూ "ఆడదానికి అన్యాయం చేయదలచుకుంటే ఎంతోసేపు పట్టదు. నా ఉద్దేశం అదికాదు." అని తన నిడుపాటి చేతులతో ఆమెను దగ్గరగా లాక్కుని హృదయానికి హత్తుకుంటూ "అందులోనూ నీకా" అన్నారు.

విడివిడిగా చూచుకుంటే అర్థమేమిటో అంతుతేలని ఈ మూడు పొడివాక్యాలు నాగరత్నంపైన మూడు మంత్రాల్లాపని చేశాయి. ఆమె మంత్రముగ్ధయైపోయిన నాగకన్యలా ఆ పారవశ్యంలో రంగనాథంగారి చేతుల్లో ఆటబొమ్మగా మారిపోయింది.

ఈ ప్రణయ నాటకానికి నాంది ప్రస్తావన ఏ ప్రదేశాన జరిగిందో అక్కడే ఈనాడు నాగరత్నాన్ని వెక్కిరిస్తున్నట్టుగా కలకలలాడిపోతూ వివాహమహోత్సవ ఆహ్వానపత్రికలు గదంతటా గాలిలో తేలియాడుతున్నాయి!

ఎవరికి పెళ్ళి? ఎవరి ఈ పెళ్ళిపత్రికలు?

నాగరత్నానికి అనుమానమైతే యిరవైరోజులక్రిందటే కలిగింది. గ్లాసులు, కూజాలు, పూలకుండీలు, కంబళ్ళలాంటి వస్తుసామగ్రులూ, వంటసంబారాలూ కోకొల్లలుగావచ్చి యింట్లో పడుతున్నాయి. ఈ మధ్య ఎవరో పెద్దమనుషులు ఏడెనిమిది కార్లల్లో తరలిరావడం జోరుగా కొనసాగుతోంది. వాళ్ళు వచ్చినప్పుడల్లా యింటిముందర పందిళ్ళువేసి, కంబానికీ కంబానికీ గ్యాసులైట్లుకట్టి, విందులుపెట్టి కొట్టి కోలాహలం చేయడం మామూలే! ఈసారి మరీ పెద్దమనిషి ఎవరో రాబోతున్నారేమో ననుకుంది నాగరత్నం. కానీ నిజం అదికాదు. ఈ యింట్లో పెళ్ళి జరుగబోతున్నదన్న వార్త మెల్లమెల్లగా నాగరత్నం చెవుల్లోపడింది. ఆ సన్నసన్నటివార్త రెండింతలై, నాలుగింతలై, ఎనిమిదింతలై అలా అలా ద్విగుణీకృతంగా ధ్వనించి నాగరత్నం బుఱ్ఱలో భూకంపాలు సృష్టించి, హృదయంలో అగ్నిపర్వతాల్ని ప్రేల్చింది.

పత్రికను చేతబట్టుకుని ద్వారబంధానికి ఆనుకుని నిల్చుంది నాగరత్నం. ఆమెకళ్ళు శూన్యంగా ఆకసంవైపు చూస్తున్నాయి. దూరాన కొండలపైన, వాటిమధ్య కోనలో, పైన ఆకాశాన, తలలో, మదిలో, ఎదలో కారుచీకటి కటికరక్కసి వికృత వికటాట్టహాసమే వినిపిస్తోంది, కనిపిస్తోంది నాగరత్నానికి! నేత్రాంచలాలకు వేసుకున్న కాటుకతో కలిసి, కన్నీరుకూడా నలుపెక్కి ఆమె బుగ్గలమీద జోటజోట కారుతోంది.

దగ్గరలో అడుగుల సవ్వడి వినిపించింది.

వస్తున్నవారు రంగనాథంగారు.

చేతిని దారికడ్డంగా చాపి పత్రికను రెపరెపలాడిస్తూ "ఏమిటిది" అని గర్జించింది నాగరత్నం.

ప్రశాంతమూ, విస్పష్టమూ అయిన గంభీరస్వరంతో రంగనాథంగారు "తెలియడంలేదా నాగరత్నం! అది పెళ్లిపత్రిక" అన్నారు.

"ఎవరికి పెళ్లి ?"

"ఎవరికో అయితే పత్రికలు మనింట్లో ఎందుకుంటాయి!"

"మనింట్లో ఎవరికి పెళ్ళనే అడుగుతున్నాను."

"నాకే! నాకు పెళ్ళయితే నీకయినట్లు కాదా నాగరత్నం!" రంగనాథం గారు లాలనగా అడిగారు.

"ఆ నోటితోనే నాకన్యాయం జరగదని చెప్పావు!"

"ఇప్పుడుమాత్రం నీకేం అన్యాయం జరిగింది నాగరత్నం!" ఆడదాన్ని నమ్మించి ద్రోహంచేసే దుర్గుణం మాయింటా బయటా లేదు తెలుసా! మా తాతగారికి మూడు పెళ్లిళ్లు. ఐతే నేం! ఆ పెళ్లాలకన్నా ఆయన చేరదీసిన సాంచారమ్మకే రాజభోగం జరిగింది. ఇక మా నాన్నగారి సంగతి సరేసరి! ఆయన చుట్టపు చూపుగా ఎప్పుడో యింటికి వచ్చేవారంతే! మిగిలినప్పుడల్లా పట్నంలో ఆ కమలాబాయి యింట్లోనే వుండిపోయేవారు."

"భోగపిల్లతో నాకు పోలికేమిటి! డబ్బుకు మానం అమ్ముకో దాని కెక్కడెవరూ కొచుక్కాపోలేదు." నాగరత్నానికి ఒళ్లు పొగలుబోతోంది. ఆ ఉద్వేగంలో ఆమెకళ్లు విస్ఫులింగాలై రంగనాథంగారిమీద నిప్పులుమిశాయి.

"కొంచెం శమాయించుకో నాగరత్నం! నీకు తెలియదు. ఈ యింటికి రాబోతున్న క్రొత్తకోడలు ఏ కాస్తో కూస్తో చదువుకున్న పిల్ల. సినిమాలు షికార్లు, క్లబ్బులూ రేడియోలు లేకుంటే అదికొక్క రోజు గడవదు. ఆమె యిక్కడుండి సంసారం నిలబెట్టబోతుందని గాదు. ఆమె తండ్రికొక్కతే కూతురు. ఆ తండ్రికి డబ్బుంది. ఏ పెట్టెలో వేసి రమ్మంటే ఆ పెట్టెలో ఓట్లువేసి రావడానికి సిద్ధంగా నాలుగైదువందల కుటుంబాలు అతడి చేతిలో వున్నాయి. కాలం ఒకరీతిగా వుండదు..."

"అవన్నీ నాకక్కర్లేదు"-తలపైన చావుదెబ్బ తగిలినా యింకా పడగెత్తడానికి ప్రయత్నించే కోడెత్రాచులా బుసలు పెడుతూ మాట్లాడుతోంది నాగరత్నం. "నా బొందిలో ఊపిరుండగా ఈ పెళ్ళి జరగదు. ఏమనుకుంటున్నారో, యిది నిప్పుతో చెలగాటం"

చేతిలోవున్న పత్రికను నలిపి నేలపైన కొట్టి మునిపంటితో పెదవిని కొరుక్కుని పొంగివస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ, ఒక్క విసురున ద్వారాన్ని దాటి, అలంబనంలేని మల్లెతీగలా కంపించిపోతూ డాబాపైన నడిచి మేడమెట్లు దిగుతోంది నాగరత్నం. గసబోసుకుంటూ పరుగెత్తివస్తున్న నాగలింగం మెట్లపైన ఆమెను తారసిల్లాడు.

తమ్ముణ్ని చూడగానే నాగరత్నం కుప్పకూలలా నిల్చున్న మెట్టుపైన్నే కూలబడిపోయింది. కూచోడానికి సైతం ఓపరికంలేక, ఆమె తమ్ముడి కాళ్లపైవు వ్రాలిపోయి వెక్కివెక్కి ఏడుస్తూ "ఈ బ్రతుకు నేనెందుకు బ్రతకాలిరా తమ్ముడూ! ఇంతకంటే చస్తే మేలుగాదూ!" అంటూ వాపోయింది.

"ఏమిటక్కా నీ ఆగడం! అవతల కొంపలంటుకపోతున్నాయి. ఎవడో ముసలాడు నా కడ్డొచ్చి దుడ్డుకర్ర దెబ్బతిని దిక్కులేని చావు చావబోతున్నాడు. తప్పుకో. బాబుగార్ని చూడాలి." అన్నాడు నాగలింగం.

నాగరత్నం చివాలున లేచి నిల్చుని తమ్ముణ్ణి చురచుర చూస్తూ "ఎవరి దాగడం? నన్ను భోగంపడుచుక్రింద లెక్కగట్టిన మీ బాబుగారిది ఆగడం. నమ్మించి నా బ్రతుకును వల్లకాట్లో కలుపుతున్న మీ అయ్యగారిది ఆగడం" అంటూ ఉక్రోషాన్ని వెళ్ళగ్రక్కింది.

"ఇప్పుడు నువ్వనేదేమిటక్కా?" అసలు విషయ మేమిటో అర్థంగాక విసుగ్గా ప్రశ్నించాడు నాగలింగం.

"ఒకమాట చెప్పి, ఆ మాటకు అప్పుడొకమాదిరి, యిప్పుడొక మాదిరి అర్థం చెబుతే నేనేం చేయను! ఒరే తమ్ముడూ! నే నాడదాన్ని! ఆడదాన్ని వంచన చేయడానికియింత పెద్ద ఎత్తు అవసరంలేదు. ఇప్పుడాయన వేరే పెళ్ళి చేసుకుంటే నా గతేంకావాలి! తప్పు నలుగురూ నన్ను చూచి నాలుగు మాటలనుకుంటే నేను నా ముఖాన్ని ఎక్కడ దాచుకోను?"

నాగలింగం తోబుట్టువును ఎడంగా త్రోసి, పైమెట్టుమీదికి దాటుకుని క్రిందికి చూస్తూ అన్నాడు. "నీకు పిచ్చెక్కిం దేమిటి? మన అంతస్థేమిటి? బాబుగారి అంతస్థేమిటి? ఆయన నిన్ను పెళ్లాడట మేమిటి? ఎవరైనా వింటే నవ్వుతారు. పో అవతలికి!"

అవును! దాస్యభావం ఒక మనిషిని మేరువునుచేసి, పాటి మనిషిని ఆ మేరువు ఎదుట గుప్పెడు ధూళిగా మార్చివేస్తుంది.

* * * *

జవానుల్ని తన వెనువెంటనే సైకిళ్ళమీద బయల్దేరమని చెప్పి సబ్ యిన్స్పెక్టరు సత్యనారాయణ మోటార్ సైకిలు 'స్టార్టు' చేశాడు. పట్టు విడిపించుకుని తోడేలుమీదికి కవిసే జాగిలంలా రొప్పుతూ మోటార్ సైకిలు రోడ్డుపైకి వచ్చింది. సత్యనారాయణ సీటుపైన సర్దుకుని కూచున్నాడు. వింటినుంచి వెలువడ్డ బాణంలా చిమ్మచీకటిని చీల్చుకుని వెళిపోతోంది సైకిలు. సత్యనారాయణ యిప్పుడిప్పుడే చీకటిలో ప్రయాణాలకు అలవాటుపడుతున్న మనిషి. పట్టపరీక్షలో అగ్రశ్రేణిలో ఉత్తీర్ణుడై, ట్రెయినింగు పెంటయలో ప్రతిభలోనేగాక, ప్రవర్తనలో కూడా మంచి పేరు తెచ్చుకున్న సత్యనారాయణను ఏరి కోరి పై ఉద్యోగులు కూనలమ్మ కోనకు రవాణా చేశారు. ఒక్క వేడినిట్టూర్పుతో ఉద్యోగ భారాన్ని తన భుజస్కంధాలపైన్నుంచి దించివేసుకుంటున్న ముసలి సబ్-ఇన్స్పెక్టరు సత్యనారాయణ భుజంపైన చేయివేసి "అబ్బాయీ! ఇంక నువ్విక్కడ ఉద్యోగం చేయబోతున్నావు నాయనా" అన్నాడు.

ఛార్జీ పుచ్చుకున్నట్టు సంతకం చేయబోతున్న సత్యనారాయణ 'షాక్' తిన్నవాడిలా కలం టేబిలుపైన వుంచి "మీరు పెద్దవారు. నేను కుర్రవాణ్ణి. మీరు చెప్పదలచుకున్నదంతా స్పష్టంగా చెప్పివేయండి" అన్నాడు.

ఉద్యోగ జీవితంలో తను నేర్చుకున్న గుణపాఠాల సారాంశాన్నంతా ఆ తలనెరసిన ఉద్యోగి నాలుగోతరగతి కుర్రాడికి పాఠం బోధించవలసిన తరహాలో ప్రశ్నోత్తరాలుగా విశదంచేసేవాడు.

"ఒకచోట నేరం జరుగుతుంది. ఆ నేరం జరగడానికి మనిషి ప్రేరేపించేది ఏదో నీకు తెలుసుననుకుంటాను."




వ్రాయు

# వాటర్‌మన్స్‌తో

మీరు సరియైన వారగుదురు.

సత్యనారాయణ తేలిగ్గా బదులు చెప్పివేశాడు.

"ఒకటి అజ్ఞానం. రెండోది అహంభావం. సాధారణంగా వీటివల్ల నేరాలు సంభవిస్తుంటాయి."

"రైట్—టిలో మొదటిరకం నేరాలతో మనకు చిక్కు లేదు. ఏ అజ్ఞానంవల్లనైతే నేరం జరుగుతుందో, అదే అజ్ఞానంవల్ల మనకు నేరస్థుడు దొరికిపోతాడు. తికమకలు పడకుండా న్యాయస్థానం అతడికి శిక్ష విధించగలుగుతుంది. కానీ రెండోరకం నేరస్థులకి వాళ్ళని నువ్వేం చెయ్యగలవు?"

ఢక్కా మొక్కీలు తిన్న ఆ పాటి ఉద్యోగిని యిక్కడ సత్యనారాయణ బోల్తాకొట్టించడానికి ప్రయత్నించాడు.

"అజ్ఞానమూ, అహంభావమూ పరస్పరాశ్రయాలు. నేరాలకు మూలకారణాలయిన వాటితో మనకు ప్రసక్తి లేదు. మనకు కావలసిందల్లా నేరస్థులు."

"కానీ ఈ రెండోరకం నేరస్థులు అంత అక్రమంగా నీ పిడికిట చిక్కిపోరు. వాళ్ళకు డబ్బుంటుంది. దర్పముంటుంది. వాళ్ళని అజ్ఞానులక్రింద లెక్కగట్టడానికి వీల్లేదు. పైగా వాళ్ళు తనచుట్టూతా వున్న అజ్ఞానాన్ని కోటగా మలుచుకుని, ఆ కోట నడుమ ఏకచ్ఛత్రాధిపత్యం సాగిస్తారు. వాళ్లు నేరం చేస్తున్నారని ఋజువుచేయడానికి ప్రత్యేకంగా సి. ఐ. డి. ఉద్యోగులు అవసరం లేదు. ఆ నేరమేదో ముంజేతికంకణంలా తెలిసిపోతూనే ఉంటుంది. కానీ మనం వాళ్లినేమీ చేయలేము."

ధర్మయుద్ధానికి మొహరిస్తున్న వీరయువకుడిలా హుంకరించి సత్యనారాయణ "నా ఉద్యోగధర్మం ఎదుట ధనాన్నీ దర్పాన్నీ తృణంగా పరిగణిస్తాను" అన్నాడు.

ముసలి ఇన్స్పెక్టరు మెల్లగా నవ్వి నిస్పృహతో "అది నీ ఉద్యోగధర్మానికి వెనుకబలం వుంటే అప్పటిమాట" అన్నాడు.

"ధర్మం స్వయంశక్తివంతమయింది. దానికి వెనుకబలాలు, ప్రక్కబలాలు అనవసరం," సునిశ్చితమయిన ధర్మసూత్రాన్ని వల్లించాడు సత్యనారాయణ.

"ధర్మం స్వయంశక్తివంతమయిందే! కాదనను. కానీ విజయాన్ని సాధించడానికి ముందు ధర్మం ఎన్నోసార్లు అధర్మంతో ఘర్షించి ఓడిపోతుంటుంది. చిట్టచివరికయినా ఈ ధర్మం జయించడానికి కారణం ఒక అలౌకికమయిన మహాశక్తి దానికి బాసటగా నిలిచివుండడమేనని మనం విశ్వసిస్తాం. కానీ అనేకమారులు ధర్మాన్ని ఓడించగలుగుతున్న అధర్మానికి అండగా వుంటున్నవేవి? ధనమూ, దర్పమూ, బలమూ, ఛలమూ అని నేనంటున్నాను. వీటిని నువ్వు తృణప్రాయంగా పరిగణిస్తావు. కానీ నీ ధర్మానికి వెనుకబలంగా వుండటానికి ఉద్దేశింపబడిన లౌకికవ్యవస్థలు కొన్ని నీ ప్రక్కలోనే బల్లాలై ఆ అధర్మాన్ని చూసీచూడనట్టు మూకీభావం వహించినప్పుడు ధర్మం అధర్మం ముందు తలవంచుకోవలసివస్తుంది. నీకు తెలియదు బాబూ! ఈ ధర్మాధర్మసంఘర్షణలో నా తల బట్టగట్టిపోయింది. పోనీలే! నీకు పిరికిమందు పోయడం నా అభిమతం కాదు. నీ ఆదర్శాలతో నువ్వు పురోగమించు. కానీ అయిదేళ్ళ తర్వాత నీ ఉద్యోగానుభవాల్ని గురించి నాకో కార్డుముక్కమాత్రం వ్రాయి. సంతోషిస్తాను" అంటూ రిటయిర్డు సబ్ యిన్స్పెక్టరు సత్యనారాయణదగ్గరనుంచి సెలవు తీసుకున్నాడు.

పోలీసుస్టేషను ఆవరణలో కాలుపెట్టిన నెలరోజులకు సత్యనారాయణ ఓ విచిత్రవృత్తాంతాన్ని గురించి తెలుసుకోవడం సంభవించింది.

ఆ రోజు యిరవైతొమ్మిదో తేదీ. మరునాటి సాయంకాలానికి నెలసరి లెక్కలన్నీ పూర్తికావలసివున్నాయి. సత్యనారాయణ రికార్డును తనిఖీ చేస్తున్నవాడు, ఉన్నట్టుండి తలపైకెత్తి వరండాలో పచారు చేస్తున్న హెడ్‌కానిస్టేబిలును పిలిచి "అది కాదు వరదయ్యా! ఈ లొకాలిటీలో దొంగసారా కేసులు ఎక్కువన్నారు. ఏదీ మరి! ఈ నెలకంతా ఒక ప్రొహిబిషను కేసయినా రిజిష్టరులో నమోదు కాలేదే!" అన్నాడు.

అదేమంత ఘనకార్యమన్నట్టు వరదయ్య నాలుక చప్పరించి "దానికేమండీ! మీరు కావాలంటే రేపటికి తీసుకొస్తాను" అన్నాడు.

"కావాలనుకోడమేమిటి! ఈ నెలరోజుల పొడుగునా ప్రొహిబిషనుకేసు ఒకటయినా లేకపోతే ఈ ఏరియాలో దేశంలో మనం ఉన్నామా, లేదామా అని పైవాళ్ళకి సందేహం రాదూ!" అన్నాడు సత్యనారాయణ.

వరదయ్య మరునాటి మధ్యాహ్నానికల్లా అన్నంతపనీ చేశాడు.

తుమ్మ సారాయితో నిండిన కడవను తలపై కెత్తుకుని ఒళ్లంతా చెమట గార్చుకుంటూ హెడ్ కానిస్టేబిలు వెంబడే స్టేషనులో ప్రవేశించిన ఆ నేరస్థుణ్ణి, చూడనూ చూడనూ సత్యనారాయణలో జాలి, విస్మయం, కోపం ముప్పిరి వేసుకపోయాయి.

ఆ వచ్చినవాడు మొలకు మూడుమూళ్ళ తుండుగుడ్డ చుట్టుకున్నాడు. అతడేనాడైనా తిండిసుఖం కళ్ళజూచి ఎరుగునో, ఎరుగడో సత్యనారాయణకి తెలియదు. కానీ అతడి కడుపు వీపుకు అంటుకపోయివున్న మాటమాత్రం నిజం! రొమ్ములో ఎముకలు మాత్రం కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నాయి. దొంగసారా కాయడానికి కావలసినంత గుండెదిటవున్న మనిషి యిలా వుంటాడని సత్యనారాయణ ఎన్నడూ అనుకోలేదు. తన ఉద్దేశం ప్రకారం మెలి దిరిగిన మీసాలతో, కండపుష్టితో మిసమిసలాడిపోతున్న దేహంతో పొరించిన పొట్టేలులా వుండవలసిన దొంగసారా నేరస్థుడు ఈ శిథిల రూపంతో ప్రత్యక్షమైనందుకు సత్యనారాయణ ఆశ్చర్యపడిపోయాడు.

'అబ్బీ' అనాలో 'అయ్యా' అనాలో తోచక కాసేపు తటపటాయించి చివరకు సత్యనారాయణ సంబోధన ఏదీ లేకనే "ఇంతకు ముందెప్పుడైనా జైలుకు వెళ్ళొచ్చావా?" అన్నాడు.

"వెళ్ళకేంబాబూ! పాతకాపునే!" అదొక సర్వసామాన్యమైన విషయంలా జవాబిచ్చాడు నేరస్థుడు.

మళ్ళీ ఒకసారి అక్కడికి వెళ్ళి రావలసినపని తగిలిందన్న భావం ఆ జవాబులో ధ్వనించి వుండకపోతే సత్యనారాయణ ఆ బికారివాడిమీద మరికొంతసేపు ప్రశ్నలవర్షం కురిపించి వుండే వాడే! కానీ అదంతా అనవసరమని అపరాధి ఒక్కమాటలో తేల్చే శాడు. భద్రాద్రిరఘురాముని దర్శనంకోసం వెళ్తుండగా బంధు మిత్రుల ఆజ్ఞ ఎందుకని ప్రశ్నించే రామభక్తుడిలా, తనకూ జైలు గోడలకూమధ్య నిలిచివున్న ఈ పోలీసుల్నీ, న్యాయస్థానాన్నీ కంటగించుకుంటున్న ఆ నేరస్థుణ్ణి సత్యనారాయణ ఏమని ప్రశ్ని స్తాడు!

ఆ రోజురాత్రి వెన్నెల్లో ఆరుబయట కుర్చీలో కూర్చుని సత్యనారాయణ ఆ అపరాధి వింతమనస్తత్వాన్ని గురించే ఆలోచిస్తున్నాడు.

ఎదురింటి పంతులుగారు భోజనానంతరం నశ్యం వేసుకుంటూ వీధిలోకి వచ్చి 'ఏమండీ సత్యనారాయణగారూ! వెన్నెల్లో చల్లగా కూచున్నారే!' అంటూ పలకరించారు.

"రండి రండి! మీ కోసమే ఎదురుచూస్తున్నాను" అన్నాడు సత్యనారాయణ.

పంతులుగారు పిల్లలకు పాఠాలు చెప్పడం మాత్రమే గాక నెలరోజులుగా సత్యనారాయణకు రాత్రిపూట స్థానికపరిస్థితుల పైన ట్యూషను కూడా చెబుతున్నారు!

పంతులుగారువచ్చి కూర్చోగానే సత్యనారాయణ తన కుర్చీని ఆయన దగ్గరకు జరుపుకుని "యిక్కడంతా అయోమయంగా వుందండీ పంతులుగారూ! నిన్న మధ్యాహ్నం ప్రొహిబిషను కేసులు లేవేమని వరదయ్య నడిగాను. అతడీరోజు మధ్యాహ్నానికే ఓ కేసు తీసుకొచ్చేశాడు. కానీ మనిషిని చూస్తుంటే అతడు నేరం చేసిన వాడిలా కనిపించడంలేదు'' అన్నాడు.

పంతులుగారు రెండు మూడుసార్లు తల పైకెత్తి అంతలోనే దించేసుకుని "ఊఁ, ఎన్నో వుంటాయి. అన్నీ కాలక్రమాన మీకే తెలిసొస్తాయి" అన్నారు.

'ఫరవాలేదు చెప్పండి బాబూ దాచక' ప్రాధేయపడ్డాడు సత్యనారాయణ!

'కోనలో సారాయి కాచడమూ, అమ్మడమూ అదొక బహిరంగవ్యాపారమండీ సత్యనారాయణగారూ!' పంతులుగారు మళ్లీ ముక్కులకు నశ్యం దట్టిస్తూ అంటున్నారు. "ఊరూరికీ ఒకటి రెండుబట్టీ లుంటాయి. త్రాగే వాళ్లు అక్కడికివచ్చి యథేచ్ఛగా త్రాగి వెళ్ళిపోతుంటారు. వసూలైన డబ్బులో కొంత ఉత్పత్తి దారుడికీ, కొంత ఈ చిల్లరదుకాణాలపైన ఈగవాలకుండా చూచుకునే ఆసామికీ, కొంత మరి కొందరికీ అలా అలా వాటాలుగా ముట్టిపోతుంది. మరి సింహానికి ఆహారంగా రోజూ ఓక జంతువు అవసరం గదండీ! మీకు ప్రొహిబిషను కేసుతో గిరాకీ తగిలినప్పుడు వాళ్లే కలిసి కట్టుగా మీ కోటా పంపకం చేసే స్తుంటారు. ఏముంది! ద్వీపాంతరం కాదుగదా! ఏ నాలుగైదు నెలలో! ఉండిరానీ"

సత్యనారాయణ బుర్ర గిర్రున తిరిగిపోయింది. అతను తటా లున టేబుల్లోనుంచి డైరీ పైకితీసి "ఆ ఆసామి లెవరో నేను తెలుసు కోవాలి చెప్పండి. చెప్పండి" అన్నాడు.

కానీ చిక్కి విక్కరించడంకంటే పారిపోయి వెక్కిరించడం మంచిదని పంతులుగారికి బాగా తెలుసు.

"బాబ్బాబూ! ఆ సంగతి నన్నడక్కండి. నాకు తెలియదు. మీ పోలీసు వాళ్ళకీ, మా టీచర్లకీ ఏనాడు జన్మాలుగా సంబంధాలు లేవు. ఇప్పుడు క్రొత్తగా కలుపుకుంటే వ్యవహారం ఎటుపోయి ఎటు వస్తుందో చెప్పడం కష్టం."

ఐతే సత్యనారాయణ ఆ ఆసామి లెవరో తెలుసుకునేంత వరకూ ఒంటికాలుపైన నిలిచాడు. మొదట కొంచెం పస్తాయించినా తర్వాత తర్వాత హెడ్ కానిస్టేబిలు వరదయ్యకు చెప్పక తప్పింది కాదు.

పై సంఘటన జరిగి మళ్ళీ ఒక నెలరోజులు గడచిపోయిన తర్వాత ఓ రోజు రాత్రి యింటిలోపల పడుకుని నిద్రపోతున్న సత్యనారాయణ ఉలికిపడిలేచి కూర్చున్నాడు. తలుపు పైన మెల్లగా చప్పుడౌతోంది. సత్యనారాయణ గబగబా వెళ్ళి తలుపుతీశాడు. అది అమావసనిశి. కన్ను పొడుచుకున్నా ఎదుటి వస్తువు కనిపించడంలేదు. ఆ చీకట్లో మెట్లపైన్నుంచీ ఒక మనిషి "కొంచెం తప్పుకోండి బాబూ! దీన్ని లోపల వేస్తాను" అన్నాడు.

"ఏమిటది?" అని ప్రశ్నించాడు సత్యనారాయణ.

"బియ్యం బస్తా బాబూ! కిచ్చిలిసంబావు బియ్యమండీ! ముక్కులు కుట్టుకోవచ్చు"

ఎంతో నిగ్రహంమీద అడిగాడు సత్యనారాయణ.

"ఎవరు పంపించారు?"

పంపించినవారిపేరు చెప్పి ఎదుటవున్న మనిషి "ఇదే కాదండీ! ఇంకా బండ్లో ఓ నెయ్యిడబ్బా, ఓ కందిపప్పు మూటా ఇదిగాక ఓబుట్టెడు మల్గూబా మామిడిపళ్లు..." అంటూ జాబితా చెప్పుకుపోసాగాడు.

సత్యనారాయణ అతడి మాటలకు అడ్డు తగిలి, టార్చిలైటు తెమ్మని భార్యను కేక వేశాడు. మాటనొక్కి పలుకును వీధిలోకి ప్రసరింపచేస్తూ "ఇదిగో, ఈఆట లిక్కడ సాగవు. ఇంకొకసారి ఎవరైనా యిలాచేస్తే నడివీధిలో నిలబెట్టి లాఠీతో బాదిస్తాను. పో, వెళ్ళిపో" అంటూ దబాలున తలుపువేసి గడియవేసుకున్నాడు.

"అయ్యయ్యో, అదేమిటండీ అలా అనేశారు! వెళ్ళి వాడేం చేస్తాడో, ఏంపాడో!" అంటూ గడగడలాడిపోయింది సత్య నారాయణ భార్య.

"నీకేం భయంలేదులే, నువ్వువెళ్ళి పడుకో" అని సత్యనారా యణ డ్రాయర్లోనుంచి డైరీపైకి తీసి యింతకుమునుపే తను వ్రాసి వుంచుకున్న పేరు క్రింద ఎర్రసిరాతో చక్కగా ఓగీత గీశాడు.

ఆ తర్వాత ఎర్రసిరాతో 'అండర్ లైను' చేసిన ఆ పేరు కెదు రుగా మరికొన్ని యింటూ మార్కులు వేసుకోవలసిన అవసరాలు కూడా వచ్చాయి. ఓరాత్రివేళ బొగ్గులు వేసుకున్న లారీ ఒకటి

సత్యనారాయణ నోరు చించుకుంటున్నా వినిపించుకోక ట్రంకు రోడ్డుపైన సాగిపోయింది. కాపున సైకిలు లేకపోవడంచేత సత్యనారాయణ కొంతదూరం పరుగెత్తి గూడా చూచాడు. కానీ నెంబరు కనిపించలేదు.

తర్వాత వాకబుచేయగా తెలిసింది, కోనలో ఓ మారుమూల వున్న చెట్లన్నీ నరికివేయబడుతున్నాయనీ, మాటులో కారి కొల్లలైపోతున్నాయనీ!

"ఈ పని ఎంతకాలంనుంచీ జరుగుతోంది?" అన్నాడు సత్యనారాయణ.

"ఇది మామూలుగా జరుగుతూన్న పనండీ" అన్నాడు వరదయ్య.

"ఐతే ఉద్యోగులు ఏంచేస్తున్నట్టు?"

"ఉద్యోగులు ఏం చేస్తారు! ముందట పట్టాచేలలో స్వంత చెట్లు నాలుగైదు నరికివేస్తారు. తర్వాత వీలైనప్పుడు రిజర్వులో చెట్లు కూలకొస్తారు. అన్నిటినీ తుండ్లుగాచేసి తమ బాగాలో ఎక్కడో మాటువేసుకుంటారు. ఇక దర్వాణా సంగతి మీరే చూచారు. రాత్రికి రాత్రే మనం ఒకవేళ చూచి కేకలు వేసినా 'కేర్' చేయకుండా లారీ వెళ్ళిపోతుంది."

సత్యనారాయణ పిడికిలిమూసి, నుదురు చిట్లించుకుంటూ "నాకూ అవకాశం వస్తుంది. తప్పకుండా వస్తుంది" అనుకున్నాడు.

ఈ నాటికి అవకాశం వచ్చింది.

"పిలుపొచ్చిందోయ్ వరదయ్యా! ఎవరో ముసలాడుట! వాళ్ళెవరో తలచితక బాదేశారట! తక్షణం రమ్మని కబురు. 606 ని 414 ని సైకిళ్ళు తీసుకుని వెంటచేరమ్మని చెప్పు" అంటూ బయలు దేరాడు సత్యనారాయణ.

వరదయ్యగుండె లోలోతులలోనుంచీ పొంగి, భయం ఉప్పెనలా అతడి పెదవులదాకా వచ్చింది. అతడేదో చెప్పడానికి నోరు తెరువబోయాడు. కానీ అప్పటికే సత్యనారాయణ సైకిలు దూరంగా వెళ్ళిపోయింది.

సత్యనారాయణ మహిడీముందు సైకిలు దిగేసరికి తొమ్మిదిన్నరయింది. ప్రాకారకుడ్యానికి ఈవల సీమభాగిచెట్ల వరుస తెరచిన కిటికీలగుండా బయటికి వస్తున్న వెలుగులో మధ్య మధ్య చీకటితో ఆ మేడ సత్యనారాయణకొక నీటిరంగుల చిత్రంలా కనిపించింది. వరాండాలో దీపం వెలుగుతోంది. దీపంచుట్టూ కూర్చుని తాళ్లు పేనుకుంటున్న పాలేళ్లు ఇన్స్పెక్టరును చూడ గానే లేచి నిల్చున్నారు. వరాండాలో ఓపైపుగా స్పృహతప్పి పడివున్న ముసలివాడిని చూస్తూ కాసేపు సత్యనారాయణ మంచం దగ్గర నిల్చున్నాడు.

చిందరవందరగా వ్రేలాడుతున్న జుత్తునూ, దాదాపు ముఖాన్నంతా ఆచ్ఛాదించివేస్తున్న ఆ జేబుగడ్డాన్ని చూస్తుంటే ఆ ముసలి వాడు ద్వీపాంతరప్రవాసంనుంచీ తప్పించుకుని వచ్చిన యావజ్జీవ ఖైదీలా కనిపిస్తున్నాడు. గాయంమీద తలపైనుంచి గడ్డంక్రిందికి బిగించి కట్టినకట్టు పూర్తిగా రక్తారుణమైపోయి వుంది. బట్టలపైన అక్కడక్కడా నెత్తురుమరకలు కనిపిస్తున్నాయి. ఉచ్ఛ్వాస నిశ్వాసాల తాకిడికి రొమ్ము ఉపిరితిత్తిలా పైకీ క్రిందికీ ఉబి పోతోంది.

"బాబుగారూ!"

పిలుపు విని సత్యనారాయణ అటువైపు తిరిగాడు.

"అయ్యగారు మిమ్మల్ని భోజనానికి రమ్మంటున్నారు" అన్నాడు నాగలింగం.

"భోజనం అయినతర్వాతనే యింటిదగ్గరనుంచీ బయల్దేరాను. నా కిప్పుడు కేసునుగురించిన వివరాలు కావాలి."

"వివరాలేమున్నాయి బాబూ! నాకుతగలాల్సిన దెబ్బ ఈ ముసలాడికి తగిలింది; ప్రాణానికిపోతే పాపం రావడమంటే యిదేగదండీ మరి!"

"ఇంతకూ ఈ ముసలాడెవరో చెప్పావుకావు!"

"నేనుమాత్రం ఏమెరుగుదును బాబూ! రోడ్డుదగ్గర నేను మేకలు తోలుకునివుండగా బస్సుదిగాడు. అతడి వాలకాన్ని చూచి 'ఈ బస్సింకా యిరవైమయిళ్ళు పోతుంది. ఏదో ముల్లె దాచిపెట్టి పోయినట్టు యిక్కడెందుకు దిగేశావన్నాను. అతగాడిక్కడ ముల్లె దాచిపెట్టిపోయినమాట నిజమేనన్నాడు. నేను పిచ్చివాడేమో ననుకున్నాను."

సత్యనారాయణ తలపంకిస్తూ "తర్వాత" అన్నాడు.

"నా పేరడిగాడు. చెప్పాను. తర్వాత లేనిపోని వివరాలన్నీ అడిగాడు. కొన్నిటికి చెప్పాను. కొన్నిటికి నీకెందుకు, ఊరుకోమన్నాను. ఇద్దరమూ మాట్లాడుకుంటూ ఊళ్ళోకి వస్తున్నాం. డొంకలో ముంగలిపొదల్లోనుంచి వాళ్లు నాపైకి దూకారు."

"నిష్కారణంగా నన్నమాట?"

"కారణమేంది! లేదంటే మేకలకోసం వేపచెట్లో నాలు గొమ్మలు నరికాను. వచ్చింది వచ్చిండే నాపైన దుడ్డుకర్రలు విసిరారు. నాలుగైదు దెబ్బలే అయినా నాకూ బాగానే తగిలాయి. ఇంతలో ఈ ముసలాడు 'కొట్టకండి, కొట్టకండి కుర్రాడుచస్తాడు' అంటూ నా కడ్డొచ్చాడు. ఒకదెబ్బ అతడితలకు సరిగా తగిలింది. అంతే! చిల్లున నెత్తురు పైకెగిరింది. నెత్తురు కనబడగానే ఎక్కడి వాళ్లక్కడ పరుగు లంకించుకున్నారు."

"అప్పటికింకా బాగా చీకటి పడలేదుకదూ" అడిగాడు సత్యనారాయణ.

"లేదు బాబూ! ప్రొద్దుగూట్లోపడింది. మేకల్ని యింటికి తోలుకొస్తున్నాను. ఒకడివెనుకొకడుగా నా పైకొచ్చారు. కోనేటి రంగడు, వడబావి శ్రీరాములు, నూకాలు..."

"ఉండుండు" అని సత్యనారాయణ, సైకిల్ను గోడకానించి వరాండాలోకి వస్తున్న పోలీసుల్ని చూస్తూ" ఆ పేర్లు కాగితంలో వ్రాసుకోండి. ఎక్కడున్నాసరే, రాత్రికే వాళ్లనిక్కడ హాజరు పరచాలి" అన్నాడు.

"ఎక్కడో ఎందుకుంటారండీ! వాళ్ళదీ ఈ వూరే. అదీ గాక పోలీసువాళ్లంటే భయపడేరక మేమున్నానా! నిక్షేపంగా యింట్లోనే వుంటారు" అన్నాడు నాగలింగం.

పోలీసులు పేర్లు వ్రాసుకుని ఊరిపైకి వెళ్లిపోయిన తర్వాత సత్యనారాయణ ఒంటరిగా వరండాలో కూర్చున్నాడు. నిమిషాలూ, గడియలూ మెల్లమెల్లగా గడిచిపోతున్నాయి. ఇంత మేడలో ఎందరున్నారో ఏమోగానీ లోపలినుంచే చీమచిటుక్కుమన్నంత అలికిడైనా వినిపించడం లేదు. సత్యనారాయణ వాలుకుర్చీలో పడుకుని ఆపసోపాలు పడ్డాడు. ఆవులించాడు. కడకు పైకి లేచి కాలుగాలినపిల్లిలా అటూయిటూ పచారు చేయసాగాడు.

గంట దగ్గరదగ్గర పదిన్నర కావస్తోంది.

వృథాగా కాలం గడిచిపోతున్నందుకు నిరుత్సాహపడుతూ సత్యనారాయణ మళ్ళీ మంచందగ్గరకు వెళ్ళి ముసలివాడికేసి చూశాడు.

ముసలివాడీసారి కళ్ళు తెరచుకుని పైకప్పుకేసి చూస్తున్నాడు.

"బాధగావుందా?" మంచంపైకి వంగి ప్రశ్నించాడు సత్యనారాయణ.

అవునన్నట్టు ముసలివాడు కళ్ళతోనే సంజ్ఞచేశాడు.

"కదలకుండా పడుకో! కదిలితే కట్టు తెగిపోవచ్చు."

సమీపంలో బూట్ల టకటకలు వినిపించి సత్యనారాయణ తల పైకెత్తాడు. ముఖంలో విజయగర్వం తాండవిస్తుండగా పోలీసులు నేరస్థుల్ని వెంటబెట్టుకుని వచ్చేస్తున్నారు. సత్యనారాయణ ఆ అయిదుగురినీ వరండాలోకి వచ్చి వృద్ధుడి చూపు కానేటట్టు మంచానికి దగ్గరగా నిల్చోమన్నాడు.

ముసలివాడు వరుసగా, ఆ అయిదుగురి ముఖాల్నీ చూశాడు. కానీ అతడి ముఖంలో సత్యనారాయణ ఆశించిన మార్పేదీ ద్యోతకం కాలేదు. అతడు పైకప్పును, తనను ఎంత నిర్వికారంగానైతే చూశాడో, అంత నిర్వికారంగానే ఆ ఐయిదుగురినీ చూస్తున్నాడు.

"వీళ్ళెవరో ఎరుగుదువా?" సత్యనారాయణ బిగ్గరగా ప్రశ్నించాడు.

నోరు మెదల్పడానికి వీల్లేకుండా కట్టు బిగిసివుండడంవల్ల ముసలివాడు మళ్ళీ సైగతోనే జవాబు సూచించవలసివచ్చింది.

అతడు పెదవి విరిచి చేతిని కదుపుతూ వీళ్లెవరో తనకు తెలియదని సంజ్ఞ చేశాడు.

సత్యనారాయణ విస్మయచకితుడైపోయి మరింత బిగ్గరగా "వీళ్లలో నిన్ను కొట్టిందెవరు?" అని అడిగాడు.

ఎవరూ కాదన్నట్టు వృద్ధుడు మళ్లీ పెదవి విరిచి బాధగా వున్నా లెక్కచేయకుండా తల అడ్డంగా ఊపాడు.

ఇంతసేపటికి సింహద్వారం కిర్రుమని తెరచుకుంది. "ఏమిటండీ యిన్స్పెక్టరుగారూ! అప్పుడే విచారణ ప్రారంభించేసినట్టున్నారే"అంటూ రంగనాథంగారు నాగలింగం వెంబడించగా బయటికి వచ్చారు.

సత్యనారాయణ చిరపరిచితునితో మాట్లాడుతున్నట్టు తల పైకెత్తకనే "మీరొస్తేనేగానీ ఈ విచారణ ముందుకు సాగేట్టు లేదు" అన్నాడు.

"ఏం! ఎందుకని?" రంగనాథంగారు కుతూహలం వ్యక్తం చేస్తూ అడిగారు.

"ఈ ముసలివాడు వీళ్లెవరో తనకు తెలియదంటున్నాడు."

"ఈసారి అడగండి" అన్నారు రంగనాథంగారు.

సత్యనారాయణ నెంబరు414 వైపు చూశాడు. 414 మంచాన్ని సమీపించి బాగా వంగి ముసలివాడి చెవిలో "నిన్ను బాదబాదినవారెవరో చూపించు" అన్నాడు.

ఇంతకుమునుపు సత్యనారాయణ ఆశించిన మార్పు ఒక్కుమ్మడిగా ముసలివాడి ముఖంలో అలముకుంది. కోపాన్నీ, అసహ్యాన్నీ వెళ్ళగక్కుతున్న చూపులతో అతడు కంపించిపోతున్న చేతిని గాఢప్రయత్నంతో పైకెత్తి చూపుడువ్రేలితో రంగనాథంగారిని నిర్దేశించాడు.

పోలీసులు నోరు తెరిచేశారు. నాగలింగం "ఏమి టేమి"టని కంగారుపడ్డాడు. రంగనాథంగారు అప్పుడే ముట్టించిన సిగరెట్టును నలిపి దూరంగా పారవేసి చరచరా మంచందగ్గరికివచ్చి నిల్చున్నారు.

రెండు నిమిషాలు మౌనంగా గడిచిపోయాయి.

పరీక్ష ముగించుకుని రంగనాథంగారు సింహద్వారంవైపు వెళ్తూ "నాగలింగం! ఇన్స్పెక్టరుగారిని మేడపైకి తీసుకురా. నెమ్మదిగా మాట్లాడుకోవచ్చు" అన్నారు.

* * * *

సత్యనారాయణ మేడపైన రంగనాథంగారి గదిలో ప్రవేశిస్తున్నాడు, గోడగడియారం టంగుటంగున పదకొండుసార్లు మ్రోగింది. పాతికాలపు నగిషీపనుల వల్లతి కుర్చీలో కూచున్న సత్యనారాయణ రెండు మూడు నిమిషాలవరకూ ఆ గదిలోని వాతావరణంలో ఉక్కిరిబిక్కిరైపోయాడు. గోడలకు అక్కడక్కడా పులిచర్మాలు వేలాడుతున్నాయి. ద్వారబంధంపైన,నిలువెత్తు తైలవర్ణచిత్రాలపైన వంపులు తిరిగిచివరల్లో ఈటెలా మొనదేలివున్న దుప్పికొమ్ములు గోడకు తాపడం చేయబడివున్నాయి. జోడుబారుల తుపాకీ ఒకటి బడలిక తీర్చుకుంటూ బీరువాపైన విశ్రమించి వుంది. కిటికీ లన్నీ మూసివుండడం చేత గదిలో గాలి కదలడంలేదు.

ఆ నీరవ నిశ్శబ్దంలో మొట్టమొదట రంగనాథంగారే నోరు తెరిచారు.

"ఇన్స్పెక్టరుగారూ! ఈ లోకంతరహాను చూస్తుంటే ఒక్కొక్కప్పుడు నాకు నవ్వొస్తుంటుంది. మీకు?" చిరునవ్వుతో ఆయన మెల్లగా ప్రారంభించారు.

"నాకు ఏడుపొస్తుంది." దాదాపు రెండుగంటలసేపటినుంచీ సత్యనారాయణ ఉద్విగ్న హృదయంలో రేగుతున్న కల్లోలం మాటల తొడుగుతో పైకి పెల్లుబికింది. "ఎందుకనండీ!" "లోకం ఒక నాటకరంగమే కావచ్చు. కానీ ఈ నాటకరంగానికి యింతటి కృత్రిమమైన కథావస్తువుమాత్రం ఎన్నడూ ఎన్నుకోబడలేదు. అన్యాయమనే బెబ్బులి మేకతోలు కప్పుకుని రంగంమీద పరవళ్ళు త్రొక్కుతుంటే, వెనుకవైపునుంచి సామాన్య మానవుడు "ఆపండి. తెర దించండి" అని ఒకవైపు మొత్తుకుంటూన్నా, సభలో ముందువైపు సుఖాసనాల్లో కూర్చున్నవాళ్లుమాత్రం "అద్భుతం, అమోఘం" అని నాటకాన్ని మెచ్చుకుంటున్నారు. నాటకంలో అన్నీ నియమ

స్థాపితం: 1860 ఫోన్: 4007 తంతి: "CANOPY"

COLAMBIA

అసలుబుట్టమార్కు




BEST IMITATION SILK

అసలుకొలంబియ

અસલ કોલંબીઆ

GUARANTEED 34 MONTHS

MANUFACTURED FOR

EBRAHIM CURRIM & SONS

BOMBAY. MADRAS. CALICUT

ప్రఖ్యాతిచెందిన

కొలంబియా

"బెలూన్" మార్కు గొడుగులు

యెల్లప్పుడు వాడండి.

తయారు చేసేవారు:

ఇబ్రహిం కరీం అండ్ సన్స్,

251-53, చైనాబజారు రోడ్, మద్రాస్-1.

హెడ్ ఆఫీస్: బొంబాయి. :: బ్రాంచి: కాలికట్.

---

ఉత్తమమైన లూబ్రికేషనుకు చిహ్నము

# ★ "వీడాల్" ★

## ప్రపంచంలో మిక్కిలి సుప్రసిద్ధమైన మోటారు ఆయిలు

—:—

**టైడ్ వాటర్ ఆయిల్ కంపెనీ (ఇండియా) లిమిటెడ్.**

ఏజంట్లు:

## ప్యారీ అండ్ కంపెనీ, లిమిటెడ్,

**(ఇంజనీరింగు డిపార్టుమెంటు)**

**ఎస్ప్లనేడ్, మద్రాసు-1.**

బద్ధంగా జరిగిపోవటానికనీ, అల్లరి జరక్కుండా ఉండటానికనీ నియమించబడుతున్న సిబ్బందికి ఇంతకంటే ప్రాణసంకటమైన పరిస్థితి ఏదో నే నూహించుకోలేకపోతున్నాను. ఈ దురవస్థను చూచి నవ్వటానికి నాకు ధైర్యం చాలదు. అందుకే నాకు ఏడుపొస్తుంది."

రంగనాథంగారు టేబిలుపైన మెల్లగా చిటిక వేసి "రాత్రి చాలా ప్రొద్దుపోయింది ఇన్‌స్పెక్టరుగారూ! అప్రస్తుత ప్రసంగాలతో కాలహరణం చేయడానికి యిది సమయంకాదు" అన్నారు.

"మీరు ప్రస్తుత విషయాన్ని గురించిమాత్రమే మాట్లాడదలచుకుంటే అందుకు నా అభ్యంతరం లేదు" అన్నాడు సత్యనారాయణ

రంగనాథంగారు ద్వారంవైపు చూస్తూ నాగలింగాన్ని లోపలికి రమ్మన్నారు.

"పిలిచారా బాబూ!" అంటూ నాగలింగం గదిలో ప్రవేశించాడు.

"ఇలా దగ్గరికి రా" అంటూ లేచి నిల్చున్నారు రంగనాథంగారు. "తల పైకెత్తి నావైపు చూడు. ఆ ముసలాడు దేమంటున్నాడో, కాదు, ఏమని సైగచేస్తున్నాడో నువ్వు చూచావుకదూ!"

"పిచ్చివెధవ! బుర్ర దారితప్పిన వాడికేం తెలుస్తుంది బాబూ!" అన్నాడు నాగలింగం.

"అతడి కీమధ్య పిచ్చి పట్టిందేమో నాకు తెలియదు. కానీ నాకు గట్టిగా తెలిసిన విషయంమాత్రం ఒకటుంది. అతడు నీతండ్రి" అంటూ రంగనాథంగారు కుర్చీలో కూర్చున్నారు.

"ఏమిటీ! ఇతడేనా మా అయ్య? నిజంగానా?" నాగలింగం ముఖంలో ఆశ్చర్యం సుళ్లు తిరుగుతోంది.

"అవును. నిండుగా పదహారేళ్ళు జైల్లో వుండి అతడీవాడు, ఈవిధంగా మనకు ప్రత్యక్షమౌతున్నాడు. ఈ పదహారేళ్లుగా నీకు, మీ అక్కకు నిలువనీడ, తిండితిండీ, కట్టుబట్ట యిచ్చి సంరక్షణ చేసినందుకు ప్రతిఫలంగా ఈరోజు మీఅయ్య తనను తలపగులగొట్టిందినేనేనని ప్రేలెత్తి చూపుతున్నాడు. పోనీ నాగలింగం! ఇన్‌స్పెక్టరుగారికి వీలుగా వుంటుంది. నువ్వూ ఆమాటే అనరాదూ!"

"ప్రాణం పోతున్నా ఆమాట అనగల్నా బాబూ! జైల్లో ఆ ముసలాడికి మతిపోయి వుంటుంది. మీ కాళ్లట్టుకుంటాను. తమరతడి మాట ఖాతరు చేయకండి."

"నేను ఖాతరు చేయవనుకో! కానీ ఇన్‌స్పెక్టరుగారి సంగతి?"

"ఈ విషయంలో నా నిర్ణయాలు నాకున్నాయి." సత్యనారాయణ లేచి చేతుల్ని టేబిలుకు ఆనించి ముందుకు వంగుతూ అన్నాడు. "ఈ రోజు అతడిపైన చేయి చేసుకున్నది మీరేనని మాత్రం నేను సందేహించలేకపోతున్నాను. ఒకవేళ అతడు పిచ్చివాడైనా కావాలి. లేకుంటే అతనలా మిమ్మల్ని చూపించడానికి వెనుక బలీయమైన కారణమేదో దాగివుండాలి. ప్రస్తుతం యింతకంటే ఎక్కువగా ఏమీ చెప్పలేను."

"తీరిగ్గా ఆలోచించుకోవచ్చు. మీరువెళ్ళి పడుకోండి ఇన్స్పెక్టరుగారూ! అర్ధరాత్రి కావస్తోంది. నాగలింగం! నడవగదిలో పడుపువేసి వుంచావుకదూ?" అన్నారు రంగనాథంగారు.

"వేసివుంచానండీ!" అంటూ నాగలింగం సత్యనారాయణకు దారి చూపించడానికి లాంతరు చేతికి తీసుకున్నాడు.

*　　　*　　　*　　　*

రాత్రి తొలి ఘడిజాములు గడచిపోయిన తర్వాత మూడో జాముగ చంద్రోదయమైంది. మేడపైన రంగనాథంగారు, నడవ గదిలో మంచంపైన పడుకున్న సత్యనారాయణ, వంటింటి గుమ్మం దగ్గర కటిక నేలపైన్నే మేనువాల్చిన నాగరత్నం—ఈ ముగ్గురూ తప్ప మిగిలిన కూనలమ్మకోన నిశ్చింతగా నిద్రపోతోంది. తనకూ, రంగనాథంగారికీమధ్య ఓ పెద్ద అఘాతముందనీ, ఆ అఘాతానికి పైన నిర్మింపబడిన వారధి కృతకమైందనీ నాగరత్నం ఎన్నడూ అనుకోలేదు, సాధ్యాసాధ్యాలు విచారించకుండా నూతి కెజ్జంలో ఏనుగను దూర్చడానికి ప్రయత్నించే లోకాతనం తన నెక్కడికి తీసుకపోయి వదలిపెట్టగలదో ఆమెకు తెలియదు. మానవుల్లో అంతరాంతరాలున్నాయన్న ప్రాపంచిక పరిజ్ఞానానికి దూరదూరంగా పెరిగిన పల్లెపడుచు నాగరత్నం. ఆమె తన తమ్ముడిలా రంగనాథంగారిలో 'అయ్యగారిని' చూడలేదు. చిన్నవాడు తనతో సరాగాలు పోయి, చక్కలిగింతలుపెట్టి 'మీ అక్క ముసలిదైపోయింది. నువ్వు నన్ను పెళ్లాడుతావా?' అన్న మాటయ్యని మాత్రమే చూచింది. ఆ అపరిపక్వమైన మానసికస్థితిలో నాగరత్నానికి రంగనాథంగారి మాటల్లో లేని అర్థాలు గోచరించాయి. ఊహాతరంగాలపైన కదలిపోతున్న పూలతెప్పలో కూర్చుని తను కట్టుకున్న ఆశాసౌధాలన్నీ పేకమేడలని విడమరచి చెప్పగలిగిన సంఘటన జరిగిన తర్వాత గూడా ఆమె అదే భ్రాంతిలో కొట్టుమిట్టాడిపోతోంది.

ఉండి, ఉండి లేచి కూర్చుంటుంది నాగరత్నం. ఒకవేళ మాఅయ్య తన మాటను తృణీకరించివేస్తున్నా, ఇది నీకు బుద్ధి కాదని అతడికి నచ్చచెప్పగలిగినవాళ్లు ఉండకపోరన్న ఆశ ఆమె లేతహృదయంలో మళ్ళీమళ్ళీ మోసులు తొడుగుతోంది. పరిపరి విధాల ఆందోళితమైపోయిన ఆమె మనసు చిత్రవిచిత్రమైన ఆలోచనలకు రంగస్థలంగా మారిపోయింది. ఒక అమాయకురాలికి మోసము జరిగిపోతోందన్న చింతలేకుండా ఈ లోకులు ఎలా నిద్రపోగలుగుతున్నారు? ఒకరిని అని ఏం లాభం? ఒకేరక్తం పంచుకుని పుట్టిన తమ్ముడే తనని అవతలికి పొమ్మని కసిరికొట్టేశాడు. తనిప్పుడేం చేయాలి? దొమ్మీలు, దోపిడీలు, దొంగతనాల్లాంటి అక్రమాలు జరిగినప్పుడు, అన్యాయంపాలైనవాళ్లు పోలీసువాళ్ళతో మొరపెట్టుకోడం లోకంలో సర్వసాధారణంగా జరుగుతున్న విషయం కానీ, తనెవరితో మొరపెట్టుకోవాలి? ఎవరు వింటారు? తనకుజరిగింది అన్యాయంకాదా? అక్రమంకాదా? దగా కాదా?

నాగరత్నం లేచి నిల్చుంది. ఇన్స్పెక్టరుగారు క్రిందికి దిగి వచ్చి నడవగదిలోకి వెళ్లి పడుకుని ఎంతోసేపు కాలేదు. ఈపాటికింకా ఆయనకు నిద్రపట్టి వుండదు. ముసలివాడికొకడికి తలమీద దెబ్బ తగిలిందని తెలియగానే రాత్రికి రాత్రే పరుగెత్తుకువచ్చిన మనిషి, తన మొరను చెవుల్లో వేసుకోడా? ఆయనతో తన గోడు చెప్పుకుంటే?

ప్రవాహంలో పడి క్రిందుమీదులై కొట్టుకపోతూ చేతికి దొరికిన పూచికపుల్ల ఆసరాతో గడచి గట్టెక్కాలని అభిలషించే మానవమాత్రుడికి మల్లే నాగరత్నం అడుగు ముందుకు వేసింది.

సరిగ్గా ఆసమయానికి నిద్రపట్టక గదిలోనుంచి బయటికివచ్చి డాబాపైన పచారు చేస్తున్నారు రంగనాథంగారు. జీవితంలో ఆయనకు బొత్తిగా నిద్రపట్టని రాత్రులను వ్రేళ్ళమీద లెక్కపెట్ట వచ్చు. ఒకసారి క్రొత్తగా వచ్చిన కలెక్టరు 'ఈ మూసలమ్మకోనలో తంటాలన్నీ మీ మూలంగానే వస్తున్నట్టున్నాయి' అన్నాడు. ఆ రోజు రాత్రి రంగనాథంగారికి నిద్రపట్టలేదు. ఇంకోసారి ఫారెస్టు వాచరొకడు "నిన్ను కోనలో లెక్కించకపోతే నాకు మారుపేరు పెట్టు" అన్నందుకు నిద్రరాక పడకపైన దొర్లుతూ ఆయన ఒక రాత్రంతా మేలుకుని వుండిపోయారు.

వసంతం జరుగుతున్నా అర్ధరాత్రయ్యేసరికి కోనలో చలిగాలి వీస్తుంది. చెవులకు మఫ్లర్ చుట్టుకుని, సిగరెట్టు కాల్చుకుంటూ రంగనాథంగారు పిట్టగోడ వెంబడే మెల్లగా తిరుగుతున్నారు. ఐదు నిమిషాల కొక్కొక్కటిగా సిగరెట్లు కాలి మసైపోతున్నాయి. పెట్టెలో అగ్గిపుల్లలన్నీ ఆఖరైపోయాయి. ఇక అగ్గిపెట్టెకోసం నాగలింగాన్ని లేపడంకన్నా గత్యంతరం లేదు, అవసరానికి ఒకటి రెండు అగ్గిపెట్టెల్ని అతడు గదిలో ఎక్కడైనా "స్టాకు" చేసి వుంటాడు. రంగనాథంగారు నాగలింగాన్ని ఒకసారి పిలిచి చూశారు. గదికివతల చాపపైన పడుకుని గుర్రు పెడుతున్న నాగలింగానికి ఆ పిలుపు వినిపించలేదు. మెలకువతో వుంటే సరే, నాగలింగం ఎంతసేపైనా అలావుండి పోతాడు, కళ్ళు మూసుకుంటే మాత్రం అతిడిది కుంభకర్ణుడి నిద్ర!

రంగనాథంగారు నాగలింగం దగ్గరకు వెళ్తూ మధ్యలో హఠాత్తుగా ఆగిపోయారు. క్రింద వంటగదికీ, నడవకూ మధ్య హాలుకు నాలుగువైపులా గదులుండడంవల్ల కాంతి ప్రసరించడం కోసం పైకప్పుకు మూడు చోట్ల అద్దాలు పొందుపరిచారు. ఆ అద్దాల గుండా వెన్నెల హాల్లో పడుతోంది! వెన్నెల కాంతిలో స్పష్టంగా చూశారు రంగనాథంగారు. నాగరత్నం నడవగదివైపు వెళ్తోంది!

రంగనాథంగారు చరచరా నాలుగడుగులు ముందుకువేసి చివరి అద్దందగ్గర నిల్చున్నారు.

నాగరత్నం ద్వారం దగ్గరఆగి, వారగా వేసిన తలుపుగుండా లోపలికి చూస్తోంది. ఆమె పెదవులు కదులుతున్నాయిగానీ మాటలు మాత్రం డాబా పైకి వినరావడం లేదు.

మరికొంత సేపటికి నాగరత్నం తలుపు తీసుకుని గదిలోపలికి వెళ్ళింది.

రంగనాథంగారు నాలుగు క్షణాలపాటు ఆలోచిస్తూ వుండిపోయారు. మరుక్షణంలో నాగలింగం దగ్గరికి ఓ గంతువేసి అతణ్ణి తట్టి లేపి కూర్చోబెట్టారు.

"ఏంబాబూ! ఏం జరిగింది?" అంటూ లేచి నిల్చున్నాడు నాగలింగం.

"అదికాదురా నాగలింగం! క్రింద మీ అయ్య అలా బాధతో అఘోరిస్తుంటే, యిక్కడ పడుకోడానికి నీకు మనసెలా ఒప్పింది? వెళ్ళు. ఈ రాత్రి తండ్రిదగ్గరే పడుకో" అన్నారు రంగనాథంగారు.

"వెళ్తాను బాబూ!" అని నాగలింగం చాప చుట్టుకుంటూ, "మీకు సిగరెట్లు, అగ్గిపెట్టె ఉన్నయ్యా బాబూ?" అన్నాడు.

"అన్నీ ఉన్నాయిలే! నువ్వు వెళ్ళు" అంటూ రంగనాథంగారు గదిలోపలికి వెళ్ళారు.

చాపచుట్టి భుజాన వుంచుకుని నాగలింగం మెట్లకేసి నడవసాగాడు.

*　　*　　*　　*

మంచంపైన అరంగుళాల మందమున్న పరుపు సత్యనారాయణకు కంటకశయ్య అయిపోయింది. కన్ను మూసుకున్నా అతడికి కునుకు రావడంలేదు. గదిలో గుడ్డిదీపం ఒకటి వెలుగుతోంది. ఆ వెలుగులో వస్తువులకన్నా వాటి నీడలే స్పష్టంగా కనిపిస్తున్నాయి. సత్యనారాయణకు పడుకోకముందు ఓ గ్లాసుడు మంచినీళ్లు త్రాగక పోతే నిద్రపట్టదు. గదిలో మిగిలినవన్నీ వున్నాయిగాని మంచినీళ్ళ కూజామట్టుకు లేదు. సత్యనారాయణ నిట్టూరుస్తూ గడియారం చూచుకున్నాడు. ముళ్లు రెండూ పన్నెండు దగ్గర కలుసుకుని, విడిపోయి కూడా అరగంట కావస్తోంది.

తలుపుదగ్గర ఏదో చప్పుడయింది. చీరచెంగు రెపరెపలాడి నట్టు, గాజులు గలగలమన్నట్టు మెల్లగా వినవచ్చిన ఆ చప్పుడువిని సత్యనారాయణ ఉలికిపడ్డాడు. ఇది, ఆయుధాలన్నీ విఫలమైపోయిన తర్వాత చిట్టచివరి ప్రయత్నంగా తన పైకి సంధింపబడుతున్న బ్రహ్మాస్త్రం కాదుగదా!

"ఎవరక్కడ?" సత్యనారాయణ సూటిగా ప్రశ్నించాడు.

కంపిత స్వరంతో "నీకు చెల్లెలిలాంటిదాన్ని అన్నా! మరేమీ అనుకోకు. ఒక మాట చెప్పుకోవాలి" అంది నాగరత్నం.

"ఏమిటది?"

లోపలికి వెళ్ళి తలుపుచాటున నిల్చుంది నాగరత్నం. "దిక్కులేని వాళ్లకు దేవుడే దిక్కంటారు. ఆ దేవుడే ఈ రోజు నిన్నిక్కడికి తీసుకొచ్చాడు. నమ్మిచెడిన ఆడదాన్ని నేను. ఇంతకాలం నాకు నమ్మకాలు చెప్పి, యిప్పుడాయన ఎవతెనో పెళ్లాడబోతున్నాడు. నాలాంటిదానికి మేలు చేస్తే నీకు పుణ్యముంటుంది. నీకు నాలాంటి అక్కచెల్లెళ్లు వుండకపోరు. నాకు తెలుసు. నువ్వు చెబితే ఆయన తప్పకుండా వింటాడు."

దుఃఖోద్వేగంతో పెనవైచుకపోయిన నాగరత్నం మాటల్ని వింటూ సత్యనారాయణ నిర్విణ్ణుడైపోయాడు.

జవాబుకోసం ఎదురుచూస్తూ అలాగే తలుపుదగ్గర నిల్చుంది నాగరత్నం.

"ఎవరమ్మా ఆయన! రంగనాథంగారేనా?" కాసేపటికి తల పైకెత్తి నాగరత్నాన్ని చూస్తూ అడిగాడు సత్యనారాయణ.

"అవును" అని చెప్పడానికి నోరు తెరవబోతున్నది నాగరత్నం.

తీవ్ర ప్రహారానికి లోనైన తలుపు దబాలున తెరుచుకుంది. ఆ తాకిడికి తూలిపోయి నాగరత్నం సత్యనారాయణ ఒడిలో పడిపోయింది.

ద్వారం దగ్గర పళ్ళుకొరుకుతూ నిలబడి వున్నాడు నాగలింగం.

అశనిపాతంలా జరిగిపోయిన ఊహించని ఈ హఠాత్పరిణామాన్ని చూస్తూ సత్యనారాయణ మంచుగడ్డలా బిగుసుకుపోయాడు. కళ్ళప్పగించి చూస్తున్నా అతడికి చూస్తున్నదేమిటో స్ఫురించలేదు. చెవులప్పగించి వింటున్నా అవింటున్నదేమిటో అతడికి అవగతంకాలేదు. చైతన్యం కోల్పోయి సత్యనారాయణ మంచంమీద అలా జడపదార్థంలా కూలబడి వుండగానే నాగలింగం తోబుట్టువును జుట్టు పట్టుకుని బరబరా లాక్కెళ్ళి సింహద్వారం తెరచి బయటకు త్రోసివేశాడు. నాగరత్నం కుయ్యోమొర్రో అని అరిచింది. ఆ అరుపులకు యింట్లో జనమంతా మేలుకుని పరుగుపరుగున ఆ గదిదగ్గరికి వచ్చి మూగారు. అందరి కళ్ళలోనూ ఆశ్చర్యం పరవళ్లు త్రొక్కుతోంది, ఒకవేళ ఆడదానికైతే బుద్ధిలేక పోయింది. ఇతడి కేందుకు లేకపోవాలి? పైగా పెద్ద ఉద్యోగి. ఉద్యోగం చేస్తే అయిపోయిందా? కుక్కను కనకపు సింహాసనంపైన కూచోబెట్టవచ్చు గానీ, దాని సహజస్వభావాన్ని మరమ్మత్తు చేయడం ఎవరితరం? ఇంతటి భావాన్ని తమలో దాచుకున్న రూపరహితాలు జతలు జతలుగా చేరి శాఖలై పాడిచి, బరిసెలై చీల్చి, అగ్నిశిఖలై సత్యనారాయణను కాల్చివేయసాగాయి.

నాటకంలోలా శరవేగంతో ఒకదానితర్వాత ఒకటిగా జరిగిపోతున్న ఈ సంఘటనలకు పతాక పరిణామంగా రంగనాథంగారు "ఏమిటి, ఏమిటి" అంటూ మెట్లుదిగి క్రిందికి వచ్చేశారు.

ఒక కాలును ద్వారబంధంమీద మోపి, చొక్కా చేతులు పైకిమడిచి, సత్యనారాయణను చురచుర చూస్తూ మీసం మెలివేస్తున్న నాగలింగం "నీతులు మాట్లాడిన మనిషిని చూస్తారా బాబూ! చూడండి. సిగ్గూ శరమూ లేకపోయేసరి! మళ్ళీ వుద్యోగం వెలగబెడుతున్నాడు. ఛీ" అంటూ ముఖం త్రిప్పుకున్నాడు.

రంగనాథంగారు ఒకసారి మెల్లగా నవ్వారు. నవ్వుతూ నాగలింగం భుజంపై చేయివేసి "నువ్వువెళ్ళరా బాబూ! వెళ్ళిపడుకో" అని సత్యనారాయణవైపు తిరిగారు.

ఈ దెబ్బతో సత్యనారాయణను పట్టిన గ్రహం వదలిపోతుందనుకున్న వాళ్ళకుమాత్రం ఆశాభంగమే కలిగింది.

రంగనాథంగారు నాగలింగాన్ని ఎంతచల్లగానైతే మందలించారో అంత తేలికగానే సత్యనారాయణని కూడా మందలించారు.

"మానవుడి బుద్ధికి మేతగా అప్పుడప్పుడూ గడ్డికావలసివస్తుంది. మీరు గడ్డితిన్నందుకు నాకు కోపంలేదు. చింతగావుంది." రంగనాథంగారి మందలింపు అసాధారణమైన పంథాలో కొనసాగిపోతోంది. "ఇది అగ్గి అనీ, ముట్టుకుంటే వ్రేలు కాలిపోతుందని కుర్రవాడికి తెలియదు. తెలియకపోవడంచేతనే వ్రేలు కాలిపోవడం జరుగుతుంది. అందుకు కోప్పడి ఏంలాభం? ఇంకా ఒకఝామురాత్రి వుంది ఇన్స్పెక్టరుగారూ! పడుకోండి."

* * * *

వదలిపెడితే వేయిముక్కలైపోవడానికి సిద్ధంగావున్న తలను రెండుచేతుల్తో అదిమి పట్టుకుని లేచాడు సత్యనారాయణ. ఒక్కపెట్టున అతడి మనసును ఆవరించుకున్న స్తబ్ధత అప్పుడప్పుడే విడిపోతోంది. కల్లోలకాసారంలో తబ్బిబ్బుపడిపోతున్న జాబిల్లి ప్రతిబింబంలాంటి అస్థిరచిత్తం అతణ్ణి "పో, వెళ్లిపో, ఇక్కడనుంచి ఎంత త్వరగా వెళ్లిపోతే అంత మంచిది" అని ఆదేశించింది. సత్యనారాయణ కంతమాత్రమే తెలుసు. తనెలా పైకి లేచాడో, ఏత్రోవ వెంబడి వరండాలోకి వచ్చేశాడో అతడికి తెలియదు.

గగనంలో తెరాజాకు మేఘాలు అద్దుతగిలినట్టున్నాయి. మండిపోతున్న సత్యనారాయణ కళ్లకు గ్రుడ్డివెన్నెల్లో నీడా, గోడా, మేడా అంతా ఒకే రీతిగా గోచరమౌతోంది. కళ్లు నులుముకుంటూ వరండాలో నడిచి పోతున్న సత్యనారాయణ పాదానికేదో చల్లగా తగిలింది. అతడు ముందుకు వేయబోతున్న అడుగును వెనక్కి తీసేశాడు.

నాగరత్నం తలను తొడమీద పెట్టుకుని ఆమెముఖంలోకి చూస్తూ విగ్రహంలా కూర్చుని వున్నాడు నరసయ్య.

"ఏమిటది? ఏమిటది?" దిక్కులు తోచక ప్రశ్నించాడు సత్యనారాయణ.

"నెత్తురు! నెత్తురు!" రక్తసిక్తమైపోయిన చేతులతో ముఖాన్ని దాచుకుంటూ పైకిలేచాడు నరసయ్య. "ఇదేమిటో తెలియడం లేదా బాబూ! ఇది కూనలమ్మకోన. కావేషాలకు నిలవనీడ. కలహాలకు రచ్చబండ. మనుషుల్లోనే పులుల్ని పొట్టేళ్లనీ, తోడేళ్లనీ కుందేళ్లనీ పుట్టించి భగవంతుడు వాళ్లకోసం కట్టిపెట్టిన యిల్లు. ఈ కూనలమ్మకు వచ్చి నెత్తురు పైపూతలు కొత్తవి కావుబాబూ! పాతవే."

నరసయ్య మాట్లాడుతున్నంతసేపూ విని, తలవడ్డంగా ఊపుతూ సత్యనారాయణ ఉన్మత్తుడులా "నాకేం తెలియదు. నన్ను వెళ్ళిపోనివ్వు" అంటూ చరచరా వరండా చివరికి వచ్చేశాడు.

"ఆగండి! మీరుకూడా వెళ్ళిపోతే నా సొదను నే నెవరితో వెళ్ళబుచ్చుకోవాలి?" అంటూ నరసయ్య సత్యనారాయణ కడ్డంగా వచ్చేశాడు.

"ముందట నాకీ సంగతి చెప్పండి. ఏం చేసిందని నాబిడ్డకీశిక్ష?"

సత్యనారాయణ ఏదో చెప్పబోయాడు.

"మనుషులంగా పుట్టడమేనా మేము చేసినతప్పు. అవును. అవునులే" నరసయ్య వికటంగా నవ్వేశాడు. నిండుగా మునిగిన తర్వాత చలిబాధవుండదు. జీవితం ఎంత దుర్భరంగా పరిణమించాలో అంత దుస్సహంగా పరిణమించిన తర్వాత ఏడుపు నవ్వవుతుంది నవ్వు ఏడ్పవుతుంది. అప్పుడు నవ్వినా, ఏడ్చినా అందు కర్థమొక్కటే! నవ్వుతూనవ్వుతూవుండగానే నరసయ్యముఖంలో విచార మేఘాలు అలుముకున్నాయి. కళ్ళల్లో కన్నీళ్ళు క్రమ్ముకున్నాయి. "నేను పదహారేళ్ళు జైల్లో వుండి వచ్చాను. ఎందుకని? సింగప్పనైన నేను కొరెక్కించేశానని లోకం అనుకుంటోంది. రంగనాథంగారు ఒప్పుకోకపోవచ్చు. కానీ నేను నిజం చెబుతున్నాను. ఆయన కావాలని చేశారో, లేకుంటే అది ప్రమాదమో అది దేముడికే తెలియాలి. కొరెక్కించింది ఆయనగారు. అప్పుడు నేను గంగిరెద్దుని! ఉలవలు తినమన్నప్పుడు ఊఁ అన్నట్టే ఊపిరి కడుపు బెట్టమన్నప్పుడు కూడా ఊఁ అనేశాను. రెండేళ్ళకన్నా ఎక్కువశిక్ష పడదన్నారు. నా కొడుకుని చదివిస్తామన్నారు. కూతురికి పదికరాల నేల వ్రాసి పెడతామన్నారు. నాకు పదహారేళ్ళశిక్ష పడింది. అప్పీలు చేయమని కాళ్ళా వేళ్ళాపడి బతిమాలుకున్నాను. ఎక్కడ చేశారు? నా ప్రాప్తానికి నన్ను వదిలేశారు. నాగతేమైనా, బిడ్డలైనా సుఖంగా బ్రతుకుతుంటారన్న ఆశతో ఇంతకాలం ఆ కమ్ముల్లో బ్రతుకు వెళ్లబుచ్చాను. నిన్న తిరిగొచ్చి చూచుకుంటే యిక్కడంతా తల్లక్రిందులుగా వుంది. పదహారేళ్లకుముందు నా కళ్లెంత గుడ్డివో, యిప్పుడు నా కుమారుడికళ్లంత గుడ్డివి. మెడబట్టి గెంటివేయగా ఆడుబిడ్డ వచ్చి మంచంకోడుపైన పడింది. దాని తల పెట్లిపోయింది. నిన్న సాయంత్రం వాడికి వెంట్రుక వాసిలో చావు తప్పింది. వాడిపైకి గురిపెట్టినదెబ్బ నాకు తగిలింది. ఏంచేశామని మాకీశిక్ష? ఇన్స్పెక్టరుగారూ! మీరే చెప్పాలి. ఇంకొకరు చెప్పలేరు. న్యాయానికి అండ మీరు. తప్పుచేస్తే దండించేది మీరు. మిమ్మల్ని గాకపోతే నేనెవరిని అడుగుతాను? చెప్పండి. ఏం చేశామని మాకీశిక్ష?"

నరసయ్య కంఠం గద్గదికమైపోయింది. ఎవడి జీవితపు తెను తీరుపైన సంజవెలుగులు ప్రసరిస్తున్నాయో, ఎవడి జీవిత ఘోరాటవిలో ముండ్లూ గుండ్లూ, పుట్టలూ గుట్టలూ తప్ప నవ్వులాంటి పువ్వు, ఆనందంలాంటి వెలయేరు, అనురాగంలాంటి పికకూజితం మచ్చుకైనా లేవో ఆ నరసయ్య శోకగాథకు ఫలశ్రుతిగా సత్యనారాయణ కళ్లల్లోంచి రెండు కన్నీటిబొట్లు మాత్రం క్రిందరాలాయి.

చెట్టుక్రింది కోడిపుంజు రెక్కలు టపటపలాడించి "ఇంకా తెల్లవారలేదు. పడుకోండి, పడుకోండి" అని కోనకంతా వినబడేటట్టు ఎలుగెత్తి కూసింది.



# వేమభూపాల పంచకము

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

కవివరుల నాదరించిన భూపాలురు, తత్కవితా స్రవంతిలో కృతావగాహులై దరిచేరినచో విశదకీర్తి విస్ఫూర్తితో నజరామరులై విరాజిల్లెదరు. అట్లు గాని నాఁడు భూపాలకులెంతటి మహోత్తరకృత్యములు నిర్వహించినను, నెంతటి యుదారులైనను భావికాలమునఁ దమ యస్తిత్వమును నిలువరింపఁజాలరు. పూర్వరాజ కీర్తిబింబము వాఙ్మయాదర్శమునఁ బ్రతిబింబించినపుడు, ఆయా వ్యక్తులు దగ్గఱ లేకున్నను నశింపక ప్రతిఫలించుచునే యుండునని—

"ఆదిరాజ యశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయమ్
తేషా మసన్నిధానేఽపి నస్వయం పశ్య నశ్యతి"

విద్యానాథుఁడు ప్రతాపరుద్రయశోభూషణ ప్రారంభమున వాకొని యున్నాఁడు. ఈ తీరుగ వాఙ్మయమునకు మహాపురుషుల చరిత్రమునకు ఘనిష్ఠ సంబంధ మొకటి యేర్పడియున్నది. ప్రాచీనకాలము నుండియు నే భూపాలురైనను శౌర్యౌదార్యములు గలిగి, వాఙ్మయాభిరుచిగల్గి కవుల నాదరించి యాశ్రయ మిచ్చినవాఁడే, మహాపురుషుల చరిత్రములతోపాటు తమచరిత్రమునుగూడఁ జిరస్థాయిగ నొనర్పఁగలిగినారు. ఆంధ్రావనిలో మహాశూరులు పరమధార్మికులు నగు నెందఱు ప్రభువు లుద్భవింపలేదు; కాని నన్నయ తిక్కన యెఱ్ఱన పెద్దనాదుల కాశ్రయ మిచ్చి, ఆంధ్రభాషాభిపోషకారకులయిన రాజరాజనరేంద్ర మనుమసిద్ధి ప్రోలయవేమ శ్రీకృష్ణదేవరాయాదులను స్మరింపఁగల్గినట్లు లన్యుల స్మరింపఁగల్గెదమా?

కవితారసాస్వాదలోలుపుఁడైన సహృదయునకు, కవి యెవ్వఁడనికాని, యెప్పటివాఁడనికాని, అతని కాశ్రయమిచ్చిన ప్రభు వెట్టివాఁడనికాని విచికిత్సకలుగఁబోదు. కాని యట్టి రసికునకే కవికాలాదికముగూడఁ దెలియవచ్చినచో మఱికొంత యానందము గలుగును. ఈ తీరుగఁ గవితారసాస్వాదవిషయమున చరిత్ర జిజ్ఞాసకూడ నొక యావశ్యక విషయమగుచున్నది. సమగ్ర దేశస్వాతంత్ర్యము లభించిన యీ తరుణమున మన కట్టి జిజ్ఞాస మఱింత యావశ్యకమైనది. దానికి వలయు పరికరము లమరించుకొని, తగినంత కృషి చేసిననాఁడు మన కెన్నియో చారిత్రక విషయములు వాఙ్మయమూలమునను, వాఙ్మయవిషయములు చరిత్రమూలమునను వ్యక్తమగుచుండును. కాని చరిత్ర పరిశోధనలోఁ బడినపుడు తెగవు తెంపులు లేని చిక్కులు కూడ నొక్కొక్కప్పుడు ముడివడుచుండును.

కడచిన శతాబ్దిలలో ఆంధ్రదేశమును ఆంధ్రభాషను మహోన్నతదశకుఁ గొనితెచ్చిన మహావీరులు పరమధార్మికులు కవి పండిత పోషకులు నగు రెడ్డిప్రభువులు మధ్యాంధ్రదేశమును నుమారు నూట యేఁబది సంవత్సరములు పాలించిరి. అందును వేమభూపాల నామ ధారులందఱు కవి వాఙ్మయపోషకులు, హేమాద్రి దాననిరతులు, పార్వతీపతిపదాబ్జారాధకులు *వీరనారాయణులు నగుట విచిత్రమైన విషయము. అట్టి వేమభూపాలురు ప్రధానముగ నయిదుగురు గాన వచ్చుచున్నారు, వారు: 1. ప్రోలయ వేమారెడ్డి, 2. అనవేమారెడ్డి, 3. కాటయ వేమారెడ్డి, 4. పెదకోమటి వేమారెడ్డి, 5. అల్లాడ వేమారెడ్డి యనువారలు. వీ రైదుగురును మహావీరులై శత్రువులతో ఘోర సంగ్రామములు జరుపుచు, విజయములు సంపాదించుచు సంస్కృతాంధ్ర సారస్వతముల పోషించుచు, దేశమున శాంతి ధర్మములను స్థాపించిన ప్రభువులు. చరిత్ర పరిశోధకులకు వీరలలో నెవ్వ రేయే కాలమునం దేయే ప్రాంతమును బాలించిరో? ఏయే మహోత్తరకృత్యములు నెఱపిరో? యను విషయము శ్రమపడినఁ గొంతవఱకుఁ దెలియరావచ్చునుగాని, ఎఱ్ఱన కృతులను శ్రీనాథుని ప్రబంధములను జదివెడి పాఠకులకు వేమపాలుర స్వరూపము నెఱుఁగుట సామాన్యముగా విడువనకే చిక్కు. అట్టివారికిఁ గొంతవఱకుఁ జిక్కువిడుటకై యీ యుపక్రమము గావించితిని. ఒకప్పు డిందలి విషయములు చరిత్ర పరిశోధకులకుఁగూడ నుపకరింపవచ్చును.

మున్ముందుగ రెడ్డిరాజులలో నెవ్వ రెవ్వ రెంతకాల మాంధ్ర దేశమును బాలించిరో స్థూలముగఁ దెలిపి తరువాత వారివారి విశిష్టతలను జేర్కొందును. ప్రోలయ వేమారెడ్డి—క్రీ. శ. 1325 మొదలు 1353 వఱకు అద్దంకి రాజధానిగా కొండవీటిరాజ్యమును బాలించెను. ఈతనివెనుక నీతని పెద్దకుమారుఁడు అనపోతారెడ్డి—క్రీ. శ. 1353 మొదలు 1364 వఱకు కొండవీడు రాజధానిగాఁ బాలించెను. అతనివెనుక అనపోతారెడ్డి సోదరుఁడు అనవేమారెడ్డి క్రీ. శ. 1364 మొదలు 1386 వఱకు నా రాజ్యమును బాలించెను. పిమ్మట అనపోతారెడ్డి కొడుకు కుమారగిరి క్రీ. శ. 1386 మొదలు 1402 వఱకు రాజ్యము చేసెను. కుమారగిరి తరువాత పెదకోమటి వేమారెడ్డి 1402 మొదలు 1420 వఱకు కొండవీటి రాజ్యమును బాలించెను. పెదకోమటి వేముఁడు ప్రోలయ వేమారెడ్డికి అన్నయగు మాచారెడ్డి మనుమఁడు. ఈ వేముని కుమారుఁడు రాచవేమన 1420 మొదలు 1424 వఱకు రాజ్యము పాలించెను. అతనితో కొండవీటి రాజ్య మంతరించెను.

పెదకోమటి వేముఁడు కొండవీటి రాజ్యము పాలించునపుడే కాటయ వేమారెడ్డి రాజమహేంద్రవర రాజ్యమును బాలించెను. కాటయ వేముఁడు అనపోతారెడ్డి యల్లుఁడు, కుమారగిరికి బావమఱది యగుటచే, అనవేముని నాఁడు వశమయిన రాజమహేంద్రవర రాజ్యము కాటయ వేమునకు సంక్రమించినది. కాటయ వేముని

1402 మొదలు 1416 వఱకుఁ బాలించెను. అతని తరువాత కాటయ వేముని అల్లురయిన అల్లాడ వేమ వీరభద్రారెడ్లు క్రీ. శ. 1416 మొ. 1436 వఱకు, రాజమహేంద్రవర మాదిగా కటకము వఱకు నుండెడి రాజమహేంద్రవర రాజ్యమును శత్రుదుర్భేద్యముగను ధర్మోత్తరముగను బాలించిరి. వీరందఱిలో "వేమ" నామధారు లయిన వారందఱు శూరాగ్రేసరులు విద్యాపోషకులు నగుటను బట్టి 'వేమ'యను నామమునకే యా విశిష్టతగలదనిపించుచున్నది.

1. ప్రోలయ వేమారెడ్డి:—ఈతఁడు ప్రోలారెడ్డి కొడుకు. కాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నమైన తరువాత యవనుల యాక్రమణముచే ధ్వంసమైన భారతీయ ధర్మమును పునరుద్ధరించిన మహావీరులు ప్రోలయ నాయకుఁడు కాపయ నాయకుఁడును. వీరిలో ప్రోలయ నాయకుఁడు కృష్ణానదీ పరిసర దేశమును, కాపయ నాయకుఁడు గోదావరీ పరిసరప్రదేశమును పునరుద్ధరించిన మహానాయకులు ఈవిషయ మనితల్లికలువచేరు శాసనమునం దుద్ధరింపఁబడియున్నది:1 ప్రోలయనాయకుని తరువాత నాతని పుత్త్రుఁడు ప్రోలయ వేమారెడ్డి రాజ్యపాలకుఁడై, హేమాద్రిదానవిరతుఁడై కవి పండిత పోషకుఁడై విలసిల్లెను. ఈతఁడు ఎఱ్ఱాప్రెగ్గడచే రామాయణమునుఁ దెనిఁగింపఁజేసి, పిమ్మట హరివంశము నాంధ్రముసేయ నియమించి, కృతిభర్తృత్వము వహించెను. ఆనాఁడు కృతిని నిర్మింపఁజేయుటయన ధనికుల కవశ్యకర్తవ్యములైన ధార్మికకృత్యములలో నదియొక్కటి. అనఁగా సప్తసంతానములలో నదియొక సంతాన ప్రాప్తి. ఉత్తమ సంతాన మెట్టులు తరతరములుగాఁ గీర్తిప్రతిష్ఠలు నిలుపునో యట్లే యుత్తమకృతి స్వీకృతియు, స్వీకరించినవాని పేరుప్రతిష్ఠలను సుస్థిరము చేయఁజాలును. దేవళములు నిర్మింపఁజేసి యగ్రహారములనిచ్చి, తామ్ర శిలాశాసనములు నెలకొల్పినవాఁడుకూడఁ గొంత కీర్తి వ్యాపించును గాని, దానిస్థాయి వాఙ్మయమునందువలెఁ జిరస్థాయి కానేరదు. కావుననే యానాఁటి ధార్మిక ప్రభువులు అగ్రహారాదికమును దానము చేసియు కృతిస్వీకృతి నొక ప్రధాన కృతిగా భావించియున్నారు. ప్రోలయ వేమారెడ్డి శౌర్యము, దానపరత, సౌశీల్యము, పరమేశ్వర భక్తి, సౌభ్రాత్రము మున్నగునవి యెఱ్ఱన హరివంశమునఁ దెలియవచ్చినట్టులు, అతని దానశాసనములవలనఁ దెలియవచ్చుట లేదు. కవితాప్రవాహములో నతిశయోక్తులు స్వభావోక్తులు కూడ నోతప్రోతములై యుండును. అట్టిపట్టులందు యథార్థవిషయములను గ్రహించుటకు వారివారి శాసనములు సహకారు లగుచుండును.

హరివంశమునం దెఱ్ఱాప్రెగ్గడ ప్రోలయ వేమారెడ్డి ఘనత నుగ్గడించుచు నాతఁడు నెఱపిన ధర్మకార్యముల నిట్లు పేర్కొని యున్నాఁడు.

అగ్రహారములు విద్యా తపో వృద్ధవి
  ప్రుల కిచ్చి యజ్ఞకర్తలుగ నునిచెఁ
గొమరారఁ జెఱువులు గుళ్లు ప్రతిష్ఠించి
  లోకసంభావ్యములుగ నొనర్చె
నిధులు నల్లిండ్లను నిలిపెఁ దోటలు సత్ర
  ములు చలిపందిళ్ళు నెలయఁజేసె
హేమాద్రిపరికీర్తితామితప్రవరదాన
  నివహంబు లన్నియు నిర్వహించెఁ
జేసెఁ జేయుచున్నాఁడు సేయనున్న
వాఁడు పునరుక్తకృతి శుభావళుల నెల్ల,
ననఁగ శ్రీ వేమవిభున కయ్యలరు పేర్మి
వశమె వర్ణింపఁ దద్భాగ్యవైభవంబు.

—హరి. పూ. 1-19

ఈ దానసామగ్రి నాతఁడు నెలయించిన శాసనములు తార్కాణించుచునే యున్నవి. ప్రోలయవేముని శాసనములం దా విషయ మంతగాఁ గానరాదు గాని, యాతని తరువాతి కొండవీటిప్రభువుల శాసనములందును హరివంశమునందును, గూడ, 'ప్రోలయవేముఁడు యవనుల దాడి యను మహాసముద్రమున మునిఁగియున్న భూమిని, తన విజయధాటిచే లేవనెత్తి నిజభుజమునఁ దాల్చి, ఉత్సన్నప్రాయమైన ధర్మము పునరుద్ధరించెనని వర్ణితమైనది. 2

మాలిని : యవననృపబలాబ్ధివ్యాపి ఖర్వగర్వవేగా
  జవన హయఖురాగ్రచ్ఛాది భూమ్యంతభాగా
  భవన భరిత లక్ష్మీబద్ధ నిత్యానురాగా
  భువనయుగ హితైకస్ఫూర్తిమ త్త్యాగభోగా!

హరి. పూ. 5-260.

ఈ వేమారెడ్డికి హరిహరు లిరువురయందును భక్తిభావము గలదు. ఈ విషయము హరివంశమునం దిట్లు తెలుపఁబడినది.

శ్రీకంఠచరణ సేవక
వైకుంఠగుణావధాన వర్ధననిపుణా!

హరి. ఉ. 3 ఆ. 1. ప.

ఇట్లు హరిహరుల నిర్వైర ముపాసించువాఁడు గావుననే యెఱ్ఱాప్రెగ్గడ కాశ్రయమిచ్చినాఁడు. ఎఱ్ఱనయుఁ దాను స్వయముగ శంభుదాసుఁడై నృసింహపురాణరచనముచే విష్ణుభక్తుఁడై నాఁడు. ఎఱ్ఱాప్రెగ్గడకు గురువు వ్యాఖ్యాతామరసన్నిభ సదాశివచింతామణి యను శంకరస్వామి. అతని పితామహుఁడు ఎఱపోతసూరి

---

1. శ్లో. వరాహవ ద్వారిధివారిమగ్నాం,
  ధరా మశేషాం యవనోదరస్థామ్
సముద్ధరన్ ప్రోలయనాయకేంద్రః,
  తతః ప్రతిష్ఠాపయతి స్మ తద్వత్.
తురుష్కైర్యే సమాక్రాంతా స్తే దాస్యే కాపభూభుజా
అగ్రహారాః పునర్దత్తా భూదేవా భువ మభూషయన్.
చూ. ఆ. సా. ప. పత్త్రిక. సం. 2. పుట 92.

2. చూ. కాటయవేమారెడ్డిచె నెలకొల్పఁబడిన అనపర్తి శాసనము, రెడ్డి సంచిక.

పవనజవ వాజివ్రాతరంగత్తరంగే
యవనజలమహోబ్ధౌ భూతధాత్రీం నిమగ్నామ్
విపుల విజయధామా యస్సముద్ధృత్య చక్రే
నిజభుజమణిభూషాం వీరనారాయణాంకః

శ్రీమదహోబలనరసింహప్రియదైవత భావుడు. అతని ప్రేరణచే నహోబల నరసింహస్వామి చరితమును 'నృసింహ పురాణ' మను పేర ప్రబంధముగా రచించి, ప్రబంధపరమేశ్వర బిరుదము గాంచి నాడు. ఈ ప్రబంధమునకుఁ గృత్యాదిలో నెఱ్ఱన తన పితామహు నిచే నిట్లనిపించియున్నాడు.

> గిరిశ పదభక్తిరసత
> త్పరభావము కలిమి శంభుదాసుం డనఁగా
> బరఁగిన గోవిందపదా
> దర సంభృత సోమనస్య ధన్యుఁడ నెందున్.
>
> —నృసిం. ౧. ౧౭.

ఇట్టి హరహరిభక్తుఁడైన యెఱ్ఱన ప్రోత్సాహమునచే కోమటి వేముఁడు శ్రీశైలమునకు పాతాళగంగాతటమునను, అహోబలపతిశైలమునకు భవనాశినదీతీరమునను సోపానసరణి నేర్పఱచినాఁడు. ప్రోలయ వేమునకు రాజ్యస్థాపనాచార్యుఁడు శైవుఁడగు 'ఘోడెరాయగంగ' గురువు. ఈ విషయము శాసన ప్రసిద్ధము. 3 దానినే శంభుదాసుఁ డిట్లు తెలిపియున్నాఁడు.

> శ్రీపర్వతేశభక్తి
> ఖ్యాపితగుణ ఘోడెరాయగంగ గురు కృపా
> స్థాపిత సామ్రాజ్య సము
> ద్దీపిత వేమక్షితీశ దీప్త నరేంద్రా!
>
> —హరి. ఉ. 4-1.

చిత్రో గ్రాజి ధనంజయా! నియమవద్వేశస్థ మృత్యుంజయా!

—హరి. పూ. 8- 206

యనుటచే నీతఁడు పరమేశ్వర భక్తుఁడనుట తెలియవచ్చుచునే యున్నది. యెఱ్ఱనచే రామాయణము రచింపఁజేసి, తన్మూలమునఁ గీర్తి నార్జించి, మరల హరివంశము రచింపఁజేయుటయే యాతని విష్ణుభక్తిపరాయణత్వమునకు నిదానము. ఈ విధముగఁ గృతికర్తయుఁ గృతిభర్తయు హరిహరభక్తిపరాయణు లగుటవలనమునఁ గనే, ప్రోలయ వేముఁడు శ్రీశైలాహోబలగిరులకు సోపానసరణిని వినిర్మింపఁజేసిన వాఁడై యుండును.

ఈ పర్వతద్వయ సోపానసరణి నిర్మాణము నెఱ్ఱన పేర్కొని యుండలేదు. కాని యనవేమ కొటయవేముల శాసనములలోనే తత్ప్రశస్తి విశదముగ వాకొనఁబడియున్నది. అనవేముఁడు శ్రీశైలమున వీరశిరోమంటపము కట్టించి వెలయించిన శాసనములో నీ ధముగఁ దెలిపియున్నాఁడు.

> స్తంభాన్ కీర్తికృతే సృజంత్యవనిశా భూమీశ్వరా నశ్వరాన్
> విష్ణ్వామ్నాస్య కృతే వినిర్మలమతిః శ్రీ వేమ పృథ్వీపతిః
> యేన శ్రీగిరిరప్యహోబలగిరి స్సోపాన మార్గాంకితౌ
> విఖ్యాతౌ రచితౌ సనాతనయశస్తంభావలంభూతయే. 4

తెలివిలేని భూపాలురు కొందఱు కీర్తికాములై నశించి పోయెడి జయస్తంభములను వేయింతురు. బుద్ధిశాలియైన వేమ భూపాలుఁడు శ్రీశైలమును అహోబలశైలమును సోపానమార్గఖచితము లను గావించి, ఆ పర్వతములనే పురాతన కీర్తిస్తంభములనుగా నిర్మించెను. ఇట్టి చేత యసాధారణ మని దీనిభావము.

ఈ సోపాననిర్మాణమే కొటయవేముని శాసనములలో వేఱొక తీరుగఁ జమత్కరింపఁబడినది. చతురమతియగు వేమభూపాలుఁడు శ్రీశైలమునకుఁ బాతాళగంగాతటమున నిర్మింపఁజేసిన సోపానములు, మేరుశిఖరముల నెక్కుటకును, స్వర్గంగలో స్నానము చేయుటకును, దేవాంగనాసౌధము లధిరోహించుటకును సోపానము లగుచున్నవనుట చిత్రము. 5

అమరావతిలోని అమరేశ్వరాలయ శాసనములో కూడా దీని ప్రశక్తి "అనవరత పురోహిత కృత సోమపాన, శ్రీపర్వత అహోబల నిర్మిత సోపాన" ఇత్యాదిగాఁ బేర్కొనఁబడియున్నది. శ్రీనాథుఁడును హరవిలాసములో "శ్రీపర్వతసోపాన, స్థాపకుఁడగు రెడ్డి వేమ జగతీ పతికిన్" అని వేముని ప్రశస్తి నుగ్గడించియున్నాఁడు.

ప్రోలయవేముని కనిష్ఠసోదరుఁడు మల్లారెడ్డి. ఈతఁడు బహు పరాక్రమశాలియై వేమునకుఁ గీర్తిప్రతిష్ఠల నెలకొల్పినవాఁడు. సంగ్రామములం దీతఁడు ప్రధానసేనానియై విజయసాధకుఁడై వేమభూపాలుని సేవించుచుండెడివాఁడని శంభుదాసు పలుమాఱులు హరివంశమునఁ బ్రస్తావించియున్నాఁడు. మల్లారెడ్డి తోడ్పాటు వేమునకు విశేషముగ నేర్పడియుండెననియుఁ దెలిపినాఁడు.

> బాహాదర్పమునం బ్రతీపధరణీపాలావళిం ద్రోల్చియు
> త్సాహోదగ్రుఁడు పోటుపల్లిఁ గొని సప్తద్వీపసద్వస్తు సం
> దోహంబున్ దనకిచ్చు నెచ్చెలి సముద్రుం బ్రీతుఁ గావించుచున్
> మాహాత్మ్యంబు వహించె మల్లరథినీనాథుండు గాఢోద్ధతిన్.
>
> రామునకు లక్ష్మణుఁడు సు
> త్రామసుతుఁడు ధర్మజునకుఁ దగ సౌభ్రాత్రం
> బేమెయి నెఱపుదు రామెయి
> వేమప్రభుఁగొల్చు మల్లవిభుఁడును భక్తిన్.
>
> —హరి. పూ. 1-28,29.

ఈ మల్లారెడ్డియే యెఱ్ఱనకు వేమభూపాలుని యాశ్రయ మొందఁజేసినవాఁడు. తన్మూలముగనే రామాయణ హరివంశ కృతి నిర్మితి జరుగుట కవకాశ మేర్పడి ప్రోలయవేముని కీర్తిప్రతిష్ఠలు సారస్వతప్రసిద్ధము లయినవి. ఈ విషయము వేమునినోటనే విన వచ్చుచున్నది.

> నాతమ్ముండు ఘనుండు మల్లరథినీనాథుండు నిష్ణాతత
> చ్ఛ్రీతోడన్ సముపేతుఁ జేసి యెలమిం జేపట్టి మాకిచ్చుటం
> జేతోమోద మెలర్ప రామకథ నుద్దీపించి యత్యుత్తమ
> ఖ్యాతిం బొందితి; నింక నీవు దనియన్ గావ్యామృ
> తాస్వాదనన్.

---

3. See Epi. Ind. Vol. VIII Madras Museum Plates of Annavema

4. See S. I. I. Vol. X No.

5' See S. I. I. Vol. VI No. 243 and Epi. Ind Vol. IV Kataya Vema's Tottaramudi Plates.

శ్లో. సోపానాని కృతాని యేన కృతినా పాతాళగంగాతటే
శ్రీశైలస్య మహీశమౌళిమణినా తాన్యేవ చిత్రంపునః
సోపానాని భవన్తి మేరుశిఖరారోహాయ నాకాపగా
గాహాయ త్రిదశాంగనాజన మహాసౌధాధిరోహాయ చ

భారతశేషమయిన హరివంశము తెనుఁగున నిర్వహించి తెలుపుమనినాఁడు.

ఈ మల్లారెడ్డి తోడ్పాటు వేమునకుఁ గార్యఖడ్గముల రెండిటను గలదని యొప్పిన పలుమాఱు శ్రీతని ప్రస్తావము శాసనాద్యంతములలోఁ జెప్పినాఁడు. వేమున కీ సోదరునియెడ నధికమగు సౌభ్రాత్రము గలదనుటకు, మల్లారెడ్డి కతఁడు యనుకృతమగునట్లు అమరేశ్వరాలయమున శాసనము వెలయించుటయే తార్కాణము.[6] మఱియు కలువపాముల శాసనమునందలి శ్లోకమొకటి మహమ్మదీయులతో నేర్పడిన దాడులలో నీ మల్లారెడ్డి తోడ్పాటు, విజయసాధకమైనట్లు తెలుపుచున్నది.

వేమానుజ స్సావరజో౽పి మల్ల
భూవల్లభో౽సౌ జగదేకమల్లః
అల్లావదీనాది తురుష్కమల్లాన్
సమల్ల సద్భంగగణాన్ విజిగ్యే.[7]

శ్రీనాథుఁడు తన్ను వీరభద్రారెడ్డి విద్యాంసుగా నొనర్చిన వేమభూపాలుని ప్రశస్తి నెట్లు సవిశేషముగఁ గాశీఖండమునఁ జిత్రించియున్నాఁడో యటులనే యొప్పనయు నీ మల్లరథినీనాథుని పరాక్రమాదికమును సవిశేషముగఁ జిత్రించియున్నాఁడు. ఇట్లు శ్రీప్రోలయవేముఁడు మధ్యాంధ్రదేశసముద్ధారకుఁడై, కొండవీటిరాజ్య ప్రతిష్ఠాపకుఁడై, విద్యావినోదియు హరిహరభక్తితత్పరుఁడునై నెగడినాఁడు.

2. అనవేమభూపాలుఁడు:—ప్రోలయవేమారెడ్డి తరువాత నాతని పెద్దకుమారుఁడు అనపోతారెడ్డి రాజ్యపాలకుఁడయ్యెను. ఈతఁడు తండ్రివలె శూరుఁడు ధార్మికుఁడు పార్వతీపతిపదారాధకుఁడునైయుండెను. ఈతని పాలనసమయమున, ఒకవైపున వెలమరాజులతోడను, యింకొకవైపున విజయనగరాధీశులతోడను, మఱియొకవైపున మహమ్మదీయులతోడను ఘోరసంగ్రామములు నెఱపవలసివచ్చుచుండెను. తన్మూలముగనే రాజధాని, అద్దంకినుండి కొండవీటికి మార్పఁబడినది. అద్దంకి స్థలదుర్గము. కొండవీడు గిరిదుర్గ మగుటచే శత్రుదుర్భేద్యమైయుండుట మార్పునకు మూలకారణమైయుండును. ఈతని పాలనసమయమున మోటుపల్లి (శాసనములలో ముకుళపురము)లోని రేవులయందు వర్తకవ్యాపారము కొనసాగుటకై సుంకములవిషయమున సంస్కారము గావింపఁబడినది.[8] బాలసరస్వతి యను విద్వాంసుఁడీతనియాస్థానమున విద్యాధికారిగా నుండినట్లు శాసనములవలనఁ దెలియవచ్చుచున్నది.

ఈతనితరువాత నీతనిసోదరుఁడు అనవేమారెడ్డి కొండవీటి రాజ్యమునకుఁ బాలకుఁడయ్యెను. అనవేముఁ డన్నివిషయములందును తండ్రియైన ప్రోలయవేముని బోలినవాఁడు. మహాశూరుఁడు. పరమధార్మికుఁడునై వన్నెకెక్కినవాఁడు. ఈతని పాలనకాలమున కొంతకాలము బాలసరస్వతియు ఆవెనుక త్రిలోచనాచార్యుఁడు విద్యాధికారులుగా నుండినట్టు లాతనినాఁటి దానశాసనములవలనఁ దెలియవచ్చుచున్నది. అనవేముని శ్రీశైల వీరశిరోమంటప నిర్మాణశాసనమునకును రచయిత బాలసరస్వతి.[9] ఇమ్మడిలంకవానపల్లి శాసనములకుఁ గర్త త్రిలోచనాచార్యుఁడు.[10] ప్రకాశభారతీయోగి యను తెలుఁగుకవి యొకఁడుగూడ శాసనరచయితగా నుండెనట్లాతని దాక్షారామ భీమేశ్వరాలయ శాసనములవలనఁ దెలియవచ్చుచున్నది.[11]

ఈ అనవేమునినాఁడు కొండవీటిరాజ్యము కృష్ణానదీపరిసరములందే సీమితముగాక, గోదావరీతీరభూములనుగూడ నాక్రమించుకొని సింహాచలమువఱకు వ్యాపించినట్టులు, శ్రీశైలశాసనమునందుఁ జేర్కొనఁబడిన యాతని బిరుదావళినిబట్టి తెలియవచ్చుచున్నది. ఆబిరుదావళిలో "సింహాచలాది వింధ్యపాద ప్రతిష్ఠాపితకీర్తిస్తంభ, సం[సా]గర గౌతమీసలిలసంగమ సకలజలదుర్గసాధన బలరామ, రాజమహేంద్రవర నిరవద్యనగరాది బహువిధ స్థలదుర్గ విదళన బలరామ" ఇత్యాదికము గలదు. అనవేముఁడు తనపరాక్రమముచే గౌతమీసాగరసలిలసంగమప్రదేశమగు జలదుర్గమును, రాజమహేంద్రవర, గిరిదుర్గమును, నిడుదవోలు మున్నగు స్థలదుర్గములను జయించి సింహాచలప్రాంతమునఁ దనకీర్తి నెలకొల్పెనని యీబిరుదావళి నిరూపించుచున్నది. రాజమహేంద్రవరమువఱకు నేక వేణిగఁ బ్రవహించుచువచ్చిన గోదావరి 'నఖండగౌతమి' యని యందురు. రాజమహేంద్రవరము తరువాత నీనది గౌతమి, వసిష్ఠ యను ప్రధానమయిన రెండుపాయలుగఁ జీలి, తూర్పుసముద్రమునఁ గలియును. ఈ రెండు శాఖలనడుమనుండి మఱికొన్నిశాఖ లేర్పడి, గోదావరి సప్తశాఖలుగ సముద్రమునఁ గలియును.' ఈశాఖలన్నియుఁ గూడునప్పటి నడిమి ప్రదేశమును కోనసీమయందురు. వసిష్ఠాశాఖకు పశ్చిమభాగమును పానారసీమ యందురు. గౌతమీశాఖకు ప్రాగుత్తరభాగమును కురవాటసీమ యందురు. రాజమహేంద్రవరమునకు ప్రాగుత్తరమును చెంగరసీమ(చాగల్నాఁడు) అని యందురు. అనవేముఁడు దాడివెడలు నాఁటికి గోదావరి కుభయపార్శ్వముల నంటిన యీ సీమలు కొరకొండ రాజధానిగాఁ బాలకుఁడైయున్న ముమ్మడిరెడ్డి పాలనమునందుండెను. ఈ విషయము ముమ్మడి కొరకొండ నృసింహస్వామి యాలయమున నెలకొల్పిన శాసనమునం దీవిధముగ వివరింపఁబడియున్నది.

పానార కోన కురవాటక చెంగరాదీన్
గోదావరీ ముభయతో౽య ముపాంత దేశాన్
జిత్వా వనాచలజలస్థల దుర్గరమ్యా
నేకః ప్రశాస్తి చిర మప్రతిశాసనం యః. 12

---

6. See. S. i. i. Vol. VI No. 243.

7. చూ. రెడ్డి సంచిక. పుట. 80. L. R. III-469.

8. See S. i. i. Vol. X No. 556. మోటుపల్లి వీరభద్రాలయ శాసనము.

9: See. ,, ,, No. 559. అనవేముని శ్రీశైల శాసనము.

అన్నవేమ నరేంద్రస్య విద్వాన్ బాలసరస్వతిః
అకరో దాకరో వాచాం నిర్మలం ధర్మశాసనం

10. See. Epi. Ind. Vol. III Page 59.

శ్రీమత్త్రిలోచనాచార్యః సుకవిః కవివంశదీపకో జయతి
అనవేమనృపతిదత్తే స్వేమ్మడిలంకస్య శాసనం జయతి.

11. See S. i. i. Vol. V Nos. 1078, 1380. పద్య శాసనములు.

12. S. I. I. Vol X No. 554 Saka ౧౨౮౫.

వీనిలో పానార కురవాటక సీమలు స్థలదుర్గములు. కోనసీమ జలదుర్గము. చేంగరసీమ వనాచలదుర్గము. అనవేముఁడు ముమ్మిడిరెడ్డిని జయించి, యీ సీమల తన వశము చేసికొనినట్లు, పైనఁ జేర్కొనిన బిరుదావళియే గాక, దాక్షారామమును వానపల్లి పద్దుపూరు మున్నగు తావులం దాతని శాసనము లుండుటయు, ఈ సీమలలో నాతని పేరఁ బెక్కు వేమవరములు వెలసియుండుటయుఁ దార్కాణించుచున్నవి.

అనవేమారెడ్డికి మామిడి సింగనమంత్రికి (నైషధకృతి భర్తకు) తండ్రియైన 'పెద్దన' రాజ్యభారధరణవ్యాపారదక్షుఁడగు మంత్రిగా నుండెనని శ్రీనాథుఁడు నైషధకృత్యారంభమునఁ దెలిపియున్నాఁడు. అనవేముని ప్రశస్తిని దెలుపుచు కవితావిలాసముతోఁగూడిన చాటుధార శ్లోకములు కొన్ని యాంధ్రదేశమున నిన్నమొన్నటివఱకు సంస్కృతవిద్వాంసులనోట నిలిచియున్నవి. కొన్నిటి నిట నుదాహరించెదను.

శ్లో. భువిసత్యనవేమపార్థివేంద్రే
విదుషాం జీవన మేవ జీవనమ్,
దివిసత్యనవేమ భూతలేంద్రే
విదుషాం జీవన మేవ జీవనమ్.

పాతాళం పరిపాలయత్యహిపతౌ వాతాశనో భోగిన
శ్శక్రే శాసతి నాకలోక మమరా స్సత్రాశనో జజ్ఞిరే
భూమౌ శ్చిర మన్నవేమనృపతౌ భూయో లభంతే జనా
మృద్వన్నం మృదులాంబరం మృగమదం చామీకరం చామరమ్.

మఱియు యనవేమారెడ్డి వసంతరాయ బిరుదాంకితుఁడై వసంతోత్సవములు విరివిగ జరుపుచుండెననియు, ఆ వసంతోత్సవములలో కర్పూర చందన కస్తూరికాది సుగంధద్రవ్యములు వెదఁజల్లఁబడుచుండెననియు నాతనినాఁటి శాసనములందును, తరువాతి రెడ్డిరాజుల శాసనములందును బలుతావులం దుగ్గడింపఁబడినది. ఈ విషయ మీతని వదుపూరు శాసనమునం దీ క్రిందివిధముగ వివరింపఁబడినది.

సోఽయం వసంతరాయాంకః కస్తూరీచంద్ర చందనైః
న కేవలాం భువం ద్యాంచ క్షిప్తాం గంధవతీం వ్యధాత్
య ద్వసంతోత్సవక్షిప్త భూరి కర్పూరరేణుభిః
యశసా కింను తస్యాసీ ద్ధవళం జగత్త్రయమ్.[13]

వసంతరాయ బిరుదాంకితుఁడైన యనవేముఁడు వసంతోత్సవములలో నుపయోగించిన సుగంధద్రవ్యములచే, భూమ్యాకాశముల రెండిటిని పరిమళభరితములఁ జేసినాఁడనియు, ఆ వసంతోత్సవములలో మీఁదికిఁ జిమ్మఁబడిన కర్పూరపరాగములచే ముల్లోకములు తెల్లవాఱినవనియు పై శ్లోకముల భావము. అతనినాఁటి వసంతోత్సవ వైభవ మిట్టు లుగ్గడింపఁబడినది.

8. కాటయ వేమారెడ్డి:—అనవేముని తరువాత కొండవీటి రెడ్డిరాజ్యమునకుఁ బాలకుఁడుగా వచ్చినవాఁడు, అనపోతారెడ్డి కుమారుఁడగు కుమారగిరిరెడ్డి. ఈతఁడు తండ్రితాతలవలె శూరుఁడైనట్లు కానరాఁడు. ఈతని పాలనకాలములో వెనుకముందుల నుండి శత్రువుల దండయాత్రలుగూడ అంతగాఁ జెలరేగినట్లు తెలియరాదు. కాని యీతని బావమఱఁది కాటయవేమారెడ్డియే యీతని రాజకీయవ్యవహారములన్నియు నిర్వహించుచుండెడివాఁడు. కాటయ వేముఁడు శూరుఁడు, చతుర్విధోపాయనయప్రవీణుఁడు. కొండవీటి ప్రభువునకు ప్రధానమంత్రియు ప్రధాన సేనాధిపతియు నై యుండెడివాఁడు. అందువలన కుమారగిరి రాజ్యనిర్వహణభారమంతయు కాటయవేమునకే వదలివేసి, తాను నాట్యాభినయప్రదర్శనముల తోడను ప్రతివత్సర వసంతోత్సవనిర్వహణముతోడను కాలము గడుపుచుండెడివాఁడు. ఈ విషయము కాటయవేముని మాళవికాగ్నిమిత్ర వ్యాఖ్యానమునం దిట్లు వర్ణింపఁబడినది.

భాగ్యం నామ సమగ్రమీదృశ మతి ప్రేమైక పాత్రం యతో
వీరం కాటయవేమ ముద్ధతరిపుధ్వంసే నియుజ్యస్వయమ్,
నిత్యం నందతి నర్తనై రభినవైః కాంతై ర్వసంతోత్సవై
స్సంతానాభ్యుదయైః కుమారగిరిభూపాలో నృపాలోత్తమః.

ఉద్ధతులైన శత్రువులను గీటడఁగించు పనికి తన సోదరిభర్త మహావీరుఁడు నగు కాటయవేముని నియోగించి, అభినవాభినయముల తోను వసంతోత్సవములతోను సంతానాభ్యుదయముతోను కాలము గడుపు భాగ్యము కుమారగిరికి లభించెను. కావుననే కుమారగిరి తన కుమారుని వెంటఁబెట్టుకొని వచ్చి దాక్షారామమునందు కుమారునితోఁ గూడి తులాదానము సలిపెను. పిమ్మట అనపోత కుమారునకు నూత్న విజయాక్రాంతమైన సీమకు యౌవరాజ్యపట్టాభిషేకము గావింపవలయునని కుమారగిరికి కుతూహల మేర్పడినది. అదియును గాక, అనవేమునినాఁడు అణఁగియున్న తూర్పునాఁటి పాలకులు, కుమారగిరి రాజైనంతనే మరలఁ దలయెత్తి తిరుగఁబడఁజొచ్చిరి. వారిని జయించుపని కుమారగిరి కాటయవేమున కప్పగింపఁగా, కాటయవేముఁడు తూర్పుదేశమును జయించుటకు దాడివెడలి వచ్చెనను విషయము అనపర్తి శాసనమునం దిట్లు వివరింపఁబడినది.

ఉదీచ్యా దాక్షిణాత్యాశ్చ ప్రతీచ్యాశ్చ మహీశ్వరాః
ఆచరంతి సదా మైత్రీ మస్యాభి రతికౌతుకాత్
తస్మా త్సింహాద్రిపర్యంత ప్రాచ్యా ఏవమహీశ్వరాః
జేతవ్యా స్త న్మహీపాలా నధునా జహి లీలయా

కుమారగిరితో మిగిలినదిక్కులందలి మహీపాలురు మైత్రి నెఱపుచుండిరనియు, సింహాచలపర్యంతము నుండెడి తూర్పు రాజులే జేతవ్యపక్షమునందుండిరనియు, వారిని జయింపుమని కాటయవేమున కాతఁడు ఆజ్ఞ యిచ్చెను. కుమారగిరి యాజ్ఞగొని కాటయవేముఁడు, కొండవీడునుండి రాజమహేంద్రవరమునకు వచ్చి, ఆ పట్టణప్రాకారమున, శుకబ్రహ్మప్రతిష్ఠితుఁడైయున్న గోపాలస్వామికి మనసార నమస్కరించి, "ప్రభూ! ఈ మాఱు దిగ్విజయము లభించిన నీకొక యుత్తమ గ్రామము నర్పింతు" నని మ్రొక్కుకొని, ప్రాగ్దిగ్విజయయాత్రకు బయలుదేఱెను. పిమ్మట కాటయవేముఁడు వింధ్యాద్రిసింహాద్రులకు నడుమనుండినమహీపాలుర నందఱను జయించి, ఆయాదుర్గములలో దనయధికారుల నియమించి, గజపతిముఖ్యులగు రాజు లర్పించిన కానుకలు కొమరగిరి యెదుట నుంచి, యాతని మన్ననఁ బడసెను. ఆ వెనుకఁ దాను చేసిన ప్రతిజ్ఞను నిర్వహింపఁదలఁచి, అనపోతకుమారునిచే తుల్యభాగానదీతీరమున

13. See. Epi. Ind. Vol III Page 286.

అనపర్తి యను గ్రామమును రాజమహేంద్రవరమునందలి గోపాల స్వామికి దానము చేయించెను. ఈ విషయమంతయు అనపర్తి శాసనమునందు వివరముగ వర్ణింపఁబడియున్నది.14 ఈ దిగ్విజయములో నాతఁ డేయే దుర్గములను జయించెనో యావిషయ మీశాసనమునఁ దెలుపఁబడలేదు గాని, కాటయవేముని శాకుంతల వ్యాఖ్యాన ప్రారంభమునందలి యొక శ్లోకము మాత్రము వివరించినది.

ధాటీ ఘోటీ ఖురాగ్ర త్రుటితరిపుకులే యత్ర మొల్లేటిదుర్గం
దుర్గం కిమ్మూరసంజ్ఞం దళితరిపుకులే దుర్గమం జెండపూండిమ్
దుర్భేదం వజ్రకూటం జితవతి రభసా రామగిర్యాఖ్య దుర్గం
విఖ్యాతం వీరఘోట్టం గళిత మనుష్యా దాం వీరసన్నాహ
దార్ఢ్యం

కాటయవేముని విజయధాటిలో సజ్జముల డెక్కలచే పర్వతతటములు తుత్తునియలగుచుండ, కిమ్మూరు, మొల్లేరు, జెండపూఁడి వజ్రకూటము, వీరఘోట్టము, రామగిరి యను దుర్గములు స్వాధీనములైనవి. దానిచే శత్రువుల యుద్ధసన్నాహములు వల్లారెనని భావము. ఈ దుర్గము లన్నియు నించుమించుగ రాజమహేంద్రవరమునకు ప్రాగుత్తరసీమలోనివి. వీనిలో కిమ్మూరుసీమ పెద్దాపురము తాలూకాలోనిది. అచటి దుర్గము కొండ్రకోట. జెండపూఁడి దుర్గము అన్నవరమునకుఁ గ్రింద క్రోసుమేరలో నున్నది. అన్నవరమునకు మీద వజ్రకూట దుర్గము. రామగిరి దుర్గము రాజమహేంద్రవరమునకు ఉత్తరముగ పదిక్రోసుల మేరలో నున్నది. కాటయవేమునినాఁ డది అన్నదేవచోడుని రాజధాని. వీరఘోట్టము పాలకొండతాలూకాలోనిది. వీనినన్నిటిని జయించి, కాటయవేముఁడు అనవేముని నాఁటికంటెను రాజమహేంద్రవర రాజ్యసీమను ప్రాగుత్తరముగఁ బెంపొందించెను.

కాటయవేముఁ డెంతటి శూరుఁడో యంతటి ధార్మికుఁడు. భీమమండలిలో ప్రధానమూర్తులుగాఁ జేర్కొనఁబడిన విష్ణుమూర్తులకుఁగూడ తనకేలికయైన కొమరగిరిపేర నెన్నియో యగ్రహారములు దానము చేసెను. ఈతఁడు సెలవిన దానములన్నియు అహోబల శాసనమునందు 'కొమరగిరిమండలము' అను పేరఁ జేర్కొనఁబడినవి.15 వానిలో శివమూర్తులకంటె విష్ణుమూర్తులకే యెక్కువ యగ్రహారము లిచ్చినట్లు గానవచ్చుటచే, కాటయవేముఁడు విష్ణుభక్తి యెక్కువగలవాఁడుగాఁ గానవచ్చును.

కాటయవేముఁడు గట్టి సంస్కృత విద్వాంసుఁడు. కాళిదాస విరచితమైన నాటకత్రయమునకు 'కుమారగిరి రాజీయము' అను వ్యాఖ్యానత్రయమును రచించెను. మనకిపుడు లబ్ధమగు కాళిదాస నాటకత్రయ వ్యాఖ్యలలో నవియే తొలుతటివి గావచ్చును. కుమారగిరి వసంతరాజబిరుదాంచితుడై, తనపేర 'వసంతరాజీయ' మను నాట్యశాస్త్రగ్రంథమును రచింపగా, నందలి విషయమును ప్రమాణముగఁ గైకొని నాటకీయ లక్ష్య లక్షణ సమన్వయము చేయుచు పై వ్యాఖ్యానారంభమునఁ దెలిపియున్నాడు.

మునీనాం భరతాదీనాం భోజాదీనాం చ భూభృతామ్
శాస్త్రాణి సమ్యగాలోచ్య నాట్యవేదార్థ వేదినామ్
ప్రోక్తం వసంతరాజేన నాట్యశాస్త్రం యదుత్తమమ్
తత్రోక్తే నైవ మార్గేణ దర్శితాశేషలక్షణమ్
కవీనా మాత్రేయో మంత్రీ కాటభూపతినాభవః
సోఽయం వేమవిభుః......శాకున్తలాదేస్స్వయం
వ్యాఖ్యానం కురుతే కుమారగిరిరాజీయాఖ్య మస్మైహితమ్.

కుమారగిరి తన యవసానకాలమునకో, లేక అంతకు ముందుగనో, కాటయవేముని పరాక్రమమునకు సంతసించి, అతని పరాక్రమముచే నిర్జింపఁబడిన రాజమహేంద్రవరమాదిగా సింహాద్రిపర్యంతమైన ప్రాగ్దేశము నాతని కిచ్చివేసెను. తన్మూలముగ కాటయవేముఁడు రాజమహేంద్రవర రాజ్యమునకు పాలకుఁడైనట్లు కాటయవేముని తొత్తరమూడి శాసనమువలనఁ దెలియవచ్చుచున్నది. 16

4. పెదకోమటి వేమభూపాలుఁడు:—ఈతఁడు ప్రోలయ వేమారెడ్డి యన్నయగు మాచారెడ్డి పౌత్రుఁడు. పెదకోమటి పుత్రుఁడు. కుమారగిరిరెడ్డి తరువాత నీతఁడు కొండవీటిరాజ్యమును పాలించెను. ఈతని పాలనమునాఁడు మామిడిసింగన రాజ్యభారధరణవ్యాపారతుఁడైన మంత్రిగానుండెడివాఁడు. ఈ సింగన మంత్రికే శ్రీనాథుఁడు తాను రచించిన నైషధమును గృతిగ నర్పించినాఁడు. తన్మూలమున శ్రీనాథుఁడు పెదకోమటివేముని యాస్థానిలో విద్యాధికారియైనాఁడు. ఈ వేమభూపాలుని శాసనములు పెక్కిటిలో తుదిని.

"విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీవేమభూపతేః
అకరో దాకరో వాచాం నిర్మలం ధర్మశాసనమ్."

అను శ్లోకము గానవచ్చుచున్నది. పెదకోమటివేముఁడు శూరాగ్రేసరుఁడుగ గణనకెక్కినవాఁడు. ఈతని కొకతట్టునుండి రాచకొండ దేవరకొండ వెలమరాజులతోడను, ఇంకొకవైపునుండి మహమ్మదీయులతోడను, వెనుకతట్టునుండి విజయనగరాధీశుల తోడను పోరు సంభవించుచుండెడిది. వానిని తట్టుకొనుచు రాజ్యము రక్షించుకొనవలసి యుండెడిది. కొమరగిరి యనంతరమున కొండవీటిరాజ్య మీతనికి దక్కినను రాజమహేంద్రవర రాజ్యము మాత్రము చేఁజిక్కలేదు. దాని నాక్రమించుటకై పలుమారులు సైన్యములతోఁ గాటయవేమునిమీఁదికి దాడివెడలుచుండెడివాఁడు. కాని యాప్రాంత మీతనికి వశముగాలేదు.

కాటయవేమునకు యుద్ధములలో 'అల్లాడరెడ్డి' యను మహాశూరుఁడు సేనానాయకుఁడై తోడ్పడుచుండెడివాఁడు. అతఁడు తన పరాక్రమముచే రాజమహేంద్రవరరాజ్యముమీఁదికి దండెత్తి

14. చూ. రెడ్డి సంచిక, అనపర్తి శాసనము. పుట. 380-385.
15. చూ. S. i. i. X No. 577 కాటయవేముని అహోబల శాసనము.
16. See Epi. Ind. Vol. IV page 318 to 327.
శ్లో. ఆసీ దమాత్యరత్నం కాటయవేమప్రభుస్తస్య
అతిసురగురు భార్గవ మతి రతిభార్గవ విజయ విఖ్యాతః
సింహాసనే నిధాయాసౌ కుమారగిరి భూభుజం
అతేజయ న్మహాతేజా శ్రీకృష్ణ ఇవ ధర్మజమ్
కుమారగిరిభూనాథో యస్మై విక్రమతోషితః
ప్రాదాత్ప్రాచీం భువం రాజమహేంద్రనగరీ ముఖామ్

వచ్చు పెదకోమటివేముని సైన్యములను హతమార్చుచుండెడి వాఁడని అల్లయ వేముని శాసనమువలనఁ దెలియుచున్నది.

హత్వా కోమటివేమ సైన్య నికరం భూయోఽపి రామేశ్వరే
ప్రాజ్యం రాజమహేంద్ర రాజ్యమకరో దల్లాడ భూమీశ్వరః.17

ఈ రామేశ్వర మనునది తణుకుతాలూకాలోని జుత్తిగదగ్గఱ నున్న రామేశ్వరము.

ఈతఁడు ఇతర వేమభూపాలురవలెనే ధార్మికదృష్టితోఁ గూడి, పెక్కు దేవతలకు బ్రాహ్మణులకు నగ్రహారములు భూములు దానముచేసి శాసనములు వెలయించెను. పంచారామములందును కృష్ణా గోదావరీ తీరస్థములయిన ప్రసిద్ధ దేవళములందును నాతఁడు దానములు నెఱపినట్లు లాతని శాసనములు తెలుపుచున్నవి.18 శ్రీనాథునిచే రచింపఁబడిన శాసనములందును, కోమటివేముని యాస్థానకవియగు వామనభట్టబాణునిచే రచింపఁబడిన వేమభూపాలచరితమునందును పెదకోమటివేముని ప్రశస్తి యిట్లుగ్గడింపఁబడినది.

చూడామణి ర్నృపాణాం, దుర్మద పరిపంథి శిఖరి దంభోళిః
సర్వజ్ఞ చక్రవర్తీ, పెదకోమటి వేమభూపతి ర్జయతి.

ఆనాఁడు మధ్యాంధ్రదేశమును బాలించు ప్రభువులలో కొండవీటఁ బెదకోమటివేముఁడు, రాజమహేంద్రవరమునఁ గాటయవేముఁడును కూరులు విద్యావంతులు కవిపండితపోషకులు నైన ధార్మికప్రభువులు. ఇరువురును సంస్కృతమున గ్రంథరచనము చేయఁజాలిన పాండిత్యవైభవము గలవారు; దాతలును.

పెదకోమటివేముఁడు 'శృంగార దీపిక' యను అమరుకశతక వ్యాఖ్యను, సప్తశతీసారటీకను, 'సాహిత్య చింతామణి' యను నలంకారశాస్త్రగ్రంథమును రచించిన మేటి. ఈతనియాస్థానకవి 'వామనభట్టబాణ' బిరుదాంచితుఁడగు సంస్కృత కవి 'వీరనారాయణ చరిత' మనుపేర వేమభూపాలచరితమును, పార్వతీపరిణయ నాటకమును, నలాభ్యుదయమను పద్యకావ్యమును రచియించెను. ఈతని మంత్రి మామిడిసింగన సోమసిద్ధాంతమునకు వ్యాఖ్యానము రచించినదిట. ఇట్టి కోమటివేముని యాస్థానిలో విద్యాధికారి పదవి లభించుటకుఁ బూర్వము శ్రీనాథుఁడు నైషధకృత్యాదియందును ఆశ్వాసాద్యంతములందును వేముని ఘనతను విశేషముగఁ జెప్పినాఁడు.

శ్రీనాథునకు వేముని యాస్థానిలో విద్యాధికారి పదవి లభించిన క్రమము భీమేశ్వరపురాణమునం దిట్లు వాకొనఁబడియున్నది.

వినిపించినాఁడవు వేమభూపాలున
కఖిల పురాణ విద్యాగమములు
కల్పించినాఁడవు గాఢపాకంబైన
హర్ష నైషధకావ్య మాంధ్రభాష
భాషించినాఁడవు బహుదేశబుధులతో
విద్యాపరీక్షణవేళలందు
వెదచల్లినాఁడవు విశదకీర్తిస్ఫూర్తి
కర్పూరములు దిగంగణములందు.
—భీమ. ౧. ౨౩.

శ్రీనాథునకుఁ గొండవీటి యాస్థానిలోఁ దొలుతనే విద్యాధికారిపదవి లభించి యుండలేదు. ముందుగ వేమభూపాలునకు పురాణములు ఆగమములు వినిపించుచుండెడివాఁడు. పిమ్మట హర్ష నైషధకావ్య మాంధ్రీకరించి తన పాండిత్య ప్రతిభలను వెలువఱిచినాఁడు. తరువాత విద్యాధికారిపదవి లభింపఁగా బహుదేశబుధులతో భాషించినాఁడు. తన్మూలముగ శ్రీనాథునికీర్తి నలుమూలల వ్యాపించినది.

పెదకోమటివేముని ప్రశస్తిని దెలుపు శ్లోకములు కొన్ని యానాఁటి శాసనములందును గ్రంథములందును గూడఁ గానవచ్చుచున్నవి.

జ్ఞాతా యది నహి దాతా, దాతా చేత్కోఽపి భువి నహి జ్ఞాతా
జ్ఞాతా దాతా చ భూః, పెదకోమటివేమభూపతే శ్చిత్రమ్
అర్థిజన చింతితార్థా, దధికం చేత స్తతోఽపి తే వాణీ
అస్యా అపి దీతికరః, పెదకోమటి వేమభూపతే శ్చిత్రమ్
శ్రితపోషణ రిపుశోషణ, బుధతోషణ సత్యభాషణాది గుణాన్
దధతే దశరథ రామః, ప్రాగద్యకలౌ తు కోమటివిభు వేమః.

ఇట్టి ప్రశస్తి గలిగి యీతఁడు కొండవీటిరాజ్యమును సుభిక్షముగఁ బాలించిన వేమభూపాలుఁడు.

5. అల్లాడ వేమారెడ్డి:—కాటయవేముఁడు రాజమహేంద్రవరరాజ్యమును పాలించువాఁడు, అల్లాడరెడ్డియు, ఆతని కుమారులు వేమ వీరభద్ర దొడ్డ అన్నారెడ్లును ఆతనికిఁ గార్యఖడ్గములు రెండిటను జేదోడువాదోడుగ నుండిరి. మఱియు కాటయవేముని కూఁతులను, హరిహరాంబను వేమారెడ్డికిని, అనితల్లిని వీరభద్రారెడ్డికి నిచ్చి వివాహము చేయుటచే కాటయవేమునకు అల్లాడరెడ్డికి సన్నిహితబాంధవ్య మేర్పడినది. కాటయవేమునకు తల్లాంబిక మల్లాంబిక యనే నిరువురు భార్యలుండిరి. వారిలో తల్లాంబిక హరిహరరాయల కూఁతురు మల్లాంబిక అనపోతారెడ్డి కూఁతురు నై యుండురు. కాటయవేముఁడు దివికేఁగిన తరువాత ఆతనికి ద్రోహము చేయ నెంచిన శత్రువర్గము నల్లాడరెడ్డి నిర్మూలించి, కాటయవేముని రాజ్యము, వాతని సంతతికి శత్రుదుర్భేద్యమై యుండునట్లు చేసెనని పలివెలశాసనము తెలుపుచున్నది.19

గతే దివం కాటయవేమభూపే, నిర్మూల్య తద్ద్రోహికులం సమస్తమ్
అచంచలశ్రీక మపాతనోతి, తత్సంతతే రాజ్య మరాత్య ధృష్యమ్.

అల్లాడరెడ్డి పెదకోమటివేముని సైన్యమును రామేశ్వరమునొద్ద హతమార్చె ననువిషయము, అల్లాడవేముని వేమవరము శాసనమునందును నిశ్శంకకొమ్మన శివలీలావిలాసమునందునుగూడఁ జెప్పఁబడియున్నది. మఱియు ననితల్లి కలువచేరు శాసనములో అల్లాడరెడ్డి వేమారెడ్లయుపదానము లిట్లు వర్ణింపఁబడియున్నవి.

దురితరహితచిత్తో దొడ్డయాల్లాడభూపో
భువ మరిజనవశ్యాం భూయసావ్యాత్య దోష్ణా

---

17. See. Epi. Ind. Vol. VIII. Page, 287.

18. చూ. శృంగార శ్రీనాథము. అనుబంధము.

19. See. S. i. i. Vol. V No 113 Saka ౧౩౩౮.

విమలగుణయుతాయాం వేమభూపాత్మజాయా
మతని సురసుధాయా మన్ని తల్లాఖ్యందత్తే.

* * *

అని తల్లీపతిరైనా ఘనసచివీభూత భావుకా భువనపతి.

అనితల్లి కలువచేరు శాసనము.

నిష్కలుషచిత్తుఁడైన అల్లాడరెడ్డి, కాటయవేముని తరువాతఁ దలయెత్తి రాజ్యము నాక్రమించిన శత్రురాజులను తన భుజపరాక్రమముచే నిర్జించి, వారినుండి భూమిని వశము చేసికొని కాటయవేముని కూఁతురు తనకుఁ గోడలు నగు అనితల్లికి రాజ్యము నర్పించెను. పతిదైవతయగు అనితల్లియు, తన బావగారయిన వేమారెడ్డిని ప్రధానమంత్రిగఁ జేసికొని యా భూమిని బాలించుచుండె నని దీని భావము. అనపోతుని మనుమరాలగుటచే కాటయవేముని తరువాత కొండవీటిరాజ్యార్ధము అనితల్లికి లభించిన దానిని అల్లాడరెడ్డి యామెకు సంక్రమింపఁజేసెనని యా పై శ్లోకమువలన వ్యక్తమగుచున్నది. అనితల్లికి భర్త యగుటచే వీరభద్రారెడ్డి సింహాసనము నధిష్ఠించినను, రాజ్యనిర్వహణభారమంతయు వేమారెడ్డిదే యను విషయముకూడ వ్యక్తమగుచున్నది. కుమారగిరి కొండవీటి రాజ్యమునకుఁ బాలకుఁడైయుండఁ గాటయవేముని మంత్రిత్వ మెట్టిదో, వీరభద్రారెడ్డి రాజమహేంద్రవరరాజ్య సింహాసనాధ్యాసియై యుండ, అతని యన్న యగు వేమారెడ్డి మంత్రిత్వము నట్టిదియే. ఈ విషయము శ్రీనాథుని భీమేశ్వరపురాణ కాశీఖండ కృత్యాదులను బట్టి మనకుఁ దెలియవచ్చుచునేయున్నది.

కాటయవేమునినాఁడు తూర్పున వీరఘట్టమువఱకుఁ బెరిగిన రాజమహేంద్రవరరాజ్యము, కార్యఖడ్గనిపుణుఁడైన అరియేటి లింగనమంత్రి సాయమున అల్లాడరెడ్డినాఁడును, బెండపూఁడి అన్నమంత్రి సచివత్వమున అల్లయవేమారెడ్డినాఁడును, ఆ రాజ్యసీమ యంతటితో నాఁగక కటకమువఱకు వ్యాపించినది. ఈ విషయమును శ్రీనాథుఁడు, రాజమహేంద్రవరమున రచించిన కృతుల రెండిటను వివరించియున్నాఁడు.

ఘూర్జరీ సప్త మాడె బారుహా దొంతి
  వంతువాడి క్షితీశ్వరుల గెలిచి
యొడ్డాది మత్స్యవంశోదయార్జుని చేతఁ
  బల్లవాధిపుచేతఁ బలుచమంది
దండకారణ్యమధ్య పుళిందరాజ రం
  భాహివంశజులకు నభయ మొసఁగి
కానుమత్కుల వీరభద్రాన్న దేవేంద్ర
  గర్వసంరంభంబు గట్టిపెట్టి
యవన కర్ణాట కటక భూధవులతోడ
  బ (చె) లిమి వాటించి యేలించెఁ దెలుఁగుభూమిఁ
దన నిజస్వామి నల్లాడధరణినాథు
  భీకరు యరియేటిలింగనప్రభువరుండు.

—భీమ. ౧. ౬౨.

బంధువా సురధాణి పాదవం బిచ్చిన
  భద్రేభములు వీథిఁ బాఱ ముందు
గౌడధాత్రీనాథుఁ డుపద పుత్తెంచిన
  బింబాధరోష్ఠి సంసేవ సహించుఁ
కర్ణాటభూపతి కానుక యిచ్చిన
  ముక్తాతపత్త్రంబు మ్రోల మెఱయ
యవనాధిపతి యుపాయనముగా నొసఁగిన
  పాగాహయంబులు వాగెవచ్చు
దూరమంతంత బారుహా దొంతిమన్నె
  సప్తమాడియ రాజన్యసమితి మ్రొక్క
రాజవేశ్యాభుజంగ సంగ్రామపార్థ
  గాయగోవాళ వేమనక్ష్మావరునకు. —కాశీ. ౧. ౩౮.

మీఁది రెండుపద్యములలోఁ జెప్పఁబడిన ప్రదేశములన్నియు తూర్పున కళింగోత్కళదేశమందును, ఉత్తరమున బంగాళాదేశ సీమలోను నిమిడియున్నవి. ఈ ప్రదేశములను జయించుటలోఁ గొంతవఱ కల్లాడరెడ్డియు, అతనిజనుక వేమారెడ్డియుఁ బ్రధాన పాత్రము వహించినట్లు తెలియవచ్చుచున్నది. అల్లయవేమభూపాలుఁడు తనకుఁగూడిన 'సంగ్రామపార్థ' బిరుదము సార్థకమగునట్టుల శత్రువిజయమును సాధించెనను విషయము నీక్రింది పద్యము తార్కాణించుచున్నది.

కొనియెం గందుకముల్ సముద్భటనటద్ఘోటీభటప్రౌఢిఁ గై
కొనియెం జెన్నదుక దెడికోట యహితక్షోణీశు లల్లాడఁ జే
కొనియెన్ నాస్తికవరంబు వీఁకమదవద్ఘోరారిసంహారియై
ఘనుఁ డల్లాడమహీశవేముఁడు నిరాఘాటైకధాటీగతిన్.

కాశీ. ౧.

అల్లాడవేముఁడు తనసోదరుఁడగు వీరభద్రారెడ్డిని సింహాసనమందుఁ గూర్చుండఁబెట్టి ధాత్రిఁ బాలింపఁజేయుచుండఁగ, గౌతమీతటమునం దాతఁడు దానమిచ్చిన యగ్రహారములందలి బ్రాహ్మణులు వివిధ సంపదలలోఁ దులతూఁగుచుండిరని శ్రీనాథుఁడు భీమఖండ కాశీఖండములలో నేకరూపముగఁ జిత్రించియున్నాఁడు.

ధరియింప నేర్చిరి దర్భ వేట్టెడి వ్రేళ్ల
   లీల మాణిక్యాంగుళీయకములు
కల్పింప నేర్చిరి గంగమట్టియమీఁదఁ
   గస్తూరికాపుండ్రకములు నొసల
సవరింప నేర్చిరి జన్నిదంబుల ప్రోల
   తారహారములు ముత్యాలసరులు
చెరువంగ నేర్చిరి శిఖల కెన్నడుములఁ
   గమ్మని క్రొత్తచెంగల్వవిరులు
ధామముల వెండియును బైఁడి తడఁబడంగ
బ్రాహ్మణోత్తము లగ్రహారములయందు
వేమభూపాలుఁ డనుజన్మ వీరభద్రు
ధాత్రి యేలింప గౌతమీతటమునందు.

వీరభద్రారెడ్డి రాజ్యపాలకుఁడైనను, విద్వాంసుల నాదరించుట, దానధర్మాదికము నెఱపుట, రాజకీయతంత్రము నిర్వహించుట, మున్నగు ప్రధాన కృత్యములు వేమునివే. వేముఁ డెంతటి శూరుఁడో యంతటి ధార్మికుఁడు, అంతకంటె నెక్కుడు పరమేశ్వర

భక్తుఁడును. శ్రీనాథుఁడు పై పద్యమునఁ జెప్పిన విధమున భూసురులకు వేమునివలననే యేర్పడినట్టులు అల్లయవేముని వేమవరపు శాసనము ధ్రువపఱచుచున్నది.

అల్లాడవేమారెడ్డి తుల్యభాగానదీతీరమునందలి 'ఐదురుపాక మహేంద్రాడ' యను గ్రామములు రెండింటికి 'వేమవరము' అను నామకరణముచేసి, 168 వృత్తులు కల్పించి పెక్కురు విద్వాంసులకు దానముచేసినట్టు లాశాసనమునఁ జెప్పఁబడినది. ఆ యగ్రహారము విద్వాంసుల శాస్త్రఘోషచే సముద్రమువలె ప్రతిధ్వనించుచుండెనని యొకశ్లోకమున వర్ణింపఁబడినది.

ఏకత్ర తర్కంచ పరత్ర తంత్రం
వేదాంత మన్యత్ర పరత్ర శబ్దం
వ్యాఖ్యానయంతః కలకంఠ కంఠైః
స్సంఘోషవ త్యేత యోఽంబుధివ ద్బుధేంద్రైః. 20

ఒకచోట తర్కము, వేఱొకచోట పూర్వమీమాంసయు, మఱియొకచోట వేదాంతము, ఇంకొకచోట వ్యాకరణము మధుర కంఠములతో విద్వాంసులు వ్యాహరించుచుండ నాయగ్రహారము సముద్రమువలె మార్మ్రోఁగుచుండెనఁట. ఇది వేమవరాగ్రహార విశేషము. దానిసమీపముననే 'కొండవరము' అను గ్రామము, తన తల్లియగు వేమసానక్క పేర వేమఁడే దానముచేసియున్నాఁడు. ఈ శాసనమునందే మఱియొక శ్లోకమునం దాతని ధార్మికత్వ మీతీరుగఁ దెలుపఁబడినది.

అనేక గోచర్మమహాగ్రహార, దాతా సుధీ రల్లయవేమభూపః
వట్టాల సంపూజిత పార్వతీశో, హేమాద్రిదానాని సదా కరోతి. 21

ఈ శాసనము 115 శ్లోకములతోఁ గూడి యొక ఖండకావ్యము వలె నున్నది. దీనిలో అల్లాడవేమారెడ్డి శౌర్యము, దాతృత్వము, భక్తి తాత్పర్యములు సమగ్రముగ వర్ణింపఁబడియున్నవి. శ్రీనాథుని వీరభద్రారెడ్డి విద్యాంసునిగాఁ జేసినవాఁ డీ వేమభూపాలుఁడే గావున, శాసనవిషయమునకుఁ గావ్యత్వముద్ర నొసఁగి శ్రీనాథుఁ డీ వేమభూపాలుని ఘనత నగ్గడించుచు, ఆతని భక్తి నిట్లు చిత్రించి నాఁడు.

త్ర్యంబకాచలకన్యకాంబుపూరంబున
నఘమర్షణస్నాన మాచరించి
నిద్దమైన మడుంగు నీర్కావిచోవతి
కనకమేఖలతోడఁ గటిఘటించి
మూలమంత్రాక్షరముల భూతి మంత్రించి
పుండ్రకంబులు ఫాలమున ధరించి
శ్రోత్ర ముక్తములతో రుద్రాక్షమాలిక
లష్టోత్తరశతంబు లఱుతఁ దాల్చి
పుండరీకాసనమునఁ గూర్చుండి శంభు
నర్చనము సేయునపుడు మహోగ్రముఖుఁడు
చాల నొప్పారు రెండవశంభు నట్లు
వీరనారాయణుఁడు రెడ్డి వేమవిభుఁడు.

—కా. 1-89.

ఈవిధముగ వేమభూపాలనామాంకితులైన రెడ్డిప్రభువు లందఱు శూరాగ్రేసరులు, పరమధార్మికులు, మహాభక్తులు, విద్యాపోషకులునై యాంధ్రదేశమును సుభిక్షముగను ధర్మోత్తరముగను బాలించి, విస్తృతకీర్తి నార్జించి శాశ్వతప్రసిద్ధులై నెగడిరి.

20, 21, See Epi. Ind. Vol. VIII Vemavaram grant of Allaya Vemareddi.



# క్షమించాను

శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు

"మిమ్మల్ని క్షమించాను."

* * *

చీకటి గదిలో ఆదిశేషయ్యగారు ఒంటరిగా యీజీచైర్‌లో కూర్చుని ఆరాటంగా అటూ యిటూ మెదుల్తూండగా, అప్పుడే బండీ దిగి, చేతిసంచీతో, రేగిపోయినజుట్టుతో, కళావిహీనంగా వున్న ముఖంతో, తడబడుతున్న అడుగులతో లోపలకు ప్రవేశించిన శకుంతల వొణుకుతూన్న చేతుల్తో లైటు వెలిగించి, ఆ దుర్భరస్థితిలో కూర్చునివున్న తండ్రినిచూసి నివ్వెరపోయి "అమ్మకి ఎలా వుందినాన్నా?" అని ప్రశ్నించింది ఆతృతగా.

ఆయన ఉలికిపడి, మ్లానవదనంతో ఆటుకేసి చూచాడు. కాని "వచ్చావా?" అన్న ప్రశ్నార్థకం అందులో లేదు. ఇంత ఆదుర్దాగా వచ్చిన కూతురిని ఏమని సంబోధించి ఏం చెప్పాలో పాలుపోవటం లేదు. "నాన్నా!" అంది కూతురు భయంగా. ఆయన ఆయోమయావస్థ యింకా ఎక్కువైంది. ఎడమచేత్తో లోపలకు పొమ్మని సౌంజ్ఞ చేయటం మినహా ఏమీ ఆచరించలేక తడబడుతూ వూరుకున్నాడు. ఆమె తేజోవిహీనంగా ఓక్షణం తండ్రిముఖంలోకి చూసి, సంచీ అక్కడే జారవిడిచి, లేనిశక్తి తెచ్చుకుని, కంగారుగా లోపలకు వెళ్లిపోయింది. ఆయన బలవంతంగాకళ్లుమూసుకున్నాడు. "మిమ్మల్ని క్షమించాను! మిమ్మల్ని క్షమించాను!! మిమ్మల్ని క్షమించాను!"

కళ్లు తెరిచాడు. ఆరోగ్య దీపం వెలుగుతోంది.

* * *

డాక్టర్ మందంగా నడిచి గేటుదాటి వెళ్లిపోయాడు. పార్వతమ్మ మంచంమీద పడుకుని వున్న విశాలమైన గదిలో బెడ్‌లైటు మాత్రం వెలుగుతోంది సన్నగా. ఆదిశేషయ్యగారు కిటికీదగ్గర నిలబడి గేటుమీదుగా బయట చీకటిలోని శూన్యంలోకి చూస్తున్నాడు. డాక్టర్ రెండునిమిషాల క్రితం వెళ్ళిపోవటం అస్పష్టంగా కనిపించింది మసకచీకటిలో. చీకటి ప్రథమదశ, జీవితం చివరిదశ. విషాదంగా వుంటాయి.

"చలివేస్తోంది. తలుపులు మూసివేయరూ?"

ఆయన చప్పున తలుపులు మూసివేసి వెనక్కితిరిగాడు. మెల్లిగా భార్య మంచాన్ని సమీపించి "దుప్పటి కప్పేదా?" అనడిగాడు ఆదరంగా.

"వద్దు. కాని పెద్దలైటు వెలిగించరూ?" అని ఆమె కోరింది బలహీనస్వరంతో.

"వద్దు దీపం వెలుగు నీకు పరిశ్రాంతి కలిగిస్తుంది"

"అబ్బ! చీకటిలోనే చచ్చిపొమ్మంటారా ఏమిటి? యమదూతలు వచ్చే సైనం ముందుగనే కనుక్కుని మీతో కొన్ని కబుర్లు చెబుతాను"

కొంచెం ఆలోచించి, చేసేదిలేక, పెద్దలైటు వెలిగించి వచ్చి దగ్గరగా కూర్చున్నాడు.

"మీ ముఖం అంత దిగాలుపడి ఉంటేం? డాక్టరుగా రేమైనా చెప్పారా?"

ఓక్షణమైనా తిరగకముందే, మళ్ళీ తనే ఓమ్లానమందహాసం చేసి "మా అమ్మకు అమ్మవారు సాక్షాత్కరించేవారుట. అటువంటి సమయంలో పరమేశ్వరుడు గరళాన్ని నిర్లక్ష్యంగా మ్రింగినట్లు యింతింతకర్పూరం మ్రింగి వేసేది. ఓసారి అమ్మవారు మా అమ్మతో అందిట. "నీ అంత్యదశ దుర్భరంగానూ, నీ కూతురి అంత్యదశ సుఖపూరితంగానూ గడుస్తుందని."

"ఆబ్బ ఊరుకో—నీకు పుణ్యం వుంటుంది."

"అమ్మాయికి నాకు చెప్పకుండా ఎందుకు టెలిగ్రాం ఇచ్చారు? పనికిరాదు చెప్పాదులెండి."

"ఊరికే నే...వరదాకి."

"నా జీవితంలో రెండే రెండు టెలిగ్రాములు వచ్చాయి మీ విలాసానికి. ఒకటి అమ్మ చచ్చిపోయినప్పుడూ, రెండవది నాన్న పోయి బైరాగుల్లో కలిసినప్పుడూ. ఇప్పుడు అమ్మాయికి ఒక టెలిగ్రాము వెళ్ళింది...రెం...డ."

"పార్వతీ!"

ఆమె తక్షణం మాట్లాడలేకపోయింది. గాద్గదికకంఠంతో యిందాకటినుంచీ మాట్లాడుతున్నదల్లా, పొడిదగ్గు వచ్చి ఆయాసపడుతూ పడుకుంది. ఆయన నిర్భ్రాంతితి యింకా వదలిపోక, చూసేసరికి వృద్ధాప్యంవల్ల కొంతా, జబ్బుచేత మరికొంతా శీర్ణరేఖలు స్థావరం ఏర్పరుచుకున్న ఆ వదనంలో విషాదం కన్నీళ్ల సెలయేరులా పారుతోంది. అశ్రువులురక్తమిశ్రితమైనవిఅయివుంటే, ప్రకృతిదేవత కొట్టిన కఠినమైన సుత్తిదెబ్బ సరిగా మస్తిష్కంమీద తగిలివుండాలి.

"అబ్బా!" అందామె వేదనగా.

"ఏమిటి? ఏం జరిగింది?"

"నాలో ఏదో తుఫాను చెలరేగింది."

"ఇంకా?" అని కేవలం మనసులో అనుకున్నాడాయన.

"ఆ తుఫానునీళ్లకు నేలమీద మట్టి తడిసి, చెదిరి అడుగున వున్న గచ్చురాళ్లు బయటపడుతున్నాయి."




THE MADRAS PENCIL FACTORY

3, STRINGER'S STREET, MADRAS-1

"పార్వతీ! ఇదంతా నీవు సరిగ్గా చూడగలుగుతున్నావా?"

"ఆ! నేను చూసినంత స్పష్టంగా వివరించలేకపోతున్నాను" అని ఆమె ఆకస్మికంగా తెల్లబోయి "నా జీవితకాలంలో నేను మీలో యింత చనువుగా, విపరీతంగా మాట్లాడనే లేదు. ఇంతజబ్బూ పడలేదు. ఒకరికి జబ్బు చేసినపుడు వారిచుట్టూ వున్నవారు సన్నిహితులూ అవుతారు, దూరంగానూ జరుగుతారు. మనం ప్రథమావస్థలో వున్నాము. ఇది మీ ఔదార్యం" అంది.

ఆయన ఆలోచిస్తూ బాధగా "నిజమే. నా జీవితకాలంలో నిన్నెపుడూ దయగా చూడలేదు" అన్నాడు.

"నా మాటలకు ఆశ్చర్యపడుతున్నారా?"

"లేదు. చెప్పు."

"మీరు చెప్పండి. వింటాను"

మొదట ఆశ్చర్యపడినా, కొంత చెప్పాలనుకుంటూ భార్య ముఖంలోకి ఏకాగ్రతతో చూశాడు...ఈమెకు యిప్పుడు యాభయి యేళ్లు సమీపించాయి. తనకన్నా అయిదేళ్లు చిన్న. ఇంచుమించు ముప్పయి అయిదు ఏళ్ల క్రితం తనతో సంసారయాత్ర ప్రారంభించటానికి వచ్చింది. తామిద్దరూ కలిసి ఎన్నో సుఖాలూ, కష్టాలూ పడ్డారు. ఎన్నో అనుభవాలను ఎదుర్కొన్నారు. ఇన్ని సంవత్సరాల జీవితంలోనూ ఆమె తనమాట ఎన్నడూ జవదాటలేదు. తన కెప్పుడూ ఎదురుచెప్పలేదు. క్రోధావేశంలో హింసించినా ఒక్క మాటయినా పన్నెత్తి పలకలేదు. ఈమె స్వాభిమానం మరిచిపోయింది. తానే దైవం అని కొలిచింది. ఒక్కొక్కప్పుడు ఆ అమాయకమైన శరీరంమీద చేయి చేసుకున్నాడు. తాను...!

కష్టమ్మీద కన్నీళ్లను నిగ్రహించుకుంటూ మళ్ళీ ఆలోచించసాగాడు. ఈమె తన భార్య. తనను మనస్ఫూర్తిగా ప్రేమించింది. ఒకసారి తనకేదో వ్యాధివచ్చి నెలల తరబడి మంచం మీద వున్నప్పుడు నిద్రాహారాలు మాని సపర్యలు చేసింది. తనకు తెలిసినంత వరకూ హిందూ సంప్రదాయం అంటే యిదీ అని ఆమెకు ఎవరూ నేర్పినట్లు లేదు. ఇది అనాదినుంచీ అనుక్రమంగా వస్తూన్న స్త్రీ హృదయాలోచన పెట్టిన భిక్ష. ఈమె అందంగురించి తనకు వ్యామోహం లేదు. తాను యాభయి అయిదేళ్ల క్రితం పుట్టిన వాడు కావటంచేత సౌందర్యాన్ని గురించి ఆలోచించే అభ్యాసం తనకు లేదు, అప్పుడప్పుడూ పరాయివారి అందచందాలని గురించి ఆలోచించేవాడు గాని, 'సౌభాగ్యం' అని లోకులు పిలుస్తారే, ఆ యీ లక్షణాలు ఆమెకు ఏశక్తి అన్యాపదేశంగా ప్రబోధించిందో అటువంటిదే మరోశక్తి తనకు ఎవరూ యివ్వని హక్కులున్నట్లూ, అధికారం వున్నట్లూ, అది తనసొత్తు అనీ బోధించి చలాయింపజేసింది. వాటిల్లో కొన్ని మాత్రం తండ్రి దగ్గర నుంచీ అనాలోచితంగా నేర్చుకున్నాడు; ఆరోజుల్లో తల్లిని హింసించేటప్పుడు ఆయనపై కోపగించినా కూడా.

తను ముప్ఫయిఅయిదేళ్ళ సమిష్టి జీవితం ముగిసిపోయే తరుణం ఆసన్నమైంది. ఒకరాత్రి, రెండు రాత్రులు యిలా వ్యథాపూరితంగా గడిచిపోతాయి. తరువాత దయలేని ఓ భూతంవచ్చి చుక్క పెడుతుంది. ఒక ఎండిన మొండిమ్రానుమాత్రం జీవచ్ఛవంలా బ్రతుకుతుంది. ఈమె తన సహచారిణి...ఈమెకు యింతవరకూ ఏలాంటి ఉపచారమూ చేసిఎరుగడు. చేయాలన్న ఉబలాటం పొంగిపోతోంది ఇప్పుడు. కాని...! తామిద్దరూ ముసలివాళ్లయారు. ఒకరికొకరు తోడునీడగా, అండగా నిలవవలసిన సమయం యిది. చివరికి ఇలా అనుకున్నాడు. "ఇన్నాళ్లనుంచీ యిది యిలా జరగాలికొబట్టే జరిగిపోయింది. మా దాంపత్యం అనుకూలమైనదనే అంతా అనుకుంటూ వచ్చారు. ఎంతకాదనుకున్నా యిది నిజమేనని నామనసు ఘోషిస్తోంది. అబద్ధమని నన్ను నేనెందుకు మోసగించుకోవాలి? మా జీవితంలో లోటు ఏమీ లేదు. ఇది నా అదృష్టం."

ఈచివరి ఆలోచన కలిగేసరికి యీఅదృష్టంలోని అంతరార్థం మనసుని కలచివేసి, యిహ కన్నీళ్లు నిగ్రహించుకోలేకపోయాడు.

"ఏడుస్తున్నారా?" అంది ఆమె అది చూసి.

"నినొక్క ప్రశ్న అడిగేదా?"

ఆమె ఓ నిట్టూర్పువిడిచి "మీరు యిదివరలో అనేక చిక్కు సమస్యలను ఎదుర్కొన్నపుడు ప్రతిసారీ నా సలహాకోసం అనేక ప్రశ్నలు వేసేవారు. నేను అది పరమభాగ్యంగా ఎంచి నాబుద్ధినంతా వుపయోగించి నానాఅవస్థపడి జవాబులు చెప్పి మీముఖంలో ఎటువంటి భావాలు మెదులుతున్నాయోనని ఆతృతగా చూసేదాన్ని. ఏనాటికైనా అక్కడ సంతృప్తిచిహ్నం కనిపిస్తుందని నా ఆశ. కాని ఒక్కనాడూ మీ ముఖకమలం వికసించలేదు. ఒక్కసారీ నాసలహాప్రకారం ఆచరించలేదు. అసలు నా ప్రత్యుత్తరాలు వినాలన్న జిజ్ఞాసే కనిపించేదికాదు నాకు మీలో...అవి మీ ప్రశ్నలుకావు. కేవలం స్వగతాలు.

"నేనడుగదలచుకున్న ప్రశ్నకు చేరువగా తీసుకువచ్చావు ప్రస్తావన. పార్వతీ! నువ్విపుడు పదిహేనురోజులనుంచీ మంచం మీద పడివున్నావు. మనమిద్దరం యీస్థితికి లాక్కుబడివచ్చి ఇలా విచిత్రంగా కబుర్లు చెప్పుకుంటామని ఏనాడూ నేను అనుకోలేదు" ఆయన గొంతు జీరవోయింది. ఒక్కక్షణం కల్లోలమైవున్న మనస్సును పదిలపర్చుకున్నాడు. "నేను నీయెడల చాలా అపరాధాలు గావించాను. అవితప్పనిసరిగా మగజాతి అభిజాత్యంతో ఆచరించాను. కాని అన్ని సన్నివేశాలలోనూ నువ్వేనాడూ నాకెదురుతిరగలేదు. ఆగడబిడలు జరిగినమరునాడే నేను ప్రేమగా పలకరించేసరికి పరవశమై సర్వంమరిచి నాతోకలిసిపోయేదానవు. ఇంతఓర్పు నీకెలావచ్చింది? నేను అన్ని అత్యాచారాలు చేసినా నన్నెలా ప్రేమించగలిగావు? చెప్పవూ?"

పార్వతమ్మ భర్తవంక విస్మయపాటుతో చూసింది. వెను వెంటనే ఆమె ముఖం పాలిపోయింది. నేత్రాంచలాలలో కొద్దిగా కన్నీరు చింది ఏటవాలుగా ప్రవహించింది. కాని అది కొద్ది క్షణాలపాటు మాత్రమే. క్రమ క్రమంగా ఆమె ముఖంనిండా ఆనందం నిండి తేజోవంతమైంది. సంశయం నశించి దృఢనిశ్చయం ద్యోతకమైంది.

"ఈ ప్రశ్నకు జవాబు ఒక్కవాక్యంలో ఎలా చెప్పను? ఇలా రండి. నాకు బాగా సమీపంలోకి వచ్చి కూర్చో - ండి."

ఆయన మంచంమీద ఆమెకు మరీ చేరువగా జరిగి, స్పష్టంగా చూస్తూ కూర్చున్నాడు.

ఆమె చెప్పసాగింది.

"నేను యీ యింట్లోకి కాలు పెట్టటమే విచిత్రంగా జరిగింది. నాన్న యింటివిషయాలు అసలు పట్టించుకోకుండా వుండటమే కాకుండా చీటికీ మాటికీ అమ్మని చెయ్యి చేసుకుంటూ వుండేవాడు. అప్పటికి మట్టుకు ఆమె ఏడ్చి ఆయన మళ్ళీ తనను పలకరిస్తే సద్భాగ్యమని తలుస్తూ ఆయన అనుగ్రహంకోసం నిరంతరం సతమత మౌతున్నట్లు నా కనిపించేది. నేను ఎప్పుడూ ఒంటరిగా కూర్చుని ఆమె దుఃఖాన్ని గురించి అమాయకంగా ఆలోచించటమేగాని, దగ్గరకు వెళ్ళి ఎప్పుడూ కలగజేసుకోలేదు... నాకు పధ్నాలుగేళ్ళ వయస్సు వచ్చాక నా వివాహంకోసం అమ్మ ముప్పొద్దులా తాపత్రయపడేది. నాన్నమాత్రం ఏమీ పట్టించుకోకుండా నిశ్చింతగా తిరిగేవాడు. మాది పల్లెటూరు కావడంవల్ల యిరుగూ పొరుగూవాళ్ళు నా కింకా పెళ్ళి కాలేదని దెప్పి పొడుస్తూ వుండటం నాకు దుస్సహంగా వుండేది. అమ్మ ఒకసారి నాన్న కాళ్ళమీదపడి బిగ్గరగా ఏడుస్తూ మొరపెట్టుకుంది. ఆయన చాలాసేపు చీదరించుకుని, ఎంతసేపటికీ పాదాలు వదలక పోయేసరికి దయ తలిచినట్లు 'సరే' అని, అప్పటినుంచీ వారం రోజులు తిరిగి ఒకరోజున యీ సంబంధం కుదుర్చుకుని వచ్చేశాడు.

"కాపురానికి వచ్చేసరికి నాకు పధ్నాలుగేళ్ళు యింకా పూర్తిగా నిండలేదు. పల్లెటూరిలో పుట్టి, అక్కడే పెరగటంచేత నేను అర్థమూ, శుభమూ ఎరుగని పిల్లను. బస్తీవాళ్ళ లక్షణాలూ, సంప్రదాయాలు చాలా కొత్తగా కనిపించేవి...... నేనూ మా ఊళ్ళో చాలామంది పిల్లలతో స్నేహం చేశాను. అనుకున్నాను. మా పల్లెటూరి ఆడపిల్లల స్నేహాలు విచిత్రమైనవి. కొంతకాలం ఒకరికొకరు కలిసి మెలిసిచాలా సఖ్యతగా వుంటారు. కొంతకాలం విడిపోయి వాళ్ళమీద వీళ్ళు వీళ్ళ మీద వాళ్ళు గుసగుసలు చెప్పుకుంటారు. వాళ్ళ విరోధాల కారణాలు చాలా కాలికరంగా, హాస్యాస్పదంగా వుంటాయి. తర్వాత...... ఎంత ప్రాణమిత్రులుగా వున్నవారైనా సరే పెళ్ళిళ్ళయిపోయాక ఎక్కడికక్కడికో వెళ్ళి ఒక్క ఉత్తరం ముక్కయినా రాసుకోరు. ఒకరినొకరు త్వరగా మరిచిపోతారు. పెళ్లయిన మరునాటి నుంచీ పెద్ద ఆరిందాలలా మాట్లాడుతారు. తన భర్త తనని చిత్తుగా తన్నినపుడు ప్రక్కయింటి యిల్లాలు ఖేదంపొంది, వచ్చి "అయ్యో పాపం" అను సానుభూతి ప్రదర్శించబోతే "వెళ్ళండి. ఇది మా స్వవిషయం" అని నిష్కల్మషహృదయంతో పలకటమే పరమ ధర్మంగా ఎంచటం వాళ్ల పాతివ్రత్య లక్షణం.

"అలా యీ యింట్లో అడుగుపెట్టాక యిరుగూ, పొరుగూ వాళ్ళని చూసినట్లుగానే నా జీవితమూ ఆరంభమయింది. నేను చదువురాని మొద్దుననీ, అర్థమూ శుభమూ తెలియనిదాననీకూడా నేననుకోకుండా చేసేవాళ్లు. ఎందుకంటే నా కనుభవం లేదు. ఏది ఎలా జరిగినా అది అలా జరగాల్సిన విషయమే కాబోలునని అనుకుంటూ వుండేదాన్ని. అప్పటిరోజుల్లో అత్తాకోడళ్ళ మధ్య వుండే సంబంధాలూ, ఆ ప్రవర్తనలు, అంతులు యీ కాలం పిల్లలకు చెబితే అది కథ అనుకుంటూ నిట్టూరుస్తారు. ఎందుకంటే మన కళ్ళముందు జరిగే విషయాలను మనవికానట్లు ఎవరి కథగానో చెబితే కళ్లు చెమ్మగిల్లి, దుఃఖపడటం రివాజు.

"నన్ను అత్తగారు నేను పాతికేళ్ల వయస్సులో వున్నప్పుడు కూడా కొట్టడం మీకు తెలియదు. నేను హైందవస్త్రీని కాబట్టి ఆ విషయాలు మీకు తెలియకుండా దాచి నా పతివ్రతా ధర్మం నిర్వర్తించుకున్నాను.

"నేను సంసారంలో కొత్తగా అడుగుపెట్టినా అదినుంచి వస్తూన్న అభ్యాసమేమో పద్ధతులన్నీ పాతవిగానే వుండేవి. అత్తగారికి నేను ఒకర్తనే కోడలినయినా అవిడ చర్యలు అవిడకే విపరీతంగా వుండకపోవటం అన్యాపదేశంగా పెద్దలనుంచి నేర్చుకున్న విద్య. మరో విచిత్రమైన విషయంకూడా చెప్పనా? అవిడనీ మామగారు అడపాతడపా కొడుతూండేవారు. వారికి ఎప్పుడూ ఎదురు పలకకుండా కిమ్మనకుండా వూరుకునేది. నిజమైన సంస్కృతి, సంస్కారం యిక్కడేవుంది......నాకు క్రొత్త అవటంచేత ఒంటరిగాకూర్చుని అప్పుడప్పుడూ వేదనగా ఆలోచిస్తూ వుండే దానిని. నా బాల్యస్మృతులు, వెర్రి మొర్రి ఆటలు అన్నీ స్పష్టంగా కళ్ళముందు మెదుల్తూ చెప్పరాని బాధగా వుండేది. ఆ బ్రహ్మాండమైన రావిచెట్టు, పండుగలకు పిచ్చిసంబరంతో దానికి ఉయ్యాలలు కట్టి ఊగటం, ఊరికి పడమరగా పోతూన్న కృష్ణపాయలో పెద్ద వాళ్ళతో చలిలోవెళ్ళి స్నానంచేయటం, విన్న పురాణాలే విని ఎప్పటికప్పుడు నూతనానందం పొందుతూన్న ముసలాళ్లు ఆ కథలు మాకుచెబుతూ, తమ చిన్నప్పటి అనుభవాలు పునశ్చరణ చేసుకుంటూ కన్నీళ్ళు విడవటం అవన్నీ గుర్తుకువచ్చి ఆ జీవితానికీ యీ జీవితానికీ సమన్వయంచేసుకుంటూ చెప్ప రాని ఆరాటానికి లోనవుతూండేదాన్ని. ఇటువంటి సమయాలలో ఆ బాల్యజీవితమే, అమందానందకరమైనదనీ, తిరిగి అందులోకి పోగలిగితే బాగుండని అనుకోవటం ఎవరికైనా సహజం. కాని మనిషి పెరుగుదలతో బాటూ మానవస్థైర్యాన్ని పరీక్షించే అనేక సమస్యలు ఉత్పన్నమౌతూంటాయి. ఇది ప్రకృతిసిద్ధం. బాధ్యత అని గుర్తించి నిశ్చలమైన మనస్సుతో నిలబడినవారు ఏదో సాధించ గలుగుతారు. పరీక్షలు వరుసగా తప్పుతూన్న విద్యార్థి, ఎలా కృతార్థుడవాలో చేతకాక 'యింతకంటే చిన్నతనమే బాగుంది. అప్పుడు యీ బాదరబందీ ఏమీ లేదు' అని దానిని తలుచుకుని ఉవ్విళ్ళూరుతూంటే యిహ వయసుకు బాధ్యత ఎందుకు? అందులో పిసమెత్తుకూడా ప్రయోజకత్వం లేదు. ఈ సత్యాన్ని తెలుసుకుని నేను విచారాన్ని మరిచి ముందుకు పురోగమించ గలిగాను.

"సంవత్సరానికి ఏ ఒకనాడో తప్ప పుట్టింటికిపోయి ఎరగను. అమ్మ నన్ను ఏవో ప్రశ్నలువేసేది. ఆదుర్దా పడేది. మళ్ళీ తానే నీతులు బోధించేది. నేను ముభావంగా ఊరుకునేదాన్ని, దేనికీ సమాధానం చెప్పక."

"మీరు అడిగిన ప్రశ్నకు జవాబు యిహ లభించబోతున్న దనుకుంటాను. ఇది మీకు చెబుతూ వున్నంతసేపూ మీరు ఎటూ

చూడలేక సరిగ్గా నా కళ్ళలోకి చూస్తూవుంటుంది. నా కడసారి ప్రార్థన యిదే.

"నేను మీతో అలవాటుపడిపోయాను. చాలా సంవత్సరాలు గడిచిపోతున్నాయి. పెద్దవాళ్ళ మైపోతున్నాం...మీరు నన్ను చాలాసార్లు కొట్టారు. ఒకసారి నా నెత్తి చిల్లిపడి నెత్తురు చుక్కలు రాలాయి. ఒకసారి మణికట్టు బొమిక విరిగి నెలరోజులు మంచాన వున్నాను. ఒకసారి మీ దెబ్బలకు, స్పృహతప్పి పడిపోయాను. కాని ఏనాడూ మిమ్మల్ని ఎదిరించలేదు. క్రోధపూరితంగా మీకేసి చూడలేదు. కిమ్మనకుండా, కిక్కురు మనకుండా వూరుకున్నాను. ఎందుకు?

"ఒకసారి—మీరు రోజూ అర్ధరాత్రివేళ లేచి ఎక్కడికో వెళ్ళిరావటం ప్రారంభించారు. అప్పుడు ఒకరోజురాత్రి పదకొండు గంటలవేళ మీకు పాదాలుపడుతూ కూర్చున్నాను. మీరు 'రెండు గంటలవేళ నన్ను తప్పకుండా లేప'మనిచెప్పి నిద్రపోయారు. మీరు రెండుగంటలకు లేచి ఎక్కడికి పోతారో నాకు తెలుసు. అయినా అప్పటివరకూ మెలకువగావుండి మిమ్మల్ని తప్పకుండా లేపుదామనుకుంటూనే, పగలంతా రెక్కలు ముక్కలు చేసుకుని వుండటం వల్ల ఎంత ప్రయత్నించినా నిద్ర ఆపుకోలేక, కూర్చున్నచోటనే నేలమీద వళ్లుమరిచి వాలిపోయాను. దభీమని పెద్ద శాబ్దంతో మెలకువ వచ్చి ఉలికిపడ్డాను. మీరు చేతిలో కర్రతో, ఉగ్రస్వరూపులై ఎదురుగా నిలబడివుండి "రెండింటికి లేపమంటే లేవలేదేం పొగరుబోతా" అని అరుస్తూ నన్ను లేవనీయకుండానే వీపు మీద పదిపదిహేను దెబ్బలుకొట్టారు. నేను భయంతో 'ఎంత ప్రయత్నించినా నిద్ర ఆపుకోలేక పోయాన'ని చెప్పాను కష్టమ్మీద లేచి నిలబడుతూ. 'అంత అదమరిచి నిద్రపోతావా భడవా' అని నన్ను బాదగొట్టారు. తెల్లారిలేస్తూనే ఆరోజు మీచేత అన్ని దెబ్బలు తిన్నాను. బాధకు తాళలేక గ్రుడ్లనీరు క్రుక్కుకుంటూ మీవంక చూశాను. ఏమీ ఎదురు సమాధానం చెప్పలేదు. కిక్కురు మన లేదు. తలవంచుకుని లోపలకు వెళ్ళిపోయాను. ఎందుకు?

"మనమ్మాయి పుట్టిన క్రొత్తరోజుల్లో నేను పగలు ఒంటి గంటకు దాన్ని పడుకోబెట్టి నిద్రపుచ్చి, మళ్ళీ ఎక్కడ లేస్తుందో నన్న కంగారులో ఆదరాబాదరాగా అన్నం తింటున్నప్పుడు దబ్బుమని క్రిందపడ్డ చప్పుడు విని నోట్లో ముద్ద నోట్లోనే వుంచుకుని 'అమ్మో' అనుకుంటూ పరిగెత్తుకువస్తున్నాను. ఆఫీసుగదిలోంచి పరుగెత్తుకువచ్చిన మీరు 'అంత వళ్ళుతెలియకుండా ఛస్తున్నావా?' అంటూ నేను అమ్మాయిని యింకా నా చేతుల్లోకి తీసుకునే ముందే కాలితో డొక్కలో ఒక్కటి తన్నారు. నేను ఎలాగో లేచి పిల్లను గుండెకు అదుముకుంటూ, బాధనంతా భరిస్తూ అక్కడి నుంచి వెళ్ళిపోయాను. ఎర్రగానైనా మీ వంక చూడలేదు. ఎందుకు?

"ఒకరోజు నేను గాఢనిద్రలో వున్నాను. మీరు రాత్రివేళ యింటికి ఆలస్యంగా వచ్చి తలుపు తట్టినట్లున్నారు; కాని నాకు మెలకువరాలేదు. చాలాసేపు తలుపు బాదినా నాకు మెలకువ రాలేదన్న కోపంతో మీరు కంకరరాయితీసి కిటికీలోంచి బలంగా విసిరేశారు. ఉలిక్కిపడి 'అమ్మో' అంటూ లేచాను ఏదో కీచుకలకంటున్న దానికల్లా నుదురు రక్తం చిమ్ముతున్న చోట తడుము కుంటూ కంగారుగా లేచివచ్చి తలుపుతీయగానే లోపలకు ఒక్క త్రోపుత్రోసి జుట్టు పట్టుకుని కొట్టారు. నేను మారుకూడా పలక కుండా యీ గొడవకు లేచి, ఏడుస్తున్న పాపని సముదాయించటానికి వెళ్ళాను. ఎందుకు?

"అత్తగారు యింట్లో రెండు మూడు నెలలకు చనిపోతా రనగా, మంచానపడి వుండికూడా, ఎవడితోనో నాకు సంబంధం కట్టారు. అది విని మీరు ముందూ వెనకా ఆలోచించకుండా నన్ను చావ చితకకొట్టారు. ఇంతకంటే అవమానం నాకు వేరే ఏముంది? కాని నేను పెదవి విప్పలేదు.

"మీ పరిచర్యల్లో ఏవో లోపాలున్నాయని అడపా తడపా కొట్టారు, తిట్టారు.

"ఒకసారి, మణికట్టుబొమిక విరిగిందని చెప్పానే, అప్పుడు నెలరోజులపాటు మంచంమీదవుండాల్సివచ్చింది. మీరు విసుక్కునేవారు. చాలాసార్లు ఒక్కొక్కసారి రెండునెలల తరబడి కూడా మీరు జబ్బులో వున్నప్పుడుకూడా నిద్రాహారాలు, సర్వసుఖాన్నీ త్యజించి మీకు సపర్యలు చేశానన్న విషయం మీ విస్మృతిలో పడిపోయింది. వారంరోజులన్నా గడవకముందే రాత్రిసమయాలందు ఎక్కడికో రాకపోకలు సాగించారు. మరి నేను మాత్రం మనిషిని కానా? కాని మిమ్మల్ని పిలిచి "నేను నెలలపాటూ విస్మరించిన సుఖాన్ని, మీరు కొన్నిరోజులు మరిచిపోలేరా? అని ప్రశ్నించలేదు.

"మీరు సంతోషంలో వున్నప్పుడు అది గ్రహించి అందు కనువుగా నేను మాట్లాడాలి. కోపంలో చికాకులో వున్నప్పుడు దూరదూరంగా తొలగాలి. ఏక్షణంలో ఎట్టి అసంతృప్తి కలిగినా చీదరించుకునేవాళ్లు. దెబ్బలకన్న పదునైనమాటలతో తిట్టి అవమాన పరిచేవాళ్లు. అతిహీనంగా చూసేవాళ్ళు. ఏమీ జరగనట్లు మసులు కునేవాళ్ళు. కాని యిన్ని సంవత్సరాల సుదీర్ఘకాలంలో ఏనాడూ పన్నెత్తి ఒక్కమాట అనలేదు. కన్నెత్తి కోరగా ఓ చూపు చూడ లేదు. ఎందుకు? మీరు కారణం అడిగారు కదూ?

"నేను యిప్పుడు మృత్యుముఖాన వున్నాను. మీరుగాని, డాక్టరుగారుగాని నాగురించిచెప్పకపోయినా ఏఅవ్యక్తపు పలుకులో నిజాన్ని వచిస్తూ నా శ్రవణ కుహరంలో ప్రవేశించగలిగాయి. ఇహ ఒకటి రెండు రోజుల్లో నాకు మీ అందరితోనూ ఋణం తీరి పోతుంది. ఇటుపై నాకు ఎవరి అండా వుండబోదు. అందువల్లే యీవేళ మిమ్మల్ని నాచెంత కూర్చొపెట్టుకుని, నా మనసు యావత్తూ విప్పి చెప్పటం ప్రారంభించాను.

"ఇప్పుడు తదేకంగా చూడగలుగుతున్న మీ ముఖంవంక యిహపై చూడవలసిన అవసరం లేదు కాబట్టి, యిన్ని ఏండ్లుగా మిమ్మల్ని ఆశ్చర్యపరచిన నా ఓర్పుకు కారణం చెబుతాను వినండి.

"మగవాడు తుచ్ఛమైన కార్యాన్ని ఘనంగా ఎంచుతాడు. ఆడది ఘనమైన ఓ కార్యాన్ని అల్పంగా ఎంచుతుంది. మీలోని భర్త నాలోని భార్యను నిర్దయగా కొట్టినప్పుడూ, దారుణ హింసాత

మానాలకు గురిచేసినప్పుడూ, ధిక్కరించడమూ, తిరగబడడమూ, పారిపోవటమూ, ఆత్మహత్యలకు పాల్పడటమూ మినహా ఆమె చేయగలిగిన ఘనకార్యం ఏమీ లేదని ఆమె అనుకుంటే యీనాటి ఆత్మహత్యల సంఖ్యకూ, సంసారాలు పాడుచేసుకున్నవాళ్ల సంఖ్యకూ మితి వుండేది కాదు. స్త్రీ ఎప్పుడూ తన శక్తికి మించిన పని చేయాలని ఉబలాటపడుతుంది, సాధిస్తుంది.

"పురుషుడు తనని హింసలపాలు చేసినప్పుడల్లా అతన్ని క్షమిస్తూ వుండటం స్త్రీ సాధించింది.

"మీవల్ల నేను అవమాన దందహ్యమాన మానసురాల్ని అయినప్పుడల్లా మెట్టుమొదట ధిక్కరిద్దా మనుకునేదాన్ని. తరువాత బావిలో పడి చద్దా మనుకునేదాన్ని. కాని మరుక్షణంలో యీ అల్పమైన ప్రయోగాలకు నేనెందుకు పాల్పడా లన్న లజ్జ ముంచుకు వచ్చేది. వీటన్నిటికన్న మించిన ఒక విశేషాన్ని నా అధీనం చేసుకుని మీకన్న ఉన్నతురాలి నన్న సంతృప్తి, గర్వం నాలో నేను ఆవహింప చేసుకోవాలి... వెంటనే మిమ్మల్ని క్షమించేదాన్ని.

— "అవును. మీరు నన్ను వేధించినప్పుడల్లా మిమ్మల్ని క్షమిస్తూ వచ్చాను. మిమ్మల్ని క్షమించానన్న ఆనందంలో, అభిజాత్యంతో రోజులు సునాయాసంగా, నిబ్బరంగా గడిచిపోయేవి. ఇదంతా అనుభవిస్తూ నాలో నేను ఎంత పరవశం చెందుతున్నానో మీకేం తెలుసు? పైచేయి నాది. ఇది మీకు చెప్పకుండానే దాచబోయేదాన్ని. కాని చివరి ఘడియల్లో నా జీవితాన్ని పునః విమర్శ చేసుకుని, దేనిని గురించి నే నాలోచనా నిమగ్నురాలనై వున్నానో, దాన్నే మీరు ముళ్లకంచెతో బురదనీటిని కదిపినట్లు కదిపారు. అందుచేత సర్వమూ మీకు వెల్లడించక తప్పలేదు. ఇదే మిమ్మల్ని విభ్రాంతి పరచిన నా బ్రహ్మాండమైన ఓర్పుకి కారణం. ఇన్నాళ్లూ... మిమ్మల్ని... క్షమించాను!

ఆమె వదన మండలమంతా ఉన్మిషితమైపోయింది. మైకంలో మైమరుపులో క్షణకాలం మాత్రం కళ్లు మూసింది. తర్వాత భర్త వంక చూస్తూ మెదలకుండా పడుకుంది.

ఆదిశేషయ్యగారి ముఖంలో నెత్తురుచుక్క లేదు. మలిన పూరితమైన ఆ పదార్థాన్ని అలానే భరిస్తూ నిర్విణ్ణుడై అలానే కూర్చుని వున్నాడు కొంచెంసేపు.

"ఈమెతో యిప్పుడు సంభాషించాలా?" ఈ భయాందోళనలు ఆయన్ని కృంగదీశాయి. ఇక్కడినుండి తప్పించుకోవటంకూడా కష్టమే. కాని యిక్కడ యీ మానవాతీతురాలిగా కనిపిస్తున్న వ్యక్తి ముందు కూలబడి ఆలోచనలు కొనసాగించటం అంతకంటే కష్టము. ఎలాగో సర్వశక్తులూ కూడదీసుకుని లేచి, తప్పటడుగులతో అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

* * *

కూతుర్ని అయోమయ పరిచి గదిలోకి సాగనంపి దీపం వేసి వున్న గదిలో ఆదిశేషయ్యగారు యింకా ఒంటరిగా కూర్చుని వున్నాడు దీనంగా. వదనంలో విరాగ రేఖలు స్పష్టంగా వ్యక్తీకరించ బడ్డాయి యిప్పుడు. అతనకు సమాధానం లభించింది. ఈ దీర్ఘకాల సంసారంలో పొందగలిగిన శాంతి, సౌఖ్యాల వెనక అదుమబడి వున్న కారణం తెలిసింది. ఇరుగూ పొరుగూ సీత పార్వతీ పరమేశ్వరుల వంటివారని తమలో తామూ, బాహాటంగా కూడా అభివందించ బడటంలో యీ ప్రతిష్ఠ ఎవరికి దక్కాలో తెలిసింది. తనలో దుర్మార్గమనే ప్రత్యేకత వుండికూడా ఆమె పెట్టిన భిక్షవల్ల మామూలు మనిషి క్రింద చలామణీ అయాడు. అసలు మగవాళ్లంతా యింతే నేమో! మరి లోకం 'దుర్మార్గుడు' అని ఎవర్నయితే పేరు పెట్టి పిలుస్తుందో వాడిలో ఎంత దుర్మార్గం కరుడు గట్టుకుపోయి వుండాలో!

తాను క్షమించబడుతూ పాపాలు చేశాడు. క్షమించబడుతూ వృద్ధు డయాడు. ఈ పాపానికి పరిధి వుంది. ప్రాయశ్చిత్తం లేదు కాని...! ఇంకా తనను ఏదో పీడిస్తోంది. అభిమానం చావకుండా నిక్కుతోంది. లజ్జ, నిర్లజ్జల మధ్య కొట్టుమిట్టాడుతున్నాడు.

"ఈ ముప్పయి అయిదేళ్ల సంసార జీవితం!"—ఆయన ఆశ్చర్యాన్వితు డయాడు. ఒక విశాల హృదయం విధివిరామం లేకుండా ప్రసరించిన క్షమవల్లనే నలుగురిలోనూ అల్లరిపాలు కాకుండా కాపాడబడ్డాడు.

ఈ ఆలోచన తోచేసరికి మనసు భయావిష్టమై స్పందించింది. "నేను పరాధీనుడ్ని. పరాజితుడ్ని. పరాభూతుడ్ని."

గతచరిత్రంతా ఒక్కసారి చెమ్మగిల్లిన నేత్రాలముందు సాక్షాత్కరించి కదలిపోయింది. ఆ కాలంలో అందరూ మానవుల్లా జీవిస్తున్నట్లు తనకు తెలుసునేమో-తనభార్యతప్ప.

ఇంతలో మరోసత్యం స్ఫురించి కంపితుడయాడు. తాను ఆమెను ఎన్నిసార్లు కొట్టాడో ఆమెకు జ్ఞాపకం వుంది. తనకు లేదు.

ముచ్చెమటలు పోస్తూండగా కళ్ళు మూసుకుని గంద్రగోళమైన మనస్సుతో తబ్బిబ్బు అవుతున్నాడు వెనక్కివాలి. డాక్టర్ యివాళ పెదవి విరిచాడు. మహా బ్రతికితే ఒకటి రెండురోజులు! ఆ తర్వాత తనని క్షమించేందుకు ఎవరూ మిగలరు.

ఈ పదిపదిహేను రోజులనుంచీ దేముడు చాటుగా తనకు అంతిమ కర్తవ్యం ప్రబోధిస్తూ వచ్చాడు. జన్మలో ఆమె గురించి తాపత్రయపడిన సమయం యిది ఒక్కటే. కాని దానిని గురించి తలచటానికైనా తనకు అర్హత లేదు. ఈ కడపటి వివేకం అసంపూర్ణంగా వుండిపోయింది.

ఇపుడు ఏదో చిత్రమైన అనుభూతి కలుగుతోంది. దాన్ని భరించలేకపోవటానికి అశక్తత ఒక్కటే కారణమవుతోంది. ఇది తన దౌర్భాగ్యం. కాక యింకా అహం పూర్తిగా చావక ఏమూల నుంచో తొంగి చూస్తోందన్న జ్ఞానం కలగటం మరేమిటి?

అవును. తన మానవత్వం యింకా సంపూర్ణత్వం పొందలేదు. అందుచేతనే ఆమె చెంతకుపోయి ఏవో మాటలు చెప్పటానికి యింకా ఉద్యుక్తుడు కాలేకుండా వున్నాడు.

"కాని తాను ధన్యుడు" ఈ యోచన తనువును పులకరింప చేసింది. మరుక్షణంలో కళ్ళనిండా నీళ్ళు పొటమరించాయి. తనకు యీ లోకం ముందు ధన్యత చేకూర్చిన ప్రాణిముందు మనసారా

కృతజ్ఞత వెల్లడించటానికి తటపటాయిస్తే యీ పాపానికి పరిధి కూడా లేదు; 'తాను ప్రపంచంలో ఒకడు' అని ఓదార్చుకుంటూంటే ఎవరో అజ్ఞాతవ్యక్తి ఆ చుట్టు గీతనుకూడా తుడిచి పారేసినట్లు ఆయన ప్రకృతి స్థితుడయాడు. వ్యవధానం తక్కువ. నిమ్మదిగా లేచి, ధైర్యంగా లోపలకు వెళ్ళాడు.

* * *

"అమ్మా!" అంది కూతురు గుమ్మందగ్గర నిలబడి భీతిగా చూస్తూ.

పార్వతమ్మ నిమ్మదిగా కళ్ళు విప్పి "ఎవరు?" అనుకుంటూ అటు కేసి చూసింది. ఎవరో చూసి ఆనందపడి "తల్లీ"రా అంది నీరస కంఠంతో. కూతురువచ్చి తల్లికి చేరువగా మంచంమీద కూర్చుని తెరు దుగా పరికిస్తోంది. ఆమె మృదుహస్తాన్ని తన కుక్కుహృదయంపైకి లాక్కుని పార్వతమ్మ "నా కంత్యకాలం సమీపించింది. నా చివరి మాటలు వినటానికి ఎందుకువచ్చావు? పిచ్చితల్లీ" అంది డగ్గుత్తికతో.

కూతురు యీ మాటలు విని శంకతో నిశ్శబ్దంగా ఏడువ సాగింది. తల్లి గుండెపై తలవాల్చి "ఇలా ఎందుకయిందమ్మా ఎందు కయింది?"

"వెర్రి తల్లీ! మీ తండ్రిగారి కళ్ళముందు నేను దాటిపోవటం నా మాంగల్య మహిమవల్ల అనుకుని ఎందుకు ఊరడిల్లవు? ఈ సౌభాగ్యం అందరికీ ప్రాప్తిస్తుందా?"

ఆనందోద్రేకంతో జలిగిపోతూన్న తల్లి కృశించివున్న వదనం లోకి తేరిపార చూసింది కూతురు. కాని అందుకు కారణం వేరుగా భావించింది. కేవలం యిప్పుడు ఆడినమాటల్లోని తాత్పర్యమేనని ఆమె అపోహ. "అమ్మా" అంది బాధతో. ఏదో చెబుదామను కుంది. కాని దుఃఖంతో గొంతు పూడుకుని సాధ్యంకాలేదు. కొద్ది క్షణాలు నిశ్శబ్దవాహినిలో ప్రవహించాయి.

"ఏమిటి?" అంది తల్లి ప్రేమగా.

తన సందేహం తీర్చుకుందామని "నీవింత ఆనందంగా వుండడం నే నెప్పుడూ చూడలేదు?" అంది.

"ఇందులో అంతరార్థం నీ కిప్పుడే తెలియదు"

"పోనీ చెప్పరాదా?"

"నా కడుపున పుట్టినదానవు. నువ్వుకూడా అనుభవశాలివై యీ సత్యం నీఅంతట నీవు శోధించగలిగినాడు నీవూ యీ అనిర్వచనీయ మైన సుఖంలో ఓలలాడుదువుగానిలే."

కూతురు విషణ్ణవదనంతో ప్రశ్నార్థకంగా చూసింది.

"తల్లీ! నీకు పుణ్యస్త్రీ అంటే అర్థం తెలుసునా?"

"అమ్మా ఏమిటే యిది? నా కేదో భయంగా వుంది. నాన్నని పిలుస్తాను" అంటూ మళ్ళీ ఏడువ సాగింది.

"వద్దు. కళ్ళు తుడుచుకో. చెప్పమ్మా. నీకు పుణ్యస్త్రీ అంటే అర్థం తెలుసునా?"

"ఊహు... తెలియదు."

ఆమె ఆలోచించి—

"నాకూ తెలియదు సరిగ్గా. నా జీవితం అందుకు ఉదాహరణ ప్రాయం అన్న అభిప్రాయం యింతవరకూ వుండేది. కాని నిన్ను చూస్తుంటే, అమాయకమైన నీ ముఖంలోకి చూస్తూంటే తప్పు టడుగు వేశానేమోనన్న సంశయం పీడిస్తోంది. ఇప్పుడు నేను చేసి వది ఒక ఉన్మాదక్రియా?" అని నిట్టూర్చి "అయ్యో ఎంత పొరపాటు జరిగిపోయింది! మీ నాన్నగారూ నువ్వూ ముఖాలు యిహమీదట కూడా చూసుకోవాలిగదా నన్న జ్ఞానం లేకపోయిందే నాకు...... ఆయనకు కనిపించావా?"

"ఆఁ నాన్న చీకటిగదిలో ఒంటరిగా ఎలాగో కూర్చుండటం చూసేసరికి నాకు భయంపుట్టింది."

"ఏమన్నా అన్నారా నిన్ను చూసి?"

"పలక లేదు. విచిత్రంగా, అయోమయంగా చూశారు."

"ఎంత పాడుపనిచేశాను?" అని ఆమె తనలో తాను మథన పడసాగింది. పాపిష్టిదాన్ని. ఈ మేలుకొలుపు నాకు కలగకున్నా బాగుండేది. తుదిఘడియల్లో నాకు సౌఖ్యగరిమ అంతా నేనే పంచు కోవాలన్న స్వార్థదాహం ఎందుకు కలిగింది?"

"అమ్మా!"

పార్వతమ్మ కళ్ళలోనీళ్లు గిర్రున తిరిగాయి. ఎడతెగకుండా ప్రవహించసాగాయి. అవి కూతురుమాపి యీ హఠాత్ పరిణామా నికి దిగులుచెందటం కనిపెట్టి "నీ చేతుల్తో యీ నీళ్ళు తుడిచి వేయవూ? నీవల్లగాక మరి ఎవరివల్ల నా దుఃఖం ఉపశమనం చెందు తుంది?" అన్నది.

కూతురు తనలో తాను కుమిలిపోతూ, మృదువైన వ్రేళ్లతో మెల్లగా కన్నీటిపాయలు, చారలు తుడిచివేసి మెదలకుండా కూర్చుంది.

"నాచేయి ఎత్తాలంటే బలహీనంగా వుంది. ఈ చేతిని నీ శిరస్సుమీద పెట్టుకోమ్మా"

ఆమె తన రెండు చేతుల్తో తల్లి దక్షిణహస్తాన్ని పట్టుకుని తలపై వుంచుకుని శ్రద్ధాభక్తులతో కనులు మూసుకుంది.

తల్లి అస్పష్టస్వరంతో ఉచ్చరిస్తూ ఏదో ఆశీర్వదించింది. అది కూతురికి యిలా వినిపించింది:

"అందరి స్త్రీలలానే బ్రతుకు"

కూతురు ఏదో పలకబోయింది. ఇంతలో గది బయట అడు గుల చప్పుడు వినిపించింది. ఇద్దరూ దృష్టి అటు లగ్నం చేసేసరికి ఆదిశేషయ్యగారు బరువుగా అడుగులు వేసుకుంటూ లోపలకు ప్రవే శించి యిద్దరివంకా తెల్లబోయి చూచాడు. ఒక్కదెబ్బతో ధైర్య మంతా సడలిపోయినట్లయింది.

పార్వతమ్మ కష్టమ్మీద "నాన్నగారు నేను ఏమయిపోతానో నన్న శంకతో రెండురోజులుగా పచ్చి మంచినీళ్లుకూడా తాగటం మానేశారు. వెళ్ళి భోజనపదుపాయం చూడమ్మా" అంది. కూతురు లేచి తండ్రివంక ఒకసారి భయభక్తులతో చూసి తల వంచుకుని అక్కడినుంచి నిష్క్రమించింది.

ఆదిశేషయ్యగారు "పార్వతీ!" అని పిలవబోయి, తృళ్లిపడి ఆమెవంక ఏకదీక్షగా అలానే చూస్తూ నిలబడిపోయాడు.

ఆయనవంక చూస్తూ పార్వతమ్మ ఆలోచించసాగింది. ఈయన మళ్ళీ తన ఎదుటకు వచ్చారు. తన మనస్సు యావత్తూ విప్పి చెప్ప గానే, ఆ క్షణాలలోనే తన ప్రాణాలు గాలిలో కలిసిపోతాయని అప్పుడు నమ్మింది. కాని...అందుకు భిన్నం. ఇప్పుడు యిద్దరూ ఒకరికొకరు అభిముఖంగా వున్నారు. ఈ అవస్థ భరించటం ఎలాగు? తన ఈ అమర్షభావం ఎందుకు ప్రకటించింది?

"పార్వతీ!" అని పిలిచి ఆదిశేషయ్యగారు సమీపించబోయి, ఉలికిపడి, నీరసంగా చూస్తూ అలానే నిలబడిపోయాడు.

పార్వతమ్మ చూపు త్రిప్పుకోలేదు. అలానే వీక్షించసాగింది. ఇదే ఘడియలో తనకు మృత్యువు ప్రాప్తిస్తే బాగుండును. తల వెయ్యి వ్రక్కలైపోతే బాగుండును...ఎంత...ఎంత...అదృష్ట హీనురాలు?

ఆదిశేషయ్యగారు మెల్లగా సామీప్యంలోకి వచ్చి "పార్వతీ! అని నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. ఈ మార్పు ఎలా అవతరించింది? ఆ ముఖంలోని ప్రతి అణువూ అలా వివర్ణరూపం పొందవుంటేం? ఆ కనుల్లోని తన్మయం, ఆభిజాత్యభావం ఏమయిపోయాయి?

పార్వతమ్మ పెదవులు కంపించసాగాయి. "రండి" అంటూ ఆయన్ని ఆహ్వానించింది చివరకు. ప్రక్కకు వచ్చి కూర్చున్నాక ఆయన వొణుకుతున్న చేతుల్ని, తన వణుకుతున్న చేతుల్తో చేరదీసి పట్టుకుని "నన్ను క్షమించరూ?" అన్నది తడబడుతున్న కంఠంతో.

"పార్వతీ!" అన్నాడు ఆదిశేషయ్యగారు విశ్చేష్టితుడై "నేను ఏమయినా............

"అవును. నన్ను క్షమించండి. నేను మిమ్మల్ని...నన్ను క్షమించండి"

ఈ హృదయ విదారకమైన వేడికోలు ఆయనను అపాంతం కలవర పరిచింది. ముందు "ఎందుకు?" అన్న ప్రశ్న నోటి వరకూ వచ్చింది. కాని...సంబాళించుకున్నాడు. ఒక క్షణం ఏదో ఆలోచన పాములా జర జరమని ప్రాకుతూ మనసులో మెలిసింది. తన పశ్చాత్తాపంలోని అఅసంపూర్ణత్వం...!—భార్య వంక తీక్ష్ణ దృష్టితో చూచాడు. మళ్ళీ తలప్రక్కకు త్రిప్పుకున్నాడు. తన నిశ్చయం పటాపంచలౌతుంది. స్వార్థరేఖ హృదయకుహరంలో మింటికి ఎగబ్రాకే మంటలా ఎగసింది. ఇవేళ...యీరోజు యీ రాత్రి ... పరాభవాల వెనుక ....పశ్చాత్తాపంవెనుక...ప్రశాంతి వెనుక...దృఢనిశ్చయం వెనుక......

అంతే ఆకస్మికంగా ఆమె వైపు తిరిగేసరికి ఆయన నేత్రాలు ఉజ్వలంగా ప్రకాశిస్తున్నాయి. చెప్పరాని మార్పు ప్రవేశించి అస్థిరచిత్తం స్థిరత్వం పొంది వికసించినట్టుగా దృక్కులను ఆమె వరకూ గంభీరంగా ప్రోలాయి. బలహీనమైన ఆమె చేతి పట్టు సడలింది. తన హస్తాన్ని ఆమె ఫాలంపై వుంచి "పార్వతీ! నిన్ను నే క్షమించాను" అన్నాడు.

* * *

రాత్రి పన్నెండుగంటలలో పున జరిగిపోయిన ఆ సంఘటన తర్వాత, సంఘటిల్లిన సంగతులను గురించి ఉల్లేఖించటానికి కలం వెనుక ముందాడుతోంది. ఈకథలో ముఖ్య పాత్ర పార్వతమ్మ ఆమెను గురించి వ్రాయటానికి బాధపడి, వదిలివేసి మిగిలిన వారిని గురించి వ్రాద్దామన్నా సాధ్యం కావటం లేదు...ఆమె జీవితం చివరి దశలో చాలా విచిత్రమైన పరిణామాలకు గురైంది. ఆమె ఆశించి నట్లు చావు దగ్గరకు రాకుండా దూరదూరంగా జరుగుతోంది, విముఖత చూపిస్తూ.

పార్వతమ్మ తనతల్లి మరణశయ్యపై వున్నప్పుడు పెలిగ్రాం అందుకుని వెళ్ళినపుడు యిలా జరగలేదు. మరునాడే ఆమె తల్లి కళ్లు మూసింది.

మరునాటిఉదయం డాక్టర్ యథాప్రకారంవచ్చినపుడుపార్వతమ్మ పరిస్థితి కొంచెం తేటగా వుండటం కనిపెట్టి ఆశ్చర్య పడ్డాడు. నాడి చూసి సంతోషం ప్రకటించాడు. మగత నిండిన నేత్రాలతో ఏదో లోకంనుండి చూస్తున్నట్లు ఆయనవంకపరికిస్తూన్న పార్వతమ్మ మనసు చివుక్కుమంది. ఎందుకీయన ఆశాభావం ప్రదర్శిస్తున్నాడు! తనకి చావు మూడటానికి యింకా కొన్నిరోజులు వ్యవధివుందా?

ఆమె ఎవరితోనూ పలకటం మానివేసింది. తాను పలికితే అందులో ఏ అపస్వరం ధ్వనించి, దానిని గురించి సమాలోచించు కున్నపుడు తనగుండెల్లో చిచ్చుపెడుతుందో ఎవరికి తెలుసు? తాను భంగపడింది. శాశ్వతమైన ఆనందాన్ని క్షణికావేశంతో బయటకు వెల్లడించి భగ్నంచేసుకుంది. దేముడు తనకు రెండు పరీక్షలు పెట్టాడు. ఒకదాంట్లో అద్భుతంగా గెలిచింది. రెండవదాంట్లో చిత్తుగా ఓడిపోయింది. సర్వసాధారణంగా స్త్రీకి లోకం అంటే భర్త. ఆలోకాన్ని ఒక ఉత్తేజంలో ధిక్కరించడం జరిగినా, యిది నిజమైనశాంతి కాదనే అపోహతో మనసులోలేని పరాజయాన్ని బాహ్యంగా ఒప్పుకుంది. ఈరెండువిధాలా హానికలిగింది. అప్పుడు తన నిజస్వరూపాన్ని అవతలివారికి ప్రదర్శించి కూడా, మారు వేషంలో తిరిగి సంచరించడానికి వీలులేదు కాబట్టి, 'నిన్ను ఇన్నాళ్లూ క్షమించాను' అని అపని జరిగిపోయాక చెప్పి, వ్యక్తం చేసి, తిరిగి క్షమించటానికి సిద్ధపడటం హాస్యాస్పదం కాబట్టి బ్రతకటానికి వీలులేదు. ఇప్పుడు అంతరంగికంగా తను అనుభవించని ఓటమిని తన హద్దుదాటి కళంకాన్ని ఆపాదించుకున్నానన్న చింతతో బయటకు అంగీకరించటంద్వారా గార్హస్థ్యప్రపంచంలో తన స్థానాన్ని శాశ్వతంగాపోగొట్టుకోవడంచేత, యీదుర్భరఅవమానంతో బ్రతకటానికి వీలులేదు. తాను యిక మనుషులనేవారితో మాట్లాడటం ఉభయులకూ ముప్పు. అందుచేతే కూతురువచ్చి బ్రతిమాలినా, ఏడ్చినా, మొత్తుకున్నా, భర్తవచ్చి "ఏమిటిపార్వతీ యీచాదస్తం? అంటూ సానునయవాక్యాలు పలికినా పెదవి కదపలేదు.

కాని ఆమె ఎంతలేదనుకున్నా మొదటిరాత్రి అనుభవించిన తృప్తి, సౌఖ్యం రెండుమూడురోజులవరకూ పెనుగులాడుతూనే వున్నాయి మానవబలహీనతవల్ల. ఇది బహుశా భగవంతుడనేవాడికి కూడా తెలియని పరమరహస్యం. అందువల్లనే డాక్టర్ మరునాడు ఆశ్చర్యపడటం జరిగింది. కాని అతడి ఆశాభావంచూసి పార్వతమ్మ కృంగిపోయింది.

కాని అందరిముఖాలూ వికసించాయి. తనకి చావురాదు. రాదు. అయ్యో. ఈనాడు ప్రపంచంలో, తాను తిరిగి బ్రతకాలి ఈ నరకయాతనలో.

ఆమె మనస్ఫూర్తిగా మరణానికి ఎదురుచూసింది.

కాని...!

ఒక అత్యద్భుతమైన సంఘటన యిక్కడ సంభవించింది. తనకి చావు రాదు. రాదు. తాను చచ్చిపోక బ్రతుకుతుందన్న దుర్భరమైన బెంగలో మానసికంగా కృంగి కృశించి మూడురోజులు గడిచే టప్పటికి క్రమక్రమంగా మరణాన్ని సమీపించ సాగింది తిరిగి.

చావనన్న భయంతో పార్వతమ్మ చచ్చిపోతోంది.

* * *

డాక్టరు మళ్ళీ సందేహాన్ని వెలిబుచ్చి వెళ్ళిపోయి నప్పటి నుంచీ ఆదిశేషయ్యగారు దిగాలుపడికూర్చున్నారు. ఈ కొద్ది రోజులనుంచీ ఆమె తప్పకుండా జీవిస్తుందన్న నమ్మకంతో తిరిగాడు. ఎన్నోసార్లు ఆమె దగ్గరకుపోయాడు. మాట్లాడించటానికి ఎన్నోవిధాల ప్రయత్నించాడు. మృదువుగా బ్రతిమిలాడాడు. "ఏమిటీ పార్వతీ యీ చాదస్తం" అన్నాడు.

తాను ఆమెను మనస్ఫూర్తిగా క్షమించివేశాడు. ఆమె బ్రతకాలి. తనకోసం బ్రతకాలి.

ఆమె యీనాడు మరణిస్తే తన శేష జీవితమంతా కీకారణ్యంలోని చీకటి. అప్పుడు చచ్చినా బ్రతికినా ఒకటే. ఆ జీవితానికి అర్థంలేదు.

తాను ఆమెయెడల ప్రవర్తించిన హింసా విధానాన్ని ఆమె నోట తెలుసుకున్నా, అందుకు బాధపడినా, ఏదో అవ్యక్త శక్తి ప్రేరణద్వారా ఆమెతో మనసారా కొన్నిమాటలు పలికించటానికి పోయినప్పుడు, ఆమె తనతప్పు తెలుసుకుని క్షమాపణకోరింది. అది తనలో తాత్కాలికమైన విస్మయాన్నీ, గగుర్పాటునూ లేపింది. కాని కొద్ది క్షణాలలో పరిస్థితి మారింది. తన నేత్రాలు ఉజ్వలమైన కాంతితో ప్రకాశించాయి. క్షమించానని చెప్పివేశాడు. ఇప్పుడు యిద్దరిలో సరియైన శాంతి భద్రతలు నెలకొల్ప బడినాయి. తనలోని కాఠిన్యం కరిగిపోయింది.

కాని యిదేమిటి? ఆమె జీవించబోవటల్లేదు ఆ రాత్రి జరిగిన సంఘటనల తర్వాత తాత్కాలికంగా వాటిల్లిన ఆమెఆరోగ్యంలో అభివృద్ధి చూసి యిహ పరవాలేదనుకున్నాడు. కాని తనకు తెలియకుండా ఏదో జరుగుతోంది. అశాంతి దాపురించబోతోంది. ఇహమీదటి తన యీ వృద్ధప్రేమను ఆమెకై గ్రుమ్మరించాలన్న ఆశలన్నీ అడియాస లౌతున్నాయి.

"నాన్నా!" అంది కూతురు. గుమ్మంలోకి వచ్చి నిలబడి ఆదిశేషయ్యగారు తలఎత్తిచూసి "ఆఁ" అన్నాడు.

కూతురు దగ్గరకువచ్చి తండ్రి ముఖంలోకి ధీనావహంగా చూస్తూ

"అమ్మకి...ఏమవుతుంది నాన్నా?" అంది.

"ఏ...మో...తల్లీ"

"అమ్మ ఏదో విషాదంలో మునిగివుంది నాన్నా!" అంది కూతురు కొంచం ఆలోచించి ఆవేదనతో.

"నీకు...ఎలా తెలుసును అమ్మా?"

"నేను ఊహించగలిగాను నాన్నా! ఇక్కడికి వచ్చిన రోజు రాత్రి అర్ధస్వగతంగా ఏవో మాటలు చెప్పింది. నాకెంతో భయం వేసింది. తాను ఏదో పొరపాటు చేశానని గొణిగింది. ఆ పొరపాటు నీకేమైనా తెలుసా నాన్నా?"

ఆయన తడి ఆరిపోతూన్న గొంతుతో "అబ్బే...తెలియదమ్మా."

"అమ్మ నాకు సరిగ్గా చెప్పలేదు. అదే ఒకవేళ చెప్పటం ఏమో. 'అందరి స్త్రీలలానే బ్రతుకు' అని నన్నాశీర్వదించింది. ఆమె ప్రవర్తన యీరీతిగా వుండటం నేనెన్నడూ చూడలేదు. నేను అతిగామాట్లాడుతూంటే క్షమించు. ఏస్త్రీకూడా తానుచేసింది పొరపాటని మనసా, వాచా చెప్పివేశాక యిహ దానిని గురించి మధన పడదనుకుంటాను...నన్నా సంశయం వేధిస్తోంది నాన్నా."

"ఏమిటది? ఏమిటమ్మా అది?"

"అమ్మ తాను జీవించాలని కోరుకోవటల్లేదు. నేనిది బాగా గ్రహించాను. ఆమె వెయ్యికళ్లతో మరణానికి ఎదురుచూస్తోంది."

ఆదిశేషయ్యగారు నిశ్చేష్టితుడయాడు. "తనకు ఏమిటది?" అని జిజ్ఞాస కలిగించిన యిందాకటి మాటలూ, యీ చివరి మాటలూ బాగా మనసులో నాటుకున్నాయి. ఈ విచిత్ర నాటకం విపరీతమైన సంచలనాన్ని కలిగిస్తోంది. ఇంతకీ ఒకరి మనసు ఒకరు అర్థం చేసుకోలేరన్నమాట. డాక్టర్ 'మీకేం భయంలేదమ్మా' అన్నప్పుడు ఆమె కళ్ళలో ప్రతిబింబించే వ్యాకులపాటుతో కూడిన గగుర్పాటుకు అర్థం? ఆయనకు అర్థమయింది. తాను ఏమీ తెలుసుకోలేని మూర్ఖుడా. ఇప్పుడు యీ జ్ఞానదానం చేసింది తనకన్నా ఎన్నో సంవత్సరాలు చిన్నదైన కుమార్తె.

ఆయనకింతలో మెరుపుమెరిసినట్లు ఓ పరిష్కార మార్గం తోచింది. అది అద్భుతమైన యోచన. కాని భయంకరమైనది కూడా–సర్వసాధారణంగా చావుబతుకుల్లో వున్న మనుషులకు తుది ప్రయత్నంగా ఓచిట్కా వంటిది ప్రయోగిస్తారు. అది ఫలిస్తే అమోఘంగా ఫలిస్తుంది. లేదా నాశనం వుండనేవుంది. ఈ తక్షణ మార్పుని గమనించి కూతురు కలవరపాటుతో 'నాన్నా' అంది. ఆయన సమాధాన మివ్వకుండా అక్కడినుంచి నడిచివెళ్లిపోయాడు.

ఆరాత్రి ఒకనాటి మాదిరి భయానకంగావుంది. పార్వతమ్మ పడుకుని వున్నగదిలో బెడ్ లైటు వెల్తురు తప్ప యిల్లంతా చీకటి అలుముకుని వుంది.

"పార్వతీ!" అని పిలిచాడు ఆదిశేషయ్యగారు ముందుకు వంగి.

ఈ కొద్ది రోజులుగా వస్తూన్న జవాబే వచ్చింది.

ఆయన ఒకసారి పెదవులు కొరుక్కున్నాడు. బరువుగా ఊపిరి విడిచాడు.

"నాతో యిప్పుడైనా మాట్లాడవా? నీ కింత మొండిపంతం ఎందుకు? అమ్మాయి బాగా దిగులు పడింది. చిక్కి శల్యమై పోయింది?

ఆమె కనీసం సానుభూతిగా ఆయనవంక చూడనన్నా లేదు.

"పార్వతీ! ఈతుది ఘడియల్లోకూడా యిలాగే వేధిస్తావేం?"

"............"

ఆయన రుద్ధకంఠంతో "నీవు భగవన్నామ స్మరణలోనే కాలం గడిపితే నాకు సంతోషమే. మనయింటిలో వున్న రాముల వారి పటం నువ్వు ఏ రోజయినా పూజించకుండా వూరుకున్నావా? పార్వతీ! ఒకసారి ఆ పటం తెచ్చి నీ కళ్ళముందు వుంచేదా?"

"............"

"నీకు ఎలా అనిపిస్తుంది? నా మాటలు నావిగా గుర్తు పట్టగలుగుతున్నావా పార్వతీ?"

"............"

"డాక్టర్ ఏదో చెప్పాడు. నీకు నిజంగానే మైకం క్రమ్ముతోందా?"

"............"

"పార్వతీ! పార్వతీ! పలకవేం! నీ యింద్రియాలు నీకు స్వాధీనంలో లేవా? అలా చూస్తున్నావేం? ఎవరు కనిపిస్తున్నారు నీకు? అయ్యో...అలా అయిపోతున్నావేం పార్వతీ......డాక్టర్ చెప్పింది నిజమేనా? నువ్వు...నువ్వు...నాకు దక్కవా?"

పార్వతమ్మ తనువు పులకరించింది. ఆనందంతో ఆమె నేత్రాలు విస్ఫారితాలయాయి. తన్మయంగా ఒకసారి భర్తవంక వీక్షించింది. అబ్బ! ఆ బాధ, ఆ దుఃఖం...నిజంగా తను...! నిజంగా తను...!

పార్వతమ్మ కళ్ళు మూసుకుంది.

తాను చచ్చిపోతోంది. చచ్చిపోతోంది. "భగవాన్! నా కోరిక యీడేరుతోంది."

* * *

ఈ లోకంలో ఆదిశేషయ్యగారిలాంటి తెలివైన వాళ్ళు వుంటూ వుంటారు. పాపం పార్వతమ్మ బ్రతికింది. కాని అమ్మ కాదు పార్వతమ్మ తల్లితో ఎందుకు తప్పు చెప్పినట్లు?

# ఆంధ్ర బ్యాంకు లిమిటెడ్

స్థాపితము 1923

(షెడ్యూల్డు బ్యాంకు)

ప్రధానకార్యాలయము—మచిలీపట్టణం.

---

చెల్లింపబడిన మూలధనము

రిజర్వులు (1-2-57 నాటికి) రు. 51,04,260

డిపాజిట్లు డిటో ... రు. 9,35,00,000 మించినవి.

అమలులో నున్న

వ్యాపార మొత్తము ... రు. 11,00,00,000 మించినది.

డైరెక్టర్ల బోర్డు: శ్రీ శ్రీమంతు రాజాయార్లగడ్డ శివరామ ప్రసాద్ బహదూర్, ఎం. ఎల్. ఎ., (ఛైర్మన్), శ్రీ జల్లు మాణిక్యాలరావుగారు (డిప్యూటీ ఛైర్మన్), శ్రీ శాజేపల్లి శ్రీరాములుగారు (మేనేజింగు డైరెక్టరు), శ్రీ పి. రామనాథ బాబుగారు, శ్రీ దంటు భాస్కరరావుగారు, శ్రీ కంచర్ల సుబ్రహ్మణ్యదత్తుగారు, శ్రీ మద్ది సుదర్శనంగారు, శ్రీ కేపాక సత్యనారాయణమూర్తిగారు, శ్రీ బచ్చు వెంకటేశ్వర్లుగారు, శ్రీ మాకేటి శేషగిరిరావుగారు, శ్రీ యస్. రామాచార్ గారు, శ్రీ వాసవాడ వేణుగోపాల్ గారు.

మద్రాసులోని శాఖలు — (1) 6-లింగి చెట్టివీధి, మద్రాసు-1. (2) 77, కచేరి వీధి, మైలాపూరు, మద్రాసు-4. (3) 87 త్యాగరాయరోడ్డు, త్యాగరాయనగర్, మద్రాసు-17.

హైదరాబాదు ఆఫీసు — 5/10-711 సుల్తాన్ బజారు.
సికింద్రాబాదు ఆఫీసు — 1359, జనరల్ బజారు.

ఆంధ్రప్రదేశ్ అంతటా, బళ్లారిలోను, బ్రాంచీలు పబ్ ఆఫీసులు కలవు.

లండన్ ఏజెంట్లు — (1) బార్ క్లేస్ బ్యాంకు లిమిటెడ్, చీఫ్ ఫారిన్ బ్రాంచి, 168 ఫెన్ చర్చి స్ట్రీట్. లండన్ ఇ. సి. 3.
(2) ది ఫస్ట్ నేషనల్ సిటి బ్యాంకు ఆఫ్ న్యూయార్కు, 177 ఓల్డు బ్రాడ్ స్ట్రీట్, లండన్ ఇ. సి. 2.

ఫారిన్ ఎక్స్చేంజిసహా అన్నిరకములైన బ్యాంకింగు వ్యాపారములు చేయబడును.

ఏలేశ్వరపు రామచంద్రమూర్తి,
ఎం.ఏ., సి.ఎ.ఐ.ఐ.బి.,
జనరల్ మేనేజరు.

# ఓరలెక్స్

సర్వవిధములైన దంతరోగములకు
సాటిలేని దివ్యౌషధము.

క్రిములను సంహరించి, రక్తస్రావమును నరికట్టి, అన్ని నొప్పులను శీఘ్రముగ తగ్గించును.

'ఓరలెక్స్':- పళ్లు సలుపులు, వాపులు, కదలుట, రక్తము, చీముకారుట, (పయోరియా) పంటిపురుపులు, ఇగుళ్ల వాపులు, పిప్పిపళ్లు, దుర్వాసన, రసదోషములు, గొంతులోని దోషములు, నోటిపూతలు - మున్నగువానికి అమోఘముగా పనిచేయును.

చర్మవ్యాధులు, తేలుకాటు, చెవిపోటులకు కూడ ఓరలెక్స అత్యద్భుతముగ పనిచేయును.

ఓరలెక్స్ టూత్‌పౌడర్:- శాస్త్రోక్తముగ, నూతన పద్ధతులలో తయారైనది. ప్రతిదినము ప్రతివారు ఉపయోగించవలసినది.

ఓరలిన్ లేబరేటరీస్
కాకినాడ.

# ఆంధ్ర విజ్ఞానము
## (Telugu Encyclopaedia)
ప్రసాదభూపాల విరచితము.

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వైస్ ఛాన్సలర్ పదవి నందియున్న శ్రీ డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి M. A. (Cantab) గారిచే మెచ్చుపడసి, "బాలసూర్యప్రసాదాంధ్ర విజ్ఞాన సంహిత" యని పేరందిన గ్రంథము. శ్రీ వారే దీని పీఠిక (Preface) వ్రాసియున్నారు. ఈ మహాగ్రంథమును వ్రాయుటకే యించుమించు లక్షరూప్యములు వ్యయమైనవి. ఆయాస్థలముల కరగి చూచి పరిశీలించుట కధిక ప్రయాసమయినది. అంగదేశము చేదిదేశము, మగధన్వదేశము మొదలగు వ్యాసములం గాంచిన నిట్టి వ్యయ ప్రయాసములు చదువరులకే తెలిసెడిని.

ఇంటింట నుండవలసిన గ్రంథము

ఏదేని యొక విషయము సంశయము కల్గునతి నెన్నో గ్రంథములు పరిశీలించి ఎందఱనో అడుగవలసియుండెడిని. అట్టిదీ గ్రంథరాజమింట నుండిన నిదియే తెల్పుచుండును. విశ్వవిద్యాలయములందు కళాశాలలందు నేర్పిడి విద్యలిందు బొందుపఱుపబడియున్నవి.

7 సంపుటములు. రు. 68/-

ఆంధ్ర విజ్ఞాన అనుబంధము

| | |
|---|---|
| బర్మాదేశ చరిత్ర రు. 0-8-0 | సాంఖ్యాదర్శనము రు. 1-0-0 |
| సింహళద్వీపచరిత్ర రు. 0-8-0 | ఆంధ్రలోకోక్తిముక్తావళి 1-0-0 |

వలయువారు: భద్రిరాజు వీర్రాజు, మేనేజరు,

ఆంధ్ర విజ్ఞాన కార్యస్థానము, కాకినాడ.

# చిత్రకూటము

శ్రీ కుందూరి ఈశ్వరదత్తు

శ్రీ రామభద్రుడు పితృవాక్యపరిపాలనాసంసిద్ధికొఱకు అయోధ్య వీడి సీతాలక్ష్మణసహితుఁడై గంగాతటమునకు వచ్చి కిరాతరాజగు గుహుని యాతిథ్యమును బొంది, యా రాత్రి యచట విశ్రమించి, మఱునాడు కదలి, ప్రయాగకు వచ్చెను. అచ్చట ప్రయాగతటమున మునివరేణ్యుడగు భరద్వాజుచే నతిథిసత్కారముల బడసి, యొకదినము భరద్వాజాశ్రమమున విశ్రమించి, తరువాత మునిని వీడ్కొని, చిత్రకూటపర్వతమునకు వచ్చి సతీసోదరసమేతుఁడై కొన్నివారము లచ్చట నివసించెను.

ఈ చిత్రకూటపర్వతము వింధ్యప్రదేశమున కుత్తరపాలి పేరను (నేటిమధ్యప్రదేశము) ఉత్తర ప్రదేశమునకు దక్షిణమున, ప్రయాగకు డెబ్బదియైదుమైళ్లు దూరమున నున్నది. ఈ పర్వతము దాదాపు 950 అడుగుల యెత్తున, నాల్గు మైళ్ల చుట్టుకొలత గలిగి, మందాకినీ తీరమున నున్నది. ఈ పుణ్యతీర్థము బెజవాడ - ఇటార్సీ - మాణిక్యపురము-అలహాబాదు సెంట్రల్ రైల్వేమార్గమున, మాణిక్యపురము-ఝాన్సీ రైల్వేశాఖలో(Manickpur-Jhansi Branch Line)కర్వీ (Karvi) రైల్వే స్టేషనుకు నాల్గు మైళ్ల దూరమున నున్నది. చిత్రకూటమును ప్రత్యేక రైల్వేస్టేషనుకూడ కలదు. కాని యాత్రికులు కర్వీ స్టేషనులో దిగి, బస్సులమీద చిత్రకూటమును జేరుదురు. ఈ చిత్రకూటసమీపముననే సీతాపుర మను గ్రామ మున్నది. ఇచ్చట ధర్మశాల లనేకము లున్నవి. శ్రీరామనవమి, దీపావళిపండుగ దినములలో వివిధప్రాంతములనుండి యాత్రికులు వచ్చుచు పోవుచుందురు.

శ్రీ మొసలికంటి తిరుమలరావుగారు వింధ్యప్రదేశమునకు ఉపరాజ్యపాలకులుగా నియమితులైన కొలదిమాసములకు, శ్రీవారు నన్ను వింధ్యప్రదేశ ప్రధాన కార్యాలయములో ఆర్థికశాఖయందు ప్రత్యేకోద్యోగిగ నియమించుట సంభవించెను. నా ఉద్యోగానంతరము, శ్రీవారి పరిపాలనాప్రాంతములో జేరిన నీ పుణ్యస్థలమును జూచుటకు నాకవకాశము లభించెను. ఈ చిత్రకూట చిత్రపటములు గొన్ని వింధ్యప్రదేశ ప్రభుత్వమువారి సౌజన్యముచే లభించి నందున, వాని నీ వ్యాసములో ముద్రించుట కవకాశము లభించెను. ఆ ప్రభుత్వ నేతయగు శ్రీ తిరుమలరావుగారికి నా కృతజ్ఞతాభివందనములు.

## రామాయణములో చిత్రకూటముయొక్క ప్రాముఖ్యము

శ్రీ రామాయణంలో రామభద్రుని చిత్రకూటవాసము పలువిధముల ప్రాముఖ్యతె వహించుచున్నది. రామభద్రుడు చిత్రకూటమునకు జేరిన కొలదిదినములకే దశరథుడు మరణించెను. భరతుడు మాతులునింట నుండి, వసిష్ఠమహర్షి కబురు పంపగ, సోదరుని వనవాసము, తండ్రి నందనవనవాసము నెఱుంగక, నయోధ్యకు శత్రుఘ్నసహితుఁడై వచ్చెను. వచ్చినపిమ్మట తల్లి పంపున సోదరుడు, సీతాలక్ష్మణ సహితుఁడై యరణ్యములపాలగుటయు, తండ్రి దివంగతుఁ డౌటయు విని, తండ్రికి అగ్నిసంస్కారమును జేసి, తన తల్లి తనకు మూటగట్టి యిచ్చిన సాకేతరాజ్యమును తృణప్రాయముగ నెంచి, భ్రాతృవత్సలుఁడై, వెంటనే సీతారామలక్ష్మణులను వెదకుచు బోయి, శ్రీరాముని రాజ్యము శ్రీరామునికే మఱల నొసంగి, యాతని నయోధ్యకు తోడ్కొనివచ్చుటకు కృతనిశ్చయుఁడై, వసిష్ఠాదిగురువర్యులతోను, పరివారముతోను, తల్లులతోను, రాముని త్రోవనే తానును బ్రయాణమయ్యెను.

భరతుడును గుహుని యాతిథ్యమును బొంది, భరద్వాజమహర్షిచే సర్వసత్కారముల నంది, యాతని తపోబలమహత్త్వముచే పరివారసేనాసమేతముగ గొప్ప విందారగించి, చిత్రకూటమును జేరి సీతారామలక్ష్మణులను జేరెను. ఇచ్చటనే రాముడు ప్రప్రథమమున తండ్రి మరణవార్త వినెను. ఇచ్చటనే మందాకినీతీరమున, సోదర, గురు మాతృసమక్షమున రాముడు తండ్రికి పిండప్రదాన మొనర్చెను. ఇచ్చటనే భరతుడు రాజ్యభారము వహింపుమని తన్నెంత ప్రార్థించినను వినక, రాముడు తుట్టతుదకు దనపాదుకల నిచ్చి, తమ్ముని రాజ్యపాలనము చేయుమని యాజ్ఞాపించెను. పితృవాక్యపాలనమే పరమధర్మమని సత్యసంధుడగు రాముడు, తన తమ్ముడు మఱల సాకేతరాజ్యమును వదలివేసి తనకొప్పజెప్ప కృతనిశ్చయుడయ్యును, ధర్మనిరతుఁడై మాట దప్పడాయెను. భ్రాతృసేవానిరతుడు, భ్రాతృవాత్సల్యతత్పరుడు నైన భరతుడు రాజ్యలోభము నెఱుంగక, సాకేతరాజ్యలక్ష్మి తన యంకతలమున నెక్కుటకు సిద్ధముగనున్నను, ఆ రాజ్యలాభమును కన్నెత్తిచూడక, భోగియౌటకు మారుగ త్యాగియు, యోగియూ నౌటకు సిద్ధుడగుట యిచ్చటనే.

## చిత్రకూటము రాఘవకీర్తిస్తంభము

శ్రీరామ లక్ష్మణుల, భరత శత్రుఘ్నుల యన్యోన్య సౌభ్రాతృత్వమునకు నిదర్శన మీ చిత్రకూటము. భరతుడు రామ పాదుకల వహించి, యయోధ్యకు మఱలిన వెంటనే శ్రీరామభద్రుడు సతీసోదరసమేతుఁడై, యిచ్చటనుండియే దండకారణ్యము ప్రవేశించెను. అరణ్యవాసప్రారంభమే రామభద్రుని కష్టముల కారంభము. ఈ చిత్రకూటము దండకారణ్యోత్తరదిక్కవాటము. సీతారామవిహార చిత్రకూటము. కులక్రమాగత రాజ్యలక్ష్మీకరగ్రహణ నిగ్రహ సోదర వాదోపవాద వసిష్ఠాధిష్ఠిత ధర్మకూటము. పితృవాక్య పరిపాలనా

మందాకిని



రామఘట్టము

భద్ర రామభద్ర విసర్జిత భరత హస్తోపేత ప్రాజ్య రాజ్య రమా వనవాటము. సకల గుణభరిత భ్రాతృపాదారవిందసేవానిరత భరత హస్తగత నివృత్తిరాజ్య పుణ్యకూటము. పావన మందాకినీ తటము. ఇక్ష్వాకుకుల సకలబంధుజనకూటము. రామపాదుకాప్రదాన పరమ పావన కృపీటతటము. ఈ చిత్రకూట వనవాసముతో శ్రీరామాయణ కథాభాగమున నొక ఘట్టము ముగియుచున్నది.

## చిత్రకూట వర్ణనము

శ్రీ వాల్మీకి రామాయణము పఠించినవారికి, వాల్మీకి రచించిన చిత్రకూటనగవర్ణన మెంత హృదయానందకరముగా నుండునో ప్రత్యేకముగ వ్రాయ నక్కఱలేదు. అయినను, అయోధ్యాకాండము లోని 92-95-103-113 సర్గలనుండి, చిత్రకూట, మందాకినీనదీవర్ణనముల చదువరుల కిందు సంక్షిప్తముగ క్రోడీకరించుచున్నాను:

## చిత్రకూటము

అథ దాశరథి శ్చిత్రం చిత్రకూట మదర్శయత్ ।
భార్యా మమరసంకాశ శ్శచీమివ పురందరః ॥
న రాజ్యభ్రంశనం భద్రే! న సుహృద్భి ర్వినాభవః ।
మనో మే బాధతే దృష్ట్వా రమణీయ మిమం గిరిమ్ ॥
పశ్యేమ మచలం భద్రే! నానాద్విజగణాయుతమ్ ।
శిఖరైః ఖమివోద్విద్ధై ర్ధాతుమద్భి ర్విరాజితమ్ ॥
కేచి ద్రజతసంకాశాః కేచిత్ క్షతజసన్నిభాః ।
పీతమాంజిష్ఠవర్ణాశ్చ కేచి న్మణివరప్రభాః ॥
నానామృగగణ ద్వీపితరక్ష్వృక్షగణై ర్వృతః ।
అదుష్టై ర్భాత్యయం శైలో బహుపక్షిసమాయుతః ॥
జలప్రపాతై రుద్భేదై ర్నిష్యందైశ్చ క్వచి త్క్వచిత్ ।
స్రవద్భి ర్భాత్యయం శైల స్స్రవన్మద ఇవ ద్విపః ॥
గుహా సమీరణో గంధా న్నానాపుష్పభవా న్వహన్ ।
ఘ్రాణ తర్పణ మభ్యేత్య కం నరం న ప్రహర్షయేత్ ॥
బహుపుష్పఫలే రమ్యే నానాద్విజగణాయుతే ।
విచిత్రశిఖరే హి అస్మి న్రతవా నస్మి భామిని! ॥
భిత్త్వేవ వసుధాం భాతి చిత్రకూట స్సముత్థితః ।
చిత్రకూటస్య కూటోఽసౌ దృశ్యతే సర్వతశ్శుభః ॥

## మందాకిని

అథ శైలా ద్వినిష్క్రమ్య మైథిలీం కోసలేశ్వరః ।
అదర్శయ చ్ఛుభజలాం రమ్యాం మందాకినీం నదీం ॥
అబ్రవీచ్చ వరారోహాం చారుచంద్రనిభాననాం ।
విదేహరాజస్య సుతాం రామో రాజీవలోచనః ॥
విచిత్రపులినాం రమ్యాం హంససారససేవితాం ।
కమలై రుపసంపన్నాం పశ్య మందాకినీం నదీం ॥
నానావిధై స్తీరరుహై ర్వృతాం పుష్పఫలద్రుమైః ।
రాజన్తీం రాజరాజస్య నళినీ మివ సర్వతః ॥

మృగయూథ నిపీతాని కలుషాంభాంసి సాంప్రతమ్ ।
తీర్థాని రమణీయాని రతిం సంజనయన్తి మే ॥
దర్శనం చిత్రకూటస్య మందాకిన్యాశ్చ శోభనే ।
అధికం పురవాసాచ్చ మన్యే చ తవ దర్శనాత్ ॥
సఖీవచ్చ విగాహస్వ సీతే! మందాకినీం నదీమ్ ।
కమలాన్యవమజ్జన్తీ పుష్కరాణి చ భామిని ॥
త్వం పౌరజనవ ద్వ్యాళా నయోధ్యా మివ పర్వతమ్ ।
మన్యస్వ వనితే! నిత్యం సరయూవ దిమాం నదీమ్ ॥
లక్ష్మణ శ్చాపి ధర్మాత్మా మ న్నిదేశే వ్యవస్థితః ।
త్వం చానుకూలా వైదేహి! ప్రీతిం జనయథో మమ ॥
ఉపస్పృశం స్త్రిషవణం మధుమూలఫలాశనః ।
నాయోధ్యాయై న రాజ్యాయ స్పృహయే ద్య త్వయా సహ ॥

## రాముడు మందాకినీతీరమున తండ్రికి పిండప్రదానమొనర్చుట

తాం శ్రుత్వా కరుణాం వాచం పితుర్మరణసంహితామ్ ।
రాఘవో భరతే నోక్తం బభూవ గతచేతనః ॥

.....................................

తత స్తే భ్రాతర స్సర్వే భృశ మాశ్వాస్య రాఘవమ్ ।
అబ్రువన్ జగతీభర్తుః "క్రియతా ముదకం పితుః" ॥

.....................................

సాంత్వయిత్వా తు తాం రామో రుదన్తీం జనకాత్మజాం ।
ఉవాచ లక్ష్మణం తత్ర దుఃఖితో దుఃఖితం వచః ॥
"ఆనయేంగుది పిణ్యాకం చీర మాహర చోత్తరమ్ ॥
జలక్రియార్థం తాతస్య గమిష్యామి మహాత్మనః ॥

.....................................

తతో మందాకినీతీరా త్ప్రత్యుత్తీర్య స రాఘవః
పితు శ్చకార తేజస్వీ నివాపం భ్రాతృభి స్సహ ॥
ఐంగుదం బదరీమిశ్రం పిణ్యాకం దర్భసంస్తరే ।
న్యస్య రామ స్సుదుఃఖార్తో రుద న్వచన మబ్రవీత్ ॥
"ఇదం భుంక్ష్వ మహారాజ! ప్రీతో యదశనా వయమ్ ।
యదన్నః పురుషో భవతి తదన్నా స్తస్య దేవతాః" ॥

## రాముడు భరతునికి పాదుకల నొసంగుట; తల్లుల, సోదరుల వీడ్కోలు

లక్ష్మీ శ్చంద్రా దపేయాద్వా హిమవాన్వా హిమం త్యజేత్ ।
అతీయా త్సాగరో వేలాం న ప్రతిజ్ఞా మహం పితుః ॥
కామాద్వా తాత! లోభాద్వా మాత్రా తుభ్య మిదం కృతమ్ ।
న తన్మనసి కర్తవ్యం వర్తితవ్యం చ మాతృవత్ ॥
ఏవం బ్రువాణం భరతః కౌసల్యాసుత మబ్రవీత్ ।
తేజసాఽదిత్యసంకాశం ప్రతిపచ్చంద్రదర్శనమ్ ॥

"అధిరోహార్య! పాదాభ్యాం పాదుకే హేమభూషితే।
ఏతే హి సర్వలోకస్య యోగక్షేమం విధాస్యతః॥
సోఽధిరుహ్య నరవ్యాఘ్రః పాదుకే హ్యవరుహ్య చ।
ప్రాయచ్ఛత్ సుమహాతేజా భరతాయ మహాత్మనే॥
స పాదుకే సంప్రణమ్య రామం వచన మబ్రవీత్।
"చతుర్దశ హి వర్షాణి జటా చీరధరో హ్యహమ్॥
ఫలమూలాశనో వీర! భవేయం రఘునందన!।
తవాఽఽగమన మాకాంక్షన్ వసన్ వై నగరాద్బహిః॥
తవ పాదుకయో ర్న్యస్త రాజ్యతంత్రః పరంతప!।
చతుర్దశే హి సంపూర్ణే వర్షేఽహని రఘూత్తమ!॥
న ద్రక్ష్యామి యది త్వాం తు ప్రవేక్ష్యామి హుతాశనమ్।"
'తథేతి' చ ప్రతిజ్ఞాయ తం పరిష్వజ్య సాదరమ్॥

.....................................

స పాదుకే తే భరతః ప్రతాపవాన్ స్వలంకృతే సంపరి
పూజ్య ధర్మవిత్।
ప్రదక్షిణం చైవ చకార రాఘవం చకార చైవోత్తమ
నాగమూర్ధని।
అథాఽనుపూర్వ్యాత్ ప్రతినంద్య తం జనం గురూంశ్చ
మంత్రి ప్రకృతీ స్తథానుజౌ
వ్యసర్జయ ద్రాఘవ వంశవర్ధనః స్థిరస్స్వధర్మే హిమ
వానివాచలః॥
తం మాతరో బాష్పగృహీతకంఠ్యో దుఃఖేన నామం
త్రయితుం హి శేకుః।
స త్వేవ మాతౄ రభివాద్య సర్వా రుదన్ కుటీం స్వాం
ప్రవివేశ రామః॥

## చిత్రపటముల వివరణము

### మందాకినీ నది

మందాకినీనది చిత్రకూటమునకు సమీపమునందే ప్రవహించుచున్నది. ఈరమణీయ దృశ్యముల నెంటిని జూచినయెడల వాల్మీకి వర్ణించినవిధ మతిశయోక్తి కానేరదు. వేలకొలది యాత్రికులు పర్వదినముల నిచటకు వచ్చి స్నానముచేసి పోవుచుందురు. చిత్రకూట సమీపమున నీనది దాదాపు మూడుగజముల వెడల్పును, మిక్కిలి లోతునుగలిగి యున్నది.

### రామఘట్టము

ఇచ్చటనే రాముడు తండ్రికి పిండప్రదానము చేసెనని చెప్పుదురు. ఈ తీరమున కుత్తరమున నొక వీథిలో జిన్న కుటీరమున తులసీదాసు కొన్నిమాసములు నివసించి, రామచరితామానస మను గ్రంథమును గొంత రచించెనని యిక్కడివారు చెప్పెదరు. ఈ తీరమున కనతిదూరమునందే శ్రీరాముడు నివసించిన పర్ణశాల యుండెనని, యా పవిత్రస్థలమును జూపించెదరు.

### శ్రీరామ భరత సమాగమస్థలము

ఈ పటములో నున్న చిన్నగుడిలో సీతా రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల పాదచిహ్నములు గలవు. ఈ స్థలము చిత్రకూటపర్వతము నానుకొనియున్నది. పటములో గుడిప్రక్కనున్న కొండయే చిత్రకూటము. ఇచ్చటనే నల్గురు సోదరులు కలిసికొనిరి.

### లక్ష్మణ ప్రహారము

చిత్రకూటపర్వతమునకు సమీపమున నున్న యొక చిన్నగుట్ట. ఇచ్చట లక్ష్మణుడు నివసించి, సీతారాములకు గావలికాచుచుండెనని ప్రజలు చెప్పుదురు.



# గడ్డిపూలు

శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి

పాత్రలు: విశ్వనాథం, గిరిధరరావు, రఘుపతి, ముత్యాలు, రజని,

* * తెర తొలగేసరికి, రంగస్థలమంతా పొగచూరి వున్న లాంతరు వెలుగులో పేలవంగా కన్పిస్తుంటుంది. బ్రతుకులో అంత ఆనందం లేకపోయినా, ఈజీవనయాత్ర నొక కర్తవ్యంగా స్వీకరించే సామాన్యకుటుంబీకుల ఇళ్ళలో, రాత్రిపూట తొమ్మిది దాటింతర్వాత కనుపించే వాతావరణం: గృహస్థుకోసం ఎదురుచూస్తూ కూచున్న రజని: ఆమె ప్రతికదలికనూ తనదిగా వూహించుకుని బాధపడుతున్న ముత్యాలు: ఇద్దరూ అల్లంతదూరంలో వొకరి నొకరు పరికించుకుంటూ నిమిషాలను లెక్కపెడుతున్నారు.

రంగస్థలానికి మధ్యగా ఇంటిలోపలికి ఒక ద్వారం, ఎడమప్రక్కగా వీధిలోనికి మరో ద్వారమూ వున్నాయి. రెండూ కూడా మూయబడే వుంటాయి. గదికి మధ్యగా వున్న చిన్న స్టూలుమీద, రేకులురాలబోతున్న గడ్డిపూల గుత్తి వొకటీ, దానికి కొద్దిదూరంలో రెండు మూడు కుర్చీలూ, ఆ ప్రక్కగా గోడకు నవ్వుతున్నట్లుగావున్న ఆ యింటి యిల్లాలి చిత్ర మొకటీ పొందికగా అమర్చబడివున్నాయి.

తెరతొలగిన తర్వాత కొద్దిక్షణాలు నిశ్శబ్దం. రజని ఏదో మాట్లాడాలని ప్రయత్నిస్తుంది. కానీ మాట్లాడలేదు. ముత్యాలు ఏదో చెప్పబోతున్నట్లుగా లేచి నుంచుంటాడు. కానీ ఏం చెప్పాలో తోచదు. ఇంతలో వాకిలివద్ద ఓ చిన్నశబ్దం. రజని తలుపు తెరవటానికని లేవబోతుంది.

ము : మీరు కూచోండి తల్లీ ! నే వెళ్ళి చూస్తాను (వెళ్లి తలుపు తీస్తాడు)

రజని : (ద్వారందగ్గరకు వెళ్ళబోతూ)వారు, వారేనా ముత్యాలూ! వచ్చారా ?

ము : లేదమ్మా—! లేరు ! రాలేరు !

రజని : లేరూ—(నిస్పృహగా కూలబడిపోతుంది. చీరలో మొహం దాచుకుంటూ, గాద్గదికంగా) రారు ముత్యాలూ-వారు ఇక రారు. నా మొహంచూడరు. ఇంతే ముత్యాలూ! ఈ జీవితం ఇక యింతే !

ము : అదేమిటి తల్లీ- చిన్నపిల్లలా ! ధైర్యం తెచ్చుకోవాలమ్మా ! ఎన్ని కుటుంబాల్లో ఈలా జరగడంలేదు ! కన్నీరు కారుస్తారా ఎక్కడైనా ? పిచ్చిపిల్లలావున్నావు!

రజని : ముత్యాలూ !

ము : ఇల్లాలి కన్నీటిచుక్క ఎక్కడ పడుతుందో అక్కడ లక్ష్మీదేవి వుండదట తల్లీ. లేచి-కళ్ళు తుడుచుకో.

రజని : ముత్యాలూ !

ము : అమ్మాయ్ రజనీ - ఇటువంటి సమయంలోనే ధైర్యం తెచ్చుకోవాలి. మగవారికేం- మహరాజులు. కన్నుపడిన దల్లా కావాలనవచ్చు. దానికి దుఃఖిస్తూ కూచుంటే ఏం ప్రయోజనం చెప్పు ? ఏవిధంగా మళ్ళీ అతగాణ్ని నీ కొంగున ముడివేసుకోవాలో ఆలోచించుకోవాలి. బానిసగా చేసుకోవాలమ్మా మగవాణ్ణి- అంతకన్నా వేరేమార్గం లేదు.

రజని : నీకు తెలీదు ముత్యాలూ-నీకు తెలీదు. ఈ యింట్లో పరిస్థితులు ఎంత అధ్వాన్నంగా వున్నాయో నీకు తెలీదు. నవ్వుతూ ఒకరినొకరం పలుకరించుకుని కొన్నినెలలైంది.

ము : అమ్మాయ్! మనుషులనేవారు ఈ గడ్డిపూలలాంటివారు. గాలిలో తేలినంతకాలం తేలడం ఆతదుపరి అమాయకంగా కన్నుమూయడం. ఇంతేనమ్మా జీవితాలు. ఎవరి సంగతో ఎందుకు నన్నుచూడు...

రజని : నీకేం?

ము : రజనీ-ఒక్కసంగతి చెబుతాను వింటావూ? మానాన్న ఈ యింటివారి సేవలోనే తన తనువు చాలించాడు. మా అమ్మ ఇక్కడ పరిచర్య చేస్తూనే తన శరీరాన్నింతబుగ్గి చేసుకున్నది. ఇక నేనా? ముందున్నది ముసలితనం.

*Distributors for:*


BABY HINDUSTHAN CARS


DODGE CARS


DODGE TRUCKS


"MATCHLESS" & TRIUMPH MOTOR CYCLES


AUTOMOBILE SPARE PARTS


AMCO BATTERIES


ALLWYN STEEL FURNITURE


FOLDELUXE CHAIRS


ROYAL TYPEWRITERS




## 83 YEARS SERVICE TO TRADE & INDUSTRY



**ADDISON & CO. (PRIVATE) LTD.**
MADRAS—BANGALORE.

*Manufacturers of:*





ENGINEERS' CUTTING TOOLS


SPRAYERS

DUSTERS




SPEEDCRAFT STEEL PRODUCTS


FIRE FIGHTING EQUIPMENT


FERROUS & NON-FERROUS CASTINGS


AUTOMOBILE ENGINEERING

బాధలూ, అవమానాలూ తప్ప ఇంకేమీ లేవుకదా! ఇదంతా ఇల్లాగే ఎందుకు జరగాలీ అంటే సమాధానం రాదు. జరగాలి కాబట్టి జరుగుతున్నది. అంతే! ఈ విశ్వనాథం బాలూ, నేనూ చిన్నప్పుడు ఒక బళ్లో ఓనమాలు నేర్చుకున్నాం. దాదాపు ఒకచోట పెరిగాం. శాపనార్థాలూ, చెప్పుదెబ్బలూ అన్నీ సమానం. ఆ తరమలా దాటిపోతున్నది. ఇక రఘుపతి?

రజని : రఘుపతి!

ము : అవును తల్లీ! ఈ చేతులతో ఆ బాబును పెంచాను. ఎన్నో వెన్నెలరాత్రులు ఆ బాబును చంక నెత్తుకుని వెండి గిన్నెలో పాలన్నం తినిపించాను—చందమామతో ఆటలాడుకుంటూ జోలపాటలు పాడాను. కాళ్లాగజ్జా ఆడాను. బడికి తీసుకు వెళ్లాను. బడినుంచి తిరిగి ఎత్తుకు తీసుకువచ్చాను. సాయంకాలం పూట చల్లగాలిలో, అతనిని షికారుకు తీసుకు వెళ్ళి ప్రకృతితో మాటలాడడం నేర్పాను. ఇదంతా ఎవరికోసం?

రజని : ఎవరికోసం?

ము : అదిగో ఆ ఫోటో చూశావా? లక్ష్మీదేవిలా కళకళలాడుతూ దీవెనలు కురిపిస్తున్నదే ఆ తల్లికోసం! ఈ మూన్నాళ్ళ బ్రతుకులో వొక వ్యాపకం కల్పించుకుందామనే ఉద్దేశ్యంలో కాదు రజనీదేవీ, ఈ భారాన్ని వహించింది నేను. సరిగా ఒక్క పుష్కరం అయింది; ఆ జ్యోతి ఇక్కడినుండి అంతరించి. అప్పటినుండి ఆ పాప ఆ చిన్నారిపాప, చిరునవ్వులు చిందిస్తూ మా యింట్లో తిరగడం అలవాటు చేసుకున్నాడు. కానీ...

ర : కాని—కానీ యేమిటి ముత్యాలూ?

ము : మా యింట్లోనూ దీపం ఆరిపోయింది. ఆరిపోతూ, ఆరిపోతూ ఈ బాబుమీది మమతను పోగొట్టుకోలేక, పైకి తీసుకువస్తానని ప్రమాణం చేయించుకుని, మరీ కన్నుమూసింది. అందుకనే బ్రతకాలనే ఇచ్ఛ ఎప్పుడో చచ్చిపోయినా ఈ జీవితాన్నిలా పొడిగిస్తున్నాను.

ర : ఈ కుఱ్ఱవాడి బాధ్యతను విశ్వనాథంగారు తీసుకోలేరా?

ము : మాతృత్వపు బాధ్యతలను అందరు మగవారూ నెత్తిన వేసుకోలేరు రజనీదేవి!

ర : అంటే?

ము : అలా వేసుకునే విశ్వనాథం తన జీవితాన్ని పాడు చేసుకున్నాడు. తండ్రిగా తన ధర్మాన్ని నెఱవేర్చగలిగాడు గాని, మాతృప్రేమను మాత్రం ఆ పిల్లవాడికి అందివ్వలేకపోయాడు.

ర : ఏమిటీ?

ము : ఏ వయసులో బిడ్డలకు తల్లిప్రేమ అవసరం అవుతుందో, ఆ వయసులోనే బిడ్డకు తల్లిలేని కొఱత తీర్చడంకోసమని, ఆయాలను తీసుకువచ్చి ఇంట్లో వుంచాడు.

ర : అయితే?

ము : ఊహించుకోలేవా రజనీదేవీ? భార్యతో తను గడిపిన అనుభవాలను మఱచిపోలేక బాధపడుతున్న సమయం : కుమారుడా చిన్నవాడు : కళ్ళముందు పాలపొంగులాంటి యౌవనంలో ఆయాలు తిరుగుతున్నారు. ఒక్కసారి కాలు జారింతర్వాత కూడదీసుకోవడం చాలా కష్టం.

ర : (నిట్టూర్పు విడుస్తుంది.)

ము : అప్పటినుండి అతని జీవితం చెడిపోయింది, మనదృష్టిలో; అతని దృష్టిలో కాదు సుమా! పాలు పుష్కలంగా దొరుకుతున్నప్పుడు ఆవునెందుకు చెప్పు కొనుక్కోవడం? స్వైరవిహారం : అధోగతి ... అంతేకదుటమ్మా! ఆ తండ్రి దగ్గరే వుంటే కొడుక్కూడా అనేక గుణాలు అబ్బుతాయేమోనని దూరంగా పట్నంలో వుంచి చదివే యేర్పాటు చేయించాను. ఇవాళో, రేపో ఇంటికి తిరిగి వస్తాడు.

ర : బావుంది!

ము : ఇక్కడ విశ్వనాథం కూడా, ఎప్పటికైనా తన జీవితగమనాన్ని గుర్తిస్తాడేమోనని ప్రయత్నంచేశాను. అందుకోసమనే ఎనిమిది సంవత్సరాల క్రితం ?

ర : ఆఁ! ఎనిమిది సంవత్సరాల క్రితం?

ము : పద్మిని అనే అమ్మాయి, పిచ్చిబట్టలు కట్టుకుని, వికిలి నవ్వు నవ్వుతూ వీధుల్లో తిరుగుతుండేది జ్ఞాపకముందా? తెల్లగా మల్లెమొగ్గలాగా వుండే ఆ అమ్మాయి అడవి పూవులా వాడిపోవడం మొదలుపెట్టింది:

ర : అవునవును.

ము : పాపం! నా అన్నవాళ్లు లేరు. పిలిచి నవ్వుతూ పలుకరించిన వారు లేరు. దేవకన్యలా వీధిలో పడిచచ్చిపోతుంటే వెంటబడే వారు తప్ప, ఒక అబల, అదీ అనాథ—ఆమెకు ఇంత ముట్టకెలుదామన్న వారు లేరు; పీల్చి, పిప్పిచేదామన్న వారు తప్ప. అసహాయురాలు—

ర : నాలాంటిదేనన్నమాట!

ము : ఓరోజు సాయంకాలం ఆమెను విశ్వనాథం చూడడం తటస్థించింది.

ర : నాలాగే.

ము : ఏమనుకున్నాడో ఏమో మాట్లాడకుండా ఇంటికి తీసుకు వచ్చాడు. కోరినతిండి పెట్టాడు. అడిగినబట్ట యిచ్చాడు.

ర : నన్ను...నన్ను కూడా అలాగే ఆదరించారు వారు!

ము : పద్మిని, నిజంగా పద్మినీదేవిలాగా తయారైంది. ఆమెను చూడడంకోసమని, విశ్వనాథంతో స్నేహం చేసుకున్నారు అనేకమంది. వెధవలు! అందులో ఆ గిరిధరరావొకడు. దగుల్బాజీ!

ర : గిరిధరమా?

ము : ఆఁ! పగటిపూట లక్ష్మీదేవితోనూ, రాత్రిపూట పద్మినీదేవితోనూ ప్రణయం మొదలుపెట్టాడు.

ర : ఆఁ!

ము : ఈ విషయాలన్నీ నీముందు చెప్పదగినవి కాకపోయినా, గతాన్ని తల్చుకుంటున్నప్పుడు వచ్చే ఆవేశాన్ని ఆపలేక పోతున్నానమ్మా! అంతే. అంతకన్నా ఏమీ లేదు.

ర : పరవాలేదు చెప్పు ముత్యాలూ, ఇవన్నీ తెలుసుకోడం నాకే మంచిది.

ము : కాదులేమ్మా. ఇప్పుడుకాదులే—తర్వాత చెబుతాను.

ర : చెప్పు ముత్యాలూ!

ము : అంతేనమ్మా. అంతే. అంతకన్నా ఇంకేమీ లేదు.

రజని : ఎందుకు ముత్యాలూ ఈ నటన ? జీవితం అంటే అంతో యింతో తెలుసుకుని, వానకూ, వరదకూ తట్టుకుని, ఒక ఒడ్డుకు వచ్చినవాడివి నువ్వు. దెబ్బలు తిని, తిని, ఆశ నిరాశలమధ్య పడుతూ లేస్తూ, ఈ ఆశ్రయానికి చేరుకున్న దాన్ని నేను. నా ముందుకూడా నీకు దాపరికాలేనా ? బావుంది ముత్యాలూ—చాలా బావుంది!

ము : దాపరికం కాదమ్మా. ఆ తర్వాత తెలుసుకోవలసింది ఏమీ లేదు కనుక.

ర : ఏమీ లేదా ?

ము : ఏముందమ్మా? ఏ యిల్లు తనకు నీడ కల్పించిందో, ఆ యింటి వాసాల్నే లెక్కపెట్టి, ఆ యింటి గడప దాటి, ఆ గిరిధరంతోటి మరో లోకాన్ని వెతుక్కుంటానని వెళ్ళి పోయింది పద్మిని.

ర : చాలా తెలివితక్కువపని చేసింది.

ము : నిజంగా నువ్వూ అలాగే అనుకుంటున్నావా?

ర : ఆఁ! పద్మిని చాలా పాడుపని చేసింది.

ము : పొరపాటుపడ్డానమ్మా! ఆడవాళ్లు చేయగలిగింది అదొక్కటే. ఆనందాన్ని కొనుక్కోడానికి ప్రయత్నించడం. అంత సాహసానికి ఏనాడు పూనుకోలేదో, ఆనాటినుండి ఆయింట్లో నరకం ప్రారంభమౌతుంది.

ర : చాలా తప్పుడు అభిప్రాయంలో వున్నావు ముత్యాలూ!

ము : నేనా ?

ర : నన్ను గురించి ఏమాత్రం తెలుసుకొనివున్నా నువ్వీమాట అనివుండవు.

ము : పిచ్చిదానా! నిన్ను గురించి నీకన్నా నాకే బాగా తెలుసు.

ర : (ఆవేశంతో) కాదు.

ము : సాఫీగా సాగిపోతున్న జీవితంలో సంతృప్తిపడలేక, ఏవేవో వూహించుకుని ఎవరితోనో కలిసి, స్వేచ్ఛా వాయువులను పీలుద్దామని, ఈ విశాలవిశ్వంలోకి వచ్చేశావు. అంతేనా? కానీ నీ జీవితం తెగిన గాలిపటంలాగా తయారైంది. దారం పట్టుకున్న అతను కొత్త చల్లగా ప్రక్కకు తప్పుకున్నాడు.

ర : (ఈ మాటలు అంటున్నప్పుడు ఆమె తలఎత్తుకోలేక, కన్నీరు కారుస్తూ ఓచోట కూచుండిపోతుంది. చివరిమాట విన్న తరువాత, కొద్దిగా కంపిస్తున్న స్వరంతో) అతనెవరో తెలుసా?

ము : తెలుసుకోవలసిన అవసరం లేదు. సంవత్సరంక్రితంవరకూ నీ జీవితానికి కొక భద్రత లేకపోయింది. అన్నాహారాలకోసం అలమటిస్తూ ఎంతనీచానికైనా సిద్ధపడ్డావు. ఆపరిస్థితుల్లోనే విశ్వనాథం నిన్ను చూచి ఇక్కడికి తీసుకువచ్చాడు.

ర : కాదు, దేవుళ్ళు కాపాడారు.

ము : కాదు, ఇద్దరు పిచ్చివాళ్లు కలుసుకున్నారు.

ర : ఏమిటీ ?

ము : చూస్తూచూస్తూవున్న పద్మిని నవ్వుతూ తన రొదుటనుంచి తప్పుకోవడం—ఎక్కడ చూచినా చీకటి తప్ప వెలుగు కనిపించకపోవడం—అతినేంచేస్తున్నాడో అతనికే తెలియని పరిస్థితమ్మా అది. తత్కారణంగానే నువ్విక్కడకు ఆహ్వానించబడ్డావు. అది జ్ఞాపకముంచుకో.

ర : కానీ యిప్పటి పరిస్థితి?

ము : అవునమ్మా కన్ను తెలియని స్థితిలో నిన్ను స్వీకరించగలిగాడు. పరిస్థితుల నవలోకించిన తర్వాత, నీలోని లోటుపాట్లు తెలిసివచ్చిన తర్వాత, నీదగ్గరకు చేరలేక పోతున్నాడు.

ర : అవును ముత్యాలూ! నిజంగా—అంతే!

ము : ఎత్తుపల్లాలు సరిదిద్దుకోవడానికి ఒక్కటేనమ్మా నువు చేయగలిగింది. అతని మనసును ఆకట్టుకల ఆకర్షణను పెంపొందించుకోవాలి !

రజని : ఎల్లా ముత్యాలూ?

ము : ఎల్లా అంటే నేనేంచెప్పేదమ్మా! ముసలివాణ్ణి—అందులోనూ మగవాణ్ణి!

రజని : ముత్యాలూ!

ము : ఏమిటి తల్లీ?

రజని : ఒక్కసాయం చేయగలవా?

ము : నీ జీవితం బాగుపడుతుందంటే అంతకన్నా చేయగలిగిందేముందమ్మా!

రజని : వెళ్లి వారిని ఒక్కసారి పిల్చుకురాలేవా?

ము : వెళ్ళడానికి అభ్యంతరం లేదు. కానీ ఎక్కడ వుంటారని?

రజని : నీకు తెలీకుండా వుంటుందా ముత్యాలూ?

ము : నాకు మాత్రం ఏం తెలుసునమ్మా? వారంరోజులక్రిందటి వరకూ పద్మిని యింట్లో వున్నారు.

రజని . పద్మిని దగ్గరా?

ము : అవునమ్మా, గిరిధరరావు ఆమెను వదిలిపెట్టేశాడు. ఒకనాడు నాలుగ్గోడలమధ్యా బంధింపబడివున్నందువలన

అపరంజిబొమ్మగా కనబడ్డ పద్మిని, ఈనాడు ఈ వూరి వారందరికీ వొక చెత్తకాయితాల బుట్ట.

రజని : (బాధగా) ముత్యాలూ!

ము : ఇందులో ఎవరిదీ తప్పులేదమ్మా. కొండికి దూరంగా వున్నంతకాలం ఏ లేలుపిల్లా మనను కుట్టలేదు.

రజని : వెళ్లిరా ముత్యాలూ!

ము : ఎక్కడికని వెళ్ళనమ్మా?

రజని : (నొసటి కుంకుమ తీసి అతని చేతిలో పెట్టి) ఇదిగో ముత్యాలూ! నా జీవితం నీ చేతిలో పెడుతున్నాను. నీకే కూతురువుండి, ఈలాగే ఆమె బాధపడుతుంటే చూస్తూ వూరుకుంటేవాడివేనా ముత్యాలూ?

ము : (చలించిపోయి, ప్రేమగా) పిచ్చితల్లీ! నాకు కూతురు లేదు. కానీ వుండివుంటేమాత్రం నీలాగే వుండేది.

(ముత్యాలు వెళ్లిపోతాడు. రజని అతను వెళ్ళినవేపే చూస్తూ ద్వారందాకా వెళ్ళి, మళ్ళీ ఏం తోచక తిరిగివచ్చి కుర్చీలో కూచుంటుంది. తలవొంచుకుని ఏదో ఆలోచించుకొంటుంటుంది. ఇంతలో రఘుపతి ప్రవేశం. చేతిలో ఓ సూట్ కేసు. స్ఫూర్తిగల విగ్రహమే! అతనిని చూసి ఆమె ఒక్కసారిగా లేచి.)

రజని : ఎవరండీ మీరు?

రఘు : ఇదీ, ఇది విశ్వనాథంగారిల్లే కదండీ?

రజని : అవునండి...మీరు...

రఘు : విశ్వనాథంగారు మా నాన్నగారండి. (రజని ఉలిక్కిపడుతుంది) ఆఁ!...ఏమిటండి?

రజని : ఏమీ లేదు బాబూ! మిమ్మల్ని ఇదేకదూ ప్రథమంగా చూడడం. సంతోషంతో గుర్తుపాటు కలిగింది. ఉండండి బాబూ ఇప్పుడే వస్తాను.

రఘు : అబ్బే! మా నాన్నగారిని విశ్రాంతి తీసుకోనీయండి. పగల్లా వొకటేపని. ఈ వయసులో కూడా నాకోసమని అహోరాత్రాలు శ్రమపడుతున్నారు. నా చదువు ఎప్పుడు పూర్తవుతుందా అని వెయ్యికళ్ళతో ఎదురుచూస్తున్నారు. మా కుటుంబానికి ఎప్పటికి మళ్ళీ మంచిరోజులు వస్తాయో గాని—

రజని : (నోరుజారి) అవును బాబూ తప్పకుండా మన కుటుంబానికి మంచిరోజులు వస్తాయి.

రఘు : మన కుటుంబమా! క్షమించాలి. మిమ్మల్నింతకుముందు ఎక్కడా చూసినట్లు జ్ఞాపకంలేదు. మా నాన్నగారికైనా దూరపుబంధువులేమో!

రజని : కాదు బాబూ!

రఘు : మరి రెవరండీ మీరు?

రజని : ఈ యింటి నీడలో బ్రతుకుతున్నదాన్ని. మీ...సేవకురాలిని.

రఘు : అలాగా!

రజని : ఉండు బాబూ! ఇప్పటికే చాలా ఆలస్యమైంది. స్నానానికేర్పాటుచేసి నిముషంలో వస్తాను. భోజనానికి కూడా ప్రొద్దుపోయింది. (వెళ్లబోతుంది)

రఘు : ఏముంత ఆలస్యం లెద్దూ! సంవత్సరం దాటింది మా నాన్నగారిని చూసి నేను. ఎల్లా వున్నారో? తగిన పోషణలేక అప్పటికే చిక్కిశల్యమై వున్నారు. మీరు వచ్చిం తర్వాతనైనా కాస్త జాగ్రత్తగా కనిపెట్టి చూస్తున్నారా? పెద్దతనానికి తోడు ముక్కోపం కూడా వారికి.

రజని : అంతా సవ్యంగానే సాగిపోతున్నదిలే బాబూ! ఆందోళనపడకు.

రఘు : ఏవమ్మా! ఒక్కసారి గదిదగ్గరకు వెళ్లి నుంచుని, చూసి, తిరిగి వచ్చేస్తాను. నన్ను నేను తృప్తిపఱుచుకున్నట్లూ వుంటుంది. మా నాన్నగారికి నిద్రాభంగం కాకుండానూ వుంటుంది. (వెళ్లబోతాడు)

రజనీ : బాబూ!

రఘు : ఏవమ్మా?

రజనీ : మీ నాన్నగారింట్లో లేరు.

రఘు : ఎక్కడికి వెళ్లారమ్మా? ఇంత రాత్రిపూటకూడా పని చేయాలా? ఏమిటో వారికీ తాపత్రయం? పెద్దతనంలో కృష్ణా, రామా అంటూ కూర్చోవలసినతరుణంలో ఎందుకు నాన్నగారికీ కష్టాలు? ఎన్నో ఉత్తరాలు వ్రాశాను. "రా నాన్నా! అందరం కలిసి ఒకే చోట వుందామూ" అని. రారు. వారికీ కొంప వదిలిపెట్టరు. ఉన్న వూరునూ వదిలిపెట్టలేరు. అంతా వొచాదస్తం!

రజని : నిజమే బాబూ!

రఘు : ఏమిటి?

రజని : నీవంటివాడిచేత, మహారాజులాగా సేవలు చేయించుకోక, వంటరిగా ఇక్కడ బ్రతకాలనుకోవడం ఏమిటి చెప్పు? అంతా ప్రారబ్ధంగాని!

రఘు : నిజమే నమ్మా. ప్రారబ్ధమే! కాకపోతే ఏమిటి—కాలు మీద కాలువేసుకుని సుఖపడవలసినతరుణంలో కష్టపడవలసిరావడం...ఎందుకొచ్చినబాధ లివన్నీ?

రజని : నేనూ ఇదే మాట చెప్పాను.

రఘు : వినలేదుకదూ?

రజని : ఊ...హూ...!

రఘు : వినరమ్మా. ఆయనకు మొదటినుంచీ ఇదే మంకుపట్టు.

రజని : నిజమే! మళ్ళీ కబుర్లలో కాలాన్ని మఱపిస్తున్నావే బాబూ. ఉండు, ఇప్పుడే వస్తాను.

[ఆమె లోపలకు వెళ్ళిపోతుంది. బయటనుంచి గిరిధరరావు ప్రవేశం. స్ఫురద్రూపి. వాలుగు దశాబ్దాలు చూచినవాడు]

అపరంజిబొమ్మగా కనబడ్డ పద్మిని, ఈనాడు ఈ వూరి వారందరికీ వొక చెత్తకాయితాల బుట్ట.

రజని : (బాధగా) ముత్యాలూ!

ము : ఇందులో ఎవరిదీ తప్పులేదమ్మా. కొండకి దూరంగా వున్నంతకాలం ఏ లేటుపిల్లా మనసు కట్టలేదు.

రజని : వెళ్లిరా ముత్యాలూ!

ము : ఎక్కడకని వెళ్ళనమ్మా?

రజని : (నోసటి కుంకుమ తీసి అతని చేతిలో పెట్టి) ఇదిగో ముత్యాలూ! నా జీవితం నీ చేతిలో పెడుతున్నాను. నీకే కూతురువుండి, ఈలాగే ఆమె బాధపడుతుంటే చూస్తూ వూరుకుండేవాడివేనా ముత్యాలూ?

ము : (చలించిపోయి, ప్రేమగా) వెఱ్ఱితల్లీ! నాకు కూతురు లేదు. కానీ వుండివుంటేమాత్రం నీలాగే వుండేది.

(ముత్యాలు వెళ్లిపోతాడు. రజని అతను వెళ్ళినవేపే చూస్తూ ద్వారందాకా వెళ్ళి, మళ్ళీ ఏం తోచక తిరిగివచ్చి కుర్చీలో కూచుంటుంది. తలవొంచుకుని ఏదో ఆలోచించుకొం టుంటుంది. ఇంతలో రఘుపతి ప్రవేశం. చేతిలో ఓ సూట్ కేసు. స్ఫూర్తిగల విగ్రహమే! అతనిని చూసి ఆమె ఒక్కసారిగా లేచి.)

రజని : ఎవరండీ మీరు?

రఘు : ఇదీ, ఇది విశ్వనాథంగారిల్లే కదండీ?

రజని : అవునండి...మీరు...

రఘు : విశ్వనాథంగారు మా నాన్నగారండి. (రజని ఉలిక్కిపడుతుంది) ఆఁ!...ఏమిటండి?

రజని : ఏమీ లేదు బాబూ! మిమ్మల్ని ఇదేకదూ ప్రథమంగా చూడడం. సంతోషంతో గుర్పాటు కలిగింది. ఉండండి బాబూ ఇప్పుడే వస్తాను.

రఘు : అబ్బే! మా నాన్నగారిని విశ్రాంతి తీసుకోనీయండి. పగల్లా వొకటేపని. ఈ వయసులో కూడా నాకోసమని అహోరాత్రాలు శ్రమపడుతున్నారు. నా చదువు ఎప్పుడు పూర్తవుతుందా అని వెయ్యికళ్ళతో ఎదురుచూస్తున్నారు. మా కుటుంబానికి ఎప్పటికి మళ్ళీ మంచిరోజులు వస్తయ్యోగాని—

రజని : (నోరుజారి) అవును బాబూ తప్పకుండా మన కుటుంబానికి మంచిరోజులు వస్తాయి.

రఘు : మన కుటుంబమా! క్షమించాలి. మిమ్మల్నింతకుముందు ఎక్కడా చూసినట్లు జ్ఞాపకంలేదు. మా నాన్నగారికే మైనా దూరపుబంధువులేమో!

రజని : కాదు బాబూ!

రఘు : మరి రెవరండీ మీరు?

రజని : ఈ యింటి నీడలో బ్రతుకుతున్నదాన్ని. మీ...సేవకురాలిని.

రఘు : అలాగా!

రజని : ఉండు బాబూ! ఇప్పటికే చాలా ఆలస్యమైంది. స్నానానికేర్పాటుచేసి నిముషంలో వస్తాను. భోజనానికి కూడా ప్రొద్దుపోయింది. (వెళ్లిపోతుంది)

రఘు : ఏమంత ఆలస్యం లెద్దూ! సంవత్సరం దాటింది మానాన్నగారిని చూసి నేను. ఎల్లా వున్నారో? తగిన పోషణలేక అప్పటికే చిక్కిశల్యమై వున్నారు. మీరు వచ్చింతర్వాతనైనా కొంత జాగ్రత్తగా కనిపెట్టి చూస్తున్నారా? పెద్దతనానికి తోడు ముక్కోపం కూడా వారికి.

రజని : అంతా సవ్యంగానే సాగిపోతున్నదిలే బాబూ! ఆందోళనపడకు.

రఘు : ఏవమ్మా! ఒక్కసారి గడపదగ్గరకు వెళ్లి నుంచుని, చూసి, తిరిగి వచ్చేస్తాను. నన్ను నేను తృప్తిపఱుచుకున్నట్లూ వుంటుంది. మా నాన్నగారికి నిద్రాభంగం కాకుండానూ వుంటుంది. (వెళ్లిపోతాడు)

రజనీ : బాబూ!

రఘు : ఏవమ్మా?

రజనీ : మీ నాన్నగారింట్లో లేరు.

రఘు : ఎక్కడికి వెళ్లారమ్మా? ఇంత రాత్రిపూటకూడా పని చేయాలా? ఏమిటో వారికీ తాపత్రయం! పెద్దతనంలో కృష్ణా, రామా అంటూ కూర్చోవలసినతరుణంలో ఎందుకు నాన్నగారికీ కష్టాలు? ఎన్నో ఉత్తరాలు వ్రాశాను. "రా నాన్నా! అందరం కలిసి ఒకే చోట వుందామూ" అని. రారు. నా కీ కొంప వదిలిపెట్టరు. ఉన్న వూరునూ వదిలిపెట్టలేరు. అంతా వోచాదస్తం!

రజని : నిజమే బాబూ!

రఘు : ఏమిటి?

రజని : నీవంటివాడ్నిచేత, మహారాజులాగా సేవలు చేయించుకోక, వంటరిగా ఇక్కడ బ్రతకాలనుకోవడం ఏమిటి చెప్పు? అంతా ప్రారబ్ధంగాని!

రఘు : నిజమే నమ్మా. ప్రారబ్ధమే! కాకపోతే ఏమిటి—కాలు మీద కాలువేసుకుని సుఖపడవలసినతరుణంలో కష్టపడవలసిరావడం...ఎందుకొచ్చినబాధ లివన్నీ?

రజని : నేనూ ఇదే మాట చెప్పాను.

రఘు : వినలేదుకదూ?

రజని : ఊ...హూ...!

రఘు : వినరమ్మా. ఆయనకు మొదటినుంచీ ఇదే మంకుపట్టు.

రజని : నిజమే! మళ్ళీ కబుర్లలో కాలాన్ని మఱపిస్తున్నావు బాబూ. ఉండు, ఇప్పుడే వస్తాను.

[ఆమె లోపలకు వెళ్ళిపోతుంది. బయటనుంచి గిరిధరరావు ప్రవేశం. స్ఫురద్రూపి. నాలుగు దశాబ్దాలు చూచినవాడు]

గిరి : ఏమిటోయి రఘుపతీ! ఎప్పుడురాక? కాలేజిలో అందరూ కులాసాయేనా? అమ్మాయి లేమంటున్నారు? అబ్బాయి లేమీ గొడవచేయడంలా? జవాబు చెప్పవోయ్... నీళ్ళు నములకుండా.

రఘు : సంవత్సరమైనా ఎదుగూ బొదుగూ లేకుండా పొదుగ చెట్టులా అలాగే వున్నారే! ఆ నవ్వూ...ఆ విట్టూ... ఏమీ మారలేదు.

గిరిధర : అవునోయ్! గ్యారంటీలేని జీవితం మనది. భీమాచేయించుకున్నా బాగుపడేది మన పెళ్ళాంబిడ్డలుగాని మనంకాదు గదా! అందుకనే బ్రతికే మూడురోజులూ నవ్వుతూ బ్రతుకుదాం.

రఘు : అవునవును. ఏడవలేక నవ్వాడంటారు చూశారూ ఆ విధంగా.

గిరి : నాన్సెన్స్. ఏడవలేక నవ్వడమేమిటి? నవ్వలేక ఏడవాలి గాని. మన ఫిలాసఫీ అంతా రెండేరెండు వాక్యాలు. ఒకరికోసం నువ్వు ఏడవబోకు. నీకోసం ఒకరు ఏడవరు- బిల్-సుష్టుగా తిని, కమ్మగా నిద్రపోయి, కలలో అపురూపసుందరి నొకదాన్ని పెళ్ళిచేసేసుకుని, అంతా మర్చిపో. మర్నాడు మళ్ళీ సంఘంలో నువ్వూ నొకడవై. పెద్ద మనిషిగా చెలామణీ కావచ్చు.

రఘు : బావుంది!

గిరి : అవును రఘూ! ప్రపంచమంతా ఒక నందనవనంగా కనిపిస్తున్నది కాబట్టి ఇప్పుడు నీకు నా యీ వేదాంతం నచ్చక పోవచ్చు. కానీ ఒకటి గుర్తుంచుకో. జీవితం నిన్నో వెధవను చేసి ముక్కుకు తాడోసి ఆడిస్తే అప్పుడు మళ్ళీ అందరికీ నువ్వే ఈ ఫిలాసఫీ బోధించడం ప్రారంభిస్తావు.

రఘు : నందో రాజా భవిష్యతి.

గిరి : నేనూ నీ వయసులో అలాగే అనుకున్నాను పంతులూ. ఒకమ్మాయిని కాదు. ఇద్దరమ్మాయిలను ప్రేమించాను. మిడిల్ స్కూల్లో ఒకమ్మాయినీ, కాలేజీలో మరో అమ్మాయినీ. కానీ చివఱకు ఏం జరిగిందో తెలుసా?

రఘు : తెలీదు.

గిరి : మిడిల్ స్కూల్లో అమ్మాయి పేరు జలజ. అప్పటికే మంచి జాజాగ్గా ఉండేదిలే. క్రీంకలరు వోణీ కావాలంటే దొంగతనం చేసి డబ్బు పట్టుకుపోయి ఇచ్చాను వోసారి. మానాన్న గారి చేతులో తర్వాత జరిగిన ప్రహసనం సంగతి చెప్ప నక్కరలేదనుకో. ప్రతిరోజూ బటానీల దగ్గరనుంచీ కాఫీ వరకూ అందించాను. చివఱకు ఏంచేసిందనుకున్నావు? ఒక రోజు ప్రొద్దుటిపూట బజార్లో పోతుంటే పిల్చి "గిరీ! గిరీ! నేను మా మామయ్యను పెళ్ళిచేసుకోబోతున్నాన్రా!" అని చెప్పి ఇంట్లోకి గువ్వపిటలా దూసుకుపోయింది. అప్పుడు నీలాంటి వాళ్ళయితే ఏంచేస్తారు? పేలవంగా ఒక్క చిరు నవ్వు నవ్వి వెళ్ళిపోయేవాళ్లు. కానీ నేను మాత్రం బావురు మని ఏడ్చేశాను. అదే మొదటిసారి ఏడవడం.

రఘు : రెండోసారి?

గిరి : కాలేజీలో వుండగా తక్కుతూ, తారుతూ లేడీస్టూరులా మేకప్ చేసుకుని వచ్చేదిలే ఒకమ్మాయి. జలజ, వనజ, గిరిజ పేరదైతే యేంలే? ఆ అమ్మాయిని చూసీచూడగానే అమాంతం ప్రేమలోపడ్డాను. అంతే. లిప్‌స్టిక్ దగ్గరనుంచీ, వెంగుటూరుచీరదాకా అన్నీ బట్వాడా వాళ్ళింటికి. ఆ తర్వాత ఓ సాయంకాలం మంచిముహూర్తం చూసుకుని వాళ్ళ నాన్నగారిదగ్గరికే వెళ్లాను. కుర్చీ చూపించి కూచోమన్నాడు. కాలరు సర్దుకుని కూచున్నాను. మా నాన్నగారి పేరడిగాడు. కీవిగా చెప్పాను. కులగోత్రాలడిగాడు. జ్ఞాపకం లేవన్నాను. ఆస్తిపాస్తు లడిగాడు. ఆయన నోట్లోంచి మాటరాకముందే బనాయించి చెప్పేశాను. సంతృప్తిపడ్డట్టుగా కళ్ళెగరేశా డాయన. నా మీద ఎవరో అమృతం చిలికినట్లుగా అయింది. చివరి కాయన కుర్చీలోనుండి లేచి నుంచుని, ఒక్కసారి దగ్గి గంభీరంగా ఇలా అన్నాడు. "అబ్బాయ్! నాకే అభ్యంతరమూ లేదోయ్." "థ్యాంక్యూ సార్!" అనబోతున్నాను. ఇంతలోకే మళ్ళీ ఆయనే అందుకుని "కానీ ఒక్క షరతు. నువ్వు ఐ. సి. యస్. ప్యాస్ కావాలి" అన్నాడు. గొర్రెలాగా తలకాయ వూపి మాట్లాడకుండా బయటకు వచ్చాను. కానీ ఎల్లా ప్యాసుకావడం? సెలక్షను బోర్డులో మన బంధువులుగూడా ఎవరూ లేరే! ఇక డైరెక్టు అప్రోచ్ ఇద్దామనుకున్నాను. ఆ అమ్మాయిదగ్గరికే వెళ్లాను. నన్ను మైలుదూరంలో చూడగానే ఛళ్లున తలు పేసుకుంది. అప్పుడు అప్పుడు, ఏడ్చాను రఘూ నిజంగా రెండవసారి.

రఘు : ఆ తర్వాత అటువంటి అవసరమేమీ రాలేదా?

గిరి : అనేకసార్లు. కానీ దిగమింగుకున్నాను. ఏడవవలసి వచ్చినపుడల్లా బిగ్గరగా నవ్వేవాణ్ణి. అందరూ కొంతకాలం పిచ్చివాడన్నారు. తరవాత మదపిచ్చి అన్నారు. ఆ తర్వాత ధనగర్వ మన్నారు. అప్పటికీ నేను వాళ్ళకు లొంగలేదు. అంతే ఆ తర్వాత నా కాళ్ళకు సలాములు ప్రారంభించారు.

రఘుపతి : చాలా బావుంది.

గిరి : ఇంతే రఘూ! మనమంతా ఎదుగూ బొదుగూ లేని వాళ్ళమే. గడ్డిపోచ నయం మనకన్నా. పుటుక, చావు ఈ రెండే మన జీవితంలోకల్లా ప్రధానమైన సంఘటనలు. పుట్టినపుడు కొందరిని నవ్విస్తాం. చచ్చినపుడు కొందరి గుండెల్లో మంటలు పెడతాం.

రఘు : అందుకని జీవితాన్ని పాడుచేసుకోవాలా?

గిరి : పాడుచేసుకోవడం కాదోయ్. అనందించడం. చూడు కామినీ కాంచనాలు ఈ రెండే మనకు ప్రపంచంలో కావలసింది. కామినిమూలంగా కాంచనాన్ని పొంద

వచ్చు. కొందరంటుంటే కామిని రానంతట అదే నడిచి వస్తుంది.

రఘు : అన్యాయం.

గిరి : నీకు తెలీదు. నా కళ్ళముందు సినిమాబొమ్మల్లా అలా ఎంతమంది వెళ్ళిపోయారో నీకు తెలీదు. పార్వతి... రజని...పద్మిని...కొన్ని పేర్లు నీకు పరిచయం. కొన్ని కాదు. మీ నాన్నగారు మాత్రం...

రఘు : మా నాన్నగారా ?

గిరి : మల్లెపూలచేరంలాగానే ఆడవాళ్ళనుకూడా కొనుక్కుంటున్నారు.

రఘు : అబద్ధం !

గిరి : అబద్ధం చెప్పవలసిన అవసరం నాకు లేదు.

[ఇంతలో లోపలినుండి రజని ప్రవేశిస్తుంది. గదిలో గిరిధరాన్నీ, అతని వర్తనాన్నీ చూసి భయపడి ఓ అడుగు వెనక్కు సర్దుకుని]

రజ : రండి బాబూ ! నీళ్ళు కాగినవి.

రఘు : (ఉధృతంగా) ఏవమ్మా - గిరిధరంగారు చెప్తున్నది నిజమేనా ! .

రజ : స్నానం చేసింతర్వాత అంతా మీకు మనవిచేస్తాను. రండి బాబూ !

రఘు : చెప్పవమ్మా !

రజ : నా మాట వినండి బాబుగారూ. (అతన్ని బలవంతంగా తీసుకువెడుతుంది)

రఘు : (వెడుతూ) గిరిధరంగారూ ! వెళ్ళకండి ; వెళ్ళకండి. ఇప్పుడే వస్తాను.

[వాళ్లిద్దరూ వెళ్ళిపోతారు. రజని కొద్దిగా వెనకబడింది. రఘుపతికి వినిపించకుండా మెల్లిగా 'రాజా' అని గిరిధరం, రజనిని పిలుస్తాడు. ఆమె ఒక్కసారి వెనక్కుతిరిగి చూసి మౌనంగా వెళ్ళిపోతుంది. గదిలో గిరిధరం ఒక్కడే మిగిలిపోతాడు. కుర్చీలో కూచుని గోల్డ్ ఫ్లేక్ ముట్టించుకుని ఏదో ఆలోచించుకొంటూండగా రజని తిరిగి ప్రవేశిస్తుంది. ఆమెను చూసి, లాంతరు దగ్గరకువెళ్ళి వత్తి పెద్దదిచేసి, లేచినుంచుని ఆమె కభిముఖంగా నడుస్తాడు.]

గిరి : రాజా ! (రజని మాట్లాడదు. దూరంగా తొలగి నిల్చుంటుంది) నేను చేసినపని తప్పే. కాదనను. నీ జీవితాన్నే నాశనం చేశాను. అందుకు నువ్వు ఏ దండనైనా విధించు, పడతాను. కానీ గతంలోని మన సంబంధాన్ని మాత్రం మఱచిపోకు.

రజ : మఱచిపోవాలి. తప్పదు.

గిరి : నేను మర్చిపోలేదు.

రజ : నేను మర్చిపోయాను.

గిరి : అవును. ఎందుకు మర్చిపోవూ ! రాణివాసపు చిలకలకు బయటిప్రపంచం అర్థంకాదు. జీవితపు పోకడ తెలీదు రజనీ !

రజ : తెలిసే ఈ కారాగారంలో వుండటానికి సిద్ధపడ్డాను.

గిరి : అందుకోసమే మళ్ళీ బయటికిపోదాం రమ్మంటున్నాను.

రజ : మళ్ళీ నడిసముద్రంలో వదిలి పెడతావనికూడా తెలుసు.

గిరి : ఈసారి అలా చేయను.

రజని : అయినా నే రాను.

గిరి : రావాలి.

రజని : రాను

గిరి : నీ జీవితం నాశనం చేయగలను.

రజని : ఇంతకన్నా ఏమీ చేయలేవు.

గిరి : చివరిసారిగా నిన్ను బ్రతిమాలుకుంటున్నాను. రావా!

రజని : చివరిసారిగా నిన్నూ నేను బ్రతిమాలుకుంటున్నాను. నాజోలికి రాబోకు.

(లోపలినుండి రఘుపతి స్నానంచేసి వస్తాడు) వడ్డించమంటావా బాబూ?

(రఘుపతి మాట్లాడడు. అంగీకారంగా తీసుకుని ఆమె లోపలకు వెళ్ళబోతూ—గిరిధరాన్ని చూచి) అయిన దానికీ, కాని దానికీ తొందరపడకూడ దెవరైనా. (వెళ్ళిపోతుంది) (రఘుపతి చాలా బాధపడుతుంటాడు. గిరిధరం వేపు మౌనంగా చూసి ఓమూలకు వెళ్లి నిల్చుంటాడు)

గిరి : (రఘుపతిని సమీపిస్తూ) అంత బాధపడవలసింది ఇందులో ఏమీ లేదు రఘుపతీ! సర్వసాధారణంగా జరిగే విషయాలకు నువ్వింత ప్రాధాన్యత నీయడం నాకేమాత్రం నచ్చలేదు.

రఘు : మీరు చెబుతున్నది నిజమైతే—

గిరి : అబద్ధమని ఆత్మవంచన చేసుకోకు.

రఘు : గిరిధరంగారూ!

గిరి : నిజం ఎప్పుడూ నిష్ఠూరంగానే వుంటుందోయ్. నాకా సంగతి తెలుసు. కానీ—అభివృద్ధిలోకి రావలసినవాడివి నువ్వు. కాలేజీలో చెప్పిన నాలుగు ముక్కలతో ప్రపంచాన్ని జయించుకుని రావాలనుకుంటున్నావు. నల్లనివన్నీ నీళ్లుగా, తెల్లనివన్నీ పాలుగా నమ్ముతున్నావు. కానీ, 'నల్లమేక—బ్రాహ్మడు' కథ జ్ఞాపకముందా? పదుగురాడుమాట పాడియై ధర జెల్లు. యథార్థం అంతే. మీ నాన్నగారిని ఇంతవరకూ ఒక దేవుడిగా కల్మష రహితుడిగా బహుశా భావించుకొని వుంటావు. కానీ నీ కల్పన వాస్తవానికి దూరమైంది.

రఘు : కాకుండావుంటే ఎంత బావుండేది!

గిరి : అవును. నీ దృక్కోణంనుంచి చూస్తే చాలా బావుండేది. కానీ ఏదయితే నువ్వు ఊహించలేవో అదే జరిగిం.

రఘు : ఇప్పటికీ నమ్మలేకుండా వున్నాను.

గిరి : (కోపంతో) అవును నమ్మలేవు, ఏయింట్లో నువు పుట్టి, పెరిగి, తిరిగావో ఆయింట్లోనే ఒక పతితతో మీ నాన్నగారు జీవితం వెళ్ళబోస్తుంటే, మూర్ఖుడవై, అది గ్రహించలేక, పైగా నన్నే అనుమానిస్తున్నావు.

రఘు : ఏమిటి? ఏమిటీ మీ రంటున్నది?

గిరి : గుమ్మంలో అడుగుపెట్టావో, లేదో నీకు స్వాగతం చెప్పిందెవరు? ఆదరణను వొలకబోస్తూ స్నానానికి నీళ్లు తోడిందెవరు? మాతృప్రేమను జూపిస్తూ భోజనానికి రమ్మంటున్న దెవరు? (ఇదే సమయంలో రజని గదిగుమ్మందగ్గరకు వచ్చి నిలబడుతుంది) ఇదిగో ఈ రజని. జీవితంలో కాలుజారిన రజని. కాదనగలదేమో అడుగు? (రఘు ఆమె వేపు మౌనంగా చూస్తాడు. ఆమె జవాబు చెప్పలేక తల వంచుకుంటుంది) ఇప్పుడైనా నన్ను నమ్ము రఘుపతీ! ఆమెతో ఒకనాటి సంబంధంమూలంగా నీకు తండ్రివంటి వాణ్ణి.

రఘు : ఛీ!

గిరి : వయసులోనే కాదు. అనుభవంలో కూడా! మీ మేలు కోరేవాణ్ణి నేను మాత్రమే. అది మరచిపోకు. సెలవు. సెలవు రజనీదేవీ సెలవు! వస్తాను రఘుపతీ! (విసురుగా వెళ్లిపోతాడు)

[గిరిధరం వెళ్ళిపోగానే, రఘుపతి ఆమెమీదకు విసురుగా వెళ్లతాడు. ఆమెకంఠాన్ని పట్టుకుని గట్టిగా నొక్కబోతూ]

రఘు : నిజమేనా? నిజమేనా? నువ్వు...నువ్వు...ఒక కులటవా? (ఆ ఆవేశంలోనే తను చేస్తున్నపని తప్పుగా తెలుసుకుని ఆమెను పురుగును దులిపినట్లుగా నెట్టివేసి కుర్చీలో కూలబడి, ఆమెవేపు పిచ్చిగా చూస్తుంటాడు.)

రజని : కానీ...ఆపేశావేం? (ఏడుస్తూ) నలుగురికీ హీనమైన పాత్రను నేను. ఒక్కసారి కాలుజారినందువల్ల, చెరగని మచ్చను చెరుపుకోవాలన్న యత్నంలో మీ ఆశ్రయం చేరుకున్నదాన్ని నిన్నటికీ, రేపటికీ భయపడి మరణానికి చేరువౌతున్నదాన్ని. ఊఁ! చంపు! అర్థం, పర్థం తెలియని అమాయకుడి చేతిలో ఆత్మను వదిలేశానన్న సంతృప్తినైనా నాకు మిగలనీ రఘుపతి బాబూ! (అతను భయపడి దూరంగా జరుగుతాడు) ఏం, అలా భయపడి దూరంగా జరుగుతున్నావు? తప్పుచేసినదాన్ని, ఆడదాన్ని, నన్ను శిక్షించడానికి, మగవాడివి నీకు భయమెందుకు? పరమ ధార్మికజీవనం గడిపే గౌరవస్థులు మీరంతా. గాలికి రాలిపోయే వాడిన గడ్డిపూవులాంటిదాన్ని. రా! రారఘూ! భయమెందుకు? నాలో వున్న రజని ఏనాడో చని పోయింది. నీముందు మాట్లాడుతున్నది చావలేక బ్రతుకుతున్న పతితమాత్రమే నాయనా!

రఘు : భగవాన్!

[బయటినుంచి ముత్యాలూ, విశ్వనాథం ప్రవేశిస్తారు. విశ్వనాథం కులీనుడిగానే కన్పిస్తుంటాడు. వడిలిపోయిన శరీరం. తలనెరుస్తూ, నెరుస్తూ వున్నది.]

విశ్వ : రఘూ!

రఘు : నాన్నా! (ఒకరి పరిష్వంగంలో మరొకరు. అప్పుడే తండ్రి చేసిన తప్పిదం జ్ఞాపకానికి వచ్చి రఘుపతి దూరంగా తొలగి నుంచుంటాడు, అది విశ్వనాథానికి అర్థంకాదు.)

ము : ఎప్పుడొచ్చావు బాబూ? ఆరోగ్యం భద్రమేనా? అన్ని సౌకర్యాలు సరీగా సమకూరుతున్నాయా?

రఘు : ఆఁ! కుక్కతోకవరుగానే జీవితం గడిచిపోతున్నది. ముత్యాలూ!

ము : (రజనితో) వీరేనమ్మా రఘుపతిబాబుగారంటే. బాబూ-ఈమె...

రఘు : తెలుసుకున్నాను. తెలుసుకోవలసిన దంతా తెలుసుకున్నాను.

రజ : తండ్రికిదగ్గ పుత్రవాడు.

ము : కాదమ్మా. అబ్బాయిగారంతా తల్లిపోలికే.

విశ్వ : అవును. నాపోలిక రాకుండా వుంటేనే వాడు బాగుపడతాడు.

ము : అదేం బాబూ?

విశ్వ : నేనెంతటి చేయగూడని పని చేస్తున్నదీ నాకు తెలుసు ముత్యాలూ! అబ్బాయైనా బాగుపడడమే నాకు కావాలి.

రఘు : నాన్నా!

విశ్వ : నేను జీవితంలో చేసిన పొరపాట్లమూలంగా నువ్వైనా బుద్ధి తెచ్చుకుంటే అంతకన్నా నాక్కావలసిందేమీ లేదు.

ము : పొరపాటుచేశారా బాబూ?

విశ్వ : కాదా ముత్యాలూ? భ్రష్టురాలైన ఒక ఆడదానికి, కులమింటి స్త్రీతో సమానమైన స్థానం ఇవ్వడం పాడుపని కాదా? ఇంతకన్నా ఇంకేం చెయ్యాలి వంశగౌరవాన్ని పాడుచేయడానికి?

ము : చాలా పొరబడుతున్నారు బాబూ! ఎవరూ సాహసించలేని కార్యాన్ని చేసి తిరిగి భిడియపడుతున్నారు. ధైర్యంతో దాన్ని కొనసాగించండి. రజనీదేవిగారికీ యింట్లో శాశ్వతంగా ఒక స్థానాన్ని కల్పించండి.

రఘు : ఏమిటీ?

ము : అవును రఘుపతిబాబూ! మీకు తెలీదు ఈమె యెంత ఉత్తమురాలో...

రజని : అవన్నీ ఇప్పుడెందుకు ముత్యాలూ—ముందు రఘుపతి బాబును భోజనం చేయనీ.

విశ్వ : ఇంకా భోజనం చేయలేదా?

ము : చూడండిబాబూ—తన జీవితంలోని సుఖదుఃఖాలకు సంబంధించిన సమస్యను మీరు చర్చిస్తున్నా, చినబాబు

భోజనం ఆమెకు ముందు కావలసివచ్చింది. ఇంతకన్న ఏ మాతృమూర్తి తన కొడుకును సరిగా చూస్తుంది.

రఘు : ఏమిటి? ఏమిటి నువ్వంటున్నది? ఈ పతితను నేను తల్లిగా స్వీకరించాలా?

ము : అవును. ఇంతకన్న సహృదయురాలు నీకింకెక్కడా దొరకదు.

రజని : ముత్యాలూ!—ఇదికాదు ఆ మాటలకు సమయం.

ము : పిచ్చిదానా—జీవితం నాశనమౌతున్నా చూస్తూ వూరుకొంటావా?

రఘు : ముత్యాలూ—నువ్వేనా ఈ మాటలు మాట్లాడుతున్నది.

విశ్వ : ఆమెమీద ఎందుకు ముత్యాలూ నీకింత ఆపేక్ష?

రఘు : ముత్యాలూ!

ము : అవున్నాయనా! ఈ ముత్యాలుమీద నీకేమాత్రం గౌరవమున్నా ఆమెను నువు తల్లిగా స్వీకరించు.

విశ్వ : కానీ నేనామెను భార్యగా స్వీకరించలేను.

ము : ఎందువల్ల?

విశ్వ : పతిత కాబట్టి. కులస్త్రీకిగల గౌరవం లేదు కాబట్టి.

ము : బాబూ మీలాంటివారు ఆమెను యింత నైచ్యానికి పాల్పడ చేయకముందు ఆమెకూడా ఒక యింటి యిల్లాలే! మీతో వచ్చింది ఆమె కష్టాలను పంచుకోనడానికి కాదు. సుఖాలను పొందడానికి. ఇది గుర్తుంచుకోండి. కానీ ఈనాడామె మీ కష్టసుఖాల్లో తానూ భాగస్వామిని కావడానికి సిద్ధపడుతున్నది. అంటే అర్థం? తన స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకోనడానికైనా వొప్పుకుంటున్నదన్న మాట!—

రఘు : అయినా నే నీమెను తల్లిగా చూడలేను.

విశ్వ : నే నీమెను భార్యగానూ చూడలేను.

ము : అలాగా? ఆరునెలలనుండి మీ సాహచర్యంలో తన రక్తమాంసాలను కోల్పోయిన ఈమె పత్నిగా వుండడానికి అనర్హురాలు. బావుంది. చాలా బావుంది!

రఘు : నువ్వు నీ స్తోమతుకుమించిన మాటలు మాటలాడుతున్నావు.

ము : స్తోమతా. నాయీ నలభైయేళ్ళ జీవితంలోనూ ఇవ్వాళే మొట్టమొదటిసారిగా ఆ మాట విన్నాను.

విశ్వ : అతిగా మాట్లాడకు. అంత మంచిదికాదు.

ము : ఏమిటి; ఈ యింట్లో వాక్స్వాతంత్ర్యంకూడా లేదా? నా యీ జీవితంలో సరిదిద్దుకోలేని ఎంత పెద్ద తప్పుపని చేశాను! కొలవరానివారి కొలువు చేశానన్న మాట!

విశ్వ : ముత్యాలూ—హద్దులుదాటి మాట్లాడుతున్నావు.

ము : హద్దులు? నాకీనాడు మర్యాద నేర్పుతున్నారు మీరు. అయినా ఒక అబల జీవితాన్ని పాడుచేయడమంత తేలికా విశ్వనాథం, ఈలా మాట్లాడడం?

రఘు : ముత్యాలూ! గౌరవం యిచ్చి గౌరవం పుచ్చుకో.

ము : నువ్వుకూడానా బాబూ! పెద్దకోతికి, చిన్నకోతి తోడయిందన్న మాట.

విశ్వ : (బలంగా ముత్యాలును కొడతాడు)

ము : అబ్బా! ఏం విశ్వనాథం—నీ కోరిక తీరిందా? ఇప్పుడైనా ఆ అమాయకురాలిని, ఆదరించు.

విశ్వ : వెధవలు! వెధవలని! కాళ్ళక్రింద అణచిపెట్టవలసిన వెధవలను నెత్తికెక్కించుకుంటే ఇటువంటివే బాధలు...అది చూడబోతే ఎప్పుడూ వొకటే యేడుపు...వీడు చూడబోతే వొకటే వస...ఛీ, ఛీ! పాడులోకమూ, పాడు మనుషులూ! అని (విసురుగా బయటకు వెళ్ళిపోతాడు.)

రఘు : నాన్నా! నాన్నా! ఉండునాన్నా—ఈ ఒక్కమాట వినిపోనాన్నా—ఈ ఒక్కమాట నాన్నా!

(అతనుకూడా బయటకు వెళ్ళిపోతాడు. ముత్యాలు చెంపన చెయ్యిపెట్టుకునీ, రజనీదేవి కళ్ళనీరు పెట్టుకుంటూనూ గదిలో మిగిలిపోతారు.)

రజ : (మెల్లిగా ముత్యాలును సమీపించి) బాగా...దెబ్బ...తగిలిందా? క్షమించు. నన్ను క్షమించు ముత్యాలూ! పాపిష్టిదాన్ని. నామూలంగా నీకుకూడా యీబాధలు.

ముత్యా : పరవాలేదులే తల్లీ! ఇటువంటివి ఎన్ని జరగకపోతే ఈ అన్యాయాలు ఒకకొలిక్కి వస్తాయి? క్షుద్రదేవతలకు కొందరు బలిఅయితేనేకాని సత్కార్యాలు జరుగవమ్మా.

రజ : ముత్యాలూ!

ముత్యా : ప్రయత్నాలన్నీ, బూడిదలోని పన్నీరులాగా నిరర్థకాలయినవికదు తల్లీ!

రజ : అది మనచేతుల్లో లేదుకదు ముత్యాలూ—భగవంతుడుకూడా అనుకూలించాలి.

ముత్యా : నిజమేననుకో! అయినా పురుషకార్యంకూడా...

రజ : అందుకనే ముత్యాలూ—ఈ వొక్కసారికి నిన్నింకొక్కటి అడగాలని వుంది.

ము : నిస్సంకోచంగా అడుగమ్మా. నాముందు నీకీసంశయమెందుకు?

ర : ఏంలేదు—వారిద్దరినీ మరొక్కసారి పిల్చుకురాగలవా?

ము : మళ్ళనా?

ర : ఇందాక నువు నాతరఫున వాదించావు. ఈసారి నేనే వాళ్ల కాళ్లా వేళ్లా పడతాను. దైవమనుకూలిస్తే సరేసరి. లేకపోతే—

ము : వద్దుతల్లీ వద్దు. అంతసాహసాని కొడిగట్టకు. ఇప్పుడేవెళ్ళి ఎల్లాగైనా సాధించుకువస్తాను.

ర : చూడు. విశ్వనాథంగారు రాకపోతే కనీసం రఘుపతినైనా తీసుకురా. ఆ కోపంలో భోజనమాటే మరిచి వెళ్ళిపోయాడు.

ము : ఎంతపిచ్చిదానవమ్మా! (వెళ్ళిపోతాడు)

(అప్పుడే మళ్ళీ గిరిధరం ప్రవేశం. అతనిరాకను రజని గమనించదు. అతను చప్పుడుగాకుండావచ్చి చల్లగా వీధి తలుపు గడియ పెడతాడు.)

గిరి : రాజా!

రజని : ఎవరూ?

గిరి : నేను రాజా—నీ గిరిధరాన్ని. అదేమిటి? అలాభయపడతా వెందుకు? రాజా?

రజ : ఏలా, ఏలా వచ్చావిక్కడకు?

గిరి : ఎల్లా ఏమిటి? రాజవీధిగుండా మహారాజకుమారుడిలా నడిచివచ్చాను. ఇంట్లోకి ప్రవేశించీ ప్రవేశించకుండా నే తలుపులు రెండూ బంధించేశాను.

ర : (భయంతో) ఆఁ!

గిరి : చూడు రాజా! నీకపకారం చేయాలనే దురుద్దేశంతో కాదు నేనిప్పుడిక్కడకు వచ్చింది. ఎవరూ మన యీ సంభాషణలకు అంతరాయం కల్గించకూడదని...

ర : ఇంట్లో, ఇంట్లో విశ్వనాథంగారు నిద్రపోతున్నారు.

గిరి : అహ్హో! అబద్ధాలు బాగా చెప్పగలవే! విశ్వనాథమూ, రఘుపతీ విసావిసా నడిచిపోతూండడం నేను చూసాను. ముత్యాలు వాళ్లవెంబడే పరుగెత్తుతున్నాడు.

ర : ఇదీ నీకు తెలిసిందా? రామచంద్రా!

గిరి : పిచ్చిదానా! నన్ను నమ్మలేకుండా వున్నావు. నిజంగా నీ శ్రేయస్సుకోరి ఇప్పుడుమాట్లాడుతున్నాను. నాయథార్థ స్వరూపాన్ని నీముందు వెల్లడిస్తున్నాను. నిజమే! ఇది వరలో ఎన్నోతప్పులు చేశాను. ఆడకూడని అబద్ధాలు, చెయ్యకూడని నేరాలు ఎన్నోచేశాను. కనుపించిన స్త్రీనల్లా అనుభవించాను. ఎందరో బాలికలు...వయసుర్గాని వారు...కాదనను. నేను రాక్షసుణ్ణే! కానీ...కానీ— నేను మాత్రం మంచిపని ఎందుకు చేయకూడదు? చనిపోయేలోపల, ఒక్కజీవికి ఒక్కజీవికి మేలుచేసి, ఆమె మెప్పును ఎందుకు పొందకూడదు? అందుకనే నీవద్దకు వచ్చాను.

రజని : ఇంకెవరూ నీ వలలో చిక్కలేదా?

గిరి : నన్నపార్థం చేసికోకు రాజా! నా జీవితంలో, నాకు కనుపించినవారిలోకెల్లా నీకే నే నెక్కువ అపకారం చేశాను. నిన్నే ఎక్కువ హింసించాను. నీ జీవితాన్నే పాడుచేశాను. అందుకనే నీక్షమను పొందితేనే కాని నాపాపం కొంతైనా ప్రక్షాళనం కాదు.

(బయట తలుపు చప్పుడు)

రజని : అదిగో! వాళ్లే! వాళ్ళు వచ్చేశారు!

గిరి : చెప్పు రజనీ తొందరగా చెప్పు. నన్ను క్షమించి, నా పూర్వపు తప్పిదాన్ని మరిచి నాతో రాలేవా? నీ జీవితాన్నే పూలబాటల్లో నడిపిస్తాను. చెప్పు. చెప్పు రజనీ!

రజని : ఉండు. నన్ను తలుపుతీయనీ.

గిరి : (ఆమెను అడ్డుకుంటూ) తలుపు తీయకు రజనీ. అది నీకే దెబ్బ. ఈ సమయంలో వారు నిన్నిక్కడ చూస్తే అపార్థం చేసికోవచ్చు.

రజని : అయ్యో! అయ్యో!

గిరి : నన్ను లోపలకు వెళ్లనీ. అక్కడ దాక్కుంటాను. (లోపలకు వెళ్ళిపోతాడు)

[బయట మళ్లీ ఉధృతంగా తలుపు చప్పుడు. ఆమె ఏమి చేయటానికి తోచక కొంచెంసేపు తటపటాయించి చివరకు వెళ్ళి తలుపు తీస్తుంది. విశ్వనాథం, రఘుపతి, ముత్యాలు లోపలకు ఒక్కసారిగా గాలివానలాగా ప్రవేశిస్తారు.]

ముత్యా : ఎందుకమ్మా ఇంత ఆలస్యం చేశావు? ఏం అఘాయిత్యం చేశావోనని హడలిపోయి చస్తుంటేను?

విశ్వ : ఎవరివి రజనీ లోపలేవో మాటలు వినిపించాయి?

రఘు : చెప్పటానికి కాలా దిక్కులు చూస్తావేమిటి?

రజని : (తబ్బిబ్బుగా) ఎలుకలు...ఎలుకలు ఒకటే గొడవ చేస్తున్నాయి?

ముత్యా : అంతేకదా!

విశ్వ : ఎలుకలా? (లోపలకు వెళ్లబోతాడు)

రజని : (అతనికి అడ్డుపోతూ) ఏమండీ...ఏమండీ...నన్ను... నన్ను...క్షమించరూ?

[ఇదేసమయంలో రఘుపతి లోపలకు వెళతాడు. అక్కడ గిరిధరాన్ని చూసి ఒక్కపెద్ద గావుకేకపెట్టి, అతనిని తోసుకుంటూ బయటకు వస్తాడు]

రఘు : ఎలుకలా? ఇటువంటి వేనా?

విశ్వ : కుక్కను సింహాసనం మీద కూచోపెట్టినా వెనకటి గుణం మానలేకపోయింది. ఛీ!

ముత్యా : రజనీ...ఏమిటమ్మా యిది?

విశ్వ : ప్రత్యక్షంగా కనబడుతున్న దానికి వ్యాఖ్యానం ఎందుకు ముత్యాలూ? ఈమె నేకదూ మహాపతివ్రతగా నువ్వు వర్ణించావు ! ఇటువంటిదాన్ని నేను భార్యగా స్వీకరించాలి.

రఘు : నాక్షేమాన్ని కోరుతున్నవాడివేకదు ముత్యాలూ నువ్వు!

ముత్యా : తొందరపడకండి బాబూ? మనకు తెలీని నిజాలు కొన్ని వుండివుండవచ్చు. చెప్పుతల్లీ ఏం జరిగింది? చెప్పుతల్లీ?

రజని : ఏం చెప్పను ముత్యాలూ ! ప్రత్యక్షంగా కనబడుతున్న దాన్ని కాదని ఎల్లా వీళ్ళను నమ్మించడం ! విశ్వనాథం బాబుగారూ - ఆడవాళ్ళలో ఏమాత్రం మీకు నమ్మకం వున్నా ఈ తప్పుపని నేను చేయలేదని మాత్రం నమ్మండి.

విశ్వ : (పెద్దగా నవ్వుతూ)నమ్మాలా ? —ఆడవాళ్లను ?—అందులోనా నిన్ను ?

రఘు : పోదాం పద నాన్నా. ఈ గాలి తగిలితే మనకూ అటు వంటి బుద్ధులే పుడతాయేమో ! రా ముత్యాలూ !

ముత్యా : వెళ్లండి బాబూ. మీరు వెళ్లండి. ఎక్కడ నీతి నిజాయితీలు వున్నాయనుకుంటున్నారో అక్కడికే వెళ్ళండి. ఈ నరకంలోనే నేను వుండిపోతాను.

రఘు : ముత్యాలు పిచ్చివాడైపోయాడు నాన్నా !

విశ్వ : పద. పద. పోదాం !

రఘు : పద.

[ఇద్దరూ వెళ్లిపోతారు. అంతవరకూ వెనకనే దాగివున్న గిరిధరం బయటకు అప్పుడు వస్తాడు. అతని కళ్ళనిండా నీళ్లు. రజనిని సమీపించి, బాధగా, డగ్గుత్తికతో]

గిరి : రజనీ ! బలవంతంగా నీ జీవితంలో ప్రవేశించి రెండో సారి గూడా నిన్ను నాశనం చేశాను. రజనీ ! ఏం చేయను నేను? క్షమించవద్దు నువ్వు. నన్ను క్షమించవద్దు. రజనీ ! రజనీ !

ముత్యా : ఏ విధంగా నీకు నేను సహాయపడనమ్మా ? తప్పులేని, గప్పుచేయలేని, నిన్ను శిక్షిస్తున్న ఈ లోకానికి ఏవిధంగా నమ్మ సమాధానం చెప్పడం ?

(ఇంతలో లాంతరులో వత్తి తగ్గిపోతుంటుంది. ముత్యాలు వెళ్లి దీపాన్ని పెద్దది చేయాలని ప్రయత్నం చేస్తాడు. కానీ, దీపం, మరణాన్ని సమీపిస్తూనే వుంటుంది)

రజని : (బాధగా) ఎందుకు ముత్యాలూ-వృధాప్రయాస ? నూనె లేని దీపాన్ని వెలిగించబోయి ఎందుకు నువ్వు బాధపడ తావు ? నీ దారిన నువ్వు బ్రతుకు లోకంలో. నా బోటి అభాగ్యులమీద సానుభూతి చూపించకు. వెళ్లు. వెళ్లు ముత్యాలూ !

ముత్యా : కాదమ్మా. అలా కాదు.

గిరి : కాదు. నేను నీకు అండగా నిలుస్తాను. [దీపం తగ్గిపోతుం టుంది]

రజని : అక్కరలేదు. ఎవ్వరూ అక్కరలేదు. ఈ జీవితచరమాం కంలో రేకులు రాలిన నాబోటి పూలమీద ఎవ్వరూ సానుభూతి చూపనక్కరలేదు. ఎవ్వరూ - సానుభూతి చూపనక్కరలేదు. వెళ్ళండి. అందరూ వెళ్లండి. వెళ్లండి. వెళ్ళండి.

[తెర]

# దండకవాఙ్మయము

శ్రీ రావూరి దొరసామిశర్మ

దండక మొక సంస్కృత వృత్త విశేషము. ఇది యిరువదాఱక్షరములకు మించిన పాదము గలది. సంస్కృత ఛ్ఛందస్సునుండి తెలుఁగు భాషలోనికీ దండకము వచ్చినది. తెలుఁగులో దీనికున్న వ్యాప్తి సంస్కృత వాఙ్మయములో లేదు. తెలుఁగులో నున్నన్ని దండకములు సంస్కృతములో లేవు. చంపకమాలాది వృత్తములు సంస్కృత ఛ్ఛందోజాతకము లయ్యును తెలుఁగులో వానికున్న వ్యాప్తి మూలభాషయందు లేదుగదా! అట్టిదే ఈ దండక వృత్తి రచనా విషయముగూడ. సాధారణముగా దండకములు భగవత్ స్తుతి పరములుగా రచితములై యున్నవి. సంస్కృతములో శ్యామలాదండకము సుప్రసిద్ధము. తెలుఁగువా రాబాలగోపాల మీ దండకము నెఱుంగుదురు. పెద్దబాలశిక్షఁ జదువని తెలుఁగక్షరాస్యు డుండఁడు. అందీ దండకము వెలయుచున్నది.

ఇఁకఁ దెనుఁగులో దండక రచనకుఁ బ్రప్రథమముగా శ్రీకారము చుట్టినవాఁడు ఆదికవి నన్నయ భట్టారకుఁడు. ఆంధ్ర మహాభారతారణ్య పర్వములో నన్నయ దండకమొండు రచించె. ఇది యక్షకృత పరమేశ్వరస్తుత్యాత్మకము.

దండకము సంస్కృతాంధ్రము లందేకాక, తమిళ కర్ణాటాది భాషలందును గానవచ్చును. కాని తెనుఁగులో దీనికున్న ప్రచారం తక్కుంగల భాషలలోగానము. సంస్కృత భాషయందును దండకరచన మహాకావ్యములం దచటనో క్వాచిత్కముగా రచితమయి యుండుటయుఁ, బ్రత్యేక దండకముల సంఖ్య చాల తక్కువగా నుండుటయు మీఁదుమిక్కిలి యాదండకకృతులు చిన్నవియై యుండుటయు గమనింపఁ దగియున్నది. తెనుఁగున నట్లు గాక, సాధారణముగాఁ బ్రతి కావ్యమందును దండక మలంకరించి యుండుటయే గాక, ప్రత్యేక దండకములు నానావిషయాత్మకములై యసంఖ్యాకములై ఖండకృతు లనఁదగి యున్నవి.

ఇఁకఁ దెలుఁగు దండకరచనం గూర్చి ముచ్చటించుటకు ముందు సంస్కృతాది భాషలలోని దండకలక్షణాదు లెట్లున్నవో యించుక పరిశీలింతము.

## సంస్కృత దండక లక్షణములు

ఇరువదాఱు ఛందములకు మించిన వృత్తములకు మాలికావృత్తములనియు నుద్ధురమాలావృత్తములనియుఁ బేర్లు గలవు. అట్టి మాలికావృత్తములకుఁ జేరిన దీ దండకము. ఇందుఁ బాదమున నిరువదాఱింటికి మించిన యక్షరము లుండును. నాలుగు పాదములుగా నొండె, నేకపాదముగానొండె దండకము రచింపవచ్చు. సామాన్యముగా నగణద్వయముపై నిచ్చవచ్చినన్ని రగణములు నిలుపవచ్చును ఇందుఁ బెక్కు తెఱఁగులు గలవు.

సంస్కృతమున ఛందోగ్రంథము లనేకములు వెలయుచున్నవి. సుప్రసిద్ధములై యధిక ప్రచారములో నుండునవి పింగళఛ్ఛందము (పింగళాచార్యకృతము. ఇది ప్రాచీనము-భట్టహలాయుధుఁడు దీనికి వృత్తి రచించె), వృత్తరత్నాకరము (కేదారభట్ట ప్రణీతము). ఈ ఛందములలోఁ జెప్పఁబడిన దండకలక్షణములఁ దొలుతఁ జూపెదను.

పింగళాచార్యచ్ఛందము (సప్తమాధ్యాయము)

దండకో నారః (7-33)

యత్రపాదే ద్వౌనగణౌ రగణాశ్చ సప్త భవంతి, దండకోనామ సః, ఉత్కృతేః షడ్వింశత్యక్షరాయాః సమనంతరం దండకస్య పాదా త్సప్తవింశత్యక్షరత్వ మేవయుక్తమ్, సర్వేషాం ఛందసామేకైకాక్షరవృద్ధ్యా ప్రవృత్తేః, ఇత ఊర్ధ్వం పునరేకైకరేఫవృద్ధ్యా ప్రస్తారః దండకో నార ఇతి శ్రవణాత్॥

ప్రథమశ్చండవృష్టి ప్రయాతః (7-34)

యః సప్తవింశత్యక్షరపాదః ప్రథమోదండకః స చండవృష్టి ప్రయాతో నామ॥

అన్యత్ర రాతమాండవ్యాభ్యామ్ (7-35)

రాతమాండవ్యాభ్యాం ఋషిభ్యామేవాన్య త్రాస్యాభిధాన మేతదేవ, తాభ్యాం పునరస్యైవసంజ్ఞాకృతాస్య. వృత్తస్య రాతమాండవ్యగ్రహణం పూజార్థమ్॥

శేషః ప్రచిత ఇతి (7-36)

ఇతిశ్చండవృష్టి ప్రయాతా దూర్ధ్వం దండకప్రస్తారః ప్రచిత ఇతి సంజ్ఞాంలభతే, పూర్వమేకైకాక్షరక్రమేణ ఛందసాం వృద్ధి రుక్తా; ఇదానీంతు రేఫోపలక్షితాక్షరత్రయేణవృద్ధిః॥

వృత్త రత్నాకరము (తృతీయాధ్యాయము)

యదిహ నయుగళం తతస్సప్తరేఫాస్తదా చండవృష్టిప్రయాతో భవే ద్దండకః॥౧॥

ప్రతిచరణ వివృద్ధరేఫాస్స్యురర్ణార్ణవ వ్యాళ జీమూత లీలాకరోద్దామ శంఖాదయః॥౨॥

ప్రచితక సమభిఖ్యో ధీరధీభిస్స్మృతో దండకో నద్వయా దుత్తరైస్సప్తభిర్యైః॥౩॥

నద్వయాత్పరత స్తకారేణాపి క్వచిద్దండకా దృశ్యంతే॥౪॥

ఏవ మేకోన సహస్రాక్షరవృద్ధిర్భవతి దండకం వృత్తమ్॥౫॥

పై ఛందో గ్రంథములవలనఁ దెలియవచ్చు దండక భేద లక్షణముల సారమిది క్రిందఁ దెలిపెద.

దండకమునందుఁ బ్రతిపాదము మొదట నగణద్వయము నియతముగా నుండును. తదుపరి రగణము లెన్నైన యుండవచ్చును. నగణయుగము మీఁద సప్తరగణములుగల యిరువదేడక్షరముల వృత్తము ప్రథమదండకము,* దండకము వృత్తిచే గాన నాలుగు పాదము లుండవలయునని తెలియుచున్నది, పై దండకమునకుఁ జండవృష్టి ప్రయాతమని పేర్లు, నగణద్వయముపై 8 రగణములున్న అర్ణదండక మనఁబడు. అట్లే 9 రగణములున్న అర్ణవము, 10 ర– వ్యాళము, 11 – ర—జీమూతము, 12 ర – లీలాకరము, 13 ర– ఉద్దామము, 14 ర – శంఖము – అని దండక భేదము లూహ్యములు. శంఖాదులనుటచే నింకను నేకైక రగణవృద్ధిచే దండక భేదములు పెక్కులుగలవని యెఱుగునది.

న-న-7 ర గణములు—చండవృష్టి ప్రయాతము.

న-న-7 యగణములు—ప్రచితకము †

న-న-7 తగణములు గల దండకము గలదు (ఇది క్వాచిత్కము.)

రగణములతోడనే కాక యగణతగణములతోడను నిరువదేడక్షరములు మొదలుకొని యొక్కొక్క గణముగా (మూఁడేసి యక్కరముల చొప్పున) లెక్కించుచు 999 అక్షరముల పర్యంతము దండకములు వ్రాయవచ్చును.

దండక లక్షణములఁగూర్చి మఱికొందఱి నిర్వచనము—

అగ్ని పురాణము:—

శేష వృద్ధ్యార్ణార్ణవాః స్యు, ర్వ్యాళజీమూత ముఖ్యకాః.

తర్క వాచస్పతి:—

(శంఖాదయః) - అదిపదా త్పంచదశాదిభి రగణై ర్ఘటితపాదాః క్రమేణ. ఆరామ - సంగ్రామ - సురామ - వైకుంఠ - సార - కాసార - విసార - సంహార.

నీహార - మందార - కేదార - ఆసార - సత్కార - సంస్కార - మాకంద.

గోవింద - సానంద - సందోహ - ఆనంద ఇత్యేతే గ్రాహ్యాః॥

శ్రీకృష్ణః:—

ఏవమే కైకరగణ, వర్ధనాత్సకలాంఘ్రిషు,
ఏకనూ్యన సహస్రార్ణ, పర్యంతం దండకామతాః॥

సేతుః:—రైరిత్యే స్యేషామపి గణానాముపలక్షణం. కవి ప్రయోగా త్తఘటితానామపి దండకానా మిష్టత్వాత్.

కృష్ణః:—నగణ ద్వితయాదేవ, మేకైకగణవర్ధనాత్,
కుసుమాబ్జతరంగాది, నామ్నాం భేదాశ్చపూర్వవత్॥

శబ్దకల్పద్రుమ నిఘంటువు - దండక శబ్ద వివరణము.

దండకః—పుం - దండ ఇవ కాయతీతి.

సప్తవింశత్యక్షరా వృత్తిః

(27 అక్షరాః) చండవృష్టిప్రయాతః—న 2 ర 7
ప్రచితకః— న 2 య 7
కుసుమస్తబకః— స 9
మత్తమాతంగ లీలాకరః ర 9
(30) అర్ణః - న2 ర8
సింహవిక్రీడః - య10
(33) అర్ణవః - న2 ర9
(3) వ్యాళః - న2 ర10
జీమూతః - న2 ర11; లీలాకరః - న2 ర12; ఉద్దామః - న2 ర13
సింహ విక్రాంతః - న2 య13; శంఖః - న2 ర14

భరతకోశము (మానవల్లి రామకృష్ణ కవిగారు)

దండకో గణవృత్తాది, భేదేన బహుధా భవేత్,
పదైస్సప్తదైర్వరచితో, నానాయతి విభూషితః,
యథోచితేన తాలేన, రాగై రపిచగీయతే,
ఏవం దండక ఉద్దిష్టః......

## సంస్కృత దండకము

సంస్కృత చ్ఛందో గ్రంథములలో దండక భేదములకు లక్ష్యము లుదాహృతములు. ప్రత్యేకముగా వెలసిన సంస్కృత భాషాదండకములలో శ్యామలాదండకము జగత్ప్రసిద్ధము. ఇది కాళిదాస కృతముగాఁ బ్రచారములో నున్నది. భోజచరిత్రాది గ్రంథము లిట్లే వాకొనుచున్నవి. ఒకానొక శ్యామలాదండక లిఖిత ప్రతిలోనిది కాళిదాస కృతముగా చెప్పు నీ క్రింది శ్లోకము గలదు.

'అంబా ప్రత్యక్షకాలే ప్రవిమల కరుణాలబ్ధ విద్యావిశేషం
ప్రౌఢే నాహూతకీర్తి ప్రథిత మతిమతా కాళిదాసేన చిత్రం
స్తోత్రం సమ్యగ్ఘనానాం రచిత మిద మహో దండకం శ్యామలాయాః
యేవా నిత్యం పఠంతి ప్రతిదిన మతులాం తేతు ధన్యాః కవీంద్రాః'.
(సంస్కృత గ్రంథముల డిస్క్రిప్టివ్ కాటలాగు నెం 10843)

ఈ దండకము భోజరాజు సమకాలికుఁడగు పురాంతక కవి రచితమని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రుగాది సంచికలో (1916-17) వ్రాసియున్నారు.

శ్యామలాదండకము—

"జయజనని సుధా సముద్రాంత రుద్యన్మణి ద్వీప సంరూఢ బిల్వాటవీ మధ్యకల్పద్రుమాకల్ప కాదంబ కాంతార వాసప్రియే,

---

* యదిహ - శ్రీ నారాయణ పురోహిత విరచిత మణినిధి వ్యాఖ్య:—ఇహ దండకేషు ప్రథమ - శ్చండవృష్టిప్రయాతో నామదండక ఏవంవిధో భవతి. పూర్వం నగణద్వయం పశ్చాత్సప్త రగణా యదిస్యు స్తదా చండవృష్టిప్రయాతో దండకో భవేత్ - నవభిర్గణై స్సప్త వింశత్యక్షరః పాదః చతుర్భిః పాదైః దండకః అష్టోత్తర శతాక్షరో భవతి.

ప్రతిచరణ వివృద్ధ రేఫాః—ప్రతిచరణం చతుష్పాదేషు వివృద్ధా వర్ధమానాః......తెనుఁగున దండకములు సాధారణముగా నేకపాదముగానే చూపట్టుచున్నవి. క్వాచిత్కముగాఁ బాద చతుష్కము, పాదద్వయముగల దండకములు రచితములు.

† నగణయుగముమీఁద సప్తరేఫములకు మించిన దండక భేదము లన్నింటికిఁ బ్రచితకములను సంజ్ఞ పింగళచ్ఛందమునఁ జెప్పఁబడినది. అనఁగాఁ జండవృష్టి పూర్వములగు దండకములు ప్రచితకములు

కృత్తివాసప్రియే... సులలిత నవయౌవనారంభ చంద్రోదయోద్వేల లావణ్య దుగ్ధార్ణవావిర్భవత్కుంభ బిబ్బోకభృత్కంధరే మంథరే .........వికసిత నవకింశుకాతామ్ర దివ్యాంశుకచ్ఛన్న చారూరు శోభాపరాభూత సిందూర శోణాయమానేంద్ర మాతంగ హస్తార్గలే శ్యామలే.........సురుచిర నవరత్న పీఠస్థితే సుస్థితే... సర్వరూపే జగన్మాతృకే పాహిమాం పాహిమామ్"

ఇది రగణదండకము ; నాలుగు పాదము లన్నవిగాని సమాక్షర సంఖ్యా కలితములుగావు. మాలతీ మాధవము (భవభూతి రచితనాటకము) నందు షోడశ రగణఘటిత దండక మొకటి గలదు. ఛందో నిర్వచనముంబట్టి యది సంగ్రామదండక మనఁబడును.

వరాహమిహిరసంహితయందు ద్వాత్రింశద్రేఫ దండకము ప్రయుక్తమని వృత్తి రత్నాకరవ్యాఖ్యలో నుట్టంకింపఁబడినది. (ఇది సంతోషా దండక మనఁబడును.)

ఇఁక మరికొన్ని ప్రత్యేక దండకములు—

గరుడ దండకము—వేదాంత దేశికులు.

హయగ్రీవ దండకము
యతిరాజ దండకము (రామానుజాచార్యస్తుతి) } ఈ రెంటిని తిరుమల బుక్కపట్టణము వేంకటాచార్యులు వ్రాసెను. తెలుఁగున అచలాత్మజాపరిణయ ద్వ్యర్థి ప్రబంధకర్త యితఁడే.

హనుమద్దండకము (రగణదండకము) — కర్త తెలియదు, (డి—9363)*

లక్ష్మీదండకము—వేంకటసుధి—(డి—9728)

వేదాంత దేశికదండకము - (డి-9662)

అంబుజవల్లీ దండకము - శ్రీ ముష్ణములోని లక్ష్మీస్తుతి - (డి - 9707)

కోమలా (కోమలవల్లీ) దండకము - కుంభకోణ లక్ష్మీస్తుతి - కర్త - వేంకటేశకవి (డి-9710).

సీతా దండకము - వరద విష్ణుకవి (డి-9792)

గోపాల దండకము - (డి-9956).

రంగనాథ దండకము - (డి-10287.)

రామదండకము - (డి-10281)

కరిగిరి దండకము - (డి-1050) కంచి వరదరాజస్తుతి.

ఆచార్య దండకము - (డి-9891)

నృసింహ దండకము ,,

తెనుఁగు కవులనేకులు తమ తెనుగు ప్రబంధములలో సంస్కృత భాషా దండకములు వ్రాసియున్నారు. ఆ వివరములు తెలుఁగు దండకముల ప్రస్తావనలోఁ జెప్పఁబడును.

## తమిళ దండకములు

తమిళ భాషలో 'తాండకమ్' అను పద్యభేదము తద్భాషా ఛందో గ్రంథములలో లక్ష్యలక్షణములతో వివరింపబడియున్నది. సంస్కృత దండకమే తమిళములోఁ తాండకమై యుండును. తాండకముల రచించిన కవులు గలరు. యాప్పరుంగలమను తమిళచ్ఛందమున నీతాండక భేదములు ప్రపంచితములు. తాండకము తమిళములో నొక వృత్తి భేదము. వృత్తమును తద్భాషలో విరుత్తమందురు. విరుత్త తాండక శబ్దములు వృత్తదండక శబ్ద వైకృతములని యెన్నవగును.

తమిళ తాండకము లిరుదెఱఁగులు—

1) అళవియల్ తాండకమ్—ప్రతిపాదమున నిరువదేడక్కరములు మొదలుకొని యెన్నేని యక్కరములు గలిగి, యక్షరములు, గురులఘువులు సరిపడివచ్చు సమగణ పద్యము.

2) అళవళి తాండకమ్-అక్షరములు సమముగా లేనిదియు, గురులఘుయోగ సమత్వము లేనిదియు నగు నిరువదాఱక్కరములకు మించిన పద్యము. కుఱుంతాండకమ్, నెడుంతాండకమ్—అను భేదమును గలదఁట.

ఈతమిళ తాండకములు నాలుగు చరణములు గలిగి యతి ప్రాసనియమబద్ధములై భాసించుచున్నవి.

తమిళములో 'తేవారము' అను శివస్తుతిపరమగు గ్రంథము తాండక వృత్తమయము. కర్త అప్పరుస్వామియను సుప్రసిద్ధ కవి. ఇతనికి 'తాండక వేందు' అని బిరుదుగలదఁట. ఆభాషలోఁ దాండకములు స్తోత్ర రూపములని తెలియుచున్నది.

## కన్నడ దండకములు

నాగవర్మ ఛందోంబుధియను కన్నడ ఛందమున దండక లక్షణము నిర్వచించె. ఇదియు సంస్కృత లక్షణలక్షితమే. (చూ. 3 ఆ ప్రథమ పద్యము)

దండక వృత్తం—

అమరగణ యుగ్మదిం ముం, దమరేళ్గుం శిఖిగణంబరల్ దండకద ప్రముదిత లక్షణమక్కుం, కమలముఖీ కేళిదుకోళ్ళు చెన్నయ మతిదిం" (అమరగణము—నగణము, శిఖిగణము—రగణము)

ఇది చండవృష్టి ప్రయాత దండకమని, రగణమిట్లే హెచ్చించుచు వచ్చిన అర్ణ, అర్ణవ, వ్యాళ, జీమూత, లీలాకర దండకములగునని చెప్పఁబడెను. దండకము లాఱువిధములు మాత్రమే యందు నిర్దేశింపఁబడెను. పాదచతుష్కము, ప్రాసనియతి యున్నట్లందలి లక్ష్యములవలన నూహింపవలసియున్నది. (కన్నడములో యతి లేదు) కన్నడమున దండకలక్షణము సంస్కృతము నుండి యితరవృత్తములయట్లు గ్రహింపఁబడియున్నది, కన్నడ కావ్యవాఙ్మయమున దండకములు గానరావఁట.

## తెలుఁగుభాషలో దండకలక్షణములు

(కవిజనాశ్రయము – (ఉద్ధురమాలా వృత్తాధికారము)

అమరఁగ నసహంబులం దాదిగా నొండె గాఁజేసి వాటిన్ దకారంబుగా నొండె లోనం దకారమ్ము లిమ్మైగకారావసానం బుగాఁ జెప్పినన్ దండకం బండ్రు దీనిం గవీంద్రుల్ జగద్గీత కీర్తి

* డి—సంస్కృత గ్రంథముల డిస్క్రిప్టివు కాటలాగు—మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయము.

# *It's Better and Elegant*

Just look at its new features, the improvements and refinements that have been added for your pleasure, convenience and comfort.

And it's economical to own and drive too!

Get acquainted with Fiat 1100 the Elegant at your dealer's.

**FIAT**



*The Elegant*



Rs. 8847/- Ex-Factory excluding all taxes.

***All these additional features at no extra cost***

Spare wheel under the luggage boot floor, accessible by raising part of the floor



Rear seat can be folded down to form a floor level with the luggage compartment



Linear scale speedometer on the instrument panel, and glove box with protective rubber moulding



New front grille with embodied fog light, new trafficator and side lights



*Progressively Manufactured by*

**THE PREMIER AUTOMOBILES LTD** Agra Road, Kurla, Bombay 37

T. V. Sundaram Iyengar & Sons (Private) Ltd., West Veli Street, Madurai.
Sundaram Motors (Private) Ltd.. Mount Road, Madras.

పురారాతి మూర్తీ.........మణిక్యాంక చూడామణీ కేవలా, శ్యామ కైరోచనా".

(పాఠాంతరము) అమరంగ ననహంబులం బాదిగా నొండె... (ప్రథమపాఠము ననహములని, ద్వితీయపాఠము సనహములని చెప్పు చున్నది.)

కావ్యాలంకార చూడామణి (విన్నకోట పెద్దన)
మఱియు ననియత పాదంబు దండకంబు.
అనంతుని ఛందోదర్పణము —

* కృతివాది ననహంబు లొండెం దకారంబు లొండెం బ్రకల్పించి యామీఁద నెల్లన్ దకార ప్రధానంబు గుర్వంతమై క్రాల విచ్ఛానురూపావధిం జేర్చి నిర్మించుచో నించి తత్తద్గణవ్రాతమున్ వృత్తి శ్రవ్యప్రాస ధుర్యంబులై యర్థవర్యంబులై మోదితార్యంబులై పాథు పారస్యహార్యంబులై రీత్యలంకారవంతంబులై పుష్టిమంతంబులై యింపు లంతింతకుం బార గల్పింపఁగా దండకంబు ల్మనన్మండలం బయ్యె...విశ్వేశ్వరా విశ్వంభరాధీశ్వరా. (8 ఉల్లాల)

అనియతాక్షరంబైన దండకము.
సిరి సేలు రసికుండు శ్రీవత్సవక్షుండు నీరేరుహాక్షుండు నిత్యాసద్యక్షుండు త్రైలోక్య సంరక్షణోపాయదక్షుండు మాపాలిదేవుండు ధీరుండు దారుం డితం డిచ్చు మాయిచ్చకు న్వచ్చు సౌఖ్యమ్ము లంచు న్నదిం గోరి పెద్దల్ సకారంబులో సంగతంబై నహం బాది నొండెన్, దకారాదిగా నైన, లోనెల్లచోటన్ దకారంబులం జెల్లజెందన్ గకారావసానంబునై దండకాకార మేపారఁ గీర్తింతు రెల్లప్పుడున్.

లక్షణసార సంగ్రహము (చిత్రకవి పెద్దన)—3 ఆశ్వాసము.
క॥ దండకవిధములు పెక్కులు
దండిగఁ గలవవి చతుష్పదస్ఫురితములై
† యుండెడి వనేకపదముల
నుండెడివిక వాని విను సమున్నతచరితా
నగణయుగముమీఁదటం దేరు రేఫల్ దగన్ జండవృష్ట్యాఖ్యయౌ దండకం బౌ హరీ.

నయుగముపయి రాష్టకంబైనచో నర్ణమౌ దండకంబొప్పు నో యంబుజాకంజనేత్రాత్మజా.

మొదట ననలమీఁదటం దొమ్మిదౌ రేఫలున్వ్యంగ నా
దండకంబర్ణవం బంద్రు...బుధు లఘువులపైని రేఫల్ పది
న్నిల్పఁగా వ్యాళ నామంబుతో దండకంబౌ...సుహాముఖ
లఘువుల్ రముల్ రేఫ లీరైదు జీమూత మన్దండకం బయ్యె....
రసలఘువులమీఁదఁ బంద్రెండు రేఫల్ దలిర్పంగ లీలా
కరం బన్న యాదండకంబు న్దగున్...

నయుగళీమును రేఫయుక్ రేఫలీరాఱు నుద్దామమౌ దండకంబౌ...నయుగళీపయి నెన్నఁ బద్నాలుగు రేఫల్ క్రమంబొప్పఁగా శంఖమన్దండకం బెందు నందంబగున్

నగణముతోడ నీకీతితో రేఫలేడాది గాఁగా గణం బంక్తి నొక్కొక్క పెక్కించినన్ జండవృష్ట్యాదులౌ దండకంబుల్ దగున్ రీతి నేకోనసాహస్ర పర్యంతమై యేకపాదంబులం గూర్పఁగా వచ్చు గాకుండె నేని జతుష్పాదయుక్తంబుగాఁ జేయఁగావచ్చు; నీలాగు నన్నద్వయం బాదిగాఁ జేసి యామైఁ బరోదేవతం బౌ గణత్రేతి (యగణము) యేడాదిగా నేపదంబందు నొక్కొక్క పెక్కించి యేకోనమైనట్టి వేయింటిసంఖ్యల్ ప్రవర్తిల్లఁగా దండకంబుల్ వినిర్మింపఁగావచ్చు; నద్వంద్వము న్మాని యాదిన్ భోదైవతంబౌ గణంబుంచి (తగణము) యెంతేఁ దకారంబులున్నిండ నస్వేచ్ఛగాతంబు గానుండఁ గావచ్చు; నింకొక్కటౌ దండకంబున్ సనల్లంబుతో నాదిగాఁ బెట్టి మీఁదం దకారంబులెన్నైన నిచ్ఛాగతిం గూర్చి గాంతంబుగానిట్లు గావింపఁగావచ్చు నోయంబుజ నేయా జయోపాయ...కీశాన్వయాంభోధి చంద్రోదయా"



పైలక్షణసారసంగ్రహములోని దండకలక్షణము చాలవఱకు సమగ్రమనఁ జెల్లును.

ఇందుఁగవి తన నాఁటివఱకుఁ గల సంస్కృతాంధ్ర చ్ఛందో గ్రంథములలోని దండక లక్షణభేదముల నన్నింటిని క్రోడీకరించి వివరించెను.

రంగరాట్ఛందము—
రెండియు దండక వృత్తంబులు దశవిధంబు గల వవి చండవృష్టి, అర్ణ, అర్ణవ, వ్యాళ, జీమూత, లీలాకర, ఉద్దామ, శంఖ, తగణ, యగణ దండకంబులు ప్రశస్తంబులై విస్తరిల్లు. నందు మొదటి చండవృష్టి, దండకమునకు ౨౭ అక్షరము లొప్పునది యెట్టులనిన–

'నగణ యుగముమీఁద రేఫావళుల్ మానిసంఖ్యల్ దగన్ జండవృష్ట్యా మహీశా.' క్రమంబున నర్ణాది దండకములకు నొక్కొక్క రగణ మెక్కుడగా నొప్పుచుండును.

భీమనచ్ఛందమున–'అమరఁగ ననహంబు...' అని యున్నది గనుకఁ బురాతనకవులు తగణ ప్రధానముగానే దండకములు రచియించినారు గనుక నాలాగునను చెప్పవచ్చును. (4-185)

కాస్తాకవి రఘునాథయ్య లక్షణదీపిక, పాత్రపి వేంకటరమణకవి లక్షణశిరోమణి మున్నగు లక్షణ గ్రంథములందుఁ బైయంశములే రచితములై యున్నవి.

‡సరసాంధ్ర వృత్తరత్నాకరము. (వెల్లటూరి లింగయ్యమంత్రి)
క. హగణంబుల, నగణంబుల, సగణంబులఁ, దగణములను
సర్కవిజనముల్
తగు ననఁగను దండకములు, నొగి నాలుగు విధము లొనరఁ
జెప్పెదఁ గృష్ణా (?)

---

* 'కృతివాది ననహంబు'లని యుండవలయునని యీ లక్ష్యమునుబట్టియు, ననంతుని లక్ష్యలక్షణములబట్టియుఁ దెలియు చున్నది. 'ననహ' గణత్రయము చేరి యొకటిగా మొదట రావలయు నని పై లక్షణముల భావము.

† 'యుండెడివి యేకపదముల' అని సవరించుట యుక్తమని తోఁచెను.

‡ అముద్రితము; లిఖితప్రతి మదరాసు ఓరియంటల్ లైబ్రరీలోఁ గలదు. గ్రంథసంఖ్య, డి. 1830

గీ॥ హగణమొక్కటి మొదలుగా హగణములను
దండకముసేయఁ దుద గురు వుండుఁ గృష్ణ.

లక్ష్యము-శ్రీ పతిప మాల్య శైలవాస......భూసుతా హవ్య భక్తలోకపోషకుండ వంచు నేను దండకమ్ముల్ రచియింతు(?) వినుము దండకంబు నిచ్చెదన్.

సగణమొక్కటి మొదలిడి సగణములను
దండకము సేయఁ దుదగురువుండుఁ గృష్ణ.

ఉ॥ జయమాల్యగిరీశ జయాశ్రితపోష...నమస్త్రోవము శ్రీనరసింహా.
తగణమొక్కటి మొదలిడి తగణములను
దండకముసేయఁ దుద గురు వుండుఁ గృష్ణ.

ఉ॥ శ్రీమాలకొండ నృసింహుండు............
నగణ మొక్కటి మొదలిడి నగణములను
దండకము సేయఁ దుద గురు వుండుఁ గృష్ణ॥

ఉ॥ జయ జయ నగ ధర జయ సురరిపు హర
జయ జయ శుభకర...నృహరీ॥

సగణ నగణ హగణ తగణంబు లివి గూర్చి
దండకంబు సేయఁదగును గృష్ణ॥

జయ జయ (రమా) రమణీ ధవ చిన్మయ జయ జయ శుశీల హార్యదంష్ట్రికై నారసింహుండవై రేణుకాగర్భశుక్తిందురత్నంబు చందంబున న్నుద్భవంబై...మాలకొండన్ నృసింహుండవై యుండు లక్ష్మీ సమేతా నృసింహా నమస్తే నమః॥

అప్పకవీయము :—(4. ఆశ్వాస) మాలికావృత్తములు (246 255, 256, 257, 258.)

సీ॥ మాలికావృత్తము లనంగ మఱియు నైదు
దనరు నిరువదియాఱు ఛందములమించి
యల లయగ్రాహి లయవిభాతి లయహారి
గడ సమాజత్రిభంగియు దండకంబు లనఁగ

ఆ॥ ఇది నియమము లేని మహాపథమునఁ గావలసినంత వర్తింపఁ
గొదలేక యమరు దండక మదభ్రేంద్రకయాన తావకోత్తమ
మతులఁ॥

దండకము॥ విచ్చ్యాంస తెల్లన్ హకారంబె కాని నకారంబె కాని సకారంబు కాని వచింపం దగు న్నందుగా నిందుఁ గాదేని యాదిం దకారంబు గల్పించి యామీఁది కల్లం దకారంబులే ముందుగా నిచ్చుచున్నచ్చు సంఖ్యాక నిర్మించి గుర్వంతముం జేసినన్ దండకంబండ్రు, భక్తానురాయా భుజంగేంద్రశాయా...... నమస్తే నమః॥

క॥ దండిగ నేకపదంబుల, మండెడివిన్ వాల్గడుగుల మండెడివిన్ నే
దండాఖ్య దండకముల, పిండువు దనరారుఁ జండ
వృష్ట్యాదికముల్॥

దండక॥ ధూర్తుల్ (?)నకారంబులన్ రెంటిపైన ప్తరేఫంబులుం గూర్చినం జండవృష్ట్యాఖ్య మయ్యెన్, నకారంబులన్ రెంటిపై నష్ట రేఫంబులుం గూర్ప నర్ణాఖ్య మయ్యెన్, నకారంబులన్ రెంటిపై రత్నసంఖ్యాక రేఫంబులుం గూర్చిన న్నర్ణవం బయ్యె, నోలి న్నకారంబులన్ రెంటిమీఁదన్ దశఖ్యాత రేఫంబులుం జెప్పినన్ వ్యాళమయ్యెన్, నకారంబులన్ రెంటిపై రుద్రసంఖ్యాక రేఫంబులు న్నిల్ప జీమూత మయ్యెన్, నకారంబులన్ రెంటిపై నొప్ప పండ్రెండు రేఫంబులుం జెంది లీలాకరం బయ్యెఁ, జేర్చ న్నకారంబులన్ రెంటిపై మించు పద్మూఁడు రేఫంబు లున్నంత నుద్దామ మయ్యెన్, నకారంబులన్ రెంటిపై రూఢిఁ బద్నాల్గు రేఫంబులన్ శంఖ మన్దండకం బయ్యె; నీరీతితోడ న్నకారంబులన్ రెంటి తర్వాత నేఁడాదిగాఁ గా రకారంబు లొప్పారఁగా సంఖ్య నొక్కొక్క టెక్కించి కావించినం జండవృష్ట్యాది నానా లసద్దండకంబుల్ పిపాలించుఁ గాకుండె వాల్గంభ్రములం జేయఁగావచ్చు, నీరీతి నేకోనసాహస్ర పర్యంతముం గూర్చి యిచ్ఛావిధిం జెప్పఁ గావచ్చు* గాంతంబుగా రాధికాజార......దేవా నమస్తే నమః॥

ఈపై తెలుఁగు లక్షణ పరంపరలవలనఁ దెలియఁదగు దండక లక్షణముల సార మీ క్రింద సంగ్రహించెద.

(1) తొలుత వరుసగా నవహగణములు, తర్వాత నిచ్చవచ్చినన్ని తగణములు, తుద గురువు నిల్పుట (కవిజనాశ్రయము)

(2) నవహాలపై తగణములు తుద గురువు (చూడామణి, ఛందోదర్పణము, లక్షణసార సంగ్రహము.)

(3) తగణములు తుద గురువు (ఇట్టి తగణదండకములే సాధారణముగాఁ దెలుఁగులోఁ జాలవఱకుఁ గనవచ్చెడు.)

(4) నగణద్వయముపై నేడు మొదలుకొని యిచ్చవచ్చినన్ని రగణములు నిల్పుట (ఇందు విభేదములే చండవృష్ట్యాదులు; సంస్కృతమున నిట్టి రగణదండకములే ప్రచురములుగా నున్నవి-లక్షణసార సంగ్రహము, అప్పకవీయము)

(5) నగణయుగముపై యగణములు (లక్షణసారసంగ్రహము)

(6) హనసగణములలో నేదియొక్కదానితో నైన మొదలుపెట్టి తర్వాతఁ దగణములు యథేష్టముగా నిల్పి గుర్వంతముగా రచించుట, (ఇది యప్పకవి యొక్కఁడే చెప్పె; దీని కాకరము మృగ్యము. నవహాలో నసహాలో వరుసగాఁ గూర్చి తగణములతో దండకము రచించుటయే తెనుఁగు సంప్రదాయముగాఁ గన్పట్టుచున్నది. నవహాలలో నొకానొక గణమును మాత్రము నైకొని తర్వాతఁ దగణములు నిల్పి దండకము రచించు పద్ధతి ప్రాచీన లక్ష్య లక్షణముల యందును గోచరింపకున్నది.

(7) హ, న, స, త గణములలో నొక్క గణముతోనే దండక మంతయు గుర్వంతముగా రచించుట. (ఈ లక్షణ విశేషము సర్వాంధ్ర వృత్తరత్నాకరమందు మాత్రమే చెప్పఁబడినది. ఇందు తగణదండకము సకల లాక్షణిక సమ్మతము, తదితరములకుఁ బ్రామాణ్యము మృగ్యము.)

---

*నయుగముమీఁద రేఫలు నిల్పుటయే దండక లక్షణమైయుండ మరల దుదగురు వేల చెప్పవలయునో? తగణదండకముం దైనచో గాంతంబుగాఁ జెప్పుట యుక్తము.

మఱి కవిజనాశ్రయ మతానుసారము నవహాలతో ప్రారంభించి తగణములు నిల్పి సర్వాంతము సేయుదుమేని యది సంస్కృత లక్షణోక్తముగు నగణద్వయముపై రగణములఁ గూర్చుటయే యగును. చూడుఁడు:—

న న హ త త త త
అమరఁ గనన హాంబు లందాది గానొండెఁ గాకేని యాదింద
త త త త త త త గ
కారంబులిమ్మైగ గారావసానంబు గాదండకంబంద్రు దీనింగవుల్॥
న న ర ర ర ర
అమరఁ గనన హాంబులం దాదిగా నొండెఁగా కేనియా......
ర ర ర
......దండకం బంద్రు దీనింగవుల్॥

న న ర ర లే– న న హ త గ లుగా భీమన చెప్పియుండును. తర్వాత న న హ పాఠము వ్రాఁతలో స న హ గా మాఱియుండును. విన్నకోట పెద్దన యందులకుఁ దగినట్లు 'కృతిసాది సనహంబు' లని రచించియుండును. దానినే యనంతాదు లనుసరించిరి కాఁబోలు. ఇంతకు 'అమరఁగ ననహము' లను పాఠము 'అమరంగ ననహ'ము లని మార్పులనొంది తదనుగుణముగా 'అమరంగ సనహ' మని కాల క్రమమున సవరింపఁబడి స్థిరపడి యుండును.

తెనుఁగు వాఙ్మయములో న న ర ల తోడి దండకములు, స న హ ల తోడి దండకములు, తగణ దండకములు గానవచ్చెడు. ఈ దండకములను నేకపాదముగా నేని చతుష్పాదముగా నేని వ్రాయవచ్చు. ఇం దొక్కొక్క పాద మేకోనసహస్రాక్షరపర్యంతము ఘటింప వీలునని లక్షణము చెప్పుచున్నది. అనఁగా నగణద్వయముమీఁద 331 రగణముల వఱకేని, తగణ దండకములందు 333 తగణముల వఱకేని దండక పాదము వ్రాయవచ్చునని తెలియఁదగు.

## తెలుఁగు దండక వాఙ్మయము:

మొదట గ్రంథములలోని దండకములఁ గొన్నింటిని జేర్కొని యవ్వలఁ బ్రత్యేక దండక కృతులఁగూర్చి తెల్పెద.

(1) భారతము-(నన్నయ) ఆరణ్యపర్వము 1-324-తగణ దండకము పాశుపతాస్త్రలబ్ధికై యర్జునుఁడు కావించిన పరమేశ్వరస్తుతి యుందభివర్ణితము. ఇదియే తెలుఁగున గ్రంథస్థమగు ప్రప్రథమదండకము. ఎఱ్ఱన తిక్కనల భారత భాగములలో దండకములు లేవు; తిక్కన నిర్వచనోత్తర రామాయణమందును దండకము గానరాదు.

(2) నృసింహపురాణము (ఎఱ్ఱన)-5-111, నృసింహస్తుతి; తగణదండకము.

(3) మార్కండేయ పురాణము (మారన) 6-224 దేవీస్తుతి-తగణము.

(4) విక్రమార్క చరిత్ర (జక్కన) 2-59; సంస్కృతభావ కాళీదండకము–ననరగణములు–ఏకపాదము.

(5) శృంగార నైషధము (శ్రీనాథ) 4-138, సంస్కృతము, సరస్వతీ దండకము; ననరగణములు, నాలుగుపాదములు.

(6) కాశీఖండము (శ్రీనాథ) 7-74; 7-204; ననరలు.

(7) హరవిలాసము (శ్రీనాథ) 6-57; నరలు.

(8) భోజరాజీయము (అనంతామాత్య) 7-25.

(9) వీరభద్ర విజయము (పోతన)-4-179.

(10) భాగవతము (పోతన) 3-203.
10-పూర్వ-1233-అక్రూరదండకము. (తగణ)

(11) సింహాసనద్వాత్రింశిక (కొఱవి గోపరాజు) 4-24; నిరోష్ఠ్యదండకము, జయకృష్ణజయకృష్ణ కృష్ణధీరా......(ననహత గణములు).

(12) మైరావణ చరిత్ర (మాడయ) 3-182.

(13) రాజశేఖర చరిత్ర (మల్లన) 2-39 ననరలు-2 పాదాలు,

(14) పారిజాతాపహరణము (నంది తిమ్మన) 3-38, ననరలు-2 పాదాలు.

(15) కాళహస్తి మాహాత్మ్యము (ధూర్జటి) 1-146 తగణము.

(16) ఉద్భటారాధ్య చరిత్ర (తెనాలిరామలింగ) 3-28 తగణము

(17) పాండురంగ మాహాత్మ్యము (తెనాలి రామకృష్ణ) 4-77 (ననరగణములు-నాలుగు పాదములు; దండకావసానమున రగణముపై గురువు)

(18) ఘటికాచల మాహాత్మ్యము (తెనాలి రామకృష్ణ) ద్వితీయాశ్వాసాంతము-నృసింహస్తుతి తగణము

(19) సుదక్షిణాపరిణయము (తెనాలి అన్నయ) 2-78 ననరలు (సంస్కృతము)

(20) కవికర్ణరసాయనము (సంకుసాల నృసింహకవి) 6-93 తగణము

(21) కళాపూర్ణోదయము-(పింగళి సూరన) 1-80 తగణము.

(22) పంచతంత్రము (దైవరాజు వేంకటనాథ) 1-645, తగణములు.

(23) రుక్మిణీ పరిణయము (కూచిమంచి తిమ్మన) 4-33 శివ స్తుతి, తగణములు, సంస్కృతము.

(24) రసికజనమనోభిరామము ( ,, ) 4-179.

(25) రాజశేఖరవిలాసము ( ,, ) 3-149 ననరగణములు, ఏకపాదము.

(26) నీలాసుందరీ పరిణయము ( ,, ) 2-41 ననరగణములు.

(27) అచ్చ తెనుఁగు రామాయణము ( ,, ) యుద్ధకాండ 161. (అరిది దొరదా నీవు రాయంచ తేజీవజీరుండవై) సనహ లపై తగణములు.

(28) కవిరాజమనోరంజనము - (కనుపర్తి అబ్బయ) 4-161 - తగణములు

(29) అనిరుద్ధ చరిత్ర (కనుపర్తి) 4-97

(30) ఉత్తర రామాయణము (కంకంటి) 7-435 తగణము

(31) అచలాత్మజాపరిణయము (తిరుమల బుక్కపట్టణపు వేంకటాచార్యులు) 1-48, న న ర లు. 4 పాదములు, మహాలక్ష్మీ దండకము-సంస్కృతము.

(32) ప్రబంధరాజము (గణపవరపు వేంకటకవి)
148 పాదచతుష్కము-న న-9 రలు.
332 సమగణ దండకము-న న రలు ఏకపాదము.

379 దండకవృత్త దండకగర్భిత సీసము - అన్నియు రగణములే.

(33) యామినీపూర్ణతిలకావిలాసము (తెళ్ళపిళ్ళ నరసకవి) 6-37

(34) వాల్మీకి చరిత్ర (రఘునాథ రాయలు)

(35) మన్నారుదాసవిలాసము (ప్రబంధము-రంగాజమ్మ) - మోహినీ దండకము.

(36) శశిరేఖాపరిణయము (అప్పప్పకవి) 5-12

(37) సమీరకుమారవిజయము (పుష్పగిరి తిమ్కన) 4-145, నిరోష్ఠ్యతగణ దండకము.

(38) సాంబోపాఖ్యానము (రామరాజు రంగప్ప) 3-78, తగణములు.

(39) సానందోపాఖ్యానము (శివరామకవి) 1-39 తగణము.

(40) రుక్మిణీ పరిణయము (సత్యవోలు భగవత్కవి) లక్ష్మీ దండకము.

(41) అచ్చాంధ్రనిరోష్ఠ్య దాశరథిచరిత్ర-2 పాదాలు, నవరలు

(42) విశ్వేశ్వరీయము (కొక్కొండ వేంకటరత్నముపంతులు) 3-206 విల్వనాథస్తుతి-తగణము,

(43) ఆంధ్ర వాల్మీకిరామాయణము (వావిలికొలను సుబ్బారావు)-సుందరకాండము-తగణము.

ఇట్లు మఱియెన్నో గ్రంథములలో దండకములు గలవు. కొన్నింటినే పైనిజూపితి. ఇవియన్నియు సాధారణముగా భగవత్ స్తుతి వర్ణనాత్మకములే యైయున్నవి. తెలుఁగు కవులు పలువురు దండకముల సంస్కృతములో రచించుట గమనార్హము.

## ఇఁక ప్రత్యేక దండక కృతులు:

ప్రత్యేకముగా వెలసిన తెలుఁగు దండకకృతులలో నుపలబ్ధము లయినవానిలో భోగినీదండకము ప్రథమమనఁ జెల్లును. దీనిని బమ్మెరపోతన చిన్నతనమున రాజప్రీత్యర్థము శృంగారమయముగా రచించెనందురు. 'ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి' ఇత్యాదిగా రాజుల దూషించిన నరస్తుతివిముఖుఁడును బరమభాగవతుఁడు నగు పోతన సర్వజ్ఞసింగభూపాలున కంకితముగా భోగినీదండకము రచించె ననుట విశ్వసనీయముగాదని కొందఱు విమర్శకుల వాదము. ఆ వాదోపవాదములతోఁ బ్రస్తుతము మన కిటఁ బనిలేదు. ఆ దండకము తుది పద్యమువలనఁ దత్కర్త పోతన యని తెలియవచ్చుటయే కాక పోతన భాగవతశైలి యందు స్పష్టముగాఁ గానవచ్చుచున్నది. కవి బాల్యమున నిట్టి కృతి వినిర్మించెననుటలో విప్రతిపత్తి యుండదని నా యభిప్రాయము. దండకకృతు లసంఖ్యాకములు తెలుఁగులో రచితములైయున్నవి. అందుఁ గొన్ని ముద్రితములు, పెక్కులు వెలుఁగునకు రాలేదు. మఱికొన్ని లిఖితములునుగాక యిప్పటికిఁ బెద్దలనోట నిలిచియున్నవి. ఇంకెన్ని కాలగర్భమున మఱుఁగుపడెనో యెఱుఁగరాదు. కొన్ని దండకముల కర్తలెవరో, తద్రచనాకాల మెయ్యదియో నిర్ణయింప వీలులేదు. నా యెఱిఁగిన కతిపయ దండక కృతుల అకారాది వర్ణక్రమమున నీ క్రిందఁ బొందుపఱచెద.

(1) అంకమ్మ దండకము - సాంక్రామికవ్యాధ్యధిదేవతాస్తుతి. *(D. నెం 1972)

(2) అమ్మవారి దండకము - శక్తిస్తవము. *(R. నెం 242)

(3) „ „ అలవెల్లి సంజీవరాయకవి (R. 560)

(4) „ „ †చిత్రగుప్త లక్ష్మీనృసింహాఖ్యుఁడు (దండక రత్నములు)

(5) „ „ ‡(చాకలిపేట వెస్టువార్డు కంపెనీ ప్రచురణ)

(6) అష్టభాషా దండకము - తాళ్లపాక చిన తిరుమలాచార్యులు (ఇందు తెలుఁగుభాష చేర్పఁబడలేదు)

(7) ఆంజనేయ దండకము - వాసుదేవకవి (వావిళ్ల ముద్రితము - జి. 2035 హనుమద్దండక మిదియే)

(8) ఆంజనేయ దండకము (R 795)

(9) ఈశ్వరదండకము - లక్కాజేనీలయ్య (R 560)

ఈ పేరిలో ముద్రితమై యున్న దండక మొకటిగలదు. అది నన్నయ భారతారణ్యపర్వములోనిదే.

(10) కనకదుర్గ దండకము - నారసింహుఁడు - (D 1976)

(11) కాళహస్తీశ్వర దండకము - విశ్వనాథ పుత్త్రుఁడు ధూర్జటి - (D 1977)

కాళహస్తీశ్వరుని వేశ్య వలచుట యిందలి విషయము.

(12) కాళికాదండకము - గుండు జగన్నాథదాసు (దండక రత్నములు)

(13) కూడేరు సంగమేశ్వరదండకము - కూడేరు గ్రామములోని సంగమేశ్వరస్వామితిరునాళ్ళ విశేషములు హాస్యప్రధానముగ వర్ణితము (R 786)

(14) కృష్ణదండకము (D 1978) కృష్ణుఁడొక శరద్రాత్రి వేణుగానము సేయుచుండఁగా బరవశలై గోపిక లిండ్లు విడిచి తన్నన్నిధికి వచ్చుటయు, నందులకుఁ గృష్ణుఁడు వారిని మందలించుటయు నిందలి విషయము.

(15) కృష్ణదండకము (D 1979) - కృష్ణస్తుతి.

(16) „ (R 924) కూచిమంచి తిమ్మకవి - కృష్ణలీల లిందు వర్ణితము.

(17) „ కేశవమళ్ళ రంగశాయి.

(18) గండవరపమ్మ దండకము - చేజర్ల నారాయణకవి, (చూ. చాటుపద్య రత్నాకరము - శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి సంపాదితము)

(19) గణేశ్వర దండకము - స్తుతి (D 1980)

(20) గ్రామ దేవత దండకము - (D 1981)

---

* (D) Descriptire Catalogue of Telugu Manuscripts.

(R) Trennial Catalogue — Madras Govt. Oriental Manuscripts Library.

† దండక రత్నములు-కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు-రాజమంద్రి వారి ప్రచురణ

‡ వెస్టువార్డు అండ్ కంపెనీ - చాకలిపేట - మదరాసు - ఈ కంపెనీ వారు పెక్కు దండకముల ముద్రించిరి.

(21) చంద్రాననాదండకము - భోగినీదండకము రీతి పుదుక్కోట సంస్థాన ప్రభువులైనట్టి రఘునాథ తొండమాను రాజున కంకితముగా ఆంధ్రభాషార్ణవ కర్త నుదురుపాటి వెంకనార్యుని పుత్త్రుఁడు సాంబశివకవి రచించినది. (చూ. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము - శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు - (పుట-399)

(22) చంద్రాననా దండకము - పై రఘునాథ తొండమాను పుత్త్రుఁడు పుదుక్కోట ప్రభువు రామచంద్ర తొండమానున కంకితముగా నుదురుపాటి వెంకన కవి పౌత్త్రుఁడు చిదాకార కవి రచించినది. (చూ. దక్షిణ...నిడుదవోలు వారు - పు 389)

(23) చోళసింహపురరథోత్సవదండకము—కొల్లం సీతారామ కవి. ఇందు ఘటికాద్రిక్షేత్రమని ప్రసిద్ధిఁగన్న చోళలింగ(సింహ) పురములో జరిగెడు నరసింహస్వామి తిరునాళ్ల విషయ మభివర్ణితము—ముద్రితము (19 శతాబ్ది)

(24) జమాబందీ దండకము—వద్దిపర్తి కోనరాట్కవి.

(25) జ్ఞానాంబా దండకము (వెస్టువర్డు కంపెనీ-ముద్రితము)

(26) తారావళీ దండకము—నైషధం కమలాపతి—వాలిపాటి వేంకటేశ్వరస్వామియొక్కయు వారి దేవేరులయొక్కయు శృంగార లీలలు వర్ణితములు. (D 1982)

(27) తిట్టు దండకము—(D 1983) ఎవఁడో తిట్టఁబోతు తనకు సరిగా సంభావన యియ్యలేదని యొక కోమటిని దిట్టిన తిట్ల దండకమఁట.

(28) తిట్ల దండకము—పోలిపెద్ది వేంకట్రాయ కవి-కార్వేటి నగర సంస్థానము—వేణుగోపాల లావణ్య శతక ద్వయకర్తయితఁడే. కోవూరి రామయయను వానిని దిట్టుచుఁ జెప్పిన దండకమిది; ఇందుఁ గొంతిభాగమే లభించెను; అముద్రితము (కవి కాలము క్రీ. 1860—84)

(R 105) తిట్టు దండక మొకటిగలదు—'విజయనగర సంస్థానమునఁ బూసపాటివారు బ్రాహ్మణుల కొసఁగిన భూములకుఁ గస్తూరి యప్పయ యను వాఁడు విఘాతము గలిగించుచుండఁగా నెవరో తిట్టుచుఁ జెప్పినది.' అని యీ దండకముం గూర్చి వ్రాయబడి యున్నది. ఇది పై D 1983 దండకమునకు భిన్నమగునో కాదో పరిశీలింపవలసి యున్నది)

(29) తిరునాళ్ల దండకము-(R 717)-వెంకటగిరి రాజధానిలో వేంచేసియున్న కాశీ విశ్వనాథస్వామి వారి తిరునాళ్ల వైభవము వర్ణితము.

(30) త్రిపురారి దండకము—నెల్లూరి వీరరాఘవ కవి.

(31) త్రిస్థలీ దండకము—'విజయనగర హేమకూటంబున న్నిల్పి' యని నంది తిమ్మన చెప్పెనని యప్పకవీయమునఁ గలదు—(4—78)

(32) దేవీ దండకము—శివశక్తిస్తుతి (D 1984)

(33) ,, ,, —దేవాంగజాతివారి మహత్త్వము దెల్పునది (D 1985)

(34) దేశమ్మవారి దండకము — కోదండరామాభిధానుఁడు (D 1985) కలరావ్యాధి యధిదేవతను స్తుతించుట యిందలి విషయము.

(35) ద్రౌపదీ దండకము—(ముద్రితము—వెస్టువర్డుకంపెనీ)

(36) నాగేంద్ర హారతీదండకము (R 344)

(37) నీలకంఠ దండకము వనం నరసింహరాయకవి

(38) నూకాలమ్మ ,, పుల్లయ్య

(39) నృసింహ ,, (R 351)

(40) ,, ,, (D 1987) - ముంగరఅప్పన్న—ప్రహ్లాదచరిత్ర.

(41) ,, ,, ఏనుఁగు లక్ష్మణకవి

(42) పద్మావతీ ,, చంద్రకవి (మైసూరు ప్రభువు కృష్ణభూపాలాశ్రితుఁడు)

(43) పద్మినీ ,, (వెస్టువర్డు కంపెనీ)

(44) పార్వతీ ,, తక్కెసీల వెంకన్న

(45) పైఁడితల్లి ,, (R 795) గ్రామదేవతాస్తుతి

(46) పోగాకు ,, (D 1990) హాస్యరసాత్మకము

(47) పోలమ్మ ,, (D 1991)—బాగడి మల్లకవి—గ్రామదేవతాస్తుతి

(48 పోశేరమ్మ ,, ముదుంబై వేంకట కృష్ణమాచార్యుఁడు

(49) బృహన్నాయికా ,, నుదురుపాటి వెంగనకవి—(D 1992)
పుదుక్కోటలో వెలసిన బృహదంబికపై నప్పటి ప్రభువగు కోటి రఘునాథభూపాలుని ప్రార్థనాది వర్ణనాపూర్వకముగా రచించినస్తుతి దండకము.

(50) భగవద్దండకము (దండకరత్నములు - ముద్రితము)

(51) భద్రాద్రిరామ ,, రాయ జగపతిరాజు (చూ. కందుకూరి కవులచరిత్ర-ఏనుఁగు లక్ష్మణకవి-పు 417)

(52) ,, ,, (R 434)

(53) భల్లాణ ,, నడిమింటి రామయోగి (R 795)

(54) భాషీయ ,, గుద్దూరి నరసింహశాస్త్రి (ఇందు అహోబలస్వామి తిరునాళ్లలోని జనుల వివిధభాషల తీరులు చక్కఁగాఁ బ్రదర్శింపఁబడినవి)

(55) భాస్కర ,, (ముద్రితము - వెస్టువర్డు కంపెనీ)

(56) భోగినీ ,, బమ్మెరపోతన – (రేచర్ల వంశ్యుఁడగు సర్వజ్ఞ రావు సింగభూపాలుని వేశ్య యొకతె వలచిదక్కించుకొనుట యిందలి విషయము.)

(57) మహాశక్తి దండకము (దండకరత్నములు)

(58) మహామారి ,, (వెస్టువర్డు)

(59) మాని ,, మల్లికార్జున పండితారాధ్యులు. శైవమత వ్యాప్తిగావించిన పండితత్రయములో నొక్కఁడు; శివతత్త్వ సారకర్త. కాలము 12 శతాబ్ది. 'మలయ రాజీయంబు మాని దండకము...శతకంబు శివతత్త్వ సారంబు' ఇత్యాది కృతుల రచించెనని పండితారాధ్యచరిత్రలో సోమనాథుఁడు సూచించె (పర్వతప్రకరణము. పు 482.) ఇది తెలుఁగో సంస్కృతమో తెలియదు.

(60) యమధర్మరాజ దండకము—(వెస్టువార్డు కంపెనీ—ముద్రితము)

(61) రంగనాయకదండకము ,, ఉయ్యాలవాడ నారాయణ కవి (D 2002) భోగినీదండకము రీతి శృంగారరసమయముగా శ్రీ రంగనాథస్వామి పేర రచితము; స్వామి శృంగారవిలాస మభివర్ణితము.

(62) రాజగోపాల దండకము—విజయరాఘవ నాయకుఁడు (తంజావూరి రఘునాథ రాయల కుమారుఁ డితఁడు)

(63) రామదండకము—స్తుతి (D 2004)

(64) ,, ,, ,, (D 2005)

మరియు R 434. R 884 రామదండకములుగలవు. ఇవి పై వానికి భిన్నములు లేమో?

(65) ,, ,, — రామదాసు (గోపన్న)

(66) రామలింగేశ ,, (D 2006) శివస్తుతి.

(67) రామానుజ ,, (D 2007) ఆచార్యస్తుతి

(68) రుక్మిణీనాథ ,, (D 2009) కృష్ణస్తుతి

(69) లక్ష్మి ,, (R 795) కామేశ్వర కవి

(70) లఘుశక్తి ,, దివ్యభాష్యం పుల్లయ్య (దండకరత్నములు)

(71) విఘ్నేశ్వర ,, (D 2012) నిత్యమాంబాపుర విఘ్నేశ్వర స్తుతి

(72) ,, ,, (D 2013) నాగమాంబాపుర ,,

(ఈ పై రెండు విఘ్నేశ్వర దండకములును 19 గణేశ్వర దండకమును ప్రారంభములం దొకరీతి గాఁ గానవచ్చెడు; ఒకదానిం జూచి మరొకటి రచితము గాఁబోలు. విఘ్నేశ్వరదండకమిట్టి దొకటి దండకరత్నములలో ముద్రితమై యున్నది, దానికర్త కొంత రాజాన్వయుఁ డసురామాభిధానుఁడు).

(73) విద్యావతీదండకము—గణపవరపు వేంకటకవి (ముద్రితము) భోగినీదండకమురీతి రచితము. పాండ్యమండలాధీశుఁడు ముద్దళఘురి (క్రీ. శ. 1659-1682) విద్యావతియను వేశ్యను ప్రేమించుట యిందలి విషయము. కవి కాలనిర్ణయమున కీకృతి యెంతయుఁ దోడ్పడుచున్నది. ఈకవి ప్రసిద్ధకృతి ప్రబంధరాజము; అప్పకవి సమకాలికు డీకవి యని యేర్పడుచున్నది.

(74) విష్ణుదండకము (D 2015) స్తుతి (ముద్రితము-దండకరత్నములు).

(75) వీరభద్రదండకము (D 2016) స్తుతి.

(76) ,, ,, (D 2018) ,,

(77) ,, ,, (R 850) వెల్వరి శంభుమంత్రి (శృంగారము) (వీరభద్రవిజయదండకము—శంకులచోడయ రచన యొకటి యున్నట్లు పండితారాధ్యచరిత్ర పీఠికవలనఁ దెలియవచ్చెడు (పుట 871.)

(78) వేంకటేశ్వరదండకము - (D 2019) స్తుతి.

(79) ,, ,, (D 2020).

(R 205 లో నొకదండక మున్నది.)

(80) శక్తిదండకము (D 2021).

(81) ,, ,, (R 880).

(82) శరభేశ్వర ,, (D 2022) కాంచిమంచిపురిలోని వీరభద్రేశ్వర స్తుతి.

(83) శివ ,, (D 2023) శివస్తుతి.

(84) ,, ,, (D 2024) ,,

(85) ,, ,, (D 2027) ,,

(86) శృంగార ,, తాళ్లపాక పెదతిరుమలాచార్యులు (క్రీ. 1463-1553) వేంకటేశ్వరస్వామిపైఁ జెప్పినది; శృంగార రసము-ముద్రితము.

(87) శృంగారిణీ ,, - పుదుక్కోట ప్రభువు రఘునాథుని తమ్ముని కుమారుఁడైన రామస్వామి నృపాలుని నాయకుం జేసి శేషయార్యకవి రచించినది.

(88) శ్రీకృష్ణ ,, - సత్యవోలు భగవత్కవి (వావిళ్ల ముద్రితము)

(89) ,, ,, - (దండకరత్నములు)

(90) శ్రీ రంగనాయక దండకము-అద్దంకి లక్ష్మణాఖ్యుఁడు.

(91) శ్రీ రామ ,, ఆడిదము సూరకవి (రామాయణకథ సంక్షేపముగా నిందు వర్ణితము. ఇందు కవియొక్క యుభయభాషాపాండిత్యము విల్లడియగుచున్నది - ముద్రితము - దండకరత్నములు).

(92) ,, - మదిన సుభద్రమ్మ.

(93) ,, - (వెస్టువర్డు కంపెనీ-ముద్రితము.)

(94) సంగమేశ్వర ,, (D 2028) శివస్తుతి.

(95) సర్వకామదాంబా ,, -పుల్లయ (దండకరత్నములు).

(96) సిద్ధేశ్వర ,, వేంకటాచల కవి — రమణయ్యామాత్య పుత్త్రుఁడు. ,, (D 2029).

(97) సూర్య ,, (D 2030) - స్తుతి.

(98) ,, ,, (D 2033)

(R 795, R 844 సూర్యదండకములు గలవు)

(99) సౌవరీ ,, -మేకపల్లి గోవిందయ్య (R 795) గ్రామదేవతాస్తుతి.

(100) హనుమద్దండకము-(D 2038)

(101) ,, ,, (D 2040) ఇట్టిదొకటి ముద్రితము (వావిళ్ల).

(102) ,, ,, శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి.

కన్యకాపరమేశ్వరీ దుర్గాదండకములు గలవని తెలియుచున్నది. ఇటీవల, టీడీ, గాలివాన, దోపిడీ, ధూమశకట, అగ్నిప్రళయాది దండకములు బయలుదేఱినవి. ఇంక నిట్టి వెన్ని కలవో ? *

## దండక సాహిత్య సమీక్ష

తెలుఁగు వాఙ్మయము పురాణ, కావ్య ప్రబంధ, ద్విపద, శతక, దండక, యక్షగాన, నాటకోదాహరణ, గేయ, వచన, శాస్త్రీయ గ్రంథాది వివిధశాఖలతో విస్తరిల్లి విరాజిల్లుచున్నది; కాని దండకములు వాఙ్మయములోఁ బ్రత్యేకశాఖక్రిందఁ బరిగణింపఁదగిన వనుటలో సందియము లేదు. ప్రబంధ ద్విపద శత కోదాహరణాది

* తిరుపతి వెంకట కవుల నానారాజసందర్శనములో - శిక్షింపుఁడీ యుత్సవమును సూచ్చిన (తగణ) దండక మొకటి గలదు.

శాఖలలో ఇతఃపూర్వము కొంత పరిశ్రమ జరిగియున్నది గాని యీ దండకవాఙ్మయశాఖమాత్రము నేఁటివఱ కపరిశీలితముగానే నిలిచియున్నది.

తెలుఁగుకవిత మార్గమని దేశియని యిరుదెఱఁగులు. సంస్కృతచ్ఛందశ్శాస్త్ర సంగతములగు వృత్తములతోఁడి రచన మార్గకవిత. ఇది సాధారణముగా అక్షరగణప్రధానము. దేశీయచ్ఛందోజాతము లగు జాతివృత్తముల రచన దేశికవిత; ఇది మాత్రాగణనిబద్ధము. దండకము సంస్కృతచ్ఛందోజనితమని మున్నే వివరించితి. కావున దండకము మార్గకవితాసంప్రదాయమునకుఁ జెందిన దనవలసినదే. కాని యీ దండకరచన సంస్కృతవాఙ్మయమున విరళముగా నెందో కానవచ్చును. తెనుఁగువాఙ్మయమున సాధారణముగాఁ బ్రతి పద్యగ్రంథమున నిబద్ధమైయుండుట, ప్రత్యేక దండక కృతు లసంఖ్యాకములుగాఁ బండిత పామర లోకమున నవిరళప్రచారము గాంచి యుండుట, యాదికావ్యమగు నన్నయభారతమునఁ బ్రయుక్తమై యుండుట యిత్యాది కారణములచే నిట్టిది దేశికవితయేఁ జేరినదివలెఁ గన్పట్టెడు. తెనుఁగులో దీనివ్యాప్తి ద్విపదవలెఁ బామర సాహిత్యమం దెక్కువ యని చెప్పవచ్చును. కృష్ణ హనుమ ద్విఘ్నేశ్వర, పోలేరమ్మ, నూకాలమ్మ ప్రభృతి దండకములు పల్లెటూళ్ల ప్రజలు పారాయణము చేయుచుందురు. ఎన్నో యలిఖిత దండకములు పెద్దల జిహ్వారంగముల నడయాడుచున్నవి. సంస్కృత భాషలోని దండకములలో నగణద్వయముమీఁద రగణముల కూర్పు గానవచ్చుచుండఁ దెనుఁగులో నేవో కొన్ని ప్రబంధములం దప్ప ముప్పాతిక మువ్వీసము తగణప్రధానములైన దండకములే గోచరించుచున్నవి. ఈ గణభేదము గమనింపఁదగియున్నది. సంస్కృత భాషా పారంగతుఁడు విద్యాదయితుఁడు, ఆంధ్ర కవిత్వ విశారదుండు, నన్నయభట్టారకుండు దండకరచనయందుఁ దనకుముందుండియున్న మార్గసంప్రదాయమును (నవరగణ దండక రచన) విడి తగణమయముగా నేకపాదముగా వ్రాయు క్రొత్తపద్ధతి స్వీకరించుట పరికింపఁగా, నాతఁడు కొంత దేశీయత చేకూర్చెనేమో యని తోఁపక మానదు. తర్వాతి తెలుఁగుకవు లాతని మార్గమునే యనుసరించిరి. సర్వతగణమైన దండకమే తెనుఁగులో సామాన్యమైనది.

అయిదు మాత్రలు గల తగణముల కూర్పుటచే దండకము మాత్రాఛందస్సునకుఁ జెందినదనియుఁ గొందఱి మతము. అప్పటికి నిది దేశికవిత యనవలసి యుండును. చంపకోత్పలవృత్తములు సంస్కృతచ్ఛందోభవములే యైనను వానికి సంస్కృతములోఁ బ్రచారము లేదు. అట్లే కావచ్చు నీ దండకవృత్తముగూడ. ద్రావిడ భాషలలో సంస్కృతభాషా సంస్కార సంపర్కములు మిక్కిలిగా నెక్కొనియుంటచే ద్రావిడభాషాసహజములగు ఛందస్సులే సంస్కృతీయములై కొంతకాలమున కవి యాభాషలోనివి గాను, దానినుండియే ద్రావిడ భాషలకు సంక్రమించినవి గాను గొందఱు భాషాతత్త్వ విమర్శకులు తర్కాణించెదరు. కర్ణాటాంధ్రములందే కాక తమిళమందును దండకము జెలయుచున్నది గదా! నేఁడు ద్రావిడభాషా పదములు కొన్ని వ్యవహారవశమున సంస్కృతభాషయందు గ్రహింపఁబడి సంస్కృతశబ్దములుగానే పరిగణింపఁబడుచున్నవి. అట్లే ద్రావిడఛందస్సులలోని కొన్ని పద్యరీతులు సంస్కృతమునఁ జేరి యా ఛందస్సులందుఁ గాలక్రమమున నెక్కియుండినోపు. ఉదాహరణ వాఙ్మయచరిత్ర యవతారికలో శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు 'తెలుఁగు సాహిత్యములో మహాకావ్యములు, పురాణములు, చంపువులు, ప్రబంధములు మార్గకవిత లనియు; ద్విపదములు, యక్షగానములు, శతకములు, ఉదాహరణములు, దండకములు దేశికవిత లనియుఁ జెప్పనొప్పును' అని యుగ్గడించి యున్నారు.

కావ్యములు ప్రబంధములు చాటుప్రబంధము లని ద్వివిధములు. అందుఁ జాటుప్రబంధములు సంఖ్యాబద్ధములు, అసంఖ్యాబద్ధము లని యిరుతెఱఁగులు. రగడ ద్విపద దండకము లసంఖ్యాబద్ధచాటుకృతు లనఁ జెల్లును. దండకములఁ జాటుప్రబంధముల క్రిందఁ బ్రాచీనాంధ్ర లాక్షణికులు నిర్వచించిరి. చూ—

అప్పకవీయము—కావ్యభేదములు :—

తే॥ అట్టి కావ్యంబు ద్వివిధమై యతిశయిల్లుఁ
బరువడిఁ బ్రబంధ చాటుప్రబంధములన... (1-27)

క॥ కనుఁగొన సంఖ్యాబద్ధం, బు నసంఖ్యాకంబు నాఁగ
ధుని నిరుదెఱఁగై
తనరారుఁ బూర్వకవిమత, మున నా చాటుప్రబంధములు
జలజాక్షా (1-92)

తే॥ వాగ్గు దెగల యుదాహరణములు ముక్త
కాది పంచదశమును సంఖ్యానియతములు
గద్య రగడ ద్విపద దండకములు మంజ
రులును సంఖ్యారహిత చాటువులు నృసింహ (1-30)

కావ్యాలంకార చూడామణి—
కావ్యభేదములు : దండకము.

క॥ ఛందోభవ లక్షణగణ, సందోహ నిబద్ధమగుచు శ్రవణానందా
మందానుప్రాసంబుల, నందంబగు దండకము మహాకవికృతులన్
(4-42)

క॥ ఇది యెల్లను నానావిధ, కవికృత శాస్త్రములచేతఁ
గల్పితములు, చె
ప్పు విధంబులఁ జాటుకృతి, ప్రవరంబులు పరఁగు నెఱుఁగఁ
బడు నొండెడలన్ (4-43)

సరసభూపాలీయమున మాత్రికవి యుదాహరణాది భేదము లను క్షుద్రప్రబంధముల క్రిందఁ జెప్పెను. ఇందు క్షుద్రమనఁగా నీచ మర్థము గాదు. అల్పకృతి, ఖండకృతి యని యెఱుఁగఁదగును.

పై గ్రంథమునకు సన్నిధానమువారి వ్యాఖ్యలో దండకములఁ గూర్చి యిట్లున్నది.—"త, న, స, హ గణములలో నొకటి మొదల నిడి లెక్కనవన్నియుఁ దగణములే కూర్చి తుది నొక గురువు నిడవలెను. యతిప్రాస నియమము లేదు. ఇది గద్యకావ్యమా, పద్యకావ్యమా యని సందేహము గలిగించును. కాని గద్యము గణబద్ధముగా నుండదు గదా! కావునఁ బద్యకావ్యమే. సామాన్యముగా దండకములు స్తోత్రరూపములే. అనఁగా భక్తిరసకావ్యములే. అంజనేయ దండకము మొదలగునవి. కాని పోతన కవి వ్రాసిన శృంగార ప్రధానమగు భోగినీదండకము గూడఁ గలదు." (పుట 265)

కన్నడ భాషలో నాగవర్మ రచించిన ఛందోంబుధిని ఆంగ్ల వివరణముతోఁ బ్రకటించిన కిట్టెల్ పండితుఁడు కొన్ని ప్రత్యంతరములలోని పాఠభేదముల నాధారముగ గొని దండకములు జాతి వృత్తములను మఱియు సైతము సూచించియున్నాఁడు. (చూ. ఆంగ్ల పీఠిక 8-9 పుటలు) అంతియకాక తెలుఁగు దండకము మాత్రాఛందస్సునకుఁ జేరినదిగా గోచరించెడు ననియుఁ జెప్పినాఁడు. (చూ. పై పీఠిక 8 పుట) * ఇందుకు సబలముగా నీ క్రిందివిషయ మాలోచింప వలసి యున్నది. పింగళచ్ఛందమునను వృత్తరత్నాకరమునను షడ్వింశతిచ్ఛందోజాతసమవృత్తములఁ జెప్పిన తర్వాత దండకములు చెప్పఁబడినవి కాని యందెయ్యవి మాలావృత్తములని పేర్కొనఁబడలేదు. మఱి తెనుఁగులోని లయగ్రాహ్యాది వృత్తభేదములు తత్ప్రకరణమునఁ జూపట్టవు.

తెనుఁగు ఛందస్సులలో లయగ్రాహి మున్నగు మాలావృత్త లక్షణంబులు చెప్పుటలో 'ఏకోనచత్వారింశన్మాత్రాగర్భితంబు ద్రింశదక్షరంబులైన లయగ్రాహి' ఇత్యాది విధముగా మాత్రాగణనము సేయబడినది. దీనినిబట్టి మాలికావృత్తములు మాత్రాఛందస్సునకుఁ జెందినవని చెప్పనొప్పు. ఏతత్కారణమున దండకాదులు జాతిపద్యములై దేశికవితాశాఖలోనివిగా సమర్థనీయములగు.

కవిత ఆశు, మధుర, చిత్ర, విస్తరము లని నాలుగు విధములు వీనినే చతుర్విధకవిత లందురు. దండకములు మధురకవితాశాఖకుఁ జెందినవి. 'లయప్రమాణంబుల నొప్పి మృదు మధుర వచన రచనలఁ బ్రసిద్ధంబులైన యవి మధురకవిత్వంబులు' అని లక్షణదీపిక (వారా కవి రఘునాథయ్యకృతము. క్రీ. శ. 1600 ప్రాంతము.) ఇందుదాహరణ యక్షగాన ద్విపదాదులు మధురకవితాభేదములోఁ జెప్పఁబడినవి. కాని దండకములు చిత్రకవిత్వభేదములోఁ జేర్పఁబడినవి. దండకము చిత్రకవిత కాఁజేరదు. మధురకవితలోఁ జేర్పఁబడవలసిన దండకములు చిత్రకవితలోఁ బ్రమాదపతితమై యుండునేమో యని తోఁచెడు. దండకములు గేయప్రధానములు భక్తిరస ప్రధానములగు మతమునకు ముఖ్యాంగములు గానకళకు సంబంధించిన దీ దండకము. 'యథోచితేన తాలేన రాగై రపిచ గీయతే' యని భరతకోశమున నిర్వచింపఁబడినది. దీని నడక లయబద్ధము. సంస్కృతరీతి రగణమయ మన్నను తెనుఁగు రీతిఁ దగణమయమన్నను నిందు అయిదు మాత్రల గణమే భాసించుచు నెటుచూచిన రగణ తగణ యగణములేయేర్పడుచుండును. తెనుఁగువారల హృదయముల నెంతయు నాకర్షించిన పద్యము.

దండకరచన సుఖతమము, పాదనియమము లేదు, యతిప్రాసలు లేవు, గణభేదము లేదు (సంస్కృతమునఁ బాదనియమ మున్నది. తెనుఁగమున యతిప్రాసలు గలవు) § నన్నయాది మహాకవులేకాక, యల్పకవులును బరిగ్రహించినారు. నన్నయ దీనిని స్తుతిపరముగా మొదలుపెట్టె. ప్రబంధకవు లందఱిట్లే రచించిరి. ఇట్టి రచనం జూచియే కాబోలు దండకమను శబ్దమునకు 'ప్రార్థన' యను నర్థ మొసఁగినారు. ఆంధ్రవాచస్పత్య నిఘంటు కారులు భక్తి రసమున కత్యంతము సముచితమైనది దండకరచన. ఇది పారాయణ యోగ్యము. పౌరాణికవిషయములు దండకములో రచితములు. దశావతారస్తుతి పెక్కు దండకములలోఁ జూడవచ్చు. ప్రత్యేక దండకకృతులలో శృంగారాది వివిధవిషయములు విరచితములు. శృంగారరసమునకు భోగినీ మోహినీ విద్యావతీ చంద్రాననాది దండకము లుదాహరణములు. భక్తికిఁ బ్రసిద్ధగాంచినవి శివ, శక్తి, నృసింహ, రామ, కృష్ణ, హనుమదాది దండకములు. తిరునాళ్ళ, జమాబంది, భాషీయాది దండకములు సాంఘికములు. మాకాలమ్మ, పోలేరమ్మ, గండవరపమ్మ దండకములు సాంక్రామిక వ్యాధినివారకాధిదేవతాస్తుత్యాత్మకములు. వీరభద్ర వీరాంజనేయాది దండకములు భయంకరదేవతాస్తుతిపరములు. భాగాకు దండకము హాస్యరసోల్బణమయినది. ఇఁకఁ దిట్ల దండకమువంటి దూషణకృతులఁగూర్చి చెప్పనక్కఱలేదు. ఏవంవిధముగా సకల విషయసంకలితములై నేఁడు దండకములు విలసిల్లుచున్నవి. దండకము, భావోద్రేకమున కనుగుణమైన ఛందముగుటచే నాదిలో భక్తి శృంగారములకే విషయమై వెలసి రానురాను సమస్తరసములకు ధారకముగా నుపయుక్తము గాఁజొచ్చినది. భూతముల భయము పోఁగొట్టుటకు ఆంజనేయ దండకమును, సాంక్రామికవ్యాధులు వ్యాపించునపుడు అమ్మవారి దండకమును మనవారు పారాయణము చేయుదురు. తక్కిన దేవతాస్తుతిరూప దండకము లనుదిన పారాయణ యోగ్యములు. తిట్లదండకమువంటివి వినోదపకసమున వినియోగించును.

నన్నయదండక ముపయోగించెను గాని తిక్కన మధ్యాక్కరమువలె దీనినిసైతము వ్రాయలేదు. ఎఱ్ఱనభారతమున వ్రాయకున్నను నృసింహపురాణమున నీవృత్తమును బ్రయోగించెను. మల్లికార్జున పండితారాధ్యుల మానిదండకము సంస్కృతమో తెలుఁగో తెలియరాదు. అది తెలుఁగేని ప్రప్రథమ దండకకృతి యనవలసి యున్నది. అది తెలుఁగుగాకేని భోగినికే ప్రథమస్థానము.

దండకరచన విశిష్టముగాఁ జెప్పుకొన్న ప్రాచీనకవులు కొందఱు గలరు.

చండవిద్యావతీదండకంబు — గణపవరపు వేంకటకవి (ప్రబంధరాజములో)

రమ్య విశ్వేశ్వరోదాహరణ నృసింహ
దండకాదిస్తుతి ప్రబంధములుగూర్చి
సములలో నుతిమఖ్యాతి నమరినావు
(ఏనుఁగు లక్ష్మణకవి - రామవిలాసములో)

శ్రీరాజిత దండకములఁ జెప్పినవాఁడన్—
సత్యవోలు భగవత్కవి (రుక్మిణీ పరిణయములో)

శతక దండక సత్కృతుల్ ప్రతిభఁ గూర్చి
యుల్ల మలరారఁ బార్వతీవల్లభునకు
భక్తి నర్పణజేసిన భవ్యమతివి –
కూచిమంచి తిమ్మన (శివలీలా విలాసములో)

---

*A Telugu Dandaka seems to belong to the Mora metres (మాత్రాగణములు).

§ The .(Matra) Dandaka or blank verse in a measured prose (six lines), each of which appears as UUI/UUI/UUI/UUI/ (C. P. Brown's Telugu grammar)

ధరరాజగోపాలదండక సందర్భ వైదర్భిగన్న విద్వత్కవీంద్ర విజయరాఘవ నాయకుఁడు (ప్రహ్లాద చరిత్ర - యక్షగానము) మండపాక పార్వతీశ్వర కవి పెక్కు దండకములు రచించె నఁట. గాధేయోపాఖ్యాన ప్రబంధకర్త కేవూరి అనంతయ్య తన తండ్రి లింగకవి 'తారావళి దండకోదులు' రచించెనని చెప్పికొని దండకములను లాక్షణికు లుదహరించి యున్నారు.

అప్పకవి - త్రిస్థలీ దండకము (4-78)
తాతంభట్టు కవిచింతామణి - భోగినీ దండకము.

దండకరచనా పద్ధతి - అందలి విశిష్టత.

సంస్కృత భాషలో దండకములు నగణముతో ప్రారంభ ముగుఁ గాన 'జయ' శబ్దములో మొదలు పెట్టఁబడును. సంస్కృతలో దాహరణములందును జయశబ్దోపక్రమమే కానవచ్చెడు. ఇఁకఁ దెనుఁగులోఁ దగణ దండకము లే సర్వసామాన్యము లగుటచేఁ దెనుఁగు భాషా సంప్రదాయానుసారము శ్రీకారముతోఁ బ్రారంభమగును. శ్రీకారముతో గ్రంథరచనా ప్రారంభణము నన్నయనాఁటినుండి తెనుఁగుసంప్రదాయ మనుట యెల్లరకుఁ దెల్లము. దండకములందు నట్లే శ్రీకారోపక్రమమునకుఁ దగణము మిక్కిలి దక్కఁగా సరిపడు చున్నది. దేవతాస్తుతి పరమగు నన్నయదండకమే కాక, శృంగార రసాత్మకమగు భోగినీదండకము సయితము 'శ్రీమన్మహామంగళా కారు' ఇత్యాదిగా శ్రీముఖమైనది. కేవల స్తుత్యాత్మకములగు తెలుఁగు దండకములు 'నమస్తే నమః' అను శబ్దములతోఁ బూర్తి చేయఁబడుట వాడుక.

శ్రీకార ప్రభావ మీరీతి వక్కాణింపఁబడి యున్నది.

గీ. వేదముల కెల్ల నోంకార మాదియైన
కరణిఁ గృతులకు నెల్లఁ శ్రీకార మాది
గానఁ గవివరు లెల్లను దానిఁ దక్క
నితర వర్ణంబు లిడరు సత్కృతుల మొదల
(అప్పకవీయము 2-354)

కావ్యారంభమున నగణమైనను తగణమైనను శుభప్రదమే.

'నవ్యసుఖప్రదాయి భగణంబు......
ద్రవ్యము సేయుజా......విభూతి నిచ్చుతా
కావ్యములందు నాది నిడఁ గర్తకు భర్తకు నంబుజోదరా
(ఛందోదర్పణము 1-23)

శ్రీనాథాదులు నగణోపక్రమదండకములలో జయపద ముపయోగించిరి.

జయ జయ జనయిత్రి కల్యాణ సంధాత్రి...నైషధము.
జయ జయ జగదంతరానందమూర్తి—విక్రమార్క చరిత్ర

అచ్చతెనుఁగు గబ్బముగుట నీలాసుందరీపరిణయమునఁ గూచి మంచి తిమ్మన 'సిరి' యను శ్రీ శబ్ద వైకృతము నుపయోగించె. "సిరిమగఁడ నిన్నుం దిరం బొప్ప' (2-42)

దండక కవిత:—

తెనుఁగు దండకములు శబ్దాలంకారభూయిష్ఠమై, రసోల్ల సితమై, దీర్ఘసమాసబంధురమై కర్ణపేయమై, యొప్పారుచున్నవి. ఆ కవితామధురిమను సమీక్షింపదొరఁకొన్న వ్యాసము గ్రంథ రూపము ధరించునన్న శంకచే స్థాలీపులాకముగా. దండక భాగములు రెండు మూఁడు నుదహరించెద.

నన్నయ. ఈశ్వరదండకము (భారతము)

శ్రీకంఠ, లోకేశ, లోకోద్భవస్థాన సంహారకారీ, పురారీ ప్రియా, చంద్రధారీ, మహేంద్రాదిబృందారకానందసందోహ సంధాయి, పుణ్యస్వరూపా, విరూపాక్ష, దక్షాధ్వరధ్వంసకా... దేవా నమస్తే నమః

శ్రీనాథుఁడు—కాశీఖండము.

మతియుతఁడు సదా నిదిధ్యాసితవ్యుండు మంతవ్యుఁ డాతండు శ్రోతవ్యుఁ డాతండు ద్రష్టవ్యుఁ డాతండు...రుద్రుండు విశ్వాధి కుం డంచు నామ్నాయసంఘాత మామ్రేడనప్రక్రియం దోరమై యాతనిం జెప్ప సత్యంబు నిత్యంబు శుద్ధంబు బుద్ధం బనంతంబు శాంతంబు...బ్రహ్మంబు దత్తత్త్వమున్ వేదవేదాంత విద్యా మహో వాక్య మీమాంస హంసుల్ విచారింతు రధ్యాత్మ యోగంబునన్ మత్తి వత్స్యంగుళీమానయుం దేహమధ్యాంతరాళావ లావాస గోత్రయా గేహశోహాత్ప్రిభా కేళికామ్యాత నిర్భిన్నషట్పుష్కరీగర్భ విష్కంభ నిష్కంభనీవారశూకోపమాధామ భామచ్ఛటాకోటి కంపాలతా లంఘితద్వాదశాకేంద్ర నిష్యందమానామృతాసార ధారాప్లవాస్పందితానందులై యోగిబృందారకుల్ లీలతో లోనఁ గంద్రాడ నిన్......

## కూచిమంచి తిమ్మన (రసికజనమనోభిరామము)

శ్రీమజ్జగన్నాథ లక్ష్మీమనోనాథ గాధేయ కౌండిన్య శాండిల్య మాండవ్య వల్మీకజ వ్యాస వాసిష్ఠ గర్గాద్య శేషర్షి సంఘాత సంస్తూయమానస్థిరోదార చారిత్ర దూరీకృతామిత్ర మిత్రేందు వేధో మరుత్వజ్జలాధీశ కీనాశ దైత్యేశ వాతార్థపేశానలాహీన ముఖ్యాఖి లామర్త్యకోటీర విస్ఫారతేజో విరాజన్మహారత్నకాంతిచ్ఛటాజస్ర నీరాజితోద్యత్పదాంభోజ భోజావనీజానిజానిర్మలస్వాంత నీత రుహోంత రిక్తలీన ద్విరేఖా ఘనాభా సరోజాతనాభా శరచ్చంద్రికా కుంద బృందారకాహార మందాకినీ హార నీహార హీరేందుకోటీర పాటీర వాక్కామినీ కాశ నీకాశ కీర్తి ప్రకాశా నిరీశా హరీ శార్ఙ్గ పాణీ కృపాణీ కృపాసీరథీ సారథీ ధీర గాండీవభృత్సారథీ......

## భోగినీ దండకము—

శ్రీమన్మహామంగళాకారు, నాకార లక్ష్మీసమాకారు, సమారీమనోరాము రామాంబరీపాది రాజన్యరాజద్యశఃకాముఁ, గామాహితి క్షీరవారాశితారాశి నాగేంద్ర మందార కుందార విందాహితాకాశ కల్లోలినీకాశ విఖ్యాత సత్కీర్తి ముక్తావళీ భూషితాశాంగనాలోక సీమంతు, సీమంతినీ మానసారామవాటీ వసంతున్, వసంతావనీనాథ సంసేవితాంఘ్రిత్పదాంభోజు, వంభోజ రాజీ సుహృత్తేజుఁ, జితోజయప్రాభవోద్దాము, సుద్దామజన్యావనీ భీము, భీమప్రతాపానలాభీల కీలావినిర్మూలితారాతి పాంష్యత్క్ష్మా పాల దుర్వార గర్వాటవీవారు, వారాధిపాహ్యప్రభాభాసురస్ఫార కల్యాణ దుర్వారు...(ముక్తపదగ్రస్త దీర్ఘసమాస రచన యిందు హృదయంగమము)......తద్వైభవంబుల్ విమర్శించి, హర్షించి, సంతోష బాష్పాంబుపూరంబు వర్షించి, కందర్పబాణాహతిం జెంది, లోఁగుంది, మోహించి, సంగంబు నూహించి, యేవేళఁ దల్లిం బ్రబోషింతు, చేలీల భూపాలకుం జేరి భాషింతు,...ఘోషమాలా లికిన్, మందవాతూలికిన్, జంద్రమఃకేళికిన్, కోకిలారావ దంభోళికిన్, జిత్తభూధల్లికిన్, దల్లికిన్ లోఁగి, కామానలజ్వాలల న్వేఁగి, చింతాధరాక్రాంతయై యేఁగి, సంతాపఘూర్ణంబులం గాఁగి.........

(అంత్యానుప్రాస గుంఫిత రసోల్లసిత రచన యిది)

భోగినీ దండక ఛాయలో మోహినీ విద్యావతీత్యాది దండకము లుప్పతిల్లినవి. భోగినిలో భాగవత కవితాశైలియేకాక యందలి వివిధ రచనావిన్యాసములు భాసించుచున్నవి; వానినెల్లఁ బ్రపంచించుట కిటఁ దావులేదు.

ఒక్క విషయము మాత్రము చెల్పెద:—

వేశ్యమాత కూఁతునకు రాజుపై వలపు వారింప యత్నించి పలుకు సందర్భమును బురస్కరించుకొని కవి యిందు రాజదూషణ గావించెను—'రాజుల్ బహువ్యాజులే భోజులే చంచలచ్చిత్తులే క్రూరకార్యోత్తులే నాతివాసక్తులే లోభసంయుక్తులే దోషసంసక్తులే రంధ్రసంవాదులే హీనమర్యాదులే, వారి సేవింపఁగారాదులే కాదులే, వాదులేలా' 'ఇమ్మనుజేశ్వరాధము'లని రాజుల నిరసించిన పోతన శైలిని పైదండక పంక్తులలోఁ బ్రస్ఫుటమగుచున్నది.

పారిజాతాపహరణ పరిమళోల్లాసవ్యాఖ్యలో నందలి దండకము క్రింద వ్యాఖ్యాత యిట్లు రచించె. "ఈదండకమునందలి ముక్తకోమంధ నిష్పంద గోబృందముల్, వ్యక్త గోవర్ధన గావనిష్యంద ముల్; మందమందానుమన్నందనా వేగమున్, కందళన్నీరపారణ్య తీర్థాగమున్; ఘోరకార్మాసురగ్రామణీ శిక్షకా, కౌరవాకర్షిత ద్రౌపదీరక్షకా; ఖేదసందగ్ధ సాందీపనానుప్రదా, వేదశాఖా శిఖాంచత్ప్రవాళత్పదా;' ఈ సమాసయుగళములు సమగణపద విన్యాసలలితములై సుమధుర చరమప్రాస కలితములై చెలువారు. కావున నే దీనికి గణసమక దండక మను పేరు సార్థకము."

(8 - 38, పుట 208)

తిట్ల దండకము — పోలిపెద్ది వేంకటరాయలు.

ఛీ ఛీ ఒరే పాతకా ఘాతకా ప్రేత దుర్నీతి పుంభోగి యుచ్ఛిష్టభుక్ కోఁతవారాంగనా వ్రాతముం బట్టు మాఁతా యిదో చూడరా ధాత నీ వ్రాఁత నాచేతఁ బట్టిచ్చిరా నేఁడు దుర్బీజమా సైజమా సైజమా నీతమా యేర కోవూరిరామా హలామా గులామా......భువిం గల్ల సంకర్లు సుంకర్లు యాకిర్లు పోకిర్లు బొమ్మర్లు ద్రిమ్మర్లు కుమ్మర్లు కమ్మర్లు...జాంద్రలు స్నీంద్రలున్ గోయలున్ బోయలున్ జోగులున్ వేగులున్ బల్లెలున్ గొల్లలున్...జారులున్ చోరులున్ కుక్కలున్ నక్కలున్ గోతులున్ కాకులున్ గోళ్లనుం జేళ్లనున్...నీ యమ్మనుం గుమ్మ నీయబ్బనుం గొట్ట...నీయత్తను న్మొత్త నీయన్న నుందన్న...నీయాలు కామాక్షి నిష్కారణం బూరకే మమ్ము నిందించఁగాఁ జూచి..?యొక్క సాహైన గద్దించి నీ కీర్తి మే ల్బుద్ధిగా దంచు వాదింపరాదా సదా దాని పాదాలకున్ మ్రొక్కుచుం గుక్కపై దానికిన్ లొంగి వెంటాడుచున్ నూకుచున్నం దువే..శంకరుం డైనఁ గావంగ లేఁడింక నిశ్శంకగాఁ జెప్పెదన్...నీకిప్పుడే కప్పదుం జూడుమా నాదు శాపంబు వస్తాను ముమ్మాటికిం గాదుసుమ్మా......శ్రీ వేణుగోపాల సద్భక్తుఁడన్ పోలిపెద్దాన్వయాబ్ధీందుఁడుల్యాండ శ్రీ వేంకనార్యుండ...నీకాలముం జెల్లె నాశాప మీఁ జేరు... కోవూరి రామాయ దొరారామ రామా॥

(ఈదండక మెంత గ్రంథమో తెలియదుగాని కొంత భాగము వ్రాతప్రతి నాయొద్ద నున్నది-అముద్రితము)

కవిని గ్రహానుగ్రహసమర్థుఁడు గాన నీదండకరచనానంతరము కోవూరి రామయ కాలధర్మముం దెనఁట.

ప్రత్యేక దండకకృతులలో భోగిని మున్నగునవి కొన్ని పెద్దవి. ఇవి యేకైకఖండవిషయములకు మాత్రమే కవులచే నుపయోగింపఁబడినవి. దీర్ఘకావ్యరచనకు దండకమును ప్రాచీనులు గ్రహింపలేదు. ర, య, త, గణములే యొటుమాఁచిన నేర్పుకుటచే బృహత్కథాత్మకములగు మహాగ్రంథములు దండకవృత్తమున రచితములు కాలేదు కాఁబోలు. కాని యిటీవల శ్రీ కలుగోడు అశ్వత్థనారాయణరావుగారు దండక రామాయణ మను పెద్ద గ్రంథము రచించి ప్రకటించిరి. ఇది రామాయణ షట్కాండకథను జెప్పెడు తగణఘటిత బృహద్దండక గ్రంథము. రామాయణమువంటి కథను దండకములో రచించుట నిరోష్ఠ్యాదినియమములతోఁ గావ్యము నిర్మించుటవలె శ్రమసాధకమనక తప్పదు.

యథాశక్తి నా పరిశీలించిన దండకములను వాని లక్షణములను లభించినంతవఱకాధారముగాఁ గైకొని యీరచన సాగించితి. పర్యాప్తముగా సాకల్యముగా నీ దండకవాఙ్మయమును బరిశోధించి యాకవితారచనను పరీక్షించి గ్రంథరూపముగా రచించిన నయ్యది వాఙ్మయమున కొక యలంకారముగా నుండునని మదాశయము. మఱి తెలుఁగు కావ్యములలోని దండకముల నెల్ల నొకటిగను, ప్రత్యేక దండకకృతుల నొక్కటిగను సంధానించి గ్రంథరూపముగాఁ బ్రకటింపవలసిన యావశ్యకత యెంతేనియుఁ గలదు. ఇందులకు సహృదయుల సహకారము లభించునని నమ్మకము.

"శ్రీనాథ లోకేశ్వరా, మాకు నభీష్టార్థితంబుల్ ప్రసాదించి మమ్ముం గృపాదృష్టి వీక్షించి రక్షింపవే నీకుఁ బూవండగా దండకం బిత్తుఁ గైకొమ్ము దేవా నమస్తే నమస్తే నమః"

# సభ్యత

శ్రీ బలివాడ కాంతారావు

భర్త ఆఫీసునుంచి వచ్చాక ఆ పోస్టుమేన్ వస్తాడు. కాస్త ముందుగా రాకూడదూ? సీతకు పోస్టుమేన్ అగపడినప్పుడల్లా గుండె బితుకు బితుకు మంటోంది.

ఆమె కాపరానికివచ్చి యేడాది అయ్యింది. వచ్చిన ఆరు నెలలూ యే గొడవాలేదు. తరవాత ఒకసారి తాతగారింటికి వెళ్ళి వచ్చినప్పుడు మోహనరావు బావ కలిశాడు. ఇదివరలానే తను మాటాడింది. కానీ చాటుగా యేవేవో నిందావాక్యాలు వేశాడు. కొన్ని సరిగ్గా ఆమెకు వినిపించాయ్. కొన్ని వినపడలేదు. విన్నాక యీయతగ్గ జవాబులు యిచ్చింది. ఏంచేస్తానో చూడు అన్నాడు. ఆమె అక్కడ వారంరోజులే వుంది. భర్త వచ్చాక కలిసి వచ్చేసింది. వచ్చిన వారంరోజుల తరవాత మోహనరావు సీతకు వుత్తరం వ్రాశాడు. ఆ కవరుపై భార్య పేరు చూచి భర్త సూర్యారావు 'నీ వుత్తరం' అంటూ యిచ్చేశాడు.

సీతకు ఆ రాత్రి నిద్రపట్టలేదు. తన చల్లని సంసారంలో అగ్ని రగుల్కొన్నట్లనిపించింది! ఆమెపై బావకు యెందుకో ఆ పగ? పిచ్చివానిచేతిలో రాయిలా—యీ వుత్తరం—ఆయన చూస్తే—యీ అబద్ధాలంతా నిజంగా తీసుకుంటే—తన కాపురం యేమైనట్లు? భర్త ఆ వుత్తరంగురించి అడిగితే యేమని చెప్పటం? ఆ మరుచటిరోజు ఆ వుత్తరాన్ని మండుతున్న పొయ్యిలో వేసింది! ఎన్నోసార్లు, ఆ వుత్తరంగురించి, యిదివరకు జరిగిన వివాదం గురించి చెప్దామనుకున్నది. చెప్పే ఆయనలో ఆమెలోపును కప్పిపుచ్చడానికి ముందుగా చెప్తోందన్న అనుమానం రేకెత్తించడమెందుకని వూరుకుంది.

సూర్యారావు ఆ వుత్తరంవిషయం పట్టించుకోనట్లుగానే మామూలుగా వున్నాడు. ఆ వుత్తరం యెవరు వ్రాశారనైనా అడగలేదు. ఇదివరకు రోజూ భార్యకు యిస్తున్న మర్యాద, లాలన యిప్పుడూ యిస్తున్నాడు!

భర్త ఆఫీసుకు వెళ్లిపోగానే ఒంటిగావున్న సీత ఆలోచనలు పరిపరి విధాలుగా పోయాయి. చిన్ననాట తల్లిపోయింది. మారటి తల్లి మూర్ఖత్వంనించి మేనమామ తప్పించాడు. తాతగారింట్లో పెరిగి పెద్దదైంది. ఏ ముద్దు ముచ్చట్లకు నోచుకోలేని ఆమెకు దేముడు వుత్తముడైన భర్తను ప్రసాదించాడు. ఏ ముహూర్తాన ఆ మూడు ముళ్లు పడ్డాయో అప్పటినుంచీ ఆయన ఆమెను సమ్మోహనం చేశాడు. ఆమెకు యింకొక ధ్యాసలేదు—చింతలేదు. లలితమైన ఆమెమనసు యింతవరకు కటుత్వాన్ని, బాధను భరించింది. భర్త ఆమెను యిదివరకు 'కని, యెరగ'ని ప్రేమతో లాలిస్తున్నాడు—ఆ లాలనలో ఆమె తన్మయత్వం చెందుతుంది—అతనికంటె మించినదేముడు ఆమెకులేదు!

నెలకొక వుత్తరమైనా బావ రాస్తున్నాడు. వ్రాసినప్పుడల్లా ఆమెలో తుపాను రేగుతోంది. భర్త చల్లనిచూపు, ఆదరణలో ఆ బీభత్సం చల్లార్చటానికి ప్రయత్నిస్తోంది. ఆ వుత్తరాల్ని దగ్ధం చేస్తోంది.

ఇప్పుడు ఆమె చూలాలు—ఎన్నో ఆశలు—ఆలోచనలు—అమ్మా అని పిలిపించుకొనే అదృష్టం తనకు వస్తోంది! "నాబాబుకు నాలాంటి రూపు—ఆయన గుణగణాలు—అమాయ, అహంభావం నా చిన్నితండ్రికి అంటనీయన్లే—నా చిన్నినాన్న, అమ్మ నాన్నకు కీర్తి తెస్తాడు!" బాబు అప్పుడే పుట్టినట్లు—ఆడించినట్లు—బుద్ధులుచెప్పి నీతికథలు చెప్తున్నట్లు అనుకుంది......

ఆవేళ సాయంత్రం భర్త ఆఫీసునుంచి వచ్చాడు! మామూలు చిరునగవు—ఆయన వెనకనే పోస్టుమేన్ వచ్చాడు—వుత్తరం వచ్చింది. అలా గదిలో నిల్చొనే ఆ కవరుపైనున్న రాత చూసి తనకే ఆ వుత్తరం వచ్చిందనుకున్నది—కానీ సూర్యారావు ఆమెకు యివ్వలేదు. "అదిగో చింపి చదువుతున్నారు!"—సీత కాళ్లు గజగజలాడి అక్కడ నిల్చోలేక వంటయింటికి వెళ్లిపోయింది కళ్లలో నీరు తిరిగింది.

గదిలోనుంచే "సీతా!" అని పిల్చాడు "అదిగో ఆగొంతుక కటువుగా వుంది—వాడు నా సంసారం కూల్చాలని పగబట్టాడు... నా దేముడా నాకేమీ తెలీదు... తెలీదు" మనసులోనే మాటాడుకుంది. ముందుకు అడుగువేస్తున్నా ఒళ్లంతా తూగిపోతోంది—

"ఇవేళ కోపంవచ్చిందా? ఎప్పుడూలేనిది రాగానే వంటయింటికి వెళ్ళిపోయావ్?"

నిట్టూర్చింది. ఆతృతంలోనే యిది యెత్తిపొడుపేమో అనుకున్నది. ఆ రాత్రి ఆమెకు నిద్ర సరిగ్గాపట్టలేదు. పట్టిన కాస్సేపైనా యేవేవో పాడుకలలు! మరుచటిరోజు భర్త ఆఫీసుకు వెళ్ళాక అలవాటుకొద్దీ భర్త తీగలో గ్రుచ్చిన వుత్తరం తీసి చదివింది. అది ఆకాశరామన్న వుత్తరం. తన భర్తకే వ్రాశాడు—అదిగో దస్తూరీ మోహనరావు బావదే!

అదిచదివాక ఆమె శిలాప్రతిమలా కూర్చుంది. కాస్సేపయాక ఆ ప్రతిమ కళ్ళవెంబడి కన్నీరు ధారలుగా ప్రవహించసాగింది. ఆమె ఆశలు నిరాశలై ఆలోచనలు ఒకదారిన పోలేదు—

"నేనెందుకు బావతో మాటాడేదాన్ని? నాకెందుకో నాకు కొద్దిగానైనా వాడు యింత నీచుడనే ఆలోచన రాలేద"ని నొచ్చుకుంది. భర్తమీదనున్న గౌరవం, విశ్వాసంతో తన తప్పేమీలేదని యెందుకు భయపడాలని, ఆమె సాయంత్రం సరికి మామూలుగా వుండటానికి ప్రయత్నించింది. ఎంత ప్రయత్నించినా యేదో వెలితిగా వున్నది.

ఆ వారం రోజుల్లోనే యింకో కవరు వచ్చింది. ఆ కవరు చదివాక తీగలో గ్రుచ్చాడు. ఈసారి చాలసేపు అలా ఆలోచించుకొని కుర్చీమీద కూర్చున్న భర్తనుచూస్తుంటే సీతకు భయంవేసింది. ఈ వేళ యేదో అఘాయిత్యం జరుగుతుందనుకున్నది. ఆమెనిల్చున్న నేల పగిలిపోయినట్లు తను భూమాతలో ఐక్యమైనట్లు అనుకుంది—కానీ కొద్దిసేపయ్యాక సూర్యారావు మామూలుగా మాట్లాడాడు. ఆ రాత్రి భోజనందగ్గర పరధ్యానంగా వున్నాడు. ఈమార్పు సీతకు యెంతో కష్టం కలిగించింది. ఇంట్లోని చల్లని వాతావరణం మారిపోయినట్లయింది. ఆ రాత్రే భర్త ఇటూ అటూ నిద్రపట్టక

కదలటం చూసింది- "ఏం రాశాడో? యేమిటో? మొదటి ఉత్తరంలో వ్రాసినదానికన్నా హెచ్చు వ్రాస్తాడుగానీ తక్కువ వ్రాయడే! అదిచాలదా? ఈయన అనుమానించడానికి?"

ఆమె భర్త ప్రక్కనవున్నా నిద్ర రాలేదు. తెల్లవారేసరికి తన బ్రతుకేమౌతుందో? భర్తచే విడువబడితే తనగతి? "నాబాబు... కడుపులో చాలా నే ఆరాటపడుతున్నాడు! నా నాయనా! నీ అదృష్టమైనా మీ నాన్నను మామూలుగా వుంచదా? అవును— మీ నాన్న గొప్పవారు తండ్రీ! తల్లిలేని నన్ను—అన్ని విధాల బాధలుపడ్డ నన్ను—ఎంచిచూచి కట్నం పుచ్చుకోకుండా పెళ్ళి చేసుకున్నారే—అలాంటి మీ నాన్న—నన్ను అనుమానిస్తారా? అనవసరంగా నేను బాధపడుతున్నానుగానీ—నన్ను పువ్వుల్లో పెట్టి పూజిస్తున్నట్లు చూస్తున్నారే—అలాంటి శాంతమూర్తి ఉత్తముడూ—నన్ను అనవసరంగా విధిపాలు చేస్తారా? చెయ్యరు నాయనా? చెయ్యరు"

కాస్సేపు ఆమెలో విశ్వాసం పాతుకపోయింది. కొద్ది క్షణాల్లో మళ్ళీ ఆరాటం పెనవేసుక వచ్చింది. "ఏమో! యీ విషయాల్లో మొగవాళ్ళకి సహనం వుండదంటారు. సహనంవుంటే యీయన యిలా నిద్రపోకుండా బాధపడ్తారా? శ్రీరామచంద్రుడు-మానవోత్తముడు—మహారాజు! నలుగురు తుంటరులు వేసిన అపవాదుకు తలొగ్గి అగ్నిలో ప్రవేశించి తన పాతివ్రత్యాన్ని నిరూపించిన మా తల్లి నిండు చూలాలు సీతమ్మనే అడవిలో విడిచి పెట్టించాడుకదా? అలాంటిది నా దేముడు నన్ను యీ యింటిలో తెల్లవారేసరికి వుండనిస్తాడా? ఆయన పాదాలదగ్గర చచ్చిపోతాను గానీ...లోకం వేలెత్తి చూపించినట్లుగా విధిపాలుకాను...ఆయన దగ్గర లేకపోతే నేనో క్షణం బ్రతకలేను—ఏందారి తండ్రీ?"

ఆమె నిశ్శబ్దంగా వలవలయేడ్చి తలగడ తడిపింది. "తెల్లవారి లేచేక ఆయన అడుగుతారు—యే మందని చెప్తాను? నేను చెప్పింది నిజమే—కానీ ఆయన నమ్మరు—కోపంతో పొమ్మంటారు...నే నేమన్నా వినరు—ఆయన పాదాలు పట్టుకుంటాను—నన్ను కోపంతో త్రోసివేస్తారు—యీడ్చిస్తే...ఆనాడు మా స్త్రీ జాతి ఆదర్శదేవత—సీతమ్మతల్లి ప్రార్థించినట్లుగా—మిమ్మల్ని తప్పించి యింకెవర్నీ నేను తలంచలేదు—మాటల్లోనూ, చేతల్లోనూ, ఆలోచనల్లోనూ మిమ్మల్నే కొలిచాను—మిమ్మల్ని తప్పించి యింకెవర్నీ నాకు తెలీదు—ఇదే నిజమైతే—నా తల్లీ భూమాతా నీలో నన్ను కలుపుకో—బుగ్గయి నీలో హాయిగా కలిసిపోతాను..."

ఆవేశంతో ఆమె అట్టుడికిపోయింది. నరాలన్నీ తోడుకొని బలహీనం చేశాయి. తెల్లవారుఝామున మాగన్ను నిద్ర పట్టింది. తెలివి వచ్చేసరికి భర్త టేబిలుముందుకూర్చుని యేదో వ్రాస్తున్నాడు. "ఎక్కడికి వెళ్ళిపోతారో—యేమో—ఆయన ముఖం చూడకుండా ఓ క్షణం వుండలేను..." కొంతసేపయ్యాక వ్రాసిన ఉత్తరం డ్రాయరులోపెట్టి "కాస్త అర్జంటు పనుంది. సీతా! లేలే—"అని పిలిచాడు. ఆమె లేచిందిగానీ కళ్ళల్లో నీరు తిరిగి పోతున్నయ్. ఇంతలోనే సూర్యారావు ఆఫీసుకువెళ్ళే బట్టలు వేసుకున్నాడు. అంతా అలా నిల్చొనేచూస్తోంది. "ఈ పూటకు హోటలుకు పోతానులే—రాత్రే చెప్పటం మరిచిపోయాను—వేగం లేచేదానివి. మళ్ళీ సాయంత్రం వేగంగా వచ్చేస్తా!"

తొందరగా అంటూ వెళిపోయేముందు "అన్నట్టు సీతా! మీ బావ మోహనరావు ఉత్తరం వ్రాశాడుకానీ తన యెడ్రసు వ్రాయలేదు—ఇప్పుడు యెక్కడున్నాడో యేమిటో ఈ ఉత్తరం కవరులోపెట్టి నీకు యెడ్రసు తెలుసుకామోసు వ్రాసి పొరుగు అబ్బాయిచేత పోష్టులో వెయ్యించేద్దూ!"

భర్త వెళ్ళిపోయాక డ్రాయరులోని ఉత్తరంతీసి చదవటానికి మొదలుపెట్టింది.

"తమ్ముడూ!

నీ ఉత్తరం నిన్న సాయంత్రమే చేరింది. అది చదివిన నిముషంనుంచీ నీ కలా జబాబు వ్రాయాలనే ఆలోచనలతో రాత్రి సరిగా అన్నం సహించలేదు—నిదరా పట్టలేదు. ఇదివరకు బహుశా నివ్వే కామోసు అప్పుడప్పుడూ సీతపేర ఉత్తరాలు వ్రాసేవాడివి—అవి అగ్నిప్రీతి అయివుండొచ్చు—సీత యెలా ఫలానవారు వ్రాశారని—యే గొప్పవిషయా లున్నాయని నాతో చెప్తుంది? సరే సీతకు వ్రాశావు—ఆమెను కల్లోలపరచావని అంతతో తృప్తిపడక నాకో ఆకాశరామన్న ఉత్తరం వ్రాశావు. అది బుట్టదాఖలా అయ్యిందని కామోసు భయపడి సీత మీద లేనిపోని నిందలు వేసి నాకే ఉత్తరం వ్రాశావు—

ఈ పైన వ్రాసిన పరిస్థితులు అవగాహన చేసుకుంటే నీ మనస్సూ మేథస్సూ యెంత సంస్కారం హీనమైనవో అర్థం చేసుకున్నాను. కానీ మర్యాద నాచే యీజబాబు వ్రాయించింది.

నీ బ్రతుకు నీకు తెలుసు. చిన్నప్పటినుంచీ ఆమె యెన్ని కష్టాలు పడిందో? తండ్రి కూతురన్న కనీసపు బాధ్యత నే విడిచి పెట్టాడు. మీయింట చేరింది. గతిలేనిపిల్లని మీ వాళ్ళెవరూ నీకిచ్చి పెళ్ళిచెయ్యటానికి ఒప్పుకోలేదు. పోనీ నీవైనా పంతంబట్టి చేసుకున్నావు కావు. పొరుగున మా చెల్లాయి వుండి సీత మంచితనమూ బ్రతుకూ నాతో చెప్పింది. కాబట్టే నేను ఆమె మంచిని ప్రేమించాను—ఆమె అసహాయతను కనికరించాను. నాకు యిల్లాలై ఆమె నన్నెంతగా కొలుస్తుందో నీకు తెలియదు!

నీతో చాలా చనువుగా సరదాగా వుండేదని వ్రాశావు. అందులోవున్న తప్పేమీ నాకుకనపడలేదు. సిగ్గుపడి తలుపుచాటునుంచిచూచే ఆడవాళ్ళకన్నా బాహాటంగా ఆదరంగా మాటాడే స్త్రీలనుచూస్తే నాకు హెచ్చు గౌరవం! నీ పేరుకు తగ్గట్టునివ్వు అందగాడివి. అందులో వరసకు బావ అవుతావ్—అలాంటప్పుడు నీతో చనువుగా మాటాడటంలో తప్పేం వుంది? పోనీ అలా మాటాడిందని నివ్వేం కనికరం చూపించావ్? నేనూ పెళ్ళికాకముందు యెందరు, అందమైన ఆడవాళ్ళ వేపుచూశాను. వాళ్ళ అందాన్ని కీర్తించాను. అంత అందమైన స్త్రీ నాభార్య అయితే బాగుండేదని తలచాను—నీవు వ్రాసిన దాన్ని బట్టి నేను సీతను వదిలేస్తే—ఇదంతా తెలిస్తే నన్ను వదిలెయ్యటానికి సీతక్కూడా హక్కు వుంది! కానీ మా యిద్దరం అంత తెలివితక్కువవారమ్ము కాము!

ఆడవాళ్ల మీద నివ్వు విసిరే విసుర్లు నేను అర్థంచేసుకోలేకుండా వున్నాను. స్త్రీ మగవానికి తల్లయి పాలిచ్చి కష్టపడి ఓర్పుతో పెంచి పెద్దచేస్తుంది—స్త్రీ భార్యయై మగవాడికి సౌఖ్యాన్ని యిస్తుంది—ఆమె పల్లాడిన ముదుసలియై నిజాన్ని జ్ఞానాన్ని మగవాడికి అందిస్తుంది—మగవాళ్లు ఆడవాళ్ళమీద యేదైనా నెపును అపాదించేముందు స్త్రీ చేసే యీ మేలును తలచుకోరేం? కృతఘ్నులై వారివారి యిళ్లను దేవాలయాలు చేసుకోనే బదులు యుద్ధరంగాలుగా మార్చుకుంటారేం? ఆడవాళ్ళను గౌరవించే కనీసపు సభ్యత మగవాళ్లలో లేకపోతే ఆ సంఘం సజీవంగా యెంత కాలం వర్ధిల్లుతుంది?

తమ్ముడూ! ఒకసారి మా యింటికివచ్చి నేనూ మా సీతా యిచ్చిన ఆతిథ్యం స్వీకరించకూడదా? నీకు తెలుసు మా సీత నిండు మనిషని-నివ్వు రాసినట్లు ఆమెను విడిచిపెట్టేదానికి నేనేమీ రాముడంత వాడ్ని కాను.

నీ అన్నయ్య,—సూర్యారావు.

# చిత్తరంజన్

శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ

భారత రైల్వేలు జాతీయ పురోగమన కాంతులు. శతాబ్దమునకు పైబడిన రైల్వేల చరిత్రలో భారత రైల్వేలు తీర్చిదిద్దిన రూపురేఖలు, పనితనము, ప్రావీణ్యత, నెలకొల్పిన క్రొత్త ఆయోజనములు గమనార్హములు. ప్రస్తుతం చిత్తరంజన్ రైల్వే కర్మాగారము కార్మికులలో స్వయంసాధన సూత్రానుసారము ఉత్పత్తి పెరుగుదలకు క్రొత్తవిధానమును ప్రయోగముజరిపి రైల్వేల చరిత్రలో పారిశ్రామికాభ్యుదయమునకు నూతనాధ్యాయమును సృష్టించినది. కార్మికులలో స్వయంసాధన—ఉత్పత్తి పెంపకము సూత్రము ద్వారా చిత్తరంజన్ సాధించిన విజయమును నిపుణులు పరిశీలించి యీ విధముగా వక్కాణించియున్నారు:

'స్వయంసాధన సూత్రానుసారము ఉత్పత్తిలో పెరుగుదల 30% న్నా తదనుగుణముగా కార్మికుల వేతనములలో వృద్ధి కలిగినది.

కేవలం డిశంబరు 1956 లోనే చిత్తరంజన్ 14 W. G. ఇంజనులను నిర్మించినది. 1956 డిశంబరు మాసాంతమునకు మొత్తం చిత్తరంజను కర్మాగారములో తయారయిన W. G. ఇంజనుల సంఖ్య 462.

మే 1949 లో చిత్తరంజను కర్మాగారము ప్రస్తుతం రైల్వే బోర్డు అధ్యక్షులయిన శ్రీ పి. సి. ముఖర్జీగారి పాలనలో జన్మించినది. ముఖర్జీగారు చిత్తరంజన్ కర్మాగారమునకు జనకులని రైల్వేపాలకవర్గమువారు అంటారు. వారిస్థానే జనరలు మేనేజరుగా పనిచేసిన శ్రీ కర్నల్ సింగు ప్రస్తుతము రైల్వేబోర్డు ఇంజనీరింగు శాఖ ముఖ్యసభ్యులుగా పనిచేస్తున్నారు.

970 కోట్ల పెట్టుబడికలిగి 35000 మైళ్ళ నిడివితో భారత రైల్వేలు ఆ సేతు శీతాచలపర్యంతం పరివ్యాప్తమైన మహోజ్వల జాతీయసంస్థ. మనదేశంలో మొత్తం 6,878 రైల్వేస్టేషను లున్నాయి. ఇందులో 6,152 స్టేషనులు ప్రభుత్వంక్రింద పనిచేస్తున్నాయి. 221 స్టేషనులు ప్రభుత్వంచేత నిర్వహింపబడకుండా ప్రత్యేక రైల్వేకంపెనీలక్రింద వున్నాయి. ప్రభుత్వ పాలనలోని స్టేషనులలో 3,083 బ్రాడుగేజి స్టేషనులు 2,646 మీటరుగేజి స్టేషనులు, 473 నేరోగేజి స్టేషనులు వున్నాయి.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికనుబట్టి సూక్ష్మంగా పరిశీలిస్తే— భారత రైల్వేలు సరుకుల రవాణా, ప్రయాణీకుల రవాణాలకు సంబంధించిన గురుతరమైన బాధ్యతలను అసంఖ్యాకంగా నిర్వహించవలసియున్నది.

సాధించవలసిన వుత్పత్తి ప్రమాణాలు యీ క్రింద పొందుపరచబడ్డాయి:

| | 1955-56 | 1960-61 |
|---|---|---|
| సరుకుల రవాణాకు సంబంధించినవి(టన్నులలో) | 120మిలియన్ల టన్నులు | 181మిలియన్ల టన్నులు. |

రైల్వేల అభివృద్ధి కార్యక్రమాలక్రింద కేటాయించబడిన మొత్తంలో 10% రోలింగుస్టాకు (ఇంజనులు) 5% రైల్వేలైను భరాయింపు శక్తిలో తగ్గుదలను సూచిస్తున్నాయి.

ప్రయాణీకుల సౌకర్యాలలో పంచవర్షీయ యోజనప్రకారము 15% మొత్తం విడేళ్లలో పెరుగుదలను సూచిస్తున్నాయి. ఇంకా 842 మైళ్ల నిడివితో క్రొత్తలైనులు ఆవిర్భవించటం జరుగుతుంది. ఈ క్రొత్తలైనుల నిర్మాణం ఇనుము ఉక్కు బొగ్గు పరిశ్రమల అభివృద్ధి దృష్ట్యా పెంచటం ఆవశ్యకం అని నిపుణులు భావిస్తున్నారు.

ఇతరమైన అభివృద్ధి కార్యక్రమాలలో 8,000 మైళ్ల పాతబడి పునర్నిర్మించవలసిన రైల్వే మార్గములు కూడా వున్నాయి. 1,607 మైళ్ల జంట రైల్వే మార్గము చేయబడవలసి వుంది. 265 మైళ్ల మీటరుగేజి మార్గము బ్రాడుగేజి మార్గముగా విస్తరింపబడుతుంది. ఇవిగాకుండా 826 మైళ్ల రైల్వేమార్గము విద్యుచ్ఛక్తితో నడిచే రైలు మార్గముగా మార్చటం జరుగుతుంది. 1,293 మైళ్ళలో డీసెలు మోటారుబళ్లు నడుస్తాయి. ఇంకా యీ అభివృద్ధి ప్రణాళికల నిమిత్తంగాను మొత్తం 2,258 ఇంజనులు, 107,247 వాగనులు (4 చక్రాలవి) 11,364 ప్రయాణీకుల పెట్టెలు కావలసివున్నాయి. ఇందులో 1,352 ఇంజనులు, 23,842 వాగనులు, 6,447 ప్రయాణీకుల పెట్టెలు అరిగి పాతగిలి వయోవృద్ధములైనందున - రవాణానుండి తొలగించవలసిన ఆవశ్యకత కూడా వున్నదని అంచనాలనుబట్టి తెలుస్తోంది.

ఈ రోలింగు స్టాకు పెరుగుదలను బట్టి ప్రణాళికలో ప్రస్తుతం వున్నటువంటి కర్మాగారాలు, లోకోషెడ్డులను, పెంచి పెద్దవిగా చేయటమున్నూ, క్రొత్త కర్మాగారాలను నెలకొల్పటమున్నూ, ఒక మీటరుగేజి ప్రయాణీకుల పెట్టెల కర్మాగారమును తెరవటమున్నూ జరుగవలసి వున్నాయి.

ప్రస్తుతం చిత్తరంజను కర్మాగారము సాలీనా 175 యూనిట్లనుంచి 400 ఇంజనులు ఉత్పత్తి చేసేట్లు మార్పులు జరుగవలసి వున్నాయి. ఈ ఇంజనులలో ఉత్పత్తి సంఖ్యా ప్రమాణాలను చిత్తరంజన్ అందుకోవలసి వుంది. సాలీనా 1,250 ప్రయాణీకుల పెట్టెలకు బదులుగా 1,800 పెట్టెలు నిర్మాణం కావలసి వుంది.

ఇవిగాకుండా మూడవతరగతి ప్రయాణీకులను దృష్టిలో వుంచుకుని ప్రయాణ సౌకర్యాలను ఎంతైనా అభివృద్ధి పరచవలసిన అవసరం రైల్వే పాలకవర్గం గుర్తించింది.

ఈ సందర్భంలో జనవరి 11-18 తేదీలలో ఢిల్లీలో జరిగిన భారత రైల్వేల జనరలు మేనేజర్ల సమావేశంలో ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ రైల్వేలు నిర్వహించవలసిన ప్రముఖ పాత్రను విస్పష్టం చేశారు.

కేటాయించబడిన కొద్దిమొత్తాలతో రెండవ ప్రణాళికా కాలంలో రైల్వేలు నిర్వహించవలసిన అసంఖ్యాకమైన బాధ్యతల దృష్ట్యా సాధించవలసినది ప్రముఖమైనది - నిర్మాణాత్మక కృషి అనగా ఉత్పాదనలో పెరుగుదల. సమయాన్ని తగ్గించటంకోసం రైళ్లను వేగంగా పరుగెత్తించినందువలన లాభంలేదు. ఎక్కువ రైళ్ళు నడిచేలా చూడాలి. అవి సక్రమంగా నడిస్తేచాలు. భారతదేశం అమెరికానుంచి క్రొత్త పంథాను మక్కీకి మక్కీ కాపీగొట్టగలిగేస్థితిలో లేదు. గొప్పకోసం అనుకరణ పనికిరాదు అన్నారు శ్రీ నెహ్రూ.

'ఉత్తమమైన సాంకేతికవిధానాలు కావాలి. వెనుకబడిన వాతావరణం కలిగిన మనం గొప్పకోసం త్రిశంకు స్వర్గాన్ని పట్టుకుని వ్రేలాడబోము. మన ప్రస్తుత ఆర్థికవిధానాల దృష్ట్యా రైల్వేల అభివృద్ధి మనయొక్క సాంకేతిక పరిజ్ఞానం నిపుణత మనమే అభివృద్ధి చేసుకున్న తర్వాత - తద్వారా నిర్మించుకున్న శిక్షాప్రణాళికతో మనం నిర్మించుకున్న పారిశ్రామిక వాతావరణమే మనల్ని ముందుకు తీసుకెళ్ళాలి. మన సాంకేతిక నిపుణుల్ని మనమే తయారుచేసుకుని మనకు కావలసినవి మన దేశంలోనే ఉత్పాదించుకుంటూ పురోగమించవలసివుంది.' అని సెలవిచ్చారు. అనివార్యాలైన ప్రమాదాలు సంఘటిల్లినపుడు ప్రజలు విభ్రాంతులవుతారు. ఈ దుర్ఘటనలను పురస్కరించుకుని మనం హతాశులం కాకూడదు. చేయవలసిన కార్యం యెంతైనా వుంది అని కూడా ప్రధాన మంత్రి రైల్వేపాలక వర్గాన్ని హెచ్చరించారు.

కార్మికుడు స్వయంగా కృషిచేసి ఉత్పాదనను పెంచుతూ వ్యక్తిగతంగా 'అధికకృషి-అధిక వేతన' సూత్రానుసారము సాధించిన ఒక క్రొత్త ప్రయోగాన్ని ప్రజలముందు వుంచటంకోసం—'చిత్తరంజన్' సాధించిన విజయాన్ని వుదాహరణగా తీసుకుని యీ వ్యాసం వ్రాయబడింది.

భారత కార్మికుని ఉత్పాదనాశక్తి (తలకొక్కంటికి) తదితర పశ్చిమ దేశాలలోని కార్మికులతో పోల్చిచూస్తే చాలా తక్కువ అని చెప్పవలసివస్తున్నది. కారణం యంత్రసౌలభ్యం సాంకేతిక ప్రవీణత లేకపోవటం అని సమాధానం చెప్పుకోవాలి. ఇవేగాకుండా యిక్కడ అధికోష్ణ వాతావరణం, బలకరంకాని ఆహారం, మానసిక ఐచ్ఛికత లోపించటంకూడా కారణాలు.

చాలా అభివృద్ధిపొందిన దేశాలలోమాదిరి మనదేశంలో కార్మికుల వేతనాలులేవు. మన దేశంలో యిస్తూన్న వేతనాలు చాలా తక్కువ అని ఒప్పుకోవాలి. ఈ పరిస్థితులు యిల్లాగుండగానే మన దేశంలో తయారైన వస్తువుల ఖరీదులు, మనకన్నా గూడా అత్యధిక వేతనాల్ని యిస్తూ పనిచేయిస్తూన్న విదేశాలలో తయారైన అవే వస్తువుల ధరల్ని తలదన్నుతున్నాయి.

ఈ ఒక్క విషయం మనదేశంలోని ఆర్థికశాస్త్రవేత్తల్ని పారిశ్రామికకూటాల్ని గాభరాయింపచేస్తూవచ్చింది. ఆర్థికనిపుణులూ పారిశ్రామికవేత్తలూకూడా వేతనాల్ని ప్రావీణ్యతతో సంబంధించేలాగున భారతదేశంలో సరిదిద్దటంఎల్లాగా అని విస్తారం ఆలోచించారు.

ప్రావీణ్యం వేతనాన్ని పురస్కరించుకునే వుంటుంది అని గుర్తించిన తరువాత యీ సవరణలు ఆచరణలో యిదివరకే ఎందుకు తీసుకురాలేకపోయారంటే కారణం — ఈ దేశంలోని కార్మికుల వేతనాల నిర్ణాయకపు ఏర్పాట్లు ఎంత అధోగతిలో వున్నాయంటే, కార్మికశక్తియొక్క అవశ్యకతలో ఎటువంటి హెచ్చుతగ్గులు ఏర్పడినప్పటికీ, వస్తూత్పాదనలో అయేరిపేరు ఖర్చులలోనన్నా ఎటువంటి మార్పురానేరదని ప్రవీణులు అంచనాలువేసి తేల్చారు. ఒకప్పుడు ఎప్పుడన్నా కార్మికులలో ప్రావీణ్యత తగ్గుముఖం పట్టినప్పుడు కొనుగోలుధరలు పెరిగిపోతే అమ్మకపుధరల్ని పెంచటంగాని కార్మికుల వేతనాల్ని తగ్గించటంగాని జరుగుతూండేది. ఏమైనప్పటికీ, ఉత్పాదనలో పెరుగుదలలేకుండా అధిక వేతనాల్ని యివ్వటంగనుక జరిగితే ద్రవ్యోల్బణం వచ్చిపడుతుంది - దాన్తో ధరలు మిన్నుముట్టుతాయి. తిరిగి ఎక్కువ వేతనాలిమ్మని కార్మికులు అడుగుతారు. ఇదివొక దుష్టసమస్యా చంక్రమణంక్రింద తయారవుతుంది.

## సాధించిన ఫలితాన్నిబట్టి వేతనాల్ని ముట్టజెప్పటం

సరియైన ఉత్పాదన జరుగుతున్నదీ లేనిదీ తేల్చుకోవటానికి ప్రతిబంధకంగావుంటున్నది మనదేశంలో సరియైన సాంకేతికశిక్షణకు అవకాశాలు మృగ్యంకావటంవల్లనే అన్నది గుర్తించాల్సివుంటుంది. రెండవ ప్రతిబంధకం పనినిబట్టి సక్రమవేతనాల్ని యివ్వటానికి అవకాశం లేకపోవటం. చాలా కర్మాగారాల్లో ఒక నిర్ణీతమైన వేతనాన్ని పనికాలాన్నిబట్టి నిర్ణయించి ఉత్పాదనతో ఎటువంటి అనుబంధంలేకుండా యివ్వడం జరుగుతోంది. ఇందులో చురుకైన తెలివైన కార్మికుడికి తనయొక్క అధికవిజ్ఞానం పని మెళకువలవల్ల ఎటువంటి అధికప్రయోజనం ఆర్థికంగా వుండటంలేదు. తరచు తనయొక్క పనివేగాన్ని తెలివితేటల్ని వృథాపోనిస్తూ నెమ్మదస్తుడైన తోటికార్మికుడితో సమానంగానే పనిచేస్తూ అంతకంటే ఎక్కువ శ్రమపడ్డం అనవసరమనే నిర్ణయానికి వస్తున్నాడు. సాధారణ పరిస్థితుల్లో పరిసమానావకాశాల్లో ఒక సరాసరి కార్మికుడు యెంత పనిచేసిచూపించాల్సి వుంటుందీ నిర్ణయించేందుకు శాస్త్రీయమైన పద్ధతులు లేకపోవటం మన పారిశ్రామిక నాగరికతలోని బ్రహ్మాండమైన లోపం.

ఈ పరిస్థితులదృష్ట్యా యిటీవలనే చిత్తరంజన్ కర్మాగారం 'ఫలితాల్నిబట్టి వేతనాల్ని రేట్లను' నిర్ణయిస్తూ ఒక క్రొత్త సూత్రాన్ని ప్రప్రథమంగా ఆచరణలోకి తెచ్చింది. ఈ సూత్రానుసారం చురుకైన నేర్పరియైన కార్మికుడికి ఉత్సాహంగా ఎక్కువ పనిచేసి చూపించి అధిక వేతనాల్ని సంపాదించుకునే అవకాశం కలిగింది. బద్ధకస్తుడైన నెమ్మదస్తుడైనసోదర కార్మికుడుకూడా తనతోటివారిలాగే తానుకూడా కష్టించి ఎక్కువశ్రమకు ఎక్కువ వేతనాన్ని పొందటం ద్వారా వుత్సాహియై కార్యరంగంలోకురుకుతున్నాడు. ఈరకంగా

సాధించిన అధికోత్పత్తి కనుగుణ్యంగా వేతనాలలో పెరుగుదల దేశాభ్యుదయానికీ స్వార్థానికికూడా పనికివచ్చేలా కల్యాణ దాయకం కాబోతున్నది.

చిత్తరంజన్ స్థాపించబడినప్పటినుంచీకూడా యిటువంటి మార్గంద్వారా కార్యసాధన చేయవలెనని సంకల్పించుకొన్నది. సాంకేతిక సహాయానికి ఒడంబడికమీద రైల్వేబోర్డువారు లోకోమోటివ్ మ్యానుఫాక్చరర్సు కంపెనీ లిమిటెడు వారితో సంతకం చేసినప్పటినుంచీ రేట్లు నిర్ణయించే నిపుణులను ఆహ్వానించడమైనది. తరువాతి కాలంలో పథకంద్వారాకూడా నిపుణులువచ్చి మన చిత్తరంజన్ కార్యక్రమాలకు తోడ్పడసాగారు. ఇదిగాకుండా మన యొక్క కార్మికులను యెంచి ఇంగ్లండు జర్మనీ సాంకేతిక శిక్షణ కోసం పంపించటంకూడా జరిగింది. ఈ విధంగా రేట్ల నిర్ణాయక నిపుణులు సిబ్బంది అనేకమంది తయారయి సిద్ధంగావున్న సమయంలో—అధిక వేతనము అధికోత్పత్తి విధానాన్ని ప్రవేశ పెట్టడం జరిగింది.

పశ్చిమదేశాల అనుభవంలో యీ రేట్లను నిర్ణయించటం తీవ్రమైన కార్మిక అసంతృప్తి అలజడులకు కారణభూతమైంది. అక్కడ దేశాల్లో యజమానులు ఉత్పత్తి కొంత ప్రమాణాన్ని అందుకున్నాక పనిలో భాగాలకి యిచ్చే వేతనాల రేట్లను తగ్గిస్తూ వచ్చారు. కార్మికులు యీ మోసాన్ని పసిగట్టారు. కాని యీ విధమైన అసంతృప్తికి కారణం యీ పనిలోని భాగాలకి రేట్లను నిర్ణయిస్తూ రావటం అనే విధానం లోపభూయిష్టం కావడమే. చాలా పారిశ్రామిక సంస్థలకు ద్రవ్యమే అవగా రూ॥ అ॥ పైసల్లో యీ అదనపు వుత్పత్తియొక్క రేట్లను నిర్ణయించటమే ప్రధానలోపం. ఈ రూపాయల్లో శ్రామికశక్తిని మార్చుకోవటం చాలా సులభమైనప్పటికీ, యీ పారిశ్రామిక శక్తియొక్క అంతరంగికవిలువలు ప్రాథమికంగా ముఖ్యంగా వేతనాల ప్రాతిపదికమీద ఆధారపడి వుండటమేగాకుండా శ్రామికులలో అలజడినికూడా కలిగించటానికి కారణాలవుతున్నాయి. ఆయా యి పరిస్థితులదృష్ట్యా చిత్తరంజన్ సంస్థముందు చేసే పనిలోని విడివిడిరూపాలకు నిర్ణాయకమైనరేట్లు ప్రామాణికంగా తీసుకోలేనప్పుడు ఒక పనినుండి మరొక పనిలోని భేదాలు అనేకమైనప్పుడు యీ విధానం నిరుపయోగమేనని గుర్తించింది. పోల్చటం అసాధ్యమైనప్పుడు పరిశీలనాపద్ధతికి వద్దామంటే — యిందులో కూడా పనిచేసే వానికీ పనిలోని విభిన్న రూపాలకు రేట్లను నిర్ణయించే నిపుణుడికీమధ్య వ్యక్తిగత సంబంధం అడ్డువచ్చేలాగుంది.

ఇటువంటి సందిగ్ధావస్థలో-చిత్తరంజన్ క్రమ విభజన పద్ధతిని అనుసరించి - అప్రకారంగా నమ్మదగిన క్రమమైన సరళిని రేట్లను తయారుచేయించి నిపుణులచేత పరిశీలింపబడినతర్వాత వుత్తరోత్తరా యజమానులకు పనివారికి యేవిషయమైగాని వివాదం వచ్చినప్పుడు ఆ సూత్రాలను రేట్లను నిర్ణయించిన విధానాలను సమగ్రంగా పరీక్షించి తనిఖీ చేయించటానికి అవకాశం కల్పించబడింది.

ఈ విధానాన్ని వుపయోగించేముందు కొన్ని విషయాల్లో సంతృప్తికరమైన యేర్పాట్లు జరగాలి. అన్ని యంత్రాలు వాటి తయారీలో సూచించిన ప్రకారం వేగం, అవి తీసుకునే ముడిసరుకు కోతల్లో నిడివి వాటి వాటి శక్తిసామర్థ్యాలు ప్రామాణికంగా కచ్చితంగా వుండేట్లు చూడాలి. ఆ యంత్రాలకోసం వాడబడే వివిధ ముడిసరుకులు వాటి వాటి భిన్నమైన కొలతలు బరువులు సంఖ్యల్లో పొందే మార్పులు చేర్పులు కూర్పులు అన్నీ తయారీలో నిర్ణీత ప్రమాణానికి ఫలితాల్ని సాధించగలగాలి. ఉత్పత్తి ప్రమాణాల్ని యీ విధంగా యంత్రాంగములనుండి విడదీసి పరిశీలించవచ్చు.

(అ) పనిముట్లు ఆయువు.
(ఆ) యంత్రం యొక్క అశ్వశక్తి.
(ఇ) ఏవిధమైన పరిపూర్తికావాలి.
(ఈ) కూలెంటు వుపయోగం.

ఉత్పాదన ప్రమాణాలు ఎంతో తెలుసుకున్నాక ఎన్నిసార్లు ముడివస్తువు ఎంతవిలువైనది అందివ్వాలో పనియొక్క వేగం ఎంత వుండాలో కూడా వూహించి అంచనాలు కట్టవచ్చును. వివిధ రకాలైన వస్తువుల్ని నిర్మించడానికి వివిధమైన వ్యాసాలు కొలతలు యంత్రాన్ని పనిలో వుపయోగించవలసిన తీరు పద్ధతులు అన్నీ సిద్ధంగా ఛార్టులు వేసుకున్నాక-ఫలానా యింతలోతు కోతకు యిన్ని నిముషాలు యంత్రాన్ని పనిచేయించాలి-యీ రకం ముడివస్తువు యీ విధమైన రూపాన్ని పొందటానికి యిన్ని పద్ధతులు అవలంబించాలి అని ప్రతి కార్యక్రమం తప్పకుండా రికార్డుచేయబడి వుండటం చేత రేట్ల నిర్ణాయక నిపుణులకు యంత్రపు గంటలు విరామాలు మార్పులకు కావలసిన నిముషాలు అన్నీ మంచినీళ్ళలాగా విడమర్చినట్లు తెలిసిపోతాయి.

యంత్రం పనిచేసే గంటలు కాకుండా-యంత్రాన్ని కార్మికులు ప్రారంభింపచెయ్యటానికి-ముడివస్తువుల్ని యంత్రానికి అందించటానికి దించటానికి, పనిముట్లు మార్చుకోవటానికి కూడా సమయం ఖర్చువుతుంది.

ఈ విధమైన ప్రతి ప్రత్యేకపుపనిలోని భాగాలన్నింటికీ అనేకమార్లు పట్టేసమయాన్ని పరిశీలనగా చూసినమీదట ఫలానా పని చేయటానికి సరాసరిన యింత సమయం పడుతుంది అని అంచనాకట్టి తేలుస్తారు.

చిత్తరంజన్ కర్మాగారంకూడా వచ్చిన ఫలితాల్ని బట్టి యితర దేశాల్లోమాదిరి బోనస్సులు ప్రీమియాలు యివ్వటం విషయం శ్రద్ధగా పరిశీలించింది.

పశ్చిమదేశాల్లో గల కార్మిక వేతననిర్ణయ విధానాల్లో ముఖ్యమైనవి హేజలీ, హైర్, రోవాన్, చ్యాడక్సు పద్ధతు లన్నింటినీ కూడా సమగ్రంగా పరిశీలించటం జరిగింది. ఈ అన్నిమార్గాల్లో కూడా వేతనపురేట్లనిర్ణయం బహు క్లిష్టమైన గణితమార్గాలు తొక్కటంచేత అవి యీ దేశంలోని కార్మికుడికి సులభ గ్రాహ్యం కాజాలవన్నది సత్యం. అధిక వేతనం ఎల్లా నిర్ణయించి యే రేట్ల ప్రకారం యిస్తున్నారన్నది కార్మికులకు బోధపడనిపక్షంలో-వారు వుత్పాదన పెంచటంకోసమే యీ క్రొత్త పద్ధతులుకాని పెంచిన వుత్పాదనకు ఫలితంగా సరియైన మూల్యం దొరకటంలేదని అపోహ చెందవచ్చు. అందుచేత కార్మికులకు సులభంగా బోధపడేటట్లు వారి విశ్వాసాన్ని సంస్థ పొందకలిగేటట్లు వుండగలిగేటందుకు—వారికి యిచ్చేటటువంటి అధిక వేతనం-బోనస్సు వారు పనిలో మొత్తం తగ్గించిన సమయానికి అనుబంధంగా వుంటుంది. ఎంత తక్కువ సమయంలో పనిచేయగలిగితే ఆవిధంగా తగ్గించుకుంటూ వచ్చిన యంత్రపు గంటల లెక్క ప్రకారం బోనస్సు యివ్వబడుతుంది. ఈ అదనపు వేతనం ఎంత సంపాయించినదీ కార్మికుడు రోజుకురోజు లెక్క కట్టుకోకలుగుతాడు.

ఉత్పాదన అధిక వేతనము యీ రెండున్నూ పరస్పరానుబంధాన్ని కలిగివుంటాయి. సంపాదించుతున్న అధిక వేతనం సరిగా

చేసిన పనితో సరితూగ గలిగేటందుకుగాను, ఒక కార్మికుడు చేయ వలసిన పనిలోని అన్ని దశలూ తూచ తప్పకుండా పరిశీలింపబడతాయి. ఆ విధంగా వ్యక్తిగతంగా చేయవలసిన పనిలోని దశల్ని పరిశీలించటం సాధ్యం కానప్పుడు-అనగా సామూహికంగా కొంతమంది కలిసి ఒక పనిచేయటం జరిగేటప్పుడు సామూహిక శక్తినంతటినీ ఒకే సంఖ్యగా భావించి ఆ ఉత్పాదనాక్రమ దశాభాగాలను విడమర్చి రేట్లను నిర్ణయించటం జరుగుతుంది. నిపుణులు, నిపుణులు కానివారు, అర్ధనిపుణులు యీవిధంగా రూపొందిన సమూహంయొక్క ఏకశక్తిని విభజించి అన్ని దశలలోనూ పరిణామాలలోనూ రేట్లను అంచనా కట్ట వచ్చును.

ఐతే తార్కికంగా చేసినపని నిర్ణీత స్థాయికి వచ్చినట్లు పరీక్షింపబడినతర్వాత అధిక వేతనము బట్వాడా చేయడమవుతుంది.

ఈ పనిలో దశలన్నింటికీ రేట్లను నిర్ణయించిన తరువాత ఉత్పాదనా విధానంలో మార్పులు వస్తేతప్ప లేదా లెక్కలలో పొరపాట్లు అచ్చుతప్పులు వున్నప్పుడూ తప్ప యీ రేట్లను పెంచటంగాని తగ్గించటంగాని జరగదు.

యంత్రపుగంటలు పనిముట్లలో సవరణలు తక్కువ సమయాన్ని సాధించే విధానాలు కనిపెట్టబడినప్పుడు ఆ కార్మికుడికి ఆరుమాసాలకాలంలో ఆ కనిపెట్టబడిన విధానంద్వారా యెంత సమయం కలిసివస్తుందో అంత మొత్తానికి బోనస్సును కట్టి బహుమానంగా యివ్వటం చిత్తరంజన్ సృష్టించిన సాంప్రదాయం.

ఈ క్రొత్తమార్గాన్ని త్రొక్కటంలో చిత్తరంజన్ ఎదుర్కొన్న ప్రతిబంధకాలు అనేకం. ఈ సమగ్రమైన భారత రైల్వేల విశ్వరూపంలో చిత్తరంజన్ కేవలం ఒక ప్రముఖ భాగం మాత్రమే కాదా! చిత్తరంజన్ చట్టరీత్యా కార్మికులకు వారి ప్రాథమిక వేతనంలో 25% మాత్రమే లాభాలనుంచి పాలు పంచుకోవటానికి అవకాశ మిచ్చేందుకు అధికారం వుండేది. ఏ కార్మికునికిగాని 33% కన్నా ఎక్కువ బోనస్సు రూపంగా ముట్టచెప్పరాదనే క్లిష్ట నిబంధన ప్రకారం—ఆవిధంగా చూచినట్లయితే కార్మికులలో సృజనాత్మకమైన ఉత్సాహం పెంపొందదనే విచారంతో చర్చలు సమగ్రంగా జరిపినమీదట లోకోమోటివ్ మ్యానుఫాక్చరర్సు వారి సలహా ప్రకారం-యింగ్లండులో కార్మాగారాల్లో ప్రస్తుతం అమలులో వున్న బోనస్సు రేట్లప్రకారం అందరికీ 33% బోనస్సు ఉత్సాహకరంగా పనిచేయటానికి యివ్వటానికి చట్టబద్ధమైన అనుమతిని పొందటం జరిగింది.

తిరిగి కార్మికులు అధికంగా పనిచేయటంవలన ఆరోగ్యాన్ని కోల్పోకుండా వుండగలందులకై యే కార్మికుడూ 50% తన బేసిక్ వేతనంకన్నా అధికంగా లాభించేలా పనిచేయకుండా చిత్తరంజన్ కట్టుదిట్టం చేసింది.

ఈవిధంగా యేడాది అనుభవంమీద చిత్తరంజన్ అంచనాల ప్రకారం తేలినదేమంటే-కొన్ని స్వల్ప సవరణలతో అవకాశాలు కల్పించినట్లయితే భారతదేశంలోని కార్మికుని ఉత్పాదనాశక్తి తదితర దేశాల కార్మికుల ఉత్పాదనాశక్తితో సరితూగగలుగుతుందనీ, అంటే జాతీయసంపద దినదినాభివృద్ధి చెందుతోందని మనం సృష్టించుతున్న పారిశ్రామిక వాతావరణంలో మనం సరిగా ముందుకు ప్రయాణం చెస్తున్నామనీ విశ్వసనీయంగా చెప్పవచ్చు.



# విచిత్రి

శ్రీ సింగరాజు లింగమూర్తి

తనను హైదరాబాదు కేటాయించారన్న ఆఫీసు ఆర్డరు చూడంగానే 'అరే—అల్లా' అంటూ అహ్మద్ కుర్చీమీద మెదవాల్చేశాడు. తోటిసహూద్యోగులమంతా కంగారుగా చుట్టూ చేరాము. అహ్మదుకు నిలువు గ్రుడ్లు పడిపోయాయి. నోట మాటలేదు. ఆఫీసుకారులోనే అతని మృతదేహాన్ని ఇంటికి చేరవేశాము. అహ్మదుమీద ఆధారపడివున్న పదిమందీ గొల్లుమని ఏడ్చారు. అతని అంత్యక్రియలకు ఇంట్లో ఎర్రని ఏగానీ కూడా లేకపోతే ఆఫీసువాళ్లమే చందాలు వేసుకున్నాము. ఏండ్లతరబడి ఒకే ఆఫీసులో కలిసిమెలిసి పనిచేసినవాళ్ళం కాబట్టి అహ్మదును సమాధిచేస్తుంటే మాకు తెలియకుండానే కన్నీళ్లు కార్చేశాం కొందరం. ఇప్పటికీ అహ్మద్ జ్ఞాపకం వచ్చినప్పుడల్లా, అతనిమాటలు మనస్సులో మసులుతూంటాయి. అతనిరూపం కళ్ళముందు కదులాడుతూ ఉంటుంది.

బక్కపల్చగా పొడుగ్గా ఉంటాడు. పాలిపోయిన ముఖంలోని ముడతలు, లోతుకు దిందుకొనిపోయిన కళ్ళూ దైన్యాన్ని సూచిస్తుంటాయి. తెలుపు-నలుపూ కలనేతరంగులో పెరిగిన గడ్డం, పొత్తాలాడి రంగు మాసిపోయిన షేర్వానీ చేతులనుంచి వ్రేలాడే దారపుపోగులు—కాళ్ళకు సగం తెగిపోయిన టైరుచెప్పులు—అహ్మదు బ్రతుకు కష్టాల సుడిగుండంలో కొట్టుకుపోతున్నట్లనిపిస్తుంది.

అసలు ఎప్పుడో ఒకప్పుడు గుండె ఆగిపోయి అహ్మదు చస్తాడనుకునేవాణ్ణి. ఏకష్టం వచ్చినా ఉప్పెనలా వచ్చేది. ఆ ఉప్పెనలో అహ్మదు ఎక్కడికి కొట్టుకుపోతాడో ననిపించేది. ఏ అవమానం వచ్చినా మనిషిని నిలువునా మ్రింగదీసేది. ఆ అవమాన భారంతో కుంచించుకుపోయిన అహ్మదు ఒకటి రెండురోజులదాకా తేరుకోలేక పోయేవాడు. ఈ కష్టాలకు, అవమానాలకు అహ్మదుగుండె బండబారిపోయింది. అంత బండబారిపోయిన అహ్మదు గుండె హైదరాబాదుకు కేటాయించారన్న ఆఫీసుఆర్డరు చూడంగానే ఆగిపోవడం అబ్బురంగానేవున్నా, అది సమ్మెటపోటులా తాకివుంటుంది. దాంతోపాటే బాధ్యతలుకూడా ఘోషిల్లడంతో ఉక్కిరి బిక్కిరై అహ్మదుగుండె బ్రద్దలై ఉంటుంది.

అహ్మదు పుట్టడం నవాబుల వంశంలోనే పుట్టాడు. అతని తాతలు, ముత్తాతలు, తండ్రి నవాబుల దర్జాతోనే బ్రతికారు. చివరికి అహ్మదు కర్మమే ఇట్లా కాలింది. తండ్రి అతనికి మిగిల్చిందల్లా ఒక ఇల్లు. అదీ తాకట్టులోనే వుంది. ఇకపోతే తండ్రిచేసిన ఉపకారమల్లా అహ్మదును పట్టభద్రుణ్ని చేయడమే. మొదట్లో, మంచికి చెడ్డకీ పిల్లనిచ్చిన తండ్రి ఆదుకునేవాడు. పలుకుబడీ—డబ్బూ కలవాడు కాబట్టి మామగారే అహ్మదుకు ఉద్యోగంకూడా సంపాదించిపెట్టాడు. ఆ ఆధారంకూడా ఎంతోకాలం అతనికి లేకపోయింది. ఆ మామగారు కాస్తా కళ్ళుమూసేసేసరికి అహ్మదు బ్రతుకు బజారునపడింది. 'నీ బ్రతుకు నీవు బ్రతుకు' అన్నారు బావమరుదులు.

అహ్మదు కుటుంబం ఆర్థికంగా చితికిపోయినా అతని వంశాన్ని అంటిపెట్టుకు వస్తున్న ఆచారాలు, సంప్రదాయాలు మాత్రం విడిపోలేమన్నాయి. కాదు—ఆ కుటుంబం విడిచిపెట్టలేకపోయింది. తన వంశగౌరవాన్నీ, పరువు ప్రతిష్ఠల్నీ కాపాడుకోవాలన్న పెనుగులాటలో అహ్మదు బ్రతుకు దుర్భరమైపోయింది.

*  *  *  *

ఒకరోజు ఆఫీసులో తొందరపనుండి ఒక ముప్పావుగంట ముందరే బయలుదేరాను. ఇరవై, ముప్ఫై గజాల దూరంలో ఆఫీసు ముందర అహ్మదు కనిపించాడు. అతణ్ణి కదలనీయకుండా ముగ్గురు కాబూలీవాళ్ళు చుట్టూ నిలబడ్డారు. ఒకడు అహ్మదు గుండెను పిండుతున్నట్టుగా గుండెలమీదవున్న షేర్వానీని పిడికిలిలో బిగించాడు. అతనికి చెరోప్రక్క నిలబడినవాళ్లు ఏవో పరుషంగా మాట్లాడుతున్నారు. నన్ను ఆ క్షణంలో ఆఫీసుముందు చూసేప్పటికి అహ్మదుముఖం వెలతెలపోయింది. ఆత్మాభిమానం గొడ్డలితో నరికినట్లయిందేమో కళ్ళల్లో నీళ్లు గిర్రున తిరిగాయి. నన్ను చూడలేక అహ్మదు తలవంచేసుకున్నాడు. 'అయ్యో-పాపం' అనిపించినా చేసేది లేక లోపలికి వెళ్ళి పోయాను.

నన్ను చూడటానికి ముఖం చెల్లకనేమో అహ్మదు ఆఫీసు ఫైళ్ళలో తలదూర్చి కూర్చున్నాడు. పనిలోవున్నా రోజూ ఏదో ఒకటి కల్పించుకొని మాట్లాడేవాడల్లా, ఆరోజు నా ముందరినుంచి పోవాల్సిన పనివున్నా తప్పించుకు పోతున్నాడు. 'లంచిటైంలో' అంతా వెడుతూంటే అహ్మదుమాత్రం సీటులో కదలకుండా కూర్చున్నాడు. రోజూ అందరికంటేముందు లంచికి బయలుదేరేవాడు ఆరోజు కదలకపోయేప్పటికి నాకే ఎలాగో అనిపించింది. అతని వాలకం చూస్తే ప్రొద్దుట భోజనంచేసినట్టు కూడా అనిపించలా. బయటికి అనుపెట్టినవాడినల్లా మళ్ళీ లోపలికివెళ్ళి "అహ్మద్ భాయ్—లే, కాంటీనుకు వెడదాం" అన్నాను. ఏమనుకున్నాడో ఏమో, నా ముఖంలోకి ఒకసారిచూసి మారుమాట్లాడకుండా బయలుదేరాడు.

ఇద్దరం కాంటీనులో ఓమూలగా కూర్చున్నాం. అతణ్ణి మాటల్లోకి దింపి 'ఏవో' కులాసాకబుర్లలో మనస్సుకు ఉల్లాసం కలిగిస్తేనేకాని అహ్మదు ప్రొద్దుటి వ్యవహారం మరచిపోడనిపించింది.

కాని అతను చిన్నబుచ్చుకొని, ముభావంగా వుండటంతో నేనే మాట కదిపినా అతను ఉత్సాహం కనబరచలేదు. మేము కాంటీనులో ఉండగానే అహ్మదుకొడుకు పన్నెండేళ్లవాడు వచ్చాడు. కుర్రాడు పసిమిఛాయలో అందంగా బాగానేవుంటాడు. సరైన పోషణలేక నేమో చిక్కిపోయివున్నాడు. కాంటీనులోంచి ఐదారు పెద్దసైజు డబుల్‌రొట్టెలు, ఇంకేవేవో కట్టించి కొడుకుచేత ఇంటికి పంపాడు అహ్మదు.

'ఏం—ఇంట్లో ఎవరికైనా జబ్బుగా ఉందా?' అన్నాను.

'రోజూ ఇది మామూలే. మధ్యాహ్నం పిల్లలకు తినటానికేమీ ఉండదు' అన్నాడు అహ్మదు.

'అందుకని రోజూ కాంటీనునుంచి పంపిస్తే బిల్లు బోలెడంత కాదూ?'

'అవుతుంది. ఏంచేయనుమరి. ఆకలితో పిల్లలేముంటారు?' అతని సమాధానం నాకంతగా నచ్చలేదు.

'అదికాదు అహ్మదుభాయీ...ఈ కాంటీనుకు తగలేసే డబ్బుతో ఇంట్లోనే ఏదైనా చేయిస్తే అందరూ తినవచ్చు. ఇంత డబ్బుకూడా కాదుగా అప్పుడు.

'ఏంచెప్పనుభాయ్—నా పాట్లు. పెద్దపిల్లలంతా కాలేజీలకు, స్కూళ్లకు వెళ్లిపోతారు. అసలే అనారోగ్యంగా వుంటే మామూసలిది మిగతా పిల్లలకు చేసిపెట్టలేక సతమత మౌతుంది. కాంటీనుకు ప్రతి నెలా రూ. 80 అవుతుంది. ఇంతెందుకు అవుతుందంటావేమో—సాధారణంగా నేను ప్రొద్దుటిపూట భోజనం చేసిరాను. ఒకవేళ చేసివచ్చినా కడుపుకు చాలీ చాలక తినిరావడంతో ఆకలికి ఆగలేక కాంటీనులో ఏదో ఒకటి తినేస్తాను' అన్నాడు అహ్మద్.

కాంటీనుకు 80 రూపాయలు అవుతుందంటే నిజంగా నాకు చాలా ఆశ్చర్యంవేసింది. ఆఫీసులో అందరికంటే ఎక్కువగానే అహ్మదుకు కాంటీనుబిల్లు అవుతుందని ఒకటి రెండుసార్లు విన్నాను కాని ఇంత ఎక్కువఅవుతుందని అనుకోలేదు. అతనికిజీతం, అలవెన్సులతో సహా 200 రూపాయలు వస్తుంది. కాంటీను బిల్లు, ఇన్సూరెన్సు, కోఆపరేటివ్ కటింగులూ అన్నీ పోగా అతనిచేతికి 80, 90 రూపాయలు వస్తాయనుకుంటాను. ఈ స్వల్పమొత్తంతో అంతపెద్ద సంసారాన్ని ఎలా ఈదుతున్నాడో, పిల్లలకు చదువు సంధ్యలు ఎలా చెప్పిస్తున్నాడో, రాబందుల్లా పీక్కుతినే కాబూలీవాళ్లకు వడ్డీలెలా కడుతున్నాడో నాకర్థం కాలేదు.

'మీకు ఆశ్చర్యంగానే వుంటుంది. ఏమిటో బ్రదర్. నా మనస్సు చెడిపోయింది. ఒక్కోసారి నేనేం చేస్తున్నానో నాకే తెలియదు. జీవితం మీద విరక్తిలేదు, అనురక్తిలేదు. ఒక్కోసారి ఒంటరిగా కూర్చొని భోరున ఏడ్వాలనిపిస్తుంది. కాని అలా ఒంటరిగా వున్నప్పుడు ఏవేవో పిచ్చి ఆలోచనలు వస్తుంటాయి. ఆ ఆలోచనల్లోనే కళ్లు చెమ్మగిలుతాయి. ఆ చెమ్మగిలిన కళ్లతో నిస్సత్తువగా మత్తుగా పడుంటాను. ఎప్పుడు నిద్రపడుతుందో నాకే తెలియదు' అన్నాడు అహ్మద్.

ఒక్కోసారి ఆలోచనలు మనిషిని పీల్చి పిప్పిచేసి ఏమాత్రం సత్తువ లేకుండా చేస్తాయి. ఆ నిస్సత్తువతో అలాగే పడుకొని వుంటాడు. ఇక అతనిలో ఆలోచించే శక్తికూడా ఉండదు. ఆ నిస్సత్తువతో వెంటనే నిద్రకూడా రాదు. అన్ని ఇంద్రియాలూ పనిచేస్తున్నట్టే వుంటాయి. కాని ఏమీ చేయలేనివాడిలా మత్తుగా పడివుంటాడు. అహ్మద్ అవస్థకూడా అంతే అయివుంటుందను కుంటూ లేచాను. ఇద్దరం మళ్లీ ఆఫీసులో అడుగుపెట్టాం.

ఆరోజునుంచీ అహ్మదుతో నాకు మరింత సన్నిహితత్వం ఏర్పడింది. అహ్మదు కుటుంబాన్ని ఉద్ధరించగల స్తోమతు నాకు లేకపోయినా, చేయగల సహాయ మేదైనా వుంటే చేయాలన్న బుద్ధి పుట్టింది. అతని కుటుంబ వివరాలు అతనివల్ల నేగాక, ఇతరులవల్ల కూడా విన్నాను.

అహ్మదుకు తొమ్మిదిమంది సంతానం. ప్రతితండ్రి తన సంతానానికి విద్యాబుద్ధులు చెప్పించి ఉన్నతిలోకి తీసుకురావాలని కుతూహలపడతాడు. కొందరికి పరిస్థితులు అనుకూలిస్తాయి. కొందరికి పరిస్థితులు అనుకూలించక కుతూహలం కుతూహలంగానే ఉండిపోతుంది. అహ్మదును ఒకందుకుమాత్రం అభినందించక తప్పదు. పరిస్థితులకు ఎదురొడ్డి తన పిల్లలకు ఉన్నతవిద్యలు చెప్పిస్తున్నాడు. 'నేను వాళ్లకి ఆస్తిపాస్తులేం ఇవ్వకపోయినా, ఇంత చదువైనా చెప్పిస్తే వాళ్ళ బ్రతుకు వాళ్లు బ్రతుకుతారుకదా' అనేవాడు.

'ఆడపిల్లలకు అంతంత పెద్దచదువులు చెప్పిస్తే రేపు వాళ్లు నీకేం ఒరగబెడుతారు? ఎలాగూ ఓఅత్తింటికోడలు కావాల్సిందేగా' అనేవారు కొందరు.

'వాళ్లు నాకేం ఒరగబెట్టక పోవచ్చు. కాని వాళ్ళ సంసారాలకు వాళ్లు ఒరిగించుకోవడమే నాకు కావాల్సింది. కట్నాలు—కానుకలు ఇచ్చి నేను మంచి సంబంధాలు తేలేను. అలాగని ఏ రిక్షావాడికో ముడిపెట్టి నా వంశగౌరవాన్ని మంటగలుపుకోలేను. ఒక డిగ్రీవుంటే దాన్ని చూసైనా ఏ మంచి సంబంధమైనా కుదరచ్చు. వాళ్ళకిష్టమైతే ఉద్యోగం చేయించుకుంటారు. లేకపోతే లేదు. అసలు ఏ సంబంధమూ రాలే అనుకుందాం—డిగ్రీవుంటే ఏదైనా మంచి ఉద్యోగంలో ఉండి- ఇతరులపై ఆధారపడకుండా బ్రతకవచ్చుగా' అంటాడు అహ్మదు.

అహ్మద్‌వున్న పరిస్థితుల్లో మన తెలుసువాళ్లెవరైనా వుంటే, చదివిన చదువు చాలని, వాళ్లనీ వీళ్లనీ ఆశ్రయించి, నానా గడ్డి కరచి ఏ చిన్న ఉద్యోగంలోనైనా సరే చేర్పించేస్తాము. గొర్రెతోక బెత్తెడేనన్నట్టు ఆ ఉద్యోగానికి ఎదుగూ—బొదుగూ ఉండదు. నలుగురూ నాలుగురాళ్లు సంపాదించుకొస్తే సుభిక్షంగా కుటుంబాన్ని గడుపుకోవచ్చుకదా అనుకుంటాము. అహ్మదు ఈ వాదాన్ని ఒప్పుకోడు. అందుకే అతని బ్రతుకు బజారుకెక్కింది అంటారు. 'నా బ్రతుకు బజారుకు ఎక్కితే ఎక్కింది—నా పిల్లల భవిష్యత్తు బాగుంటేచాలు' అనేవాడు అహ్మదు.

* * * *

ఓసారి నేనేదో పనిమీద హిమాయత్‌నగర్ వెళ్ళి వస్తున్నా. ఓ ఇంటి గుమ్మంలో అహ్మదు కనిపించి, "ఇదే మా ఇల్లుభాయీ,

రండి లోపలికి" అంటూ చెయ్యిపట్టుకొని లోపలికి తీసుకువెళ్లాడు. ఇద్దరం కూర్చొని మాట్లాడుకుంటుండగా "భాభా" అన్న మధుర స్వరంతోపాటు ఓ సుందర సుకుమారమూర్తి తెర తొలగించి, నన్ను చూసి తటిల్లతలా తెరవెనక్కి మాయమైంది. 'అం—బేటియా ఆ' అన్నాడు. ఆలావణ్యమూర్తి అందాలొలికిస్తూ లోపలికివచ్చి సిగ్గుదొంతిరలతో 'ఆదాబర్సే' అంది. ఆముగ్ధ సౌందర్యాన్ని కళ్లతో ఫుణుకుతూ "అదాబర్సే" అన్నాను. అహ్మదు నన్ను పరిచయం చేశాడు. ఆ పరిచయంలో నేనో మామూలు గుమాస్తా నైనేకాక, కథకుడిననీ, పేరుమోసిన పత్రికలలో నారచనలు వస్తుంటాయనీ, రేడియోకు కూడా రచనలు చేస్తుంటాననీ తెలియజేశాడు. 'మిమ్మల్ని కలవడం చాలాసంతోషంగా ఉంది......ఇప్పుడే వస్తా' నని ఉర్దూలోనే అంటూ, లోపలికి వెళ్ళింది. ముంతాజ్ బి. యస్. సి. చదువుతున్నదనీ, తెలివైనదవడంవల్ల స్కాలర్‌షిప్పుకూడా దొరికిందనీ అహ్మద్ చెప్పాడు. ఇంతలో ముంతాజ్ మెరుపుతీగలా లోపలికివచ్చింది. ఆమెవెనకే నౌకరు ట్రేలో టీ తీసుకువచ్చి మా ముగ్గురికీ ఇచ్చాడు. నావంక చూస్తూ 'లీజియే' అంది ముంతాజ్. ఆస్వరంలో ఏదోమధురిమ ప్రతిఫలించింది. సోగలుతీరిన ఆకాటుకకళ్లలో ఏదో వింతశోభ తొణికిసలాడింది.

'మిమ్మల్ని ఒకవిషయం అడుగుదామని చాలారోజులనుంచి అనుకుంటున్నా మూర్తిసాబ్' అన్నాడు అహ్మదు.

'నాదగ్గర సంకోచమెందుకు అహ్మద్ భాయ్—చెప్పు' అన్నాను.

'ముంతాజ్ ప్రాంతీయభాషల్లో తెలుగు తీసుకుంది. మీరు ఆమెకుకాస్త సహాయంచేస్తారేమో అడుగుదామనుకున్నాను. కాని ఇంతకుముందు ఆఫీసులో ఒకరడిగితే ట్యూషన్ చెప్పనని మీరనడం విని నేను అడగటానికి సంకోచించాను.' అహ్మద్ మాటల్లో కొంత లౌక్యం లేకపోలేదనిపించింది. నే నేమంటానో వినాలన్న కుతూహలం కనబరచింది ముంతాజ్.

'నిజమే ఆమాట. సాయంత్రాలప్పుడు ఏవోసభలకీ, సమావేశాలకీ వెడుతుంటానుగా. ట్యూషన్లు చెప్పేకాలంలో ఏ రచనైనాచేస్తే ఆమాత్రం గిట్టుబాటుకాకపోదనే ఉద్దేశంతో ట్యూషన్లు ఒప్పుకోలేదు. మీ అమ్మాయికి కావాలంటే సాయంత్రంపూట ఓగంటసేపు ఎలాగో వీలుచేసుకొని చెబుతాలే' అన్నాను. నా సమాధానానికి అహ్మదూ, ముంతాజ్ ఎంతోసంతోషం, కృతజ్ఞత వెలిబుచ్చారు.

ఆనాటినుంచే అహ్మదుకుటుంబంతోకూడా నాకుపరిచయమూ, సన్నిహితత్వమూ—సానుభూతి ఏర్పడ్డాయి. అహ్మదుపిల్లలంతా చురుకైనవాళ్లే. పెద్దకూతురు మానూనాశేగం మెడిసిన్ చదువుతున్నది. ముంతాజ్ రెండోకూతురు, మూడోసంతానం వహీద్ ఇంజనీరింగ్ చదువుతున్నాడు. మిగతాపిల్లలు వయస్సువారీగా చదువుతున్నారు.

సాయంత్రం ఆఫీసువదలంగానే సరాసరి అహ్మదు ఇంటికివెళ్లే వాణ్ణి—ముంతాజుకు తెలుగుపాఠాలు చెప్పడానికి. ఆ కుటుంబంలో పిల్లలదగ్గరినుంచి పెద్దలదాకా ఎంతో గౌరవం చూపేవారు. అహ్మదు ఆఫీసువదలంగానే ఇంటికి వచ్చేవాడుకాదు. అతనికేవో పనులున్నాయంటూ ఎక్కడికో వెళ్లేవాడు. అతనికేం పను లున్నాయో అడగడం దేనికని వూరుకునేవాణ్ణి.

రోజూ నేను వెళ్లంగానే ముంతాజ్ బిస్కట్లు, టీ తెప్పించి ఇచ్చేది. వద్దంటే ఏమనుకుంటుందోనని మొదట్లో తీసుకునేవాణ్ని. అహ్మదు పడేఇబ్బందులు నాకు తెలుసుకాబట్టి అనవసరంగా ఆ కుటుంబానికి ఖర్చు కలిగించడం దేనికనిపించి ఓరోజు ముంతాజుతో 'ఎందుకివన్నీ-వద్దు' అన్నాను. 'ఏం?' కళ్లల్లోకి చూస్తూ అంది ముంతాజ్.

'అబ్బే-మరేం లేదు. నేను ఆఫీసునుంచి వచ్చేప్పుడు ఎలాగూ హోటలుకువెళ్లి వస్తాను. మళ్ళీ అనవసరంగా ఎందుకూ' అన్నాను. ముంతాజ్ కాస్త చిన్నబుచ్చుకున్నట్లనిపించింది. 'అయితే తీసుకోరా?' అంది. ఆ మాటల్లో కొంత ప్రాధేయత ధ్వనించింది. నే నేం మాట్లాడలేదు. 'తీసుకోకపోతే నామీద ఒట్టే' అంది. ఏమిటీ ఒట్టు అనుకుంటూ ముంతాజ్ వంక చూశాను. ఎప్పుడూ చిరునవ్వులు చిందే గులాబీ రెక్కల్లాంటి ఆమె పెదవుల్లో చలనం కనిపించలేదు. ముఖంలో చిరుకోపం నర్తించింది. ముంతాజ్ నామీద ఎందుకింత చనువు తీసుకుంటున్నదోనని ఆలోచిస్తూ బిస్కట్లు, టీ తీసుకొని 'ఊఁ—సరేనా' అన్నాను. ముంతాజ్ పుస్తకం తెరుస్తూ తృప్తిగా నవ్వింది.

నెలగడిచింది. ఆరోజు నేను ముంతాజుకు పాఠంచెప్పి, ఇంటికి వెళ్లడానికి బయలుదేరబోతుంటే ఆమె 'ఇవి తీసుకోండి' అంటూ రెండు పదిరూపాయలనోట్లు అందించబోయింది. ఆశ్చర్యంతో 'ఎందు' కన్నాను. 'ట్యూషన్ ఫీజు' అందామె.

'అయితే నేను రేపటినుంచి మానేస్తాను' అన్నాను. ముంతాజ్ తెల్లబోయింది. 'క్షమించాలి...నాకేం అర్థంకావడం లేదు' ఆందోళనగా అంది.

'మరేం లేదు. ఆడబ్బును ఇంకేఅవసరానికైనా ఉపయోగించు' అంటూ బయటికి వచ్చేశాను.

* * * *

ఓ రోజు స్నేహితులతో కలిసి మొదటాట సినిమాకు వెళ్లాను. హాల్లోంచి ఇవతలికి వచ్చేప్పటికి పదిగంటలైంది. అంతా తలోదారీ వెళ్ళాల్సిన వాళ్లం కాబట్టి అక్కడే నిలబడి ఏమిటో మాట్లాడుతున్నాము. ఇంతలో వెనక నుంచి 'రిక్షాహోనా క్యాసాబ్' అన్న కంఠం వినిపించింది. అది పరిచయమైన గొంతుగా అనిపించి వెనక్కు తిరిగాను. లోతుకు దించుకుపోయిన కళ్లు, బూడిద సున్నుడి రంగులో పెరిగిన గడ్డం...నా కళ్లను నేను నమ్మలేకపోయాను. నా ముఖం చూడడంతోనే, రిక్షా కావాలా అని అడిగిన వాడల్లా, మారుమాటాడకుండా ముందుకు తొక్కుకుంటూ వెళ్లిపోయాడు. సందేహం లేదు. అహ్మదే అతను. టోపీకిమారుగా తలపాగా చుట్టాడు. పంట్లానికి బదులు కాకినిక్కరు తొడిగాడు. షేర్వానీ స్థానంలో చినిగిన చొక్కావుంది. తన నెవరూ గుర్తుపట్టకుండా ఉండటానికనేమో వేషం మార్చివేశాడు. తనకు తెలిసినవారు కనపడకుండా ఉండటానికనేనేమో మారు మూలలో రిక్షా నడుపుతున్నాడు.

ఆ మరునాడు నన్ను చూడటానికి మనస్కరించక నేమో, అహ్మదు ఆఫీసుకు సెలవు పెట్టాడు. ఏవో పనులమీద వుండి రెండు సాయంత్రాలు మామూలుగా ముంతాజ్‌కు పాఠాలు చెప్పడానికి పోలేదు. ఈ మూడు రోజులూ అహ్మదు ఆఫీసుకు రాకపోవడంతో నాలో ఆందోళన ఎక్కువైంది. మర్నాడు సాయంత్రం ఇంటికి వెళ్ళి సంగతేమిటో కనుక్కుందామనుకున్నా. కాని ఆ రోజు సాయంత్రం ఆఫీసుపనిమీద మరో చోటుకి వెళ్ళవలసి రావడంతో పోలేక పోయాను. ఆ మరునాడు ఆదివారమే కాబట్టి వెళ్లచ్చుకదా అనుకున్నాను.

ఆదివారం నాడు ప్రొద్దున కాఫీ తాగి ఏమిటో వ్రాసుకుంటూ కూర్చున్నా. ఇంతలో ఇంటిముందు పరదాకట్టినరిక్షా ఆగింది. తలెత్తి చూసేప్పటికి పరదా తొలగించుకొని ముంతాజ్ చరచరలోపలికివచ్చి 'తొందరగా రండి మాస్టర్ సాబ్' ఆదుర్దాగా అంది. 'మీ బాబా ఆఫీసుకు రావడం లేదేం' అన్నాను.

'బాబాకు నాల్గురోజులనుంచి జ్వరం పేలిపోతున్నది. రోజూ మీరు వస్తారేమోనని ఎదురుచూసేదాన్ని. మిమ్మల్ని బాబా చూడాలంటున్నాడు. రారూ' అంది. తండ్రికి జ్వరం తగులుతున్నదన్న దిగులువల్లనో, నిస్సహాయతవల్లనో ముంతాజ్ కళ్ళల్లో నీళ్లు గిర్రున తిరిగాయి.

'ఛా...ఇంతమాత్రానికే కన్నీళ్లు పెట్టుకుంటున్నావా...మీ బాబాకేం భయంలేదు. నీవు పద ముంతాజ్... నేను స్నానంచేసి వస్తాను' అన్నాను. 'నిజమేనా?' అన్నట్టు చూసింది ముంతాజ్.

స్నానంచేశాక, ఎందుకైనా మంచిదని అక్రితంరోజే రేడియో చెక్ మారిస్తే వచ్చిన పాతిక రూపాయలు జేబులో వేసుకొని ముంతాజ్ ఇంటికి వెళ్లాను.

అహ్మదుకు జ్వరం బాగానే పేలిపోతున్నది. 'మందు తీసుకుంటున్నావా అహ్మద్ భాయ్' అన్నాను.

'ఆఁ...ఏదో తీసుకుంటున్నా' నీరసంగా అన్నాడు. ముంతాజ్ ఒక కాగితం అందించింది. అందులో డాక్టర్ ఏవో ఇంజక్షన్లు వ్రాశాడు. పరిస్థితి అర్థమైంది. జేబులోంచి రెండు పది నోట్లు ఒక అయిదునోటూ తీసి 'వహీదు వుంటే తెప్పించు' అంటూ ముంతాజ్ కిచ్చాను.

'ఇవి నీకు తిరిగిరావేమో' అన్నాడు అహ్మద్.

'మరేం పర్వాలే' దన్నాను.

అహ్మదులో కొంతసేపు మాట్లాడి లేచి రాబోతుంటే 'ఆనాటి సంగతి ముంతాజ్‌కు చెప్పకుభాయీ' అన్నాడు అహ్మదు. అతని చూపుల్లోని ప్రాధేయత, కంఠంలోని జీర నన్ను కలచివేశాయి. 'ఎంత ఆత్మాభిమానం' అనుకుంటూ ఇవతలికి వచ్చేప్పటికి చదువుల గదిలోంచి ముంతాజ్ పిలిచింది.

"పాఠాలు చెప్పడానికి రావడం లేదేం? నేనేం తప్పు చేశాను?" అంది ముంతాజ్. నేను వెంటనే సమాధానం చెప్పలేక పోయాను.

"అవునులెండి—నాకేం అధికారముంది అడగటానికి. నేనేమైనా డబ్బిచ్చి చదువుకునేదాన్నా ఏమైనానా, నిష్ఠూరంగా అంటున్నది ముంతాజ్.

'ముంతాజ్' అని గట్టిగా అరచినట్టున్నాను. ముంతాజ్ గజగజలాడి పోయింది. ఆమెను మందలిద్దామన్న ఉద్దేశం కూడా నాలో లేదు. అహ్మదుపడే మానసికబాధను, అతనుపడే శ్రమనూ నన్నా అర్థంచేసుకోలేక పోయిందన్న విచారమూ, కోపమే నా గొంతునలా పలికించి వుంటుంది. ఒక నిముషం వరకూ ఆమెమాట్లాడ లేకపోయింది.

'క్షమించండి...ఏదో చికాకులో అన్నాను' కళ్లల్లో నీళ్లు నింపుకుంటూ అంది ముంతాజ్.

'మీబాబా రోజూ ప్రొద్దుపోయి ఇంటికి ఎందుకు వస్తున్నాడో తెలుసా?' అన్నాను.

'ఇంటికివస్తే ఏమీతోచదని ఏక్లబ్బులోనో, స్నేహితులతోనో కాలక్షేపం చేస్తుంటానని బాబా చెప్తుండేవాడు' ఆ ప్రశ్న నేనెందుకు వేస్తున్నానా అన్నట్టుగా వున్నాయి ముంతాజ్ చూపులు.

'కాదు—పచ్చి అబద్ధం'

మరి ఏం చేస్తున్నాడంటారు?'

'మిమ్మల్ని చదివించడానికోసం, పోషించడానికోసం, వచ్చే జీతం రాళ్ళు చాలక, తాటిప్రమాణంగా పెరిగిన అప్పులకు వడ్డీలు కట్టడానికి చాలక రాత్రిళ్లు 11 గంటలదాకా రిక్షా నడుపుతున్నాడు. ముంతాజ్-రిక్షా' ఆవేశంగా అనేస్తున్నాను.

'రిక్షా...మా బాబా రిక్షా నడుపుతున్నాడా?...ఛీ...ఛీ నేనెంత పాపిష్టిదాన్ని మాస్టర్ సాబ్' అంటూ ముంతాజ్ వెక్కి వెక్కి ఏడుస్తున్నది.

'మీరు విలాసంగా రిక్షాల్లో కాలేజీలకు వెళ్ళడానికి రోజూ ఇచ్చే డబ్బులు ఎక్కడినుంచి వస్తున్నాయనుకున్నావు ముంతాజ్. మీ బాబా రాత్రిళ్లు రిక్షా నడిపి సంపాదించిన డబ్బులే. మీ బాబానుగురించి నీవుకానీ, మామూనాకాని, వహీద్ కానీ ఎప్పుడైనా ఆలోచించారూ?'

'ఇక చెప్పకండి మాస్టర్ సాబ్' అంటూ ముంతాజ్ కుళ్లికుళ్ళి ఏడుస్తున్నది.

ఈ సంగతిచెప్పి ముంతాజును ఏడిపిద్దామనుకోలేదు. ఆమెలో చైతన్యం కలిగించి ఆమెద్వారా మామూనా, వహీదులకుకూడా చైతన్యం కలిగించాలనే నా ఉద్దేశం. కాని ముంతాజ్ సుకుమార హృదయం భరించలేకపోయింది.

'ఏడవకు ముంతాజ్ ఏడవకు' అంటూ అప్రయత్నంగానే ఆమె తల నిమిరాను. కొంతసేపటికి ఆమె తేరుకుంది.

'ఎక్కడైనా నాకో ఉద్యోగం చూసిపెట్టండి మాస్టర్ సాబ్—రేపటినుంచి కాలేజీ మానేస్తాను' అంది ముంతాజ్. 'సరే' నంటూ లేచాను.

అహ్మద్ ఆ జ్వరంతో పదిరోజులక్కానీ తేరుకోలేదు. నేనారోజు ముంతాజుతో అన్నమాటలు ఆమె హృదయంపై బాగానే పనిచేశాయి. ఉద్యోగంలోచేరి, తండ్రికి ఆసరాగావుండా మన్న పట్టుదల ఆమెలో ఎక్కువైంది. మెడిసిన్ చదువుతున్న మామూనా, ఇంజనీరింగ్ చదువుతున్న వహీదూ వాళ్ళ కోర్సులు పూర్తి అవుతే,నేగాని మరేపని చేయడానికీ అవకాశం లేదనుకున్నారు. నా పలుకుబడికూడా కొంత ఉపయోగించేటప్పటికి ముంతాజుకు ఒక కార్యాలయంలో ఉద్యోగం దొరికింది. అహ్మద్

మొదట్లో కూతురు ఉద్యోగానికి ఒప్పుకోకపోయినా, నా ప్రోద్బలం, ముంతాజ్ పట్టుదల అతణ్ణి ఒప్పింపచేశాయి.

* * * *

అహ్మద్ మామూలుగా ఆఫీసుకు వస్తూనే వున్నాడు. వడ్డీ వసూళ్లకోసం, కాబూలీవాళ్లు అతణ్ణి పీడిస్తూనే వున్నారు. క్యాంటీను బిల్లు మామూలుకు భిన్నం లేకుండానే ఉంటున్నది. ముంతాజ్ ఉద్యోగంలో చేరడం ఫలితంగా అహ్మదుకు రాత్రిళ్ళు రిక్షా నడపడం తప్పింది. అదైనా ముంతాజ్ పట్టుదలవల్లనే.

ఇంతలో రాష్ట్రాల పునర్విభజన వచ్చింది. రాష్ట్రంలోని మహమ్మదీయోద్యోగులను కొందరిని మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాలకు కేటాయిస్తారన్న వార్త ముస్లిం ఉద్యోగులలో కొంత ఆందోళన కలిగించింది. తనను ఏ ప్రాంతానికి కేటాయిస్తారోనని అహ్మదు భయపడసాగాడు.

అప్పులతో, దైనందిన సమస్యలతో అహ్మదుకు అసలు మతి స్థిమితం లేకుండా పోయింది. ఈ భయం అతనిలో మరింతఅశాంతిని కలిగించింది.

"నేనిక్కడినుంచి కదలాలంటే మాటలా భాయ్...పదివేల రూపాయలు అప్పు తీర్చందే అవతలికి కాలు పెట్టలేను. సంసారాన్ని కదిలించేట్టు లేదు. పిల్లలచదువులకు ఇబ్బంది కలుగుతుంది" అన్నాడు అహ్మద్.

'ఈ గడ్డన పుట్టాం—ఈ గడ్డన పెరిగాం. కలలోకూడా అనుకోలేదు—ఈ గడ్డను వదిలిపెట్టి పోవాల్సి వస్తుందని' అన్నారు కొందరు.

'ఎవరు ఏ ఉద్యోగాలు చేస్తున్నా ఇంతవరకూ మా కుటుంబం సమష్టిగా వుంది. నన్ను మైసూరుకు, నా కొడుకుని బొంబాయికి, తమ్ముణ్ని మరోచోటుకు, నా కూతుర్ని ఏ ఔరంగాబాదుకో కేటాయిస్తే కుటుంబంలో 'విచ్ఛిత్తి' కలుగుతుంది. ఒకడు తక్కువ సంపాదించినా, ఒకడు ఎక్కువ సంపాదించినా ఇప్పుడు సర్దుకుపోవడానికి వీలవుతున్నది. ఇకపలా కుదరదుగా' అన్నాడొక పెద్ద కుటుంబీకుడు.

'సంకుచిత భావాలతో మూలసూత్రానికే దెబ్బ తగులుతుంది. పునర్విభజనవల్ల తాత్కాలికంగా కొన్ని ఒడుదుడుకులు, ఇబ్బందులు కలగడం సహజం. ఈనాడు మనకు కావాల్సింది విశాల దృక్పథం,' అన్న నాయకుల బోధనలు కొందరిలో పనిచేశాయి. కానీ ఇవేవీ రచ్చకెక్కలేదు. ఎవరికి వారు—పలుకుబడి గలవారు — ఈ గడ్డమీద ఉంటానికే ప్రయత్నాలలోకి దిగారు. వాళ్ళలాగానే అహ్మదూ ప్రయత్నించాడు. తన ఈతిబాధల్ని అధికారుల ముందు చెప్పుకొని ప్రాధేయపడ్డాడు. కాళ్ళూ కడుపులూ పట్టుకొని బ్రతిమాలుకున్నాడు. వాళ్ళను మెప్పించి అనుగ్రహం పొందటానికికూడా పూనుకున్నాడు.

కొన్ని కార్యాలయాలలో కేటాయింపులు ప్రకటింపబడ్డాయి. గోరుచుట్టుపై రోకటిపోటులా క్రొత్తగా ఉద్యోగంలో చేరిన ముంతాజ్ ను ఔరంగాబాదుకు కేటాయించడంలో అహ్మద్ కు తనవిషయంలో ఏమౌతుందోనని మరింత ఆందోళన పట్టాడు. 'ఎలాగయినా సరే, తను ఇక్కడికే వేయించుకుంటానికి గట్టిగా ప్రయత్నించాలి' అన్న సంకల్పం మరింత బలపడింది. 'నన్నిక్కడికే కేటాయిస్తే ముంతాజ్ చేత ఉద్యోగానికి రాజీనామా ఇప్పిస్తాను భాయీ' అన్నాడు.

ఈ దుమారంలో అప్పులను వసూలు చేసుకోడానికి తహ తహలాడసాగారు—మార్వాడీలు, కాబూలీవాళ్లు. కిరాణా దుకాణదార్లు కూడా అప్పులివ్వడం మానివేశారు. ఈవత్తిడివల్ల అహ్మదులాటి ఋణగ్రస్థులకు దినదినగండమైపోయింది బ్రతుకు. తాకట్టులో వున్న అహ్మద్ ఇంటిని స్వాధీనపరుచుకోడానికి మార్వాడీ పథకం వేశాడు. 800 అప్పిచ్చి వెయ్యిరూపాయలకు ప్రాంసరీనోటు వ్రాయించుకున్న కాబూలీవాడు కోర్టులో దావా తెస్తానని బెదిరిస్తున్నాడు. 'మూలిగే నక్కమీద తాటికాయపడి'నట్టు అహ్మదు భార్యకు క్షయ అని డాక్టర్లు నిర్ణయించారు. ఇవన్నీ అహ్మదు మెదడును తినివేశాయి. ఈ దిగుళ్ళతో మనిషి కట్టెలా తయారయ్యాడు. 'ఎందుకుభాయీ బ్రతకడం' అని పెదిమ విరిచేవాడు.

రోజులు గడుస్తున్నాయి. ఉన్నట్టుండి అహ్మదు ప్రవర్తనలో కొంత మార్పు కనిపించింది. ఎప్పుడూ పరాగ్గా వుండేవాడల్లా అందరితో కల్పించుకొని చలాకీగా నవ్వుతూ మాట్లాడడం మొదలు పెట్టాడు. 'ఈ మార్పుకు కారణమేమిటా' అని ఆలోచించాను. దీపం ఆరిపోయేముందు 'గప్' మని ఎగిరినట్టు కాదుగదా అహ్మదు జీవితం అన్న ఆలోచనవచ్చి అటువంటి పాడు ఆలోచన కలిగినందుకు నన్ను నేను తిట్టుకున్నాను.

ఓరోజు సాయంత్రం టాంకుబండ్ మీదికి షికారుకని వెళ్ళి వస్తున్నాను. అప్పటికే ప్రొద్దుపోయింది. ఒక బెంచీమీద అహ్మదు కనిపించాడు. నన్ను చూడంగానే ఎప్పుడూ ఎంతో ఆప్యాయంగా పలుకరించేవాడల్లా ఆరోజు నన్ను చూడనట్టు తల ప్రక్కకు తిప్పుకున్నాడు. 'కొంపతీసి హుసేన్ సాగర్ లో పడటానికి రాలేదుకదా' అన్న అనుమానం వేసి నేనే పలుకరించాను. ఎప్పుడూ చొరవగా మాట్లాడేవాడల్లా ముక్తసరిగా సమాధానమిచ్చి, 'నేనిందులోపడి చావడానికి రాలేదు భాయీ, ఒక పెద్దమనిషితో మాట్లాడుదామని వచ్చా' నన్నాడు. నేనుండటానికికూడా అతనికి ఇష్టం వున్నట్టు కనిపించకపోవడంవల్ల 'సరే నేవెడుతున్నా' నంటూ ముందుకు సాగాను. కొన్ని గజాలు వచ్చేప్పటికి ఒక కారులో ముంతాజ్ ముఖం దీపాలవెలుగులో తళుక్కున మెరిసింది. ప్రక్కనే ఒక అధికారి ఆమె భుజంమీద చెయ్యివేసి కులాసాగా మాట్లాడుతున్నాడు. నాకెక్కడలేని ఆశ్చర్యమూ విచారమూ కలిగాయి. 'ఛీ...ఛీ...అహ్మదు ఎంత నీచానికి ఒడిగట్టాడు. చదువూ సంస్కారమూగల ముంతాజ్ ఈ పాడుపనికి ఎలా ఒప్పుకుంది! ఇదా అహ్మదులోని మార్పుకు కారణం' అనుకుంటూ నడుస్తున్నాను. అతనిమీద జాలి, విచారమూ పడటంకంటే మరేం చేయగలుగుతాను.

అన్ని కార్యాలయాలలోనూ కేటాయింపుల జాబితాలు ప్రకటింపబడ్డాయి. అహ్మదు ఆశాసౌధం కుప్పలా కూలిపోయింది. ఏ అధికారిని నమ్ముకున్నాడో ఆ అధికారికూడా ఏమీ చేయలేకపోయాడు. తనను మైసూరు కేటాయించినట్టు ఆఫీసు ఆర్డరు చూడంగానే తనకళ్ళను తాను నమ్మలేకపోయివుంటాడు అహ్మదు. తనకు ఆశచూపిన అధికారి భయంకర కాముకుడిలా కనిపించివుంటాడు. తనకోసం శీలం అమ్ముకున్న ముంతాజ్, క్షయతో తీసుకుంటున్న భార్య కళ్ళముందు దీనంగా కనిపించివుంటారు. ఇంటిని తాకట్టు పెట్టుకున్న మార్వాడీ మాటలు, దావా తెస్తానన్న కాబూలీవాడి బెదిరింపూ చెవుల్లో ఘోషిల్లివుంటాయి. వీటన్నిటితో ఉక్కిరిబిక్కిరై నీరసించిపోయిన అహ్మద్ గుండె ఆగిపోయి వుంటుంది. ఏ పిల్లల భవిష్యత్తు ఉజ్జ్వలంగా ఉండాలని కాంక్షించి రిక్షాకూడా నడిపాడో ఆ పిల్లల భవిష్యత్తు ఏమవుతుందోనన్న ఆలోచనకూడా కలగకుండానే పాపం అహ్మద్ కళ్లు మూసేశాడు.

# తొలి పార్లమెంటు

శ్రీ చావలి వెంకటహనుమంతరావు

ఈ వ్యాసం ప్రచురింపబడే సమయానికి దేశంలో ఎన్నికల సంరంభం చాలావరకు పూర్తిఅయి క్రొత్త పార్లమెంటు స్వరూపం తేలిపోయి ఉంటుంది. మన రాజ్యాంగ చట్ట నిబంధనల ననుసరించి ఎన్నుకోబడుచున్న రెండవ పార్లమెంటు సమావేశం కాకముందు మొదటి పార్లమెంటు (1952-57) యొక్క పనిని సమీక్షించడం సమంజసంగా ఉంటుంది.

మొదటి పార్లమెంటుకు సాధారణ ఎన్నికలు 1952 మొదట్లో జరిగాయి. రాజ్యాంగచట్టంలో నిర్ణయించబడ్డ విధంగా ఈఎన్నికలు వయోజన ఓటింగు పద్ధతి ననుసరించి జరిగాయి. వయోజన వోటింగు విధానం మనదేశంలో ప్రథమంగా అప్పుడు ఆచరణలోకి తేబడ్డప్పటికీ, వోటర్లలో అధిక సంఖ్యాకులు ఎన్నికలలో పాల్గొనడం, వారి వారి ఇష్టాల ననుసరించి తమ ఓటింగుహక్కును ఉపయోగించి తమ ప్రతినిధుల నెన్నుకోవడం జరిగింది. ఓటుచేసిన వారిలో కొంతమంది తాము బలపరుస్తున్న పార్టీల సిద్ధాంతాలను, ప్రణాళికలను పూర్తిగా అవగాహన చేసుకొని వోటు చేసారనడానికి వీలు లేకపోయినా, మొత్తంమీద ఆహక్కు విలువను వారు గ్రహించారని చెప్పుకోవచ్చు. ప్రజాస్వామ్య బీజాలు మనదేశంలో మొలకలెత్తడమే కాకుండా బలమైన వృక్షంగా పెరగడానికి అవకాశాలున్నాయని తెలంచడానికి అదిఒక నిరాఘాటమైన నిదర్శనం.

స్వాతంత్ర్యం వచ్చినతర్వాత ఎన్నుకోబడ్డ ఆపార్లమెంటులో కాంగ్రెసు సభ్యులు 363 మంది. ప్రజాసోషలిస్టు పార్టీవారు 28, కమ్యూనిస్టులు 17, హిందూ మహాసభవారు 4, ఇతర పార్టీలవారు 44 స్వతంత్రులు 43, ఉండిరి. పార్లమెంటు జీవితంలో మధ్య మధ్య కొంతమంది సభ్యులు ఒక పక్షంనుండి ఇంకొక పక్షానికి మారడం జరిగినా మొత్తంమీద వివిధ పార్టీ బలాలలో ఈమార్పులవలన చెప్పుకోతగ్గ హెచ్చుతగ్గు లేమీ జరగలేదు.

జరిగిన ఐదు సంవత్సరాలలో పార్లమెంటు అధికార పూర్వకంగా దేశంయొక్క ఆర్థిక, సాంఘిక, పారిశ్రామిక, పరిపాలనా విషయాలలో సర్వతోముఖంగా తన బాధ్యతను నిర్వహించింది. అదీకాక పార్లమెంటు మొదటి సమావేశంలో పునాది వేయబడ్డ మన విదేశాంగ విధానం పార్లమెంటు అంత్యదశలో ఒక నిర్దిష్ట, నిర్దుష్ట పంథాలోకి వచ్చి అనేక ఇతర దేశాలచేత మెప్పు పొందింది. అధిక సంఖ్యాకులుగా ఉండి ప్రభుత్వ నిర్వహణ బాధ్యత వహించిన కాంగ్రెసుపక్షంయొక్క విధానాలు పార్లమెంటులో స్వతహాగా ఆమోదింపబడ్డప్పటికీ, ప్రతిపక్షసభ్యులు అభిప్రాయాలను వెల్లడించడానికి కాని, వారి పక్ష పథకాలననుసరించి ప్రభుత్వ విధానాలను, పథకాలను విమర్శించడానికి గాని ఏ విధమైన ఆటంకాలు, అంతరాలు లేవు. మొదట్లో కొంతవరకు ప్రతిపక్షాలు, ముఖ్యంగా కమ్యూనిస్టు పార్టీవారు కాంగ్రెస్ ప్రభుత్వ కార్యకలాపాలను తీవ్రంగా విమర్శించడానికి పూనుకున్నా, క్రమేపీ నిర్మాణాత్మక దృక్పథంతో ప్రభుత్వచర్యలను పరిశీలించడం జరిగింది. పార్లమెంటరీ విధానంయొక్క విలువ, గౌరవం ఈ విధంగా ఇనుమడించడం సంతోషకరమైన విషయం.

## అంతరంగిక విషయాలు

దేశంయొక్క ఆంతరంగిక విషయాల్లో పార్లమెంటు జీవితకాలంలో జరిగిన ప్రధానవిషయం 1951 లో నిర్ణయింపబడ్డ మొదటి పంచవర్ష ప్రణాళిక జయప్రదంగా పూర్తిఅవడం. దానికన్న అనేక విధాల పెద్దదైన రెండవ పంచవర్ష ప్రణాళికకు పునాదులు నిర్మింపబడడం. గత 5 సంవత్సరాలలో అనేకసార్లు ఈ పంచవర్ష అభివృద్ధి ప్రణాళికల స్వరూపం, వాటి మూలసూత్రాలు, వాటి ద్వారా జరిగిన అభివృద్ధిసమీక్ష, ప్రణాళిక సూత్రాలలోను, విధానాలలోను అవసరమైన మార్పులు, పార్లమెంటులో చర్చించబడ్డాయి. ముఖ్యంగా రెండవ పంచవర్ష ప్రణాళిక తయారవుతున్న కాలంలోను. తయారయినతరువాత "సోషలిస్టు సాంఘిక వ్యవస్థ" ఏర్పాటుచేయడం ప్రణాళిక లక్ష్యం అని నిర్ణయించడంలోను, దానిని రూపొందించడంలో పార్లమెంటు ప్రధానపాత్ర వహించింది.

"సోషలిస్టు సాంఘిక వ్యవస్థ"ను దేశంలో స్థాపించేందుకు అనువుగా పార్లమెంటు కొన్ని చట్టములను, కార్యక్రమాలనుకూడా ఆమోదించింది. స్టేట్ బ్యాంకును ప్రభుత్వపరం చేయడం, జీవిత భీమాను జాతీయంచేయడం, కంపెనీల చట్టాన్ని సవరించి కంపెనీ యాజమాన్యాలను ప్రజోపయోగంగా వ్యవహరించేటట్టు నిబంధనల నేర్పర్చడం ఈ కార్యక్రమంలో కొన్ని ముఖ్యఘట్టాలు. పన్నులు విధించే విధానాలలో మార్పులు ప్రవేశపెట్టి, ప్రత్యక్షపన్నుల భారాన్ని క్రమేపి హెచ్చుచేయడం, ఎస్టేటు డ్యూటీలను విధించడానికి చట్టంచేయడం కూడా ఈ నూతన సాంఘికవ్యవస్థకు దారితీసే పథకాలే. ఈ విధానాలన్నీ రాజ్యాంగచట్టంలో ఇమడ్చబడియున్న ప్రధానరాజకీయ, సాంఘిక సూత్రాలకు అనుగుణ్యంగా ఉన్నాయనీ, వాటిననుసరించే ప్రవేశపెట్టబడ్డాయని గ్రహించాలి.

మనదేశ ఆర్థిక, పరిపాలనా విధానాలు క్రమేపీ సోషలిస్టు వ్యవస్థ ననుకరించడానికి దోహదం చేయడమే కాకుండా, సాంఘికజీవితంలో కూడ విప్లవాత్మకములైన మార్పులు తీసుకువచ్చే

చట్టములను పార్లమెంటు ఆమోదించింది. వీటిలో హిందూ కోడ్‌ను సంస్కరించడానికి ఏర్పడ్డచట్టములు ప్రధానస్థానాన్ని ఆక్రమిస్తాయి. హిందువుల పెండ్లి, విడాకులు, వారసత్వము, దత్తత వీటికి సంబంధించిన చట్టములు ఒకదాని తరువాత ఇంకొకటి పోయిన ఐదు సంవత్సరములలో ఆమోదింపబడ్డాయి. ఈ చట్టముల ఆచరణలో హిందూ సంప్రదాయాలు, సంఘజీవితము ఏవిధమైన మార్పులకు లోనవుతుందో చెప్పడం కష్టం. పార్లమెంటులో ఈ చట్టములు వివిధపక్షాల విమర్శకు గురి అయినా, మొత్తంమీద అవి అధికసంఖ్యాకుల ఆమోదాన్ని పొందాయనడానికి సంకోచం లేదు.

సాంఘిక విషయాలనుగురించి వ్రాస్తూన్నప్పుడు, ఆ సందర్భములో పేర్కొనవలసిన వేరొకచట్టం అస్పృశ్యతా నివారణచట్టం. వివిధ రాష్ట్రాలలో అంతకుముందు ఆచరణలో ఉన్న వివిధచట్టాలను క్రోడీకరించి ఈ కేంద్రచట్టం ఏర్పాటుచేయబడింది. పడుపు వృత్తిని అణచటానికి దానివలన ఏర్పడ్డ ఘోర సాంఘికపరిస్థితుల తీవ్రతను తగ్గించడానికి కూడ ఒక కేంద్రచట్టాన్ని పార్లమెంటు ఆమోదించింది.

అధికారరీత్యా పార్లమెంటు ఆమోదించిన పథకాలలో రాష్ట్రపునర్నిర్మాణము ముఖ్యంగా పేర్కొనదగ్గది వుంది. ఈ పునర్నిర్మాణకార్యక్రమానికి పునాది 1953 లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడ్డంతో వేయబడింది. అటుతరువాత దేశంలో ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని పురస్కరించుకొని భాషాప్రయుక్త రాష్ట్రాలకై ఆందోళన ప్రబలడం, భారతప్రభుత్వం రాష్ట్ర పునర్నిర్మాణ సంఘాన్ని ఏర్పర్చడం, వారి రిపోర్టు ప్రచురింపబడ్డం దానికి సంబంధించిన చిత్తుచట్టాన్ని ప్రభుత్వం తయారుచేయడం జరిగాయి. ఇతర రాష్ట్రముల పునర్నిర్మాణాన్నిగురించి సరిహద్దుల మార్పులనుగురించి అభిప్రాయభేదాలు ఎక్కువ లేకపోయినా, బొంబాయిరాష్ట్ర విభజన, బొంబాయినగరంయొక్క భావిని గురించి తీవ్రమైన భేదాలు ఏర్పడడం, బొంబాయిలోను, యితర మహారాష్ట్ర గుజరాత్ ప్రాంతాలలోను అల్లరులు జరగడం అందరకు తెలిసినదే. చివరకు పార్లమెంటులోని కొంతమంది అనధికార సభ్యుల కృషివల్ల బొంబాయి ద్విభాషారాష్ట్రంగా ఏర్పడడానికి అవకాశం కల్పింపబడి, ప్రభుత్వంకూడ ఆసూచన కనుకూలంగా నిర్ణయించడం ఆవిధంగా బొంబాయి క్లిష్టసమస్య పరిష్కారం కావడం జరిగింది. రాష్ట్ర పునర్నిర్మాణంవల్ల ఇండియా రాజకీయపటానికి సుస్థిర స్వరూపం ఏర్పడింది. వివిధ రాష్ట్రాల సరిహద్దులు ఆయా రాష్ట్రాలలో వాడుకలో ఉన్న భాషననుసరించి ఆయా ప్రాంతాల పరిపాలనా సౌకర్యము ననుసరించి సరిదిద్దబడ్డాయి. వివిధరాష్ట్రాల ప్రభుత్వాలమధ్య, ప్రజలమధ్య సఖ్యత, సామరస్యం, సహకారం, ఐక్యత పెంపొంది దేశక్షేమానికి దేశాభివృద్ధికి మార్గం సుగమం అయింది.

## విదేశాంగ విధానం—"పంచశీల"

ఇండియా విదేశాంగ విధానానికి గత 5 సంవత్సరాలలో స్థిరత్వము, విశిష్టత ఏర్పడిందంటే, ఆ విధానానికి పార్లమెంటు మొదటినుండి ఇస్తూవచ్చిన ఆమోదం ఒక ముఖ్యకారణం. మన విదేశాంగ విధానానికి ప్రధానమంత్రి పండిత నెహ్రూ సూత్రధారు డైనప్పటికి, రానురాను దాని కేంద్ర సూత్రాలకు వివిధ రాజకీయ పక్షముల సహకారం, ఆమోదంకూడ దొరికింది. "పంచశీల" (5 సిద్ధాంతాలపై ఆధారపడ్డ విధానం) ప్రపంచంలో వివిధ దేశాల, ముఖ్యంగా ఆసియా, ఆఫ్రికా ఖండాలలోని దేశాల, మెప్పును పొందింది; ఆయా దేశాల పరిపాలకులు మన దేశం వచ్చినప్పుడు, ప్రధాన మంత్రి వారి దేశాలలో పర్యటిస్తున్నప్పుడు దానికి వ్రాతమూలకంగా తమ ఆమోదాన్ని తెల్పారు. రష్యా, చైనా, సౌదీ అరేబియా, ఇండోనీసియా, సిలోన్, సిరియా, ఇథియోపియా, ఈజిప్టు, బర్మా, సయాం, ఆఫ్గనిస్థాన్‌లు వీటిలో ముఖ్యమైనవి. మరి కొన్ని దేశాలు వ్రాతమూలకంగా "పంచశీల"కు ఆమోదం తెల్పక పోయినా, ఏ సిద్ధాంతాలపైన ఆ విధానం నిర్మింపబడిందో వాటి ఆచరణలో తమ సహకారాన్ని చూపిస్తున్నాయి. ఇండియాయొక్క శాంతివైఖరి, ప్రపంచంలో ఏర్పడ్డ రెండు రాజ్యవర్గాలకు సంబంధించని మధ్యేమార్గ అవలంబన ప్రపంచదృష్టిలో సరియైన విధానమని దీనివల్ల స్పష్టమౌతోంది. విదేశాలలో మన దేశపు ప్రతిష్ఠ క్రమేపి పెరుగుతోందనటానికి ఏ విధమైన అభ్యంతరం లేదు. దీనివలన మనకు సమకూడిన లాభమేమని కొంతమంది ప్రశ్నించవచ్చును. ప్రత్యక్ష లాభం ఎక్కువగా కన్పించకపోయినా, ప్రపంచశాంతి, భద్రతలను నిల్వబెట్టుటలో ఇండియా ఎప్పుడూ ముందంజవేసే అభిప్రాయం ఏర్పడడమే ఒక గొప్పలాభం. కొరియా, ఇండోచైనా, సూయజ్, హంగరీ-సమస్యలలో ఇండియా అనుసరించిన వైఖరి "పంచశీల" విధానానికి సిద్ధాంతాలకి ప్రత్యక్ష నిదర్శనంగా ఉంది. కాగా కాశ్మీర్ సమస్య ఇంకా పరిష్కారం కాకపోవడం, దానివల్ల ఇండియా పాకిస్థాన్‌ల మధ్య సామరస్యం కుదరకపోవడం కొంత వరకు విచారించవలసిన విషయాలే. కాని దానికి ఇండియా ప్రభుత్వ విధానంమాత్రం కారణంకాదని నిష్పాక్షికంగా ఆ సమస్య పరిశీలించినవా రందరకు తోస్తుంది.

పార్లమెంటు ప్రతిసమావేశంలోను ఒక్కసారైనా విదేశాంగ విధానంపైన చర్చ జరగడం, ప్రధాన మంత్రి ఆ సందర్భంలో ప్రపంచ పరిస్థితులను ఇండియా ప్రభుత్వ విధానాన్ని గురించి విపులంగా ప్రసంగించడంవల్ల దేశంలోను బయటాకూడ ఇండియా దృక్పథం సుస్పష్టంగా ప్రకటింపబడేందుకు అవకాశా లేర్పడ్డాయి. ఇంకా కొన్ని దేశాల్లో ఆ విధానాన్నిగురించి తప్పు అభిప్రాయాలుండడం - కనీసం అట్టి అభిప్రాయాలు వెల్లడించబడడం, ఆయా దేశాల వక్రదృక్పథానికి మాత్రమే తార్కాణాలు. దేశంలో విదేశాంగవిధానానికి సంబంధించిన చిన్న విషయాలలో ప్రభుత్వ విధానంపట్ల ప్రతిపక్షాలు విముఖత్వం సూచించినా, మొత్తంమీద వారందరు దానికి సుముఖులనే చెప్పొచ్చు.

## పార్లమెంటరీ మర్యాదలు

పార్లమెంటరీ విధానం జయప్రదంగా సాగడానికి కొన్ని మర్యాదలు, ఆచారాలు పార్లమెంటు సభ్యులు, మంత్రులు అనుసరించవలసిఉంది. వాటి అనుసరణవల్లనే ప్రజాస్వామ్యం బలపడి,

పార్లమెంటరీ విధానంయొక్క పునాదులు గట్టిపడడానికి అవకాశాలేర్పడుతాయి. ఇట్టి మర్యాదలు కొన్ని గత 5 సంవత్సరములలో ఆచరణలోకి వచ్చాయి. వీటిలో మొదటిది, మంత్రులెవరైనా ఏ ముఖ్యవిషయంలోనైనా ప్రభుత్వ విధానంతో ఏకీభవించలేకపోయినా, తమ ప్రత్యేక శాఖలకు సంబంధించిన విషయాలలో తమ బాధ్యతానిర్వహణలో లోపములు చూపింపబడినా, తమ మంత్రిపదవికి రాజీనామా నీయడం అనే సిద్ధాంతం బొంబాయి నగరభావిని గురించి ప్రభుత్వ విధానంతో తా నంగీకరింపలేకపోయినప్పుడు శ్రీ చింతామణి దేశ్ ముఖ్ ఆర్థికమంత్రిపదవికి రాజీనామా నిచ్చిరి. శ్రీ వి. వి. గిరి బ్యాంక్ ఉద్యోగుల బత్తెములను గురించి మంత్రివర్గములో తీవ్రఅభిప్రాయభేదము లేర్పడి తమ విధానం అమలుపర్చడంలో అడ్డు ఏర్పడినప్పుడు కార్మిక మంత్రిపదవిని వదలివేసిరి. శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి రైల్వేప్రమాదాలు పదేపదే జరుగుతూఉండటం తమ బాధ్యతానిర్వహణలో లోపం చూపుతున్నదనే కారణంచేత రైల్వే మంత్రిపదవికి రాజీనామా నిచ్చిరి. ఈ ఉదాహరణలు, పార్లమెంటరీ మర్యాదలకు, ప్రజాస్వామ్య పద్ధతికి అనుగుణ్యంగా ఉండటమేకాక, మన దేశంలో ప్రజాస్వామ్య బాధ్యతాయుత స్వపరిపాలనా సిద్ధాంతానికి బలం చేకూర్చాయని చెప్పక తప్పదు.

## ప్రతిపక్షం అవసరం

పార్లమెంటరీ విధానం జయప్రదంగా, వక్రగతులు పొందకుండా జరగడానికి అధికసంఖ్యాకబలం కల్గిన ప్రభుత్వపక్షమెంత అవసరమో, ఒక నిర్దుష్ట కార్యక్రమం కల్గి బలమైన ఐక్యతతో పనిచేసే ప్రతిపక్షం ఉండటంకూడ అంతే అవసరమనే విషయం సర్వాంగీకృతమైనదే. మొదటి పార్లమెంటులో ఇట్టి బలమైన ప్రతిపక్షం లేకపోవడం, ఉన్న ప్రతిపక్షాలు పరస్పర విరుద్ధ సిద్ధాంతాలకు చెందినవయి, వాటిలో అవి కలసి పనిచేయలేకపోవడం, దాని వలన ప్రతిపక్షం నిర్వహించవలసిన బాధ్యతల నవి పూర్తిగా నిర్వహించలేకపోవడం జరిగింది. ప్రభుత్వ బాధ్యతను నిర్వహించవలసి వచ్చిన కాంగ్రెస్ పక్షం చాలా బలంకలదిగా ఉండినప్పటికీ అది ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు కట్టుబడి తన కార్యభారాన్ని నిర్వహించడంవలన బలమైన ప్రతిపక్షంలేనిలోటు కన్పించకపోయినా, అట్టి పక్షంయొక్క అవసరంమాత్రం తగ్గలేదు.

గత ఐదు సంవత్సరాలలో పార్లమెంటు రాజ్యాంగ చట్టానికి ఏడు (7) సవరణలను ఆమోదించింది. రాజ్యాంగచట్టం ప్రవేశపెట్టబడిన ఇంత కొద్దికాలంలోనే ఇన్ని సవరణ లవసర మవడం కొంత ఆశ్చర్యంగా కన్పించినా, దేశంలో ఏర్పడ్డ ఆర్థిక, సాంఘిక, రాజకీయావసరాలనుబట్టి ఆ సవరణలు అవసరమయ్యాయి. ఉదాహరణకు, ఒక ముఖ్యసవరణ జమీందారీల రద్దు విధానాన్ని ఆచరణలో పెట్టే సందర్భంలో నష్టపరిహారం నిర్ణయించడంలో ఏర్పడ్డ క్లిష్ట పరిస్థితులను తొలగించడానికి చేయవలసివచ్చింది. మరొక సవరణ రాష్ట్ర పునర్నిర్మాణ సమస్య సందర్భంలో రాజ్యాంగచట్టంలో రాష్ట్ర సరిహద్దులు మార్చబడేటప్పుడు జరుగవలసిన విధానాన్ని సవరించి చేయవలసివచ్చింది. ఈ సవరణలు రాజ్యాంగచట్టం యొక్క పునాదిని బలపర్చడానికి తోడ్పడ్డాయికాని దానిని బలహీనం చేయడానికికాదు.

పార్లమెంటులో లోక్ సభ, రాజ్యసభ రెండూ అంతర్భాగాలనే విషయం అందరకు తెలిసిందే. కాని ఈ వ్యాసంలో ప్రధానంగా లోక్ సభ పనినిమాత్రం సమీక్షించాము. రాజ్యాంగచట్ట నిబంధనల ప్రకారం భారతప్రభుత్వం లోక్ సభకు బాధ్యత వహించిఉండటమే దీనికి కారణం. అట్లని రాజ్యసభ ప్రాముఖ్యతను తక్కువగా చూడడం ఉద్దేశ్యంకాదు. రాజ్యసభకూడ తన కార్యకలాపాలను శ్రద్ధాదీక్షలతోను, దేశక్షేమ, దేశాభివృద్ధి దృక్పథాలనుంచి నిర్వహించి, అనేక సందర్భాలలో దూరదృష్టితో చిత్తుచట్టములలో అవసర సవరణలను సూచించి, లోక్ సభకు మార్గదర్శిగా ఉండటమేకాక, ఆ సభతో పూర్తి సహకారంతో వ్యవహరించిందనడానికి అనుమానం లేదు.



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1.
Editor S. Sambhu Prasad.

శ్రీరస్తు—శ్రీ త్రిపురసుందరీ పరశివాభ్యాం నమః

# శ్రీహేమలంబనామ సంవత్సర పూర్ణశాస్త్రీయ(ఆంధ్రపత్రికా)పంచాంగమ్

## బ్రహ్మశ్రీ శ్రీమత్పిడపర్తి చినపూర్ణార్యసిద్ధాన్తిన స్తృతీయపుత్రేణకృష్ణమూర్తిశాస్త్రిణాప్రణీతమ్

విఘ్నేశ విధిమార్తండ చంద్రేంద్రోపేంద్రవందిత । నమో గణపతే తుభ్యం బ్రహ్మణాం బ్రహ్మణస్పతే॥

వేదమయీం నాదమయీం బిందుమయీం పరపదోద్యదిందుమయీం ।
మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీం॥

### గమనిక

ఈ సంవత్సరమున రాజు చంద్రుడు. మంత్రి శని. ౩ కుంచముల వర్షము. సర్వసస్య సముదాయమగు ౧౬ వీసము లలో ౯½ వీసములు పంట ఫలించును. శ్రీకృష్ణుడు పశుపాలకు డగుటచే పశువులు తృణక్షీరాదిసమృద్ధిగలవి యగును.

వైశాఖ శు ౧౫ సో. ముచ్యమానాస్తమిత చంద్రగ్రహణము, కార్తీక శు ౧౫ గు. ఖచ్ఛన్న చంద్రగ్రహణమున్ను సంభవించును. జ్యేష్ఠ బ ౭ బు. న కృష్ణానది యందు సార్ధత్రికోటితీర్థసహితపుష్కర ప్రవేశము. వైశాఖ శు ౧౫ సో. చంద్రగ్రహణము హైదరాబాదు మొదలు పశ్చిమదేశములకు గ్రస్తాస్తమ యము గాదు. వైశాఖ శు ౭ సో. న బుధగ్రహము రవిమండలమును భేదించును (దూసుకు పోవును.)



### మౌఢ్యములు

దుర్ముఖి సం. ఫాల్గున శు ౧ శ. ప్ర. వైశాఖ శు ౧౩ ఆ॥ వరకు శుక్ర మౌఢ్యము. భాద్రపద బ ౯ బు. ప్ర॥ ఆశ్వ బ౧౧ శ. వరకును గురుమౌఢ్యము. మాఘ శు ౪ శు. ప్ర॥ ఈ శు ౧౦ గు. వరకు శుక్రమౌఢ్యము. చైత్ర బ ౪ గు. ప్ర॥ జ్యేష్ఠ బ ౭ బు. వరకు సింహ గురుడు. (ఈ సింహగురుదోషము గంగా గోదావరీమధ్యదేశమునకే గలదు. మేషమున సూర్యుడుండ సింహగురు దోషము లేదు.)

| | |
|---|---|
| కల్యాద్యబ్దాః | ౫౦౫౯ |
| శాలివాహన శకః | ౧౮౭౯ |
| ఫసలీసన్ | ౧౩౬౬-౭ |
| హిజరీసన్ | ౧౩౭౬-౭ |
| క్రీస్తు సం. | 1957-8 |

శ్రీః శ్రీః శ్రీః

## ఆంధ్రపత్రికా కార్యాలయము, మద్రాసు 1.

## పంచాంగపద్ధతి వివరణము

ఇందు కాలమానము గంటలలో చూపబడినది. తిథి నక్షత్రము దినమానము భుక్తి గ్రహపాదప్రవేశములు ఘటికలలో గూడ చూపబడినవి. గంటలు అర్ధరాత్రినుండి చూపబడినవి. మధ్యాహ్నానంతరము 1-2 మొదలగు గంటలు 13, 14 మొదలగు సంఖ్యలచే చూపబడినవి. అనగా 12 గంటలకు తక్కువ గంటలు మధ్యాహ్నమునకు పూర్వమనియును, 12 గంటలకు నెక్కువ యగు కాలము మధ్యాహ్నానంతరము అనియు గ్రహింపవలయును. రాత్రి 12 గంటలు 24 గంటలుగ నుండును. రాత్రి 12 గంటల నుండి పరదినసూర్యోదయమువరకు నగు కాలము 1, 2, 3 మొదలగు గంటలు 'రా' అను గుర్తుచే వ్రాయబడినవి. 5-7 గంటల మధ్య కాలము 'రా' అను గుర్తు లేనిచో సూర్యోదయానంతరమని తెలియవలయును. సూర్యోదయమునుండి పరదినసూర్యోదయమువరకు పూర్తిగనున్నచో 'పూర్తి' అని వ్రాయబడినది.

కేంద్రప్రభుత్వముచే నియమింపబడిన పంచాంగసంశోధక మండలి (కాలెండరురిఫార్మకమిటీ) వారి నిర్ణయము ననుసరించి నూతన వేధశాలలందు గనుగొనబడిన నూతనసంస్కారములచే సాధింపబడిన తిథ్యాదికము, గ్రహసంచారము, ఇందు ప్రాధాన్యముగ చూపబడినది. ఈ తిథ్యాది గ్రహసంచారములే పంచాంగమున వ్రాసినట్లు ఆకాశమున సరిపడుచున్నవి. కావున నిది దృగ్గణిత పద్ధతియని చెప్పబడుచున్నది. కాని సూర్యసిద్ధాంత సంబంధమగు పూర్వపద్ధతి తిథ్యాదికమున్ను సంగ్రహముగ నిందు వేరుగ చూపబడినది. ఇది తెలియుటకై (పూర్వపద్ధతి పంచాంగే) అని పైన వ్రాయబడినది. రామానుజ మధ్వ సంప్రదాయముల ననుసరించి తిరునక్షత్రములును, పుణ్యదినములును పూర్వపద్ధతి పంచాంగమునందే వ్రాయబడినవి. దృగ్గణితపంచాంగమునందు అశ్విన్యాది నక్షత్రవిభాగము అయనాంశములును వేదాంగజ్యోతిషాదిప్రమాణసమ్మతములు. మరియు నిందు సాయనమానముచే నగు ఋతు పరిణామమున్ను సూచింపబడినది. పంచాంగసంశోధకమండలివారు లోకవ్యవహారముకొరకు సాయనసౌరమానముచే కాలమానము నేర్పరచియున్నారు. దానిచే మార్చి 22 వ తేదీ, చైత్రం 1 వ తేదీ యగుచున్నది. అట్టి తేదులును ఇందు చూపబడినవి.

ప్రస్తుతకాలమున నూతనముగ ఉత్పన్నములైన 3 గ్రహములు నవీన యంత్రసహాయముచే గనుగొనబడినవి. అవి 1. యురేనస్ (వరుణ) 2. నెప్ట్యూన్ (ఇంద్ర) 3. ప్లూటో (యమ) ఇవి యు. నె. ప్లూ. ఈ అక్షరములచే రాశిచక్రమున చూపబడినవి. కేంద్రప్రభుత్వ-అబ్సర్వేటరీశాఖచే పంపబడిన రవ్యాది సాయనగ్రహ భోగములు I. S. T. 5-30 లకు ఇందు వేరుగ చూపబడినవి.

శ్రీః శ్రీః శ్రీః

## దేశాంతర చక్రము

| పట్టణములు | మేష తులా | వృష కన్యా | మిథున సింహా | కర్కాటక | వృశ్చిక మీన | ధనుః కుంభ | మకర |
|---|---|---|---|---|---|---|---|
| శృంగేరి | ౬౫ | ౯౩ | ౯౭ | ౮౧ | ౫౯ | ౫౧ | ౪౭ |
| మైసూరు | ౫౦ | ౬౦ | ౬౮ | ౯౨ | ౪౦ | ౩౨ | ౨౮ |
| బెంగుళూరు | ౪౨ | ౫౧ | ౫౮ | ౬౧ | ౩౩ | ౨౬ | ౨౩ |
| అనంతపురం | ౪౨ | ౪౯ | ౫౧ | ౫౩ | ౩౯ | ౩౩ | ౩౧ |
| కర్నూలు | ౩౯ | ౪౦ | ౪౨ | ౪౩ | ౩౪ | ౩౨ | ౩౧ |
| నెల్లూరు | ౧౯ | ౨౩ | ౨౯ | ౨౭ | ౧౦ | ౯ | ౫ |
| హైదరాబాదు | ౩౨ | ౩౧ | ౩౧ | ౩౦ | ౩౩ | ౩౩ | ౩౪ |
| తంజావూరు | ౨౯ | ౪౦ | ౫౧ | ౫౪ | ౧౪ | ౪ | ౦ |
| కంచి (కామకోటి) | ౨౦ | ౨౭ | ౩౯ | ౩౭ | ౧౧ | ౩ | ౧ |
| వరంగల్లు | ౨౪ | ౨౩ | ౨౩ | ౨౨ | ౨౫ | ౨౫ | ౨౬ |
| బెజవాడ | ౧౨ | ౧౩ | ౧౪ | ౧౪ | ౧౧ | ౧౦ | ౧౦ |
| చెన్నపురి | ౧౫ | ౨౪ | ౩౦ | ౩౩ | ౬ | ౦ | ౩ |
| కుంభకోణం | ౨౩ | ౩౯ | ౪౯ | ౫౧ | ౭ | ౨ | ౫ |
| విజయనగరం | ౧౬ | ౧౮ | ౩౦ | ౨౨ | ౧౪ | ౧౨ | ౧౦ |
| బరంపురం | ౩౦ | ౩౪ | ౩౮ | ౪౦ | ౨౬ | ౨౨ | ౨౦ |
| రంగూన్ | ౧౪౫ | ౧౪౫ | ౧౪౪ | ౧౪౪ | ౧౪౫ | ౧౪౬ | ౧౪౬ |

## రాజమండ్రినుండి స్వగ్రామమునకు మార్పుట

రాజమండ్రినుండి ఆయాపట్టణములకు మేషాదిసాయనమాసను లందుగలుగు దేశాంతరవిఘటికలు పైచక్రమునందు గలవు. ఆయా రాశ్యయనప్రవేశము మొదలు ఆయారాశిసాయనమాసము లగు చుండును. పై దేశాంతరవిఘటికలు సాయనమాసారంభమునందగును. స్వగ్రామమునకు సమీపమందున్న పట్టణమునకు అభీష్టసాయనమాస మందగు దేశాంతర విఘటికలను పంచాంగతిథ్యాదులందు వల్లని రేఖకు పైనున్నవాటిని తీసివేయవలెను. క్రిందనున్నవాటిని కలుప వలయును. అట్లు చేయగా స్వగ్రామములకు తిథ్యాదు లగుచున్నవి.

## మేషాది నిరయనరాశి ప్రమాణములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| మేషము | ౪-౨౨ | గం. 1-45 | తుల | ౫-౨౪ | గం. 2-10 |
| వృషభము | ౫- ౧ | గం. 2- 0 | వృశ్చికము | ౫-౩౫ | గం. 2-14 |
| మిథునము | ౫-౩౧ | గం. 2-12 | ధనుస్సు | ౫-౧౮ | గం. 2- 7 |
| కర్కాటకం | ౫-౩౧ | గం. 2-13 | మకరము | ౪-౩౭ | గం. 1-52 |
| సింహము | ౫-౧౯ | గం. 2- 7 | కుంభము | ౪- ౮ | గం. 1-39 |
| కన్య | ౫-౧౩ | గం. 2- 5 | మీనము | ౪- ౧ | గం. 1-36 |

## మేషాది సాయనరాశిప్రమాణములు

(నిరక్ష. దేశమునకు)

| | | | |
|---|---|---|---|
| మీన మేషములు | ౪-౩౭ | కర్కాట ధనుస్సులు | ౫-౨౨ |
| వృషభ కుంభములు | ౪-౫౭ | సింహ వృశ్చికములు | ౪-౫౭ |
| మిథున మకరములు | ౫-౨౨ | కన్యా తులలు | ౪-౩౭ |

ఇవి దశమలగ్నానయమున కావశ్యకములు.

అయనాంశములు భా ౨౩ లి ౧౪ విలి ౫౦

అయనాంశ గతి విలిప్తలు ౫౦.౨౬

## సంవత్సర ఫలము

| మి | వృ | మే | మీ |
|---|---|---|---|
| | కు | కే | ర బు చం శు |
| ల | జగల్లగ్నము | | |
| | | | |
| గు | రా | శ | |

| మి | వృ | మే | మీ |
|---|---|---|---|
| | కు | ర బు కే | శు |
| | నిరయనసౌర వర్షలగ్నము | | |
| | | | |
| ల చం గు | రా | శ | |

జగల్లగ్నమందును వర్షలగ్నమందును లగ్నాధిపతులకు కేంద్ర కోణస్థితి, శుభసంబంధము, గలవు. కావున కొబ్బరి దుంప పదార్థములు, కంగులు, పెసలు మొదలగు పప్పుపదార్థములును సులభములై దేశమున పంటలు బాగుగ పండి క్షేమసుభిక్షములు గలుగునని చెప్ప వలయును. గాని జగల్లగ్నమునకు రాజ్యస్థానమున కేతువు. రాజ్యాధిపతికి శనిదృష్టి. మంత్రిస్థానము (పంచమము) ఆరూఢలగ్నము నగు వృశ్చికమున శని, లగ్నాధిపతికి షష్ఠాధిప సంబంధము. వర్షలగ్నమును బట్టియు లగ్న రాజ్యాధిపతికి అష్టమస్థితి వ్యయాధిపతి సంబంధము, పంచమాధిపతికి (మంత్రాధిపతికి) ఆరూఢలగ్నమందుస్థితి అట్టి శనికి కుజసంబంధము, రాజ్యాధిపతికి రవి కేతు సంబంధము. ఇట్టి దుర్యోగముల ప్రాబల్యము మంత్రిరాజ్యస్థానములకు విశేషముగ గలుగుటచే రాజనీతి చాల క్లిష్టపరిస్థితి నందును. స్వదేశపాలనమున్ను, విదేశ రాజ్య సంబంధమున్ను కపటముతో గూడి కఠినమై యుండును. ఎప్పటికి కప్పుకు తీవ్రరూపమును దాల్చి యుద్ధభయమును గలుగ చేయుచుండును. ఐనను లగ్నములకు శుభసంబంధము గలుగుటచే చిక్కులన్నియును కొట్టివేయబడగలవని తోచుచున్నది. సాయన సౌరవర్షలగ్నము మేషసంక్రమణానంతర పూర్ణిమాప్రవేశలగ్నము మకరము తులయు నైనవి. వాటింబట్టియు వైదేశిక, స్వదేశీయ రాజ్యతంత్రము సమర్థతతో నిర్వహింపవలసియుండును. పంటలు సమృద్ధిగ పండినను, చైత్రమాసమంతియును కార్తిక బ. ప్రతిపత్తు నుండి మాఘ బ పంచమి వరకును శనికి వృశ్చికాంతిసంచారముచేతను శనిరాహువుల ద్విర్ద్వాదశస్థితి, గురుశనుల తృతీయలాభస్థితియు ఈ సంవత్సరమున కొంతవరకు నుండుటచేతను, పిమ్మట గురు రాహు సంబంధముచేతను, సస్యహాని ఈతిబాధలు దుర్భిక్షము హెచ్చగును. మొదట వర్షములు సామాన్యముగనుండి శ్రావణ బహుళ భాద్రపదము లందు వర్షములు గలుగును. లోలకరిపంట సాధారణముగ నుండును. ఎఱ్ఱనిభూములు ఎఱ్ఱని ధాన్యము బాగుగ ఫలించును. వైదిక మతముల కును ధర్మములకును హాని గల్గును. వ్యాధిబాధలు హెచ్చగును. ఐనను జగల్లగ్న వర్షలగ్నాధిపతుల శుభస్థితిచే ప్రజలు సుఖజీవనము నంది, దైవభక్తి నందగలరు.

సర్వేషాం సమస్తశుభాని భవన్తు శ్రీః శ్రీః శ్రీః

## చంద్రగ్రహణము

తా 13 మే 1957 సం. (A. M. 14)

హేమలంబనామ సం॥ వైశాఖ శు పూర్ణిమా సో. ముఖ్యమానాస్తమిత చంద్రగ్రహణం. ఖచ్ఛన్నం. రాహుగ్రస్తః. పింగలవర్ణః. సూర్యాస్తమయాదితః.

స్పర్శ కాలః ౧౯-౩౫ రా. గం 2-15
నిమీలన కాలః ౨౨-౩౨ రా. గం 3-22
మధ్య కాలః ౨౪-౦ రా. గం 4-1
ఉన్మీలన కాలః ౨౫-౩౬ రా. గం 4-40
పరదినే సూర్యోదయాది శుద్ధ
మోక్ష కాలః ౦ ౩౧ ఉ. గం 5-47
ఆద్యంత పుణ్యకాలః ౮-౪౯ గం 3-32
బింబాదర్శన కాలః ౩-౧౪ గం 1-18

ఉత్తరగోలః అపసవ్యగ్రహణం. ఆగ్నేయ దిక్స్పర్శః వాయవ్యోత్తరమధ్యే నిమీలనం ప్రాగ్దిశి ఉన్మీలనం పశ్చిమదిశి మోక్షః.

నిత్యభోజన ప్రత్యాబ్దికాది నిర్ణయము:—పూర్ణిమా సోమవారమున సందేహములేదు. కాని ఈ గ్రహణము గ్రస్తాస్తమయ మగుటచే పరదినమున (బ. ప్రతిపత్తు మంగళవారమున) రాత్రి చంద్రోదయానంతరము స్నానముచేసి భోజనము చేయవలెను. పగలు భుజింపరాదు.

పరదినమున చేయదగిన ప్రత్యాబ్దికాదికము ఇందు చూపబడిన శుద్ధమోక్ష కాలానంతరము స్నానముచేసి పగటియందు యథోక్త కాలమందే యాచరింపవలయును.

☞ ఈ గ్రహణమున హైద్రాబాదు కర్నూలు మొదలగు పశ్చిమదేశములందు విడుపు గన్పించును. గ్రస్తాస్తము గాదు.

## చంద్రగ్రహణము

ది 7 నవంబరు 1957 సం.

హేమలంబ సం॥ కార్తిక శు పూర్ణిమా గు. శే చంద్రగ్రహణం ఖచ్ఛన్నం. కేతుగ్రస్తః పింగలవర్ణః సూర్యాస్తమయాదితః

స్పర్శ కాలః ౧-౫౪ గం 18-11
నిమీలన కాలః ౫-౩౬ గం 19-43
మధ్య కాలః ౬-౧౨ గం 19-57
ఉన్మీలన కాలః ౬-౪౬ గం 20-11
శుద్ధమోక్ష కాలః ౧౦-౪౦ గం 21-40
ఆద్యంత పుణ్యకాలః ౮-౩౬ గం 3-26
బింబాదర్శన పుణ్యకాలః ౧-౧౦ గం 0-28

దక్షిణగోలః సవ్యగ్రహణం ఈశాన్యదిక్స్పర్శః దక్షిణాగ్నేయమధ్యే నిమీలనం. ఆగ్నేయోన్మీలనం పశ్చిమదిశి మోక్షః.

నిత్యభోజన ప్రత్యాబ్దికాదికము:— ఈ గ్రహణము రాత్రి ప్రథమయామమందు గల్గుటచే నీరోజున నిత్యభోజనమున్ను, ప్రత్యాబ్దికాదికమున్ను ప్రాతఃకాలమున ప్రథమయామమందు అనగా 9-0 గంటలకు లోపు కాలముననే యాచరింపవలెను. బాలవృద్ధాతురులు 12-0 గంటలకు లోపు కాలమున చేయవచ్చును.

## వైష్ణవ శ్రీరామనవమి

చైత్ర శు ౮ సో ౧౬-౫౪ పున ౨౮-౪ దిన ౩౦-౫౩ స్మార్త శ్రీరామనవమి.

శు ౯ మం ౧౨-౧౯ పుష్య ౨౪-౮ దిన ౩౦-౫౫ రామానుజ మాధ్వ శ్రీరామనవమి.

శు ౧౦ బు ౫-౫౨ ఆశ్లే ౫౨-౪౯ దినం ౩౦-౫౮,

శ్రీరామనవమికి మధ్యాహ్నకాలమునకు నవమి యుండుట ప్రశస్తమని గలదు. గాని అష్టమీ సంబంధము నిషిద్ధమనియు గలదు. పునర్వసూ నక్షత్రయోగమున్నను అష్టమీ సంబంధమున్నచో ఆ రోజు శ్రీరామనవమీవ్రతమునకు యోగ్యము గాదనియును శాస్త్రము గలదు. దీనింబట్టి గ్రంథకర్త లిట్లు నిర్ణయించిరి. నవమి ప్రాతఃకాలమున మూడు ముహూర్తములకు తక్కువ యుండరాదు. దశమినాడు పారణము (భోజనము) ముఖ్యము. అనగా ఆ రోజు ఏకాదస్యుపవాసము సంభవింపగూడదు. ఈ నిర్ణయప్రకారము నవమీ మంగళవారమున శ్రీరామనవమ్యుపవాసము నాచరించినచో స్మార్తులకు మరునాడు ఏకాదస్యుపవాసము సంభవించుటచే నవమీ పారణము యోగ్యముగాదు. గావున స్మార్తులకు అష్టమీ సోమవారముననే శ్రీరామనవమి యగును. వైష్ణవులకు దశమీ విద్ధైకాదశినాడేకాదస్యుపవాసము నిషిద్ధమగుటచే గురువారమునాడే ఏకాదస్యుపవాసము గావున బుధవారము దశమీ ప్రయుక్తపారణము యోగ్యమే గావున మంగళవారమే శ్రీరామనవమి యగును. పూర్వపద్ధతి పంచాంగమందు మంగళవారమున దశమి ఏష్యమగుటచే బుధవారమున స్మార్తఏకాదశి యగునుగాని మంగళవారమున నవమి త్రిముహూర్తాల్పమగుటచే వ్రతాచరణ యోగ్యముగాదు. గావున వైష్ణవులును అష్టమీ విద్ధనవమియగు సోమవారముననే శ్రీరామనవమీవ్రతము నాచరింపవలయును. వైష్ణవు లనగా—"వైఖానస పాంచరాత్రౌ ద్యాగమదీక్షాం ప్రాప్తా వైష్ణవః" అను మాధవాచార్యోక్తి ననుసరించి వైఖానస, రామానుజ, మధ్వాది మతసంప్రదాయములవారందరును వైష్ణవులని చెప్పదగియున్నారు. అయినను రామానుజసంప్రదాయమువారికి స్వీయనిర్ణయమునుబట్టి మంగళవారమున శ్రీరామనవమి యనియు, మాధ్వవైష్ణవులకు పైసందర్భమునుబట్టి సోమవారమున శ్రీరామనవమి యనియు పూర్వపద్ధతి పంచాంగమున వ్రాయబడెను.

## అనంతవ్రతము

భాద్రపద శు ౧౪ శ. ౬౦-౦ అనంతవ్రతం.
శు ౧౪ ఆ. ౫-౧౬.

"ఉదయే త్రిముహూర్తవ్యాపినీ చతుర్దశీ గ్రాహ్యేతిముఖ్యః పక్షః" అను ధర్మసింధు వాక్యానుసారము ఆదివారమున త్రిముహూర్తవ్యాప్తి లేకపోవుటచేతను, శనివారమున సంపూర్ణముగ నుండుటచేతను శనివారమే అనంతవ్రతము చేయదగినది. "ఉదయవ్యాపినీ గ్రాహ్యా ఘటికైకాపి యా భవేత్॥" అను వాక్యము త్రిముహూర్తవ్యాప్తిస్తావకము. అదియుగాక పూర్వదినమున సకల త్రిముహూర్తవ్యాప్తిగల చతుర్దశి లభించునపుడు "ఘటికైకాపి" అను వాక్యముచే పరదినమున నముట సమంజసముగాదు.

## సింహగురుదోషము

చైత్రబహుళ చతుర్థీ గు. ప్ర॥ జ్యేష్ఠ బ సప్తమీ బు. ప॥ సింహగురుడు. ఇందు గంగాగోదావరులకు మధ్య గల దేశమున శుభకర్మల చేయరాదు. గోదావరికి తూర్పుటొడ్డు ఆంధ్రదేశమున తుల్యభాగయను గోదావరీనదియొక్క పాయయొక్క తూర్పుటొడ్డు అని గ్రహింపవలయును.

## శ్రీ హేమలంబనామ సంవత్సర పంచాంగ పీఠికా

అంచిత్యావ్యక్తరూపాయ నిర్గుణాయ గుణాత్మనే। సమస్త జగదాధారమూర్తయే బ్రహ్మణే నమః ॥౧॥ లంబోదరాంఘ్రిద్వయ మంబుజ శ్రీ సర్వస్వహో ర్యన్వహ మర్చయామః। యదర్చయా బ్రహ్మముఖామరేశా నిరంతరాయం సఫలీకృతార్థాః ॥౨॥ ప్రావృట్భర మేఘనిభా భుజంగశయ్యావిభూషా విహగోత్తవాహా। గోపాల మృత్యుంజయదేవదేవా భజే ప్రియాదత్తహృదర్ధదేహా ॥౩॥ వేదమయీం నాదమయీం బిందుమయీం పరపదోద్యదిందుమయీం। మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీం ॥౪॥

గురుస్తుతిః॥ శ్రీ నోరివంశాబ్ధిసోమం సూర్యనారాయణాభిధం। జ్యోతిశ్శాస్త్రే కులగురుం ధ్యాయామి మనసాఽనిశం ॥౫॥ యదను గ్రహాతః ప్రాప్తం విజ్ఞానం సర్వశాస్త్రజం। తం సాహిత్యగురుం వందే దర్భా వైరాగిశాస్త్రిణం ॥౬॥ చిలుకూరి ఖ్యాతవంశమణిం కొండయ్యశాస్త్రిణం। శబ్దశాస్త్రే సునిష్ణాతం వందే మచ్ఛాబ్దదేశికం

॥౭॥ మాతులం న్యాయసాహిత్యాచార్యం మన్న్యాయదేశికం। భజామ్యహం వారణాశి వేంకటేశ్వరశాస్త్రిణం ॥౮॥ యస్య బోధ లవం ప్రాప్య మీమాంసాశాస్త్రసాగరా। తీర్ణా మయా గురుం వందే భూమానందయతీశ్వరం ॥౯॥ మహామహోపాధ్యాయం శ్రీ రఘోపాఖ్య మురలీధరం। తం నౌ మ్యస్మద్గురుం జ్యోతిషాబ్ధిపారంగతో యతః ॥౧౦॥

స్వీయ వంశక్రమః॥ శ్రీ కౌండిన్యస గోత్రే ఓడపర్త్యా ఖ్యాన్వయే ప్రసిద్ధిమే। త్రిస్కంధశాస్త్ర కృతినో భవ న్తి శశ్వద్బ హోఃకాలాత్ ॥౧౧॥ చలమాఖ్య వేంకటచలావ్యాఖ్య స్సుతౌభవ ద్విబుధః। రామా లుప్తమాసవిషయకవాదే నాగణయ దపి చ విశ్వపతిం ॥౧౨॥ తస్యసుత స్తత్సదృశ శ్శేషాచల దైవవిత్ప్రవరః। జజ్ఞాతే తస్య సుతౌ పూర్ణౌ విద్యాసుపరిపూర్ణౌ ॥౧౩॥ తయోర్ద్వితీయోఽ ద్వితీయప్రతిభావా న్సుధోత్తమః। శ్రీ పూర్ణార్యః పుష్కరాది సంసత్ప్రోజ్జ్వలద్యశాః ॥౧౪॥ తదనుగ్రహోత్త విద్యాః పంచసుతా స్తస్య శంభవక్త్రసమాః। శ్రీ కృష్ణమూర్తిశాస్త్రీ హ్వాయ స్తృతీయోహ మేషుమయా ॥౧౫॥ సురువరకరుణావశత స్సిద్ధాన్తీ కృత్య నిఖిల సంసత్సు। స్వమతం, తథాద్య క్రియతే పంచాంగం ధర్మకర్మార్థం ॥౧౬॥

## సంవత్సరాది కృత్యం

అబ్దాదౌ మిత్రసంయుక్తో మంగళస్నాన పూర్వకం। అలం కృతో గణాధ్యక్షం వాణీం దైవవిదం గ్రహాన్ ॥౧౭॥ సురాన్వి ప్రాంశ్చ సంపూజ్య ముదితో బ్రహ్మ జన్మతః। సంవత్సర ఫలం శ్రుత్వా సుకృతానాంఫలంలభేత్ ॥౧౮॥ యద్వర్షాదౌ నింబసుమం శర్కరామ్ల ఘృతైర్యుతం। భక్షితం పూర్వయామేస్యా త్తద్వర్షం సౌఖ్యదాయకం ॥౧౯॥

## బ్రహ్మాయుః ప్రమాణాదికం

బ్రహ్మణ స్త్రుటికాలప్రమాణం సౌరమానేన మా ౫ ది ౨౭ ఘ ౨౬ వి ఘ ౪౦. లవకాల ప్ర. సం ౪౯ మా ౪ ది ౧౭ ఘ ౪౬ విఘ ౪౦. నిమేషకాల ప్ర. సం. ౧౪౮౧ మా ౫ ది ౨౩ ఘ ౨౦ గుర్వక్షరోచ్చారణకాల ప్ర. సం. ౪౦ సహస్రాణి. ప్రాణకాల ప్ర॥ సం ౪ లక్షాః. విఘటీ ప్ర. సం. ౨౪ ల. ఘటీ ప్ర. సం. ౧౪ కో ౪౦ ల. దిన ప్ర. సం. ౪౩౨ కోటయః. అనేన బ్రహ్మాయుః ప్రమాణసౌరాబ్దాః ౩,౧౧,౧౪,౦౦౦ కోటయః. వర్తమానస్యాస్య బ్రహ్మణః పరాఖ్యస్యాయుషోర్ధం గతం. ద్వితీయ పరార్ధే ప్రథమ వర్షే ప్రథమమాసాదౌ గత ఘట్యాదయః. ఘ ౧౩ విఘ ౪౨ ప్రాణ(౦) గుర్వ ౩ నిమే ౧౯ లవ ౧౮ త్రుటయః ౪౨ సంప్రతి త్రి చత్వారింశత్తమే త్రుటికాలే గతసౌరమాసాదయః మా ౨ దిన ౨౦ ఘట్యః (౦) విఘట్యః (౦) బ్రహ్మణస్సౌరమానేన వయోగత వత్సరాః ౧౫౫౫౨౧౯౭ కో ౨౯ ల ౪౯ సహ ౫౮ సం. ఇదానీం తిన శ్వేతవరాహకల్పే స్వాయంభువాద్యాష్షణ్మనవో గతాః। సప్తమే వైవస్వత మన్వంతరే సప్తవింశతి మహాయుగా గతాః। సప్తవింశ్రదమనూ నామప స్వమానేనాయుర్వర్ష శతమేవ। తన్మైక సప్తతి మహా యుగమితం। తత్పరిమాణ సౌరాబ్దాః ౩౦ కో ౬౭ ల ౨౦ సహ. తత్సంవత్సర ప్ర॥ ౩౦ ల ౬౭ సహ ౨౦౦ సం॥ అహోరాత్రి ప్ర॥ ౯౫౨౦ సం॥ అహః ప్ర॥సం॥ ౪౨౬౦ ఘటీ ప్ర. సం. ౧౪౨ వర్తమానస్యాస్య వైవస్వతమనో ర్వయోగతవత్సరాః ౧౨ కో ౫ ల ౩౩ సహ. ౫౮ సం॥ ఏష్యాబ్దాః ౧౮ కో ౬౧ ల ౮౬ సహ ౯౪౨ సం. శ్రీ మజ్జగద్గురు శ్రీ మచ్ఛంకర భగవత్పాద పూజ్యపాదాబ్దాః ౨౦౨౯ శ్రీ శాలివాహన శకాబ్దాః ౧౮౭౯ ప్రభవాది గతాబ్దాః ౩౦ ఏష్యాబ్దాః ౩౦.

## వ్యవహారమాన నిరూపణం

అథ అస్మిన్దేశే లోకవ్యవహారార్థం చాంద్రమానాబ్దో గ్రాహ్యః వింధ్యస్యోత్తరదేశే బార్హస్పత్యమానాబ్దో గ్రాహ్యః। అయమేవ ఫలప్రదర్శనార్థం మాసనామ్నా గ్రాహ్యః। చాంద్రమానవశా దయం హేమలంబనామ సంవత్సరః। బార్హస్పత్యమానవశాదయం సాధారణ నామసంవత్సరః। అయమేవ చైత్రాబ్ద ఇత్యుచ్యతే। ప్రభవాది షష్టి సంవత్సరేషు ద్వాదశయుగాని, తత్ర పితృదేవతాకం సప్తమయుగం వర్తమానం। తత్రాద్య అగ్ని దేవతాక స్సంవత్సరనామా వత్సరః। అస్మి న్తిలదానం మహాఫలం। సంవత్సరఫలం। వృష్టి స్సమాద్యే॥ ఇతి॥ ఈతి ప్రాయాప్రచురపవనా హేమలంబేను వృష్టిః॥ ఇతి॥ బార్హస్పత్య మానేన అనువత్సరాఖ్య సంవత్సరఫలం॥ పశ్చాజ్జలం ముంచతి యద్చ తుర్థమ్॥ ఇతి॥ సాధార జేల్పం జల మీతయశ్చ॥ ఇతి॥

తా॥ ఈ దేశమున చాంద్రమానముచే హేమలంబ సంవత్సరము. దీనికి సంవత్సర వత్సర మనియును పేరు. ఇందు తిలదానము మహాఫలము. సంవత్సరవత్సరమున వర్షములు సమముగ నుండునని శాస్త్రము. బార్హస్పత్యమానముచే సాధారణ సంవత్సరము. అల్పవృష్టి, ఈతిబాధలు గలుగును. దీనికి చైత్రాబ్దమనియును పేరు. అనువత్సరమని యును నామాంతరము. దీనిచే నిందు వర్షకాలమునకు తుదను వర్షములు గలుగును.

## హేమలంబ సంవత్సర ఫలము

హేమలంబే నృపా స్సర్వే పరస్పర విరోధినః।
అవర్షత్వం ప్రజాపీడా తథాపి సుఖినో జనాః॥

తా॥ హేమలంబ సంవత్సరమున ప్రభువులు పరస్పరము కల హింతురు. ధరలు హెచ్చును. ప్రజలు పీడనందుదురు. ఐనను సుఖించెదరు.

బార్హస్పత్యమానాబ్దఫలం॥ సాధారణాబ్దే రాజాన స్సుఖినో గత మత్సరాః। ప్రజాః పసుగణాశ్చైవ వృష్టిః కర్షకసమ్మతా॥ చైత్రాబ్ద ఫలం॥ చైత్రే మందా వృష్టిః ప్రియ మన్నం క్షేమ మవనిపా మృదవః। వృద్ధిశ్చ కోశధాన్యస్య భవతి పీడాచ రూపవతాం॥

తా॥ బార్హస్పత్యమానముచే సాధారణ సంవత్సరము గావున నిందు ప్రభువులు సుఖించెదరు. ప్రజలును పసుగణములును మాత్సర్య మును వీడి సుఖమునందుదురు. వ్యవసాయమునకు తగిన వర్షములు గలుగును. చైత్రమను నబ్దముగుటచే వర్షములు తక్కువ. ధాన్యాదులు ప్రియములై దుర్లభము లగును. ప్రభువులు సౌమ్యులయ్యెదరు. ధాన్యము నిలవచేయబడును. సుందరులకు పీడ గలుగును.

## రాజాది నిర్ణయము

| | | |
|---|---|---|
| రాజా చంద్రః | గణకో బుధః | పరాధిపతి శ్శుక్రః |
| మంత్రీ శనిః | గ్రామపాలక శ్శనిః | గ్రామనాయక శ్చంద్రః |
| సేనాధిపతి శ్శుక్రః | దైవజ్ఞ శ్శుక్రః | వస్త్రాధిపతి ర్గురుః |
| సస్యాధిపతిః కుజః | రాష్ట్రాధిపతి శ్చంద్రః | రత్నాధిపతి శ్శనిః |
| ధాన్యాధిపతీ రవిః | సర్వదేశోద్యోగపతి శ్శనిః | వృక్షాధిపతీ రవిః |
| అర్ఘాధిపతి శ్శుక్రః | అశ్వాధిపతి శ్శనిః | జంగమాధిపతిః కుజః |
| మేఘాధిపతి శ్శుక్రః | గజాధిపతిః కుజః | సర్పాధిపతి ర్బుధః |
| రసాధిపతి ర్గురుః | పశూనామధిపతిః శ్శుక్రః | మృగాణామధిపతి శ్శుక్రః |
| నీరసాధిపతిః కుజః | దేవాధీశః కుజః | శుభాధిపతి శ్శుక్రః |
| పురోహితః కుజః | | స్త్రీణామధిపతిశ్శుక్రః |
| పరీక్షక శ్చంద్రః | | |

చంద్రుడు :—రాజు, పరీక్షకుడును, రాష్ట్రాధిపతియు గ్రామనాయకుడు నయ్యెను.

శని:—మంత్రి యయ్యెను. గ్రామ పాలకుడును, సర్వదేశో ద్యోగపతియు, అశ్వాధిపతియు, రత్నాధిపతియు నయ్యెను.

శుక్రుడు:—సేనాధిపతి, అర్ఘాధిపతి, మేఘాధిపతియు నయ్యెను. మరియు దైవజ్ఞుడు, పశ్వధిపతి, నరాధిపతి, మృగాధిపతి, శుభాధిపతి, స్త్రీల కధిపతియు నయ్యెను.

కుజుడు:—సస్యాధిపతియు, నీరసాధిపతియు నయ్యెను. మరియు పురోహితుడును, గజాధిపతియు, దేవాధిపతియు, జంగమాధిపతియు నయ్యెను.

రవి:—ధాన్యాధిపతి యయ్యెను. వృక్షాధిపతియు నయ్యెను.

గురుడు:—రసాధిపతి యయ్యెను. వస్త్రాధిపతియు నయ్యెను.

బుధుడు:—గణకుడును, సర్పాధిపతియు నయ్యెను.

## రాజు చంద్రుడు - ఫలము

ధారాధరాః స్యుర్మఖిలాం ప్రకుర్యు
ర్ధారాధరాం క్షేమసుఖే సుభిక్షం।
ప్రజా నృపా శ్చాతిసుఖాశ్చ భూమా
నిత్యోత్సవా శ్చాబ్జపతౌ శశాంకే॥

తా॥ చంద్రుడు రాజగుటచే సమస్తభూమియందును మేఘములు వర్షించును. భూమియందు క్షేమము, సుభిక్షము, సుఖము గలుగును. ప్రజలును పాలకులును అత్యంత సుఖవంతులై నిత్యోత్సవములు గలిగియుందురు.

## మంత్రి శని, ఫలము

మందఫలా నిఖిలధరా న వారి ముంచంతి వారిధరాః।
దినకరతనయే సచివే భయసహితం సార్వకాలికం జగత్ ॥

తా॥ సమస్తభూమియందును పంటలు తక్కువయగును. మేఘములు తక్కువగ వర్షించును. సంవత్సరమంతయును ప్రపంచము భయముతో గూడియుండును.

## సేనాధిపతి శుక్రుడు, ఫలము

సువృష్టి రత్యంతసమృద్ధసస్యం సుభిక్ష మర్ఘో బహుళో ధరిత్ర్యాం।
నరా స్త్రియో భోగసుఖప్రసక్తా సైన్యాధిపత్యేఖలు భార్గవస్య॥

తా॥ సువృష్టి, సస్యసమృద్ధి, సుభిక్షము, ధరలు తక్కువయై ధాన్యాదులు సులభములగుటయు గలుగును. స్త్రీలును పురుషులును భోగముల ననుభవించుటయం దాసక్తు లయ్యెదరు.

## సస్యాధిపతి కుజుడు, ఫలము

రక్తశాలి మహాశాలి తువరీ చణకాదయః
రక్తభూమి స్సుఫలితా భౌమే ధాన్యాధిపే సతి॥

తా॥ ఎఱ్ఱధాన్యము, పెద్దధాన్యములు, వేరుసెనగ (లేక పొట్టు ధాన్యము సెనగలు) ఎఱ్ఱ నేలయందు బాగుగ ఫలించును.

## ధాన్యాధిపతి సూర్యుడు, ఫలము

మధ్యవృష్టిః ఫలం స్వల్ప మనర్ఘశ్చ మహద్భయం
రక్తసస్యాని జాయంతే సూర్యే ధాన్యాధిపే సతి ॥

తా॥ మధ్యవృష్టి. పంటలు తక్కువ, ధరలు హెచ్చుగుట, యుద్ధాది భయములు, ఎఱ్ఱధాన్యములు ఫలించుటయు గలుగును.

## అర్ఘాధిపతి శుక్రుడు, ఫలము

శాలీక్షు జల సస్యార్ఘ వృద్ధి ర్భూపా స్స్వధర్మగాః
సంపూర్ణజలదా మేఘా శ్శుక్రే చార్ఘాధిపే యది ॥

తా॥ వర్షములు ధాన్యములు చెరకు ఇతర సస్యములును సమృద్ధిగనుండి ధాన్యాదులు సులభములగును. మేఘములు బాగుగ వర్షించును. పాలకులు చక్కగ పాలింతురు.

## మేఘాధిపతి శుక్రుడు ఫలము

అతివృష్టి స్సుభిక్షం చ సస్యవృద్ధి ర్నిరామయః
క్షీరప్రదా స్సదా గావ శ్శుక్రే మేఘాధిపే సతి ॥

తా॥ మంచివర్షములు మంచిపంటలు దేశారోగ్యము, సుభిక్షము గలుగును. గోవులు క్షీరసమృద్ధిగలవి యగును.

## రసాధిపతి గురుడు, ఫలము

రసవాధే దివిజగురౌ చందన కర్పూర కందమూలాని।
సులభానిరసా న్యఖిలాని ఫలంతి న కుంకుమాద్యాని॥

తా॥ చందనము కర్పూరము కందమూలములు మొదలగు రసవస్తువులును సులభము లగును. కుంకుమ మొదలగు నీరస వస్తువులు ఫలింపవు.

## నీరసాధిపతి కుజుడు, ఫలము

క్షితితనయే నీరసపే నీరసవృక్షా స్సుపుష్పఫలితా స్స్యుః।
స్వర్ణ మణి రక్తచందన కాష్ఠాదీనాం మహార్ఘతా నూనం॥

తా॥ కుజుడు నీరసాధిపతి యగుటచే నీరసములగు వృక్షలతాదులు పుష్పఫలభరితములగును. రత్నములు, బంగారము, రక్తచందనము, కఱ్ఱలు మొదలగునవి ధర తగ్గి సులభములగును.

## పురోహితాద్యధిపతి ఫలము

క్రూరగ్రహాఫలం క్రూరం శుభగ్రహాఫలం శుభం।
పురోహితాది సర్వేషాం భవే దేశ సముద్భవం॥

తా॥ తక్కిన పురోహితాద్యధిపతులు క్రూరగ్రహములగుచో చెడ్డఫలము. శుభగ్రహములగుచో మంచిఫలము అగును. (రవి-కుజ-శనులు, పాపయుతి బుధుడు క్షీణచంద్రుడును క్రూరులు.)

## మేఘాదినిర్ణయము—ఫలము

ఆవర్తమను మేఘము—మధ్యవృష్టి। ఉత్తరదిక్కున మేఘోత్పత్తి। చతుర్మేఘ పక్షమున పుష్కరమను మేఘము—దక్షిణపు వానలు। వాయువను వాయువు—వర్షములు తక్కువ। సౌదామిని యను మెఱుపు—సువృష్టి। అసితమను ఉరుము—మంచి వానలు। క్షీర సముద్రము — అల్పవృష్టి వాసుకియను శేషుడు భూమిని వహించును—ఉపద్రవములు లేక భూమియందు ఫలవృక్షములు సస్యములు బాగుగ ఫలించును.

## సావన వర్షారంభము

(తే 8-6-1957) జ్యేష్ఠ శు ౧౦ శనివారము. వర్షాధిపతి, శని.
వర్షాధిపే సూర్యసుతే ధరిత్ర్యా మవృష్టి రోగాగ్ని మహీశపీడాః
భూపాలకానా మతులం చ యుద్ధ మనర్ఘతా సస్యవినాశనం చ॥

తా॥ అనావృష్టి, రోగములు, అగ్నిబాధలు, ప్రభువులవలని బాధలు, ప్రభువులకు ఘోరయుద్ధము, ధరలు హెచ్చుగుట, సస్యహానియు గలుగును.

## పశుపాలకాది నిర్ణయము - ఫలము

పశుపాలకుడును, గోవ బహిష్కర్తయును, శ్రీకృష్ణుడు. బలరాముడు గోష్ఠాగారప్రాపకుడు. శ్రీకృష్ణాధిపత్యముచే సుభిక్షము, పశువృద్ధి, సస్యవృద్ధి, పశువులకు క్షీరసమృద్ధియు గలుగును. బలరామాధిపత్యముచే పశువృద్ధి, మధ్యవృష్టియు గలుగును మధ్యదేశము సుభిక్షముగ నుండును.

## వర్ష పరిమాణము

మూడు ఆఢక (కుంచ)ములు వర్షము—సుభిక్షము। "సప్త భాగా స్సముద్రేషు పర్వతేషు తథా దశ। చతుర్భాగా ధరణ్యాం స్యు రేవం వర్షతి చ ద్రోణః॥" సముద్రములందు ఏడుభాగములును పర్వతములందు పదిభాగములును, భూమియందు నాలుగు భాగములును వర్షించును.

ఆఢకప్రమాణము — "షష్టియోజన విస్తీర్ణం శతయోజన మున్నతం। ఆఢకస్య ప్రమాణం తు దేవమానేన గణ్యతే॥"

ఆఢకస్థితి:—వత్సరాది ప్ర॥ చైత్ర బ. అమా సో. ప॥ గోప వృద్ధుని హస్తమందుండును, అటనుండి కార్తిక. బ. ప్రతిపత్తు శు. ప॥ గోపయువకుని హస్తమందుండును, అటనుండి మాఘ బ. పంచమీ శ. ప॥ తిరుగ గోపవృద్ధుని హస్తమందుండును, అటనుండి సంవత్సరాంత ప॥ బ్రాహ్మణబాలుని హస్తమందుండును ఆఢక ముండును. గోపుని హస్త మందుండుటచే సుభిక్షము, ఆరోగ్యము, సంపత్తు గలుగును. బాల్య వయస్కునిచో వర్షములు తక్కువగును. యౌవనవయస్కునిచో సువృష్టి, వార్ధకవయస్కునిచో సుభిక్షము గలుగును. బ్రాహ్మణ హస్తమందుండిన సస్యహాని దుర్భిక్షము గలుగును.

## వర్షధాన్యాది ప్రమాణములు (వింశోపకములు)

వర్షం ౯ ధాన్యం ౧౯ శీతం ౧౧ తృణం ౧౯ ఉష్ణం ౧౩ మారుతః ౮ ప్రజావృద్ధి ౧౫ నాశః ౧౫ రాజవిగ్రహం ౧౧ వ్యాధయః ౮ ఉపశమనం ౧౧ ఆచారః ౫ అనాచారః ౧౧ మరణాని ౧౮ జన్మాని ౯ దేశోపప్లవః ౮ దేశస్వాస్థ్యం ౧౫ చోరభయం ౧౯ నా ౨౧ అగ్నిభయం ౫ నా ౮ మృగోపద్రవః ౧౩ నా ౮ కీటభయం ౮ నా ౧౫ శలభ వృ ౩ నా ౧౧ మశక వృ ౮ నా ౮ మత్కుణ వృ ౧౧ నా ౧౩ వృశ్చిక వృ ౧౧ నా ౧౧ వ్యాఘ్ర వృ ౩ నా ౮ సర్ప వృ ౮ నా ౬ శుక వృ ౯ నా ౮ పిక వృ ౭ నా ౫ కుక్కుట వృ ౭ నా ౭ ఖగ వృ ౩ నా ౫ గో వృ ౫ నా ౩ మహిష వృ ౬ నా ౬ మృగ వృ ౩ నా ౩ ఛాగ వృ ౫ నా ౫ అశ్వ వృ ౬ నా ౫ స్వేదజ వృ ౧౧ నా ౧౯ వ్రీహి వృ ౬ శాలి వృ ౧౨ కుళుత్థ వృ ౭ తిల వృ ౬ మాష వృ ౧౬ ముద్గ వృ ౧౨ సర్షప వృ ౧౦ చణక వృ ౧౬ ఆఢక వృ ౧౦ గోధూమ వృ ౧౭ కోద్రవ వృ ౧౦ ప్రియంగు వృ ౧౬ యావనాళ వృ ౧౭ శ్యామాక వృ ౧౨ రాజమాష వృ ౪ నీవార వృ ౧౬ శింబిధాన్య వృ ౧౨.

## రవిచార ఫలము

చైత్ర శు చతుర్దశీ శ. మేషే రవిః ౨౮-౨౪॥ చతుర్దశి—వృష్టి నాశము। శనివారము—ప్రభువులకు భయము। హస్త—సర్వ సౌభాగ్యము। వ్యాఘాతయోగము—యుద్ధభయము। వణిక్కరణము-ధన ధాన్య వృద్ధి, సుభిక్షము। కన్యాలగ్నము—మధ్యవృష్టి। సాయాహ్నము—సువృష్టి। మఘాదిమండలము—హాని। పగలు—ధాన్యాభి వృద్ధి, ధరల వృద్ధియు నగును.

ఆర్ద్రాప్రవేశము:—జ్యేష్ఠ బ. నవమీ శు. ఆర్ద్రా ౧ రవిః ౩౬-౩౪॥ నవమి—యుద్ధభయము। శుక్రవారము—లోకమునకు శాంతి। రేవతి—సువృష్టి। శోభనయోగము—శుభకార్యములు వృద్ధి। గరజకరణము—దుర్భిక్షము। ధనుర్లగ్నము—సుభిక్షము। రాత్రి—సస్యాభివృద్ధి। ధనిష్ఠాదిమండలము—సర్వ ధాన్యాదులును ధర గలవి యగును. తత్కాల-లగ్న సంపత్తిచే—సువృష్టియు సస్యాభివృద్ధియు గలుగును.

## చంద్రచార ఫలము

జ్యేష్ఠ శు. ప్రతిపత్తు గురువారమున—సువృష్టి, సుభిక్షము, క్షేమము, ఆరోగ్యము, సస్యవృద్ధి, పసువులకు క్షీరాభివృద్ధి॥ ఆషాఢ శు. పంచమి—సోమవారమున సువృష్టి॥ మంగళవారము—యుద్ధ భయము॥ ఆషాఢ శుక్లమున స్వాతి దశమినాడైయున్న—మంచివర్షములు॥ ఆషాఢ బహుళమున రోహిణి ఏకాదశితో గలియుటచే సస్య వృద్ధి మధ్యమము॥ ద్వాదశితో గలియుటచే సర్వసస్య హాని.

మరియు వైశాఖమున ౫ మంగళవారములు, ఆషాఢమున ౫ శనివారములు, శ్రావణమున ౫ ఆదివారములు, అశ్వయుజమున ౫ మంగళవారములు, మార్గశిరమున ౫ శనివారములు, పౌషమున ౫ ఆది వారములు, మాఘమున ౫ మంగళవారములు నైనవి.

మంగళవారము లైదగుచో యుద్ధభయము. శనివారము లైద గుచో జననాశనము, దుర్భిక్షము, భూకంపా ద్యుపద్రవములు, ఆది వారము లైదగుచో దుర్భిక్షము గలుగును.

## సౌరార్ఘములు

మేష, వృషభ, మిథున, సింహ, తులా, వృశ్చిక, ధను, మీన మాసములందు యావనాళ యాలకీ కుంకుమ హింగు కాంస్య తైల ఏరండ గోధూమ కస్తూర్యాదులు శూన్యార్ఘములగును। ధాన్యాజ్య చణక వస్త్ర కర్పూర లవణ తామ్ర కుళుత్థ లవంగ పుష్ప సీసాదు లత్యర్ఘము లగును। సువర్ణ రజత కార్పాస మాష ముద్గ మరీచ నాగవల్లీ దళ తిల జీర జాజి పిప్పలి పట్టావి కాయస శ్రీగంధ క్రముక శర్కరాదులు సమార్ఘము లగును। కర్కాట, మకర, కుంభమాసములందు— యావనాళాదు లత్యర్ఘము లగును। ధాన్యాదులు సమార్ఘము లగును। సువర్ణాదులు శూన్యార్ఘము లగును। కన్యామాసమునందు—యావనా ళాదులు సమార్ఘము లగును। ధాన్యాదులు శూన్యార్ఘము లగును। సువ ర్ణాదు లత్యర్ఘము లగును.

## చాంద్రార్ఘములు

చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, భాద్రపద, అశ్వయుజ, పౌష, మాఘమాసము లందు—యావనాళాదులు శూన్యార్ఘము లగును। ధాన్యాదు లత్యర్ఘము లగును। సువర్ణాదులు సమార్ఘములగును॥ ఆషాఢ మాసమునందు—యావనాళాదులు సమార్ఘములగును। ధాన్యాదులు శూన్యార్ఘము లగును। సువర్ణాదు లత్యర్ఘము లగును॥ శ్రావణ కార్తిక మార్గశిర ఫాల్గున మాసములందు—యావనాళాదు లత్యర్ఘము లగును। ధాన్యాదులు సమార్ఘము లగును। సువర్ణాదులు శూన్యార్ఘము లగును.

## మౌఢ్య నిర్ణయము

సంవత్సరాది ప్ర॥ వైశాఖ శు. త్రయో. ఆ. (12-5-1957) ప॥ శుక్ర మౌఢ్యము॥ భాద్రపద బ నవమీ బు. (18-9-1957) ప్ర॥ ఆశ్వ బ ఏకాదశీ శ. (19-10-1957) ప॥ గురు మౌఢ్యము॥ మాఘ శు చతుర్థి శు. (24-1-1958 సం) ప్ర॥ మాఘ శు ౧౦ గు (30-1-1958) ప॥ తిరుగ శుక్రమౌఢ్యము.

## మకరసంక్రాంతి పురుషలక్షణము

అష్టకర్ణో విశాలాక్షో లంబభ్రూ దీర్ఘ నాసికః। అష్టబాహుశ్చతు ర్వక్త్రి స్సంక్రాంతిపురుష స్స్మృతః॥ శతయోజన మాన్నత్వంచ దీర్ఘం ద్వాదశ స్స్మృతం। ఏవం రూపం హివిజ్ఞేయం సంక్రాన్తిపురుషాకృతేః॥



ఈ సంక్రాంతి పురుషునకు మహోదరు డని పేరు-చోరులకరిష్టము। మాకేడు నీరు చే స్నానము - శుభము। తిలల వక్షతలుగ ధరించును-తిలలకు నాశము। నల్లని వస్త్రమును ధరించును - మహాభయము। లాక్షారసము గంధము- యుద్ధభయము। జపా పుష్పము-కీర్తికి హాని। గోమేధికాభరణం - పసునాశము। సీసపాత్ర యందు పాలు త్రాగును-ఆరోగ్యము పసు నాశనము। శేషపంకు- శుభము। గజవాహనము

రాజుల కరిష్టము। కోదండ మాయుధము – యుద్ధభయము। బంగారు గొడుగు – సువర్ణనాశనము। అస్త్రమును ధరించును – రోగభయము। ఆగ్నేయ దిక్కునకు ప్రయాణము – ఆగ్నేయ దేశారిష్టము। ఆశ్చర్యము చేష్ట – ప్రజలకు వ్యాధి। నిలబడియుండును – సస్యవృద్ధి

పక్షఫలము:—కృష్ణపక్షే యదా పౌషే మకరస్థో దివాకరః। సువృష్టిః క్షేమ మారోగ్యం బహూవు స్సస్యసంపదః॥

తా॥ మకరసంక్రాంతి కృష్ణపక్షమున నగుటచే సువృష్టి క్షేమము ఆరోగ్యము సస్యసంపదలు గలుగును.

తిథ్యాది ఫలములు:—పౌష బ నవమీ సో. మకరే రవిః ౫౪-౩౯ నవమి – ప్రభువులకు యుద్ధము। మంగళవారము-దుఃఖము। చరనక్షత్రము (స్వాతి) చోరులకు హాని। శూలయోగము – అల్పవృష్టి। గరకరణము – దుర్భిక్షము। వృశ్చికలగ్నము – యుద్ధభయము। అపరరాత్రి – నటులకు హాని। ఇరువదిరెండవ ముహూర్తము-దుష్టరాజ్యము నశించును॥—యశ్శృణోతి మనుసక్లపక్షకే వర్షనాథసచివాదికం ఫలం। ప్రాప్నుయా ద్దురితము క్తిగ్రహా శ్చాయు రర్థమతులం యశస్సుఖం॥ కాలా నుపరాశాదీ నుక్త్వా పుణ్యాని కారయే ద్యస్తు। తేషా మంశం దశమం నియమే నాప్నోతి దైవజ్ఞః॥ ఆయుర్వృద్ధిం పుత్రపౌత్రాభివృద్ధిం నిత్యారోగ్యం మంగళం నిర్వ్యపాయం। అచ్ఛిన్నా నా ముత్సవానా మవాప్తిం యచ్ఛం త్యేతే వత్సరాధీశముఖ్యాః॥

## సస్యవిచారము

నాయక విచారముచే పూర్వసస్యములు స్వల్పముగ ఫలించును. సస్యజాతిక విచారము చేతినున్న గ్రైష్మిక (పూర్వ) ధాన్యములకు అల్పత్వమే తెలియుచున్నది. రెండవ పంట (శారద ధాన్యము) వినను మధ్యమముగ నుండును.

## ఆదాయ వ్యయములు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషవృశ్చికయోః | ఆ | ౧౪ | వ్య | ౨ | సింహస్య | ఆ | ౮ | వ్య | ౨ |
| వృషభతులయోః | ఆ | ౮ | వ్య | ౧౧ | ధనుర్మీనయోః | ఆ | ౨ | వ్య | ౧౧ |
| మిథునకన్యయోః | ఆ | ౧౧ | వ్య | ౮ | మకరకుంభయోః | ఆ | ౫ | వ్య | ౫ |
| కర్కాటకస్య | ఆ | ౫ | వ్య | ౮ | సర్వాదాయః | | ౫౩ | సర్వ వ్య | ౪౭ |

## రాజపూజావమానములు

| | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషస్య | రా | ౪ | అ | ౫ | సింహస్య | రా | ౨ | అ | ౪ | ధనుషః | రా | ౭ | అ | ౭ |
| వృషభస్య | రా | ౭ | అ | ౫ | కన్యాయాః | రా | ౫ | అ | ౪ | మకరస్య | రా | ౩ | అ | ౩ |
| మిథునస్య | రా | ౩ | అ | ౧ | తులాయాః | రా | ౧ | అ | ౭ | కుంభస్య | రా | ౬ | అ | ౩ |
| కర్కాటస్య | రా | ౬ | అ | ౧ | వృశ్చికస్య | రా | ౪ | అ | ౭ | మీనస్య | రా | ౨ | అ | ౬ |

## కందాయ ఫలములు

| అశ్వి | భర | కృ | రోహి | మృగ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్లే |
|---|---|---|---|---|---|---|---|---|
| ౬ | ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౧ | ౩ | ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ |
| మఖ | పూఫ | ఉఫ | హస్త | చిత్ర | స్వా | విశా | అనూ | జ్యే |
| ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౪ | ౧ | ౩ | ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ |
| మూ | పూషా | ఉషా | శ్ర | ధని | శత | పూభా | ఉభా | రేవ |
| ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ | ౪ | ౧ | ౩ |

ఫలం॥ విష మే వ్యర్థలాభ స్స్యా త్సమేషు సమతా భవేత్।
శూన్యేషు శూన్యం భవతి కందాయ త్రయయోగతః॥
ఆదిశూన్యే భవే ద్వ్యాధి ర్మధ్యశూన్యే మహద్భయం।
అంత్యశూన్యే భవే ద్ధానిః కందాయఫల మీదృశమ్॥

## సంవత్సర ఫలము

| | | | | | |
|---|---|---|---|---|---|
| అశ్విని | పుష్య | స్వాతి | అభిజిత్తు | వారలకు | రాజపూజ్యత |
| భరణి | ఆశ్లేష | విశాఖ | శ్రవణం | ,, | యుద్ధభయం |
| కృత్తిక | మఖ | అనూరాధ | ధనిష్ఠ | ,, | అలంకారప్రాప్తి |
| రోహిణి | పూఫ | జ్యేష్ఠ | శ. తా | ,, | రోగభయం |
| మృగశిర | ఉఫ | మూల | పూ. భా | ,, | ఆయుర్వృద్ధి |
| ఆర్ద్ర | హస్త | పూ. షా | ఉ. భా | ,, | అర్థలాభము |
| పునర్వసు | చిత్ర | ఉ. షా | రేవతి | ,, | మనస్తాపము. |

## కుజచార ఫలము

ఈ సంవత్సరమున కుజునకు వక్రము లేదు. రోహిణి ఆర్ద్ర ఉత్తరాత్రయము స్వాతి మూల జ్యేష్ఠ శ్రవణము సింహరాశి. వీటి యందు కుజుడు సంచరించుట అనావృష్టి కారణము.

## బుధచార ఫలము

ఆయా మాసములం దుదయాస్తమయముల నందిన బుధునకు వైశాఖ శు పూర్ణిమా సో. ఆషాఢ బ పంచమీ బు. కార్తిక బ దశమి ఆ. పౌష శు దశమి మం. లం దుదయించుటచే యుద్ధభయము, అగ్నిభయము, చోరభయము, రోగభయము, దుర్భిక్షము, జలభయము గలుగును. మరియు చెప్పడైన బుధోదయానంతర మేకేని విపరీతఫలము గలుగును. వర్షమున్నచో ననావృష్టి, అనావృష్టియున్న వర్షము, సుభిక్షముగనున్న దుర్భిక్షము, దుర్భిక్షముగనున్న సుభిక్షము, భయముగ నున్న క్షేమము, క్షేమముగ నున్న భయము, ఇట్లు విపరీతఫలము గలుగును.

## గురుచార ఫలము

సంవత్సరాది ప్ర॥ చైత్ర బ చతుర్థీ గు. ప॥ కన్యయందు గురుడు. అటనుండి జ్యేష్ఠ బ. సప్తమీ బు. ప॥ సింహమున గురుడు. అటనుండి మార్గశిర శు సప్తమీ గు. ప॥ కన్యయందు గురుడు. అది మొదలు వత్సరాంత ప॥ తులయందు గురుడు. ఫలము॥ సింహమున గురుడుండ ప్రభువులకు యుద్ధప్రయత్నము లగును. వర్షములు బాగుగ గురియును. సజ్జనులును బ్రాహ్మణులును ధనహీను లయ్యెదరు. కన్యయందు గురుడుండ వర్షములును సస్యములును బాగుగ నుండును. ధరలు కొంచెము తగ్గి సుభిక్షముగనుండును. ప్రభుత్వమునకు ఆదాయ మధికమగును. బ్రాహ్మణులు సత్కర్మల నాచరింతురు. తులారాశి యందు గురుడుండ సువృష్టి, సర్వసస్య సమృద్ధియు గలుగును గాని కూరగాయలు మిర్చి, చింతపండు, బెల్లము, కూరలు వగైరా పదార్థములు దుర్లభము లగును.

## శుక్రచార ఫలము

ఈ సంవత్సరమున వైశాఖ శు త్రయోదశి ఆ. న కృత్తికయందు ఉత్తరమార్గమున నాగవీథియం దుండి పడమరదిక్కున నుదయించును. తిరుగ మాఘ శు చతుర్థీ శు. న శ్రవణనక్షత్రమున మధ్యమమార్గమున జరద్గవవీథియందు పడమట నస్తమించి ఆ శుక్ల దశమీ గు. న ఆ మార్గమం దావీథియందే తూర్పున నుదయించును. ఫలము॥ ఉత్తర మార్గమున నుదయ మగుటచే సువృష్టి, సుభిక్షము, పరరాష్ట్రములు స్వరాష్ట్రమున చేరుటయు, వాటిని చక్కగ పాలించుటయు గలుగును. మధ్యమమార్గమున నుదయాస్తమయము లగుటచే సస్యములు వర్షములు ధరలు రోగక్షేమములు మధ్యమముగ నుండును. నాగవీథియం దస్తమించుట నాగాశ్రితులకు పీడ. (యుద్ధభయము) జరద్గవవీథియం

దుదయాస్తములు అగుటచే శాస్త్రవేత్తలకు హాని. శుక్లపక్షమున నుదయాస్తము లగుటచే ఏనుగులు గుఱ్ఱములు యుద్ధవీరులు యుద్ధమునందు హతులగుట తటస్థించును. భరణ్యాదిమండలమున నుదయించుటచే సుభిక్షముగ నుండునుగాని అంగ వంగ కళింగ మాహిష బాహ్లీక దేశములందు భయము గలుగును. మాఘమున జ్యేష్ఠాదిమండలమున నుదయాస్తము లగుటచే దుర్భిక్షము చోరభయము రోగోపద్రవములు గలిగి అవంతి, మత్స్య, కాశ్మీర, అశ్మక దేశములు చారుదేవీనగరమున్ను పీడ నందును.

## శని చార ఫలము

సంవత్సరాది ప్ర॥ మాఘ బ పంచమీ శ॥ ప॥ వృశ్చికమున శని. అటనుండి సంవత్సరాంత ప॥ ధనుస్సులో శని॥ అంటు వత్సరాది ప్ర॥ జ్యేష్ఠ బ చతుర్థీ ఆ. ప॥ జ్యేష్ఠయందును అది మొదలు ఆశ్వయుజ శు ఏకాదశీ శు ప॥ అనూరాధయందును, అటనుండి మాఘ బ పంచమీ శ ప॥ తిరుగ జ్యేష్ఠయందును, అటనుండి సంవత్సరాంత ప॥ మూలయందును శని సంచరించును. శని వృశ్చిక రాశియం దుండుటచే ప్రజలకు రోగభయము పశువులకు సైనికులకు సంఘములకు హాని. ప్రభువులకు భేదము (విరోధభావము) గలుగును. అనూరాధయం దుండగా కులూత తెంగణ ఖస కాశ్మీర దేశములు ఆయా దేశముల మంత్రులు ఆయా దేశములందున్న కుంభకార తైలిక ఘాంటిక ప్రభృతులును పీడ నందెదరు. మిత్రదేశములకు భేదము గలుగును. జ్యేష్ఠయం దుండగా రాజులు, రాజపురోహితులు రాజసన్మానితులు శూరులు సంఘములు సైనికులు పీడనందెదరు. ధనూరాశియం దుండగా వర్షములు స్వల్పమగుట, ప్రభువులకు కలహము, ధరలు హెచ్చుగుట పాంచాలము కోసలము కురుదేశము కాశ్మీరము వంగము కళింగము కాశీదేశము హానినందును. మూలయందుండ కొంకణ, పాంచాల, కాశీదేశములు యుద్ధభీతులు ఓషధులు ఫలజాతులు నశించును. దుర్భిక్షము, అనావృష్టి, యుద్ధభయము గలుగును.

కూర్మచక్రమునె—కొంకణ, కాంభోజ, సింధు సౌవీర అంబష్ఠ, అరబ, బర్బర, యవన, బాహ్లీక, కిరాత, ఆనర్త, ద్రవిడ, సురాష్ట్ర మహారాష్ట్ర, అభీరాది నైరృతిదేశములకున్ను, కాశీ, పాంచాల అవంతి మాళవ సైంధవ త్రిగర్త హైహయ పారసీక శక మ్లేచ్ఛాది పశ్చిమదేశములకును హాని.

## రాహు చార ఫలము

వైశాఖమాసగ్రహణముచే పత్తి నూవులు పెసలు నశించును. ఇక్ష్వాకువంశీయులు యౌధేయులు శకులు కళింగులు పీడ నందెదరు. దేశము సుభిక్షముగ నుండును. కార్తికమాసగ్రహణముచే అగ్నిచే జీవించువారు, మగధ, కోసల, కల్మాష, కాశీ, శూరసేన, ప్రాచ్యదేశ వాసులును పీడ నందెదరు. కళింగదేశాధిపతికిని వారి అనుచరులకును విశేషపీడ. క్షత్రియులకును పీడాకరము. క్షేమము, సుభిక్షము గలుగును.

## దేశారిష్టయోగములు

1. వత్సరాది ప్ర॥ చైత్ర శు చతుర్దశీ శ, ప॥ గురుశుక్రసమ సప్తకము, ఫలము: ప్రజలకు జలభయము, అగ్నిభయము, రోగ భయము, యుద్ధభయము సర్పభయము, చోరభయము, దుండగుల వలని భయము గల్గును.

2. వత్సరాది ప్ర॥ చైత్ర బ చతుర్థీ గు ప॥ గురునకు తృతీయమున శని. ఫలము: వింధ్యకు దక్షిణమున జనహాని.

3. వత్సరాది ప్ర॥ చైత్ర బ చతుర్థీ గు ప॥ వృషభ కన్యా వృశ్చికములందు కుజ గురు శనులు. ఫలము దుర్భిక్షము, యుద్ధ భయము, మరణములు అగ్నిభయము, వాయుభయము, వ్యాధులు గలుగును.

4. వత్సరాది ప్ర॥ చైత్ర బ నవమీ మం. ప॥ కుజ శని సమ సప్తకం. ఫలము: అయోధ్యకు దక్షిణదేశమున దుర్భిక్షము యుద్ధ భయము గలుగును.

5. వత్సరాది ప్ర॥ చైత్ర బ అమా సో. ప॥ వృశ్చికాంతమున శని. ఫలము॥ దుర్భిక్షము గలుగును.

6. వత్సరాది ప్ర॥ జ్యేష్ఠయందు శని వక్రము. అవంతి దేశాధిపతికిని యవనదేశాధిపతికిని ఆరుమాసములలో మృతియగు నని శాస్త్రము.

7. వత్సరాది ప్ర॥ జ్యేష్ఠ బ ౪ ఆ. ప॥ జ్యేష్ఠయందు శని. ఫలము: అనావృష్టి గలుగును. ధరలు హెచ్చును.

8. వత్సరాది ప్ర॥ శ్రావణ బ ప్రతిపత్ ఆ॥ ప॥ వృశ్చికమున శని వక్రము. గుఱ్ఱములు, ఏనుగులు, మానవులు గోమహిషాదులును మూడవ వన్తు మిగులునట్లు నశించును.

9. వత్సరాది ప్ర॥ మాఘ బ పంచమీ శ. ప॥ శనికి వ్యయమున రాహువు. ఫలము. ఆంధ్రదేశమున సస్యహాని. నీచులకు తస్కరులకు నాశమున్ను అగును.

10. వత్సరాది ప్ర॥ మాఘ బ పంచమీ శ. ప॥ వృశ్చికమున శని. ఫలము: దుర్భిక్షము, అతివృష్టి, రోగములును గల్గి ప్రజలు కష్టముచే జీవింతురు.

11. జ్యేష్ఠ బ చతుర్థీ ఆ. ప్ర॥ ఆశ్వయుజ శు ఏకాదశీ శు. ప॥ అనూరాధయందు శని. ఫలము. అనావృష్టి, ధరలు హెచ్చును.

12. జ్యేష్ఠ బ సప్తమీ బు ప్ర॥ మార్గశిర శు సప్తమీ గు. ప॥ తిరుగ గురునకు తృతీయమున శని ఫలము. (చూ. 2 యో)

13. భాద్ర బ చతుర్థీ శు ప్ర॥ కార్తిక శు సప్తమీ మం. ప॥ కన్యా వృశ్చికములందు కుజ గురు శనులు. ఫలము (౩ యో. చూ)

14. ఆశ్వయుజ శు ఏకాదశీ శు. ప్ర॥ మాఘ బ పంచమీ శ. ప॥ జ్యేష్ఠయందు శని. ఫలము (చూ. 6 యో)

15. కార్తిక శు. సప్తమీ మం. ప్ర॥ మార్గశిర బ సప్తమీ శు. ప॥ కుజ రాహువు లొకరాశియందు, ఫలము. అంగ వంగ కళింగ దేశములందు సస్యహాని భూకంపాద్యుపద్రవములు యుద్ధభయము గలుగును.

16. కార్తిక బ ప్రతిపత్ శు. ప్ర॥ మాఘ బ పంచమీ శ. ప॥ వృశ్చికాంతమున శని. ఫలము (చూ. 2 యో).

17. మాఘ బ పంచమీ శ. ప్ర॥ సంవత్సరాంత ప॥ గురునకు తృతీయమున శని. ఫలము. (చూ. 2 యో)

18. మాఘ బ పంచమీ శ. ప్ర॥ సంవత్సరాంత ప॥ ధనుస్సులో శని. ఫలము. ప్రభువులకు యుద్ధములు, ప్రజలకు రోగములు దుర్భిక్షము శస్త్రభయము గలుగును.

## గ్రహకూటములు

19. చైత్ర శు చతుర్దశి ప్ర॥ వైశాఖ శు అష్టమీ మం. ప॥ మేషమందు రవి బుధ శుక్ర కేతువులు. మఘయందు అమా ప్రతిపత్తులందు చంద్రునితో ఐదు గ్రహములు.

20. ఆషాఢ బ చతుర్థీ మం ప్ర॥ బ అష్టమీ శ. ప॥ కర్కాటకమున రవి కుజ బుధ శుక్రులు.

21. భాద్ర శు ద్వితీయా మం. తృతీయా బు. లందు కన్యయందు చంద్ర బుధ గురు శుక్రులు.

22. భాద్ర బ అమా సో. ప్ర॥ దినత్రయ ప॥ కన్యయందు రవి చంద్ర కుజ గురులు.

23. ఆశ్వయుజ శు నవమీ బు. ప్ర॥ బ సప్తమీ బు. ప॥ కన్య యందు రవి కుజ బుధ గురులు.

24. ఆశ్వ బ అమా బు. ప్ర॥ దినద్వయ పర్యంతం తుల యందు రవి చంద్ర బుధ రాహువులు.

25. కార్తిక శు సప్తమీ మం. ప్ర॥ శు పూర్ణిమా గు. ప॥ తుల యందు రవి కుజ బుధ రాహువులు.

26. కార్తిక బ అమా గు. ప్ర॥ దిన త్రయ ప॥ వృశ్చికమున రవి చంద్ర బుధ శనులు.

ఫలము:— నాలుగు గ్రహము లొక రాశియందు కలసిన సరిహద్దు రాష్ట్రములవలన భయము గలుగును. ఐదు గ్రహములు గలిసిన సర్వదేశ ప్రభువులకును హానియగును. ఈ గ్రహకూటములు మేష వృశ్చికములం దగుచో యుద్ధభయము. కర్కాటకమున నగుచో నతివృష్టి. కన్యయం దగుచో వాయుపీడ. తుల యందు అగుచో నతివృష్టియు గలుగును.

## శు భ ము హూ ర్త ము లు

చైత్రమాసము:—ఏప్రి 1 ప్రతి సో. వత్సరాదిగాన నవవస్త్ర ధరణ ధారణాదులకు మిథునము చోర పం॥ ౧౪-౨౫ గం 11-46— ఏప్రి 6 శు షష్ఠి శ. మృగశిర. అన్నప్రాశనకు మిథునము ౧౪-౫౦ గం 11-52 లగ్నచంద్రుడు—7 శు సప్త. ఆ. పునర్వసు రాత్రి హల కర్మకు మకరం ౧౯-౨౧ రా. గం 2-0 షష్ఠచంద్రుడు—(2) 10 దశ బుధ మఘ రాత్రి హలకర్మకు కుంభము మత్రాం ౨౪-౩౮ రాగం 4-7—(2) 12 త్రయో శు ఉఫ అన్నప్రాశన హలకర్మలకు మిథునం ౧౪-౨ ప గం 11-28—రాత్రి హలకర్మకు మకరం ౧౭-౩౦ రా గం 1-40 రవివేధ—13 చతుర్ద శ హస్త రాత్రి హలకర్మకు మకరం ౧౭-౧౭ రా గం 1-36—మీనమున్ను ౨౫-౫౦ రా గం 4-37—14 పూర్ణి ఆ చిత్ర అన్నప్రాశన హలకర్మలకు మిథునము చోరపం ౧౩-౪౬ ప గం 11-21—16 బ ద్వితీ మం అనూరాధ రాత్రి హలకర్మకు మకరము ౧౮-౪౮ రా గం 1-24—కుంభము రోగ పం ౨౩-౩౪ రా గం 3-43—17 తృతీ బు అనూ అన్నప్రాశనహలకర్మలకు మిథునం ౧౩-౨౧ ప గం 11-8 షష్ఠచంద్రుడు—18 బ చతుర్థీ గురు మూల రాత్రి హలకర్మకు కుంభము ౨౩-౧౩ రా గం 3-35—మీనము మత్రాం ౨౪-౫౭ రా గం 4-17—(2) 21 సప్త ఆ ఉషా అన్నప్రాశనకు మిథునము ౧౨-౪౮ ప గం 10-52 కుజవేధ—రాత్రి హలకర్మకు కుంభము మత్రాం ౨౨-౪౦ రా గం 3-22 రిఃఫచంద్రుడు—మీనము ౨౪-౨౨ రా గం 4-4—(2) 23 నవ మం ధనిష్ఠ రాత్రి హలకర్మకు కుంభము ౨౨-౧౯ రా గం 3-15—మీనం మత్రాం ౨౪-౫ రా గం 3-57 రిఃఫచంద్రుడు—(2) 24 దశ బు శతా రాత్రి హలకర్మకు కుంభము మత్రాం ౨౨-౯ రా గం 3-11—మీనం ౨౩-౫౫ రా గం 3-53 రిఃఫచంద్రుడు.

వైశాఖమాసము:— మే 1 శు ద్వితీయ బు రోహిణి రాత్రి హలకర్మకు కుంభము మత్రాం ౨౦-౫౫ రా గం 2-43—మీనం ౨౨-౪౧ రా గం 3-25—2 తృతీ గు రోహి అన్నప్రాశన హల కర్మలకు కర్కాటకము ౧౩-౩౮ ప గం 11-6—4 పంచ శ పున ర్వసు రాత్రి కుంభము ౨౦-౨౪ రా గం 2-32—మీనము రోగపం ౨౨-౧౦ రా గం 3-14—(2) 6 సప్త సో పుష్య అన్నప్రాశనకు కర్కాటకము ౧౩-౩ గం 10-50 లగ్నచంద్రుడు—(2) 7 అష్ట మం మఘ రాత్రి కుంభము ౧౯-౫౨ రా గం 2-20—(2) 8 నవ బు మఘ పగలు కర్కాటకం ౧౨-౪౬ గం 10-42—9 దశ గు ఉఫ రాత్రి బీజావాపనాదులకు మీనము ౨౧-౧౮ రా గం 2-54—16 బ తృతీ గు మూల రాత్రి వివాహాదులకు కుంభము ౧౭-౧౮ రా గం 1-44—మీనం మత్రా॥ ౨౦-౩ రా గం 2-26—(2) 18 పంచ శ పూషా ఆశ్వలాయనోపనయనమునకు కర్కాటకము ౧౧-౮ గం 10-4 షష్ఠచంద్రుడు కుజవేధ—ఉషా రాత్రి వివాహాదులకు మీనం ౧౯-౪౧ రా గం 2-18—19 షష్ఠి ఆ ఉషా అన్నప్రాశనోపనయన వివాహాదులకు కర్కాటకము ౧౧-౮ ప గం 9-59—శ్రవణం రాత్రి వివాహమునకు కుంభము ౧౮-౪౪ రా గం 1-32 రిఃఫచంద్రుడు—మీనము చోర పం ౧౯-౩౦ రా గం 2-14—(2) 20 షష్ఠి సో శ్రవణం అన్నప్రాశనోపనయనవివాహాదులకు కర్కాటకము రోగ పం ౧౦-౫౭ గం 9-55 జామిత్రచంద్రుడు రవివేధ—21 సప్త మం శతా రాత్రి నవవధూప్రవేశమునకు మీనము ౧౯-౭ రా గం 2-6 రిఃఫచంద్రుడు—(2) 22 అష్ట బు శతా రాత్రి గర్భాధానాదులకు మకరం మత్రాం ౧౧-౨౫ గం 23-1—23 నవ గురు పూభా గర్భాధానమునకు మకరము ౧౧-౧౪ గం 22-58—(2) 24 దశ శు ఉభా రాత్రి వివాహమునకు మకరము రోగ పం ౧౧-౩ గం 22-53.

జ్యేష్ఠమాసము:— మే 30 శు ప్రతి గు మృగశిర రాత్రి వివాహాదులకు మకరం రాజపం ౯-౫౭ గం 22-29—కుంభం మత్రాం ౧౫-౪౪ గం 24-48—మీనము ౧౮-౩౦ రా గం 1-30—31 శు ద్వితీ శు ఆర్ద్ర గర్భాధానమునకు మకరం ౯-౪౮ గం 22-26—(2) జూన్ 2 శు చతుర్థీ ఆ పుష్య అన్నప్రాశనోపనయనాదులకు కర్కాటకం ౭-౫౩ గం 9-8—గర్భాధానమునకు మకరము ౯-౩౬ గం 22-21 వాపీకూపాదులకు కుంభము ౧౫-౧౨ గం 24-36—మీనము ౧౬-౫౮ రా గం 1-18—6 నవ గురు ఉఫ అన్నప్రాశనోపనయన వివాహ నవగృహప్రవేశ దేవతాప్రతిష్ఠాదులకు సింహము రాజపం ౧౬-౯ ప గం 11-57—హస్త రాత్రి వివాహాదులకు మీనము ౧౬-౧౮ రా గం 1-4—(2) 7 దశ శు చిత్ర రాత్రి వివాహాదులకు మకరము ౭-౩౪ గం 21-58 భృగుషట్కం—వివాహ నవగృహప్రవేశ వాపీకూపతటాకారంభాదులకు మీనము రోగపం ౧౬-౬ రా గం 1-0—8 ఏకా శ చిత్ర ఉపనయన వివాహాదులకు కర్కాటకము ౮-౫౬ ప గం 8-40—(2) స్వాతి రాత్రి వివాహాదులకు మకరము మత్రాం ౭-౨౪ గం 21-55 భృగుషట్కము సరాహుచంద్రుడు—9 ద్వాద ఆ స్వాతి అన్నప్రాశనోపనయనవివాహాదులకు కర్కాటకము ౮-౪౬ గం 8-36—సింహము మత్రాం ౧౫-౪౦ గం 11-46 సరాహు చంద్రుడు—(2) బ ప్రతి గు మూల పగలు వివాహాదులకు సింహము ౧౫-౩ ప గం 11-32 కుజవేధ—(2) 14 ద్వితీ శు ఉషా రాత్రి వివాహాదులకు మీనము ౧౪-౫౪ గం 24-38 రవివేధ—(2) 15 తృతీ శ ఉషా అన్నప్రాశనోపనయనాదులకు సింహము ౧౪-౪౩ గం 11-24 షష్ఠచంద్రుడు—శ్రవణం రాత్రి వివాహాదులకు మీనము ౧౪-౪౪ గం 24-29 నక్షత్రసంధి—16 చతుర్థీ ఆ శ్రవణం అన్నప్రాశనోపనయన వివాహాదులకు సింహము ౧౪-౩౩ గం 11-20 షష్ఠచంద్రుడు శనిదృష్టి—రాత్రి వివాహ గర్భాధానాదులకు కుంభము ౧౨-౪౮ గం 23-43 రిఃఫచంద్రుడు—17 పంచ సో ధనిష్ఠ వివాహమునకు సింహము మత్రాం ౧౪-౨౨ గం 11-16 షష్ఠచంద్రుడు—రాత్రి వివాహమునకు కుంభము మత్రాం ౧౨-౩౬ గం 23-38—(2) 19 సప్త బు పూభా ఆశ్వలాయనోపనయనమునకు సింహము ౧౪-౧ గం 11-8 దుర్ముహూర్తస్పర్శ—(2) 23 దశ ఆ అశ్విని సింహము ౧౩-౧౯ గం 10-52.

ఆషాఢమాసము:—జూలై 12 బ ప్రతి శు ఉషా అన్నప్రాశనకు కన్య ౧౪-౦ గం 11-14—13 బ ప్రతి శ శ్రవణం అన్నప్రాశనకు సింహం ౯-౪౭ గం 9-33 షష్ఠచంద్రుడు—14 ద్వితీ ఆ శ్రవణం అన్నప్రాశనకు సింహం మత్రాం ౯-౩౮ గం 9-30 షష్ఠచంద్రుడు—(2) ధనిష్ఠ అన్నప్రాశనకు కన్య చోరపం ౧౩-౩౮ గం 11-6 రాహువేధ—(2) 15 తృతీ సో ధనిష్ఠ అన్నప్రాశనకు సింహం మత్రాం ౯-౨౮ గం 9-26—(2) అన్నప్రాశనకు కన్య

